శ్రీ

# శ్రీకృష్ణావతారతత్త్వము

## నాల్గవ ప్రకరణము.


ఇయ్యది

కడప మ్యునిసిపల్ హైస్కూలునందుఁ బ్రధానాంధ్ర పండితులగు

కావ్యస్మృతితీర్థ

జనమంచి శేషాద్రిశర్మచే రచింపఁబడి








చెన్నపురి :

'వావిళ్ల' ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడినది.

1926.



జనమంచి శేషాద్రిశర్మ

# విజ్ఞప్తి.

---

మహాశయులారా! శ్రీకృష్ణావతారతత్వమున నాల్గవ ప్రకరణ మిద్ది తమకృపచే బయటికి రాఁ గల్గినది. పోషకుల సంఖ్య వృద్ధియగుచున్నజాడ కనుపట్టుచున్నది. ఈప్రకరణమున ఇంద్రయాగభంజనము, గోపికావస్త్రాపహరణము, నగ ద్వేణుగానము, గోపిక లచ్చటికి రాత్రివేళ నంచలు చేరుట, రాసక్రీడ అను నీప్రధానగాథలు గలవు. ఈకథలను చదివియే శ్రీకృష్ణుని జారజారశిఖామణి యందురు. ఇంక నెన్నియో భంగుల దూషింతురు. కాని యీకథలనుబట్టియే భగవంతుఁ డని స్పష్టమగును. ఆవిషయ మాకథలు వ్రాయునపుడే పురాణ శ్లోకములు వాని యర్థములు విశేషార్థములు వ్రాయఁబడినవి. అసూయమాని యించుక యోపికతోఁ బఠించినచో నాయర్థము సుసంగతమా యసంగతమా యని తోఁచెడిని. మహాకవిపోతన గారి పద్యరత్నములవలన నట్టిభావము గోచరము కాదు. ఏదే భక్తులేయే కోరికలనొందఁగోరుదురో వారి కాయాకాంక్షలఁ దీర్చుపని భగవంతుని దన్నభావము పోతనగారిదని స్పష్టమగుఁ గాని యీభావము మతాంతరు లంగీకరింపరు. మూలమున నట్టి యసంగతార్థమే లేదని లక్ష్యలక్షణపురస్సరముగా వ్రాయఁ బడినది. అందు లోపము లుండవచ్చును. ఆలోపములు నావని

యే భావింపుఁడు. మూలమున నేలోపములేకుండ భగవంతుని దివ్యచరిత్రము గలదనియే నమ్ముఁడు. ఆయాయితావుల వ్రాయఁబడినచర్చను జక్కఁగఁ దిలకింపుఁడు. దాన నాపరిశ్రమము ఫలించును. భాగవతమునకు సరియగుభాషాంతరీకరణ ముండిన మేలని తోఁచెడిని. ఈశ్వరానుగ్రహముగలిగిన నది నెఱవేఱుఁగాక. ఇంకను మీసాయ మెక్కువగాఁ గావలయు నని ప్రార్థించుచు నిందు విశేషించి వ్రాయఁబూనక విరమించెదను. ఈ గ్రంథమును బఠించి సంతోషమున నిరువదియైదురూప్యములు విరాళముగా దయచేయించిన కణేకల్లు నివాసులు వైశ్యరత్నములు సత్కార్యనిర్వాహకులు నగు మ-రా-రా-శ్రీ, అయ్యగారి బుస్సెట్టి గారికి హృదయపూర్వకమగు కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాఁడను. ఈగ్రంథమును బోషించుటయే ప్రధానకృత్యముగా భావించి పోషకులను జేర్చి మిక్కిలి తోడ్పడుచున్న మువ్వురుభక్తులకు నాహృదయానుమోదము నేతన్ముఖమునఁ దెలుపుకొనుచున్నాఁడను వారిపేరులు యథార్థముగా పీఠికలోఁ బ్రకటింతును.

ఇట్లు విన్నవించు భక్తజన పాదసేవకుఁడు,
జనమంచి శేషాద్రిశర్మ.

మ. రా. శ్రీ. సి. సుందరరామయ్యగారు, హెడ్‌క్లర్కు, మునిసిఫుకోర్టు.
,, ఆర్కాటు గుండూరావుగారు, ప్లీడరు.
,, సిద్ధవటము వెంకటసుబ్బయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, కోవూరు వేంకటరామరావుగారు, పెన్షనర్.

## బళ్లారి మండలము.

,, విట్టా శేషప్పశ్రేష్ఠిగారు, ప్రజాసంఘకార్యదర్శులు.
,, రావుసాహేబు జే. పాపయ్యశ్రేష్ఠిగారు.
,, అయ్యగారి బుస్సెట్టిగారు, కణేకల్లు.
,, ఏ. భీమరావుగారు, వ్యాపారస్థులు. ఆదవాని.

## నెల్లూరు మండలము.

,, వెలంపల్లి రామకృష్ణమ్మగారు.
,, ములుమూడి లక్ష్మీనరసింహయ్యగారు.
,, ఇడమకంటి వేంకటరామిరెడ్డిగారు, తాళ్లూరు.
,, అల్లంపాటి పోలిరెడ్డిగారు, మంగుపల్లె.
,, పత్తి గురుమూర్తిశ్రేష్ఠిగారు, కుల్లూరు.

## చెన్నపురము.

,, వి. యస్. నరసింహాచార్యులుగారు, బి. యే., బి. యల్.
,, కట్టా. జోగయ్యగారు.

## కందనూలుమండలము.

,, అక్కెనప్రగడ లక్ష్మీనారాయణరావుగారు, బి. ఏ., బి. ఇ. డిస్ట్రిక్టు బోర్డు ఇంజనీయర్ గారు.
,, అవధానము వేంకటనరసయ్యగారు, ఉయ్యాలవాడ.
,, కానుగోవి. కృష్ణమూర్తిరావుగారు, రివిన్యూఇన్‌స్పెక్టరు. అవుకు.

## గుంటూరు మండలము.

,, మారుటూరు పుండరీకాక్షుడుపంతులుగారు, పట్టిచెరుకూరు.

## గోదావరీ మండలము.

మ. రా. శ్రీ. కలిదిండి వేంకటరాజుగారు.
,, బొడ్డు మల్లికార్జునరావుగారు, బాపిరాజుగారు. ఏలూరు.
,, గిరిగె మాణిక్యముగారు. ,,
,, ఏ. యస్. స్వామిగారు. ,,

## విశాఖపట్టణ మండలము.

,, మాడుగుల వేంకటప్పారావుగారు, జమీందారు. బొంతల కోడూరు.

## గంజాంమండలము.

,, పుల్లెల వేంకట రమణయ్యాపంతులుగారు, ఇచ్ఛాపురము.

# విషయసూచిక.

విషయము. — పుట.

| విషయము. | | పుట |
|---|---|---|



శ్రీ ర స్తు.

# శ్రీకృష్ణావతారతత్త్వము.

## నాల్గవ ప్రకరణము.



శ్లో. మాధుర్యవారిధిమదాంధతరంగభంగీ
శృంగారసంకలితశీతకిశోరవేషమ్,
ఆమందహాసలలితాననచంద్రబింబ
మానందసంప్లవమనుప్లవతాంమనోమే. ౧౪

అవ్యాజమంజులముఖాంబుజముగ్ధభావై
రాస్వాద్యమాననిజవేణువినోదనాదమ్,
ఆక్రీడతామరుణపాదసరోరుహాభ్యా
మార్ద్రేమదీయహృదయే భువనార్ద్రమోజః. ౧౫

తరుణారుణకరుణామయవిపులాయతనయనం
కమలాకుచకలశీభరవిపులీకృతపులకమ్,
మురళీరవతరళీకృతమునిమానసనలినం
మమ ఖేలతి మదచేతసి మధురాధరమమృతం. ౧౮

శ్రీకృష్ణకర్ణామృతము.

శ్రీకృష్ణపరబ్రహ్మపాదారవిందమిళచ్ఛిత్తద్విరేఫులై, సత్కథాశ్రవణకుతూహలులై తనరారు పుణ్యపురుషులారా!

మూఁడవప్రకరణమున శ్రీకృష్ణపరమాత్మ యద్భుతచర్యలు, భగవంతుఁడు తనసర్వవ్యాపిత్వమును దెలుపుటయు, దానిని గోపిక లెఱుంగఁజాలక మోసపోవుటయు, దుష్టదానవులఁ జంపుటయు, బృందావనప్రవేశము, కలావతీవృత్తాంతము, బ్రహ్మగర్వభంగము, కాళీయఫణిదర్పభంజనము లోనగుగాథలఁ బఠించితిరి. ఈప్రకరణమున సర్వదేవతాద్భుతజనకము లగుచర్యల భగవంతుఁడు విహరించుటయుఁ, గపటవేషమునఁ దిరుగు దనుజులఁ జంపుటయుఁ, దనమాయ బ్రహ్మాదు లెఱుఁగకుండఁ దాఁ బ్రవర్తించుటయు ననుపుణ్యతమకథలఁ జదువఁదగు. మఱియు ఈప్రకరణమున శ్రీకృష్ణపరబ్రహ్మము తనయమానుషచర్యలను జూపుటయేగాక వానిమూలమున సకలధర్మములను, విమలజ్ఞానమును లోకులకు బోధించును. మఱియు నిందనేకస్తుతులు గలవు. అవి సంసారసాగరతరణనౌకలనఁ దగియుండును. కలికాలమున నన్నిధర్మములకంటె నిరపాయమైనది భగవన్నామస్మరణమే యని యందఱ అంగీకరించినవిషయముకదా? నామస్మరణము శ్రద్ధాభక్తులుగలిగి చేసిననే ఫలించును గాని లేకయున్న సంపూర్ణఫలము నీయఁజాల దనుటయు నిర్వివాదాంశము. ఇన్నింటికి మూలము చిత్తశుద్ధి. అది కలుగవలెనన్న యోగము నభ్యసింపవలయును. ఆయోగము పూర్వకర్మానుసారముగా లభించును. అనఁగాఁ బ్రాణాయామయోగముచేతనే

కొందఱకు మనశ్శుద్ధి లభించును. మఱికొందఱకు హఠయో
గాదు లభ్యసించినను గలుగదు. కారణము పూర్వజన్మమునఁ
గృషిచేయకుండుటయే. కొందఱు తొలిజన్మమునఁ గృషి కొలఁ
దిగఁజేసి యుందురు. అట్టివారి కీజన్మమునఁ జిరకాలమునకు
యోగాభ్యాసఫలము గలుగును. యోగ మభ్యసించినఁగాని
మనశ్చాంచల్యము తొలఁగదు. చిత్తవృత్తినిరోధమే యోగమని
పెద్దలభావము. ఏజన్మమునఁగాని యోగమునఁ గృషిసల్పియుం
డనిచోఁ జిత్తశుద్ధి గలుగదనుట నిర్వివాదాంశము. అలసులు
కొందఱు యోగాభ్యాసము నిరుపయోగమని పలుకుచుందురు
గాని అది పెద్దలతాత్పర్యమునకు నూఱుయోజనములంతదూ
రమున నుండఁదగినమాట. చిత్తము శుద్ధముగ నుండినఁగాని
భగవన్నామస్మరణము సంపూర్ణఫలము నీయఁజాలదు. ఆనామ
స్మృతి కపటమూలమగునేని నిరర్థకము. యత్కించిత్ఫలము కలు
గకపోవునా యనునలసులమాటలు విశ్వసనీయములుకావు.
కాఁబట్టియే కలియుగమున నించుకసేపైనను నిర్మలమనస్సున
భగవంతుం గీర్తించినఁ జాలునని మహర్షులు వాక్రుచ్చిరి. అట్టి
నామస్మృతి హరికథాపఠనమునఁ గల్గును. తత్పఠనమునకుఁ
బూర్వజన్మసుకృతము సహాయముచేసినఁగాని కొనసాగదు.
కావున భక్తవరులారా! యీనాల్గవప్రకరణమును దృఢభక్తి
మెయిం బఠింపుఁడు. దీనియందలి కథావిశేషము లద్భుతావ
హములు. అవి ముందుముందు తమశక్తిసారమును దెలుపఁగ
లవు. ఆవిషయ మిట వ్రాయు టనవసరము. ఇఁకఁ దత్కథా

విశేషములప్రక్కను నీలేఖినిం ద్రిప్పుచున్నాను. మీకెల్ల శ్రీమన్నారాయణుండు భగవద్భక్తిని మిగుల దృఢమగునట్లు చేయుంగాక.

## ఇంద్రయాగవిఘ్నము.

*ధేనుకాసురుం బొలియించి శ్రీకృష్ణబలరాములు బృందావనము చేరినపిదప దానవులబాధలులేక కొంతకాలము హాయిగాసాగెను. గోపికలు గోపకులు నందాదులగురాజకుటుంబము వారునిశ్చింతగాఁ గాలముపుచ్చుచుఁగొంతయనుమాటనెఱుంగకయుండిరి. కాని భగవంతుఁడవతరించినది మానుషానంద మనుభవించుచుఁ గాలము గడపుటకుంగాదుకదా! కావున నవసరము ననుసరించి యొకకార్యము చేయుచునే యుండును. ఆమహాత్ముని యుద్దేశానుసారము తదితరులుగా నెన్నఁబడువారందఱు కార్యకరణమునఁ బ్రవర్తించుచుందురు. కాని తమరు భగవత్సంకల్పానుసారమీకార్య మొనరింపఁ బూనితిమనిమాత్ర మూహింపరు. దూరమాలోచించి చేయుచున్నవారమనియే ఒక్కయహంకారమునుబూనుదురు కాని సర్వాంతర్యామియగుభగవంతుఁ డీమా

---

*ఈగాథ శ్రీకృష్ణజన్మఖండము: ఇరువదియొకటవయధ్యాయమునుండియు, బ్రహ్మపురాణము డెబ్బదితొమ్మిదవయధ్యాయమునుండియు, హరివంశము విష్ణుపర్వము పదునాఱవయధ్యాయమునుండియు, శ్రీభాగవతము దశమస్కంధము ఇరువదినాల్గవయధ్యాయమునుండియు వ్రాయఁబడినది. ఇందు విష్ణుపురాణమునఁ గలవిశేషములును గలుపఁబడును.

ఖ్ఖలంగాంచి పకపకనవ్వుచు నీచర్మప్రతిమలఁ ద్రిప్పుచుండును. దానికిఁద్రాడుండవలదా యనుప్రశ్నము రావచ్చును.కర్మరూప ములైనపాశములే వీరిం ద్రిప్పుట కుపయోగింపఁబడును. కాఁబట్టియే యందఱొక్కరీతిగాఁ బ్రవర్తింపక భిన్నగతులఁ బ్రవర్తిల్లుదురు. ఇట్లుజరగఁ గారణం బేమనిమాత్ర మాలోచింపనివారే సంఖ్యయందధికులు. అట్టి యహంకారముండినఁగాని ప్రపంచము సాగదని శ్రీపరాత్పరుని యూహయేమో తెలియదు.దానిం దెలియఁజాలకయే బ్రహ్మాదు లల్లాడుచున్నవారు. ఇఁక మనమే పాటివారము? అట్టులగుటచేతనే కాఁబోలు దీనింగూర్చి యెవ్వారును గృషిసల్పకుండుట యని నాకుం దోఁచెడిని.

ఒక్కదినము మహానందమున నుప్పొంగుచు నందుఁడు శక్రయాగముచేయువేడుక మదిఁ బురికొలుప దుందుభిని మ్రోఁగఁజేయించెను. గోపకులంద అరుదెంచిరి. కర్తవ్యమేమని నందునితో నాలోచించిరి. ఇది చేయఁదగినయజ్ఞమని నిశ్చయించిరి. దీన మేలుకలదని నమ్మిరి. ప్రయత్నము లిట్టిట్లు చేయవలయునని యేర్పాటుచేసికొనిరి. తమతమగృహముల కరిగిరి. మఱునాఁ డందఱు దుందుభినాదము వినఁబడఁగనే యరుదెంచి నందుని గలిసికొనిరి. వారిరాక నెఱింగి నందుఁడు గోపవరులారా! ఇంద్రయాగముచేయవలయునని నిశ్చయించితిమికదా దాని కనువగుపదార్థముల నేకరింపవలయును. దధిక్షీరఘృతతక్రనవనీతములు బెల్లము తేనెయు నను నీమొదలగుపదార్థములఁ గైకొని మనమందఱ మరిగి మహేంద్రుఁ బూజింపవలయునని

తెల్పెను. అంతియగాక నగరమునఁగల గోపకులు, గోపికలు, బాలకులు, బాలికలు, ద్విజులు, వైశ్యులు, శూద్రులు భక్తియుక్తిమైఁ బయనము సాగింపుఁడనియు వీరెల్ల నట మహేంద్రుం బూజింపవలయుననియుఁ దానే యెల్లరు వినుచుండఁ జెప్పెను. తానును బయనముసాగించి విశాలమై మనోహరమై సర్వర్తుపుష్పాఢ్యభూరుహవిరాజమానమై జలప్రవాహముల విలసిల్లు నొకస్థలమున యష్టి నారోపించి క్షౌమవస్త్రమును బుష్పమాలికలను సర్వపరిమళవస్తుసముదంచితచందనద్రవమును నందునుపఁ బంచెను. తాను స్నానమొనరించి ధౌతవస్త్రముల ధరించి సంధ్యావందనాదికృత్యముల నొనరించి స్వర్ణపీఠమున నాసీనుఁడయ్యెను. నానావిధపాత్రజాలము లమర్పఁబడియెను. బ్రాహ్మణప్రవరులు పురోహితులు గోపికాగోపకులు బాలికాబాలకులు తన్మహోత్సవమునకై వేచి నందునిచెంత నుండిరి. ఇట్టిసమయమున నగరమునఁగలవారెల్ల నరుదెంచి యందుఁ బ్రవేశించిరి. నానావిధపదార్థములఁ గైకొని బహువిధోపహారములం దీసికొని వారెల్ల నరుదెంచిరి. బ్రహ్మతేజస్సుచే జ్వలించుమానులు శాంతరసం బుట్టిపడుచుండ శిష్యగణంబులు పరివేష్టించిరా వచ్చిరి. వారెల్ల వేదవేదాంగపారంగతులు. గర్గ, గాలవ, శాకల్య,శాకటాయన,గౌతమ,కరుశ, కణ్వ, వాత్స్య, కాత్యాయన, సౌభరి, వామదేవ, యాజ్ఞవల్క్య, పాణిని, ఋశ్యశృంగ, గౌరముఖ, భరద్వాజ, వామన, కృష్ణద్వైపాయన, శృంగి, సుమంతు, జైమిని, కచ, పరాశర్య,

మైత్రేయ, వైశంపాయనప్రభృతు లగుమును లాగుంపునందుం డిరి. అనేకవిధములఁ దపస్సుచేయుబ్రాహ్మణులు భిక్షుకులు వం దిమాగధాదులు రాజులు వైశ్యులు శూద్రులు మహోత్సవ దర్శనార్థులై వచ్చిరి.

ఆమహర్షులను జూడఁగనే సువర్ణపీఠమున్నుండి నందుఁడు లేచి భక్తియుక్తుఁడై యెదురుపోయెను. గోపకులు నందునివెం టఁ జనిరి. నందుఁడు వారికి నమస్కరించి వినయమునఁ గుశల ప్రశ్నపూర్వకంబుగా వారి నర్హపీఠంబులఁ గూరుచుండఁజే సెను. వారనుమతింపఁ దాను నాసీనుఁడయ్యెను. యష్టిసమీప మందే పాకముచేయ నాజ్ఞాపించెను. పాకశాస్త్రమునఁ బాండితి సంపాదించిన నూఱుగురుబ్రాహ్మణులఁ బిలిపించి పాకముసేయ నియమించెను. రత్నప్రదీపము లందు వెలుఁగుచుండెను. సురభి ధూపములచే నాక్రతుశాలయంతయుఁ జీకటిచే నావృతమై నట్లుండెను. నానావిధపావనకుసుమమాలికలు, నవ్యభవ్యపదార్థ కల్పితనైవేద్యము, తిలలడ్డుకసహితమండకసహస్రములు సంసి ద్ధములయ్యెను. ఆయష్టిస్థానము స్వస్తికపరిపూర్ణమయ్యెను. శర్కరచే నింపఁబడినకలశములు వేయి యం దగపడుచుం డెను. కొన్నికలశములు యవగోధూమచూర్ణముచేతను, లడ్డు కాదిమధురపదార్థములచేతను, ఘృతపక్వములగు నితర బహువిధభక్ష్యములచేతను నింపఁబడియె. చెట్టుననే పండినరమ్య పరిమళమిళితఫలములు, మనోహరమోచాఫలములు, తత్కా లదేశోచితము లగునితరఫలములు నం దమర్పఁబడియుండెను.

క్షీరసంభృతకలశములు సహస్రము, దధిపూర్ణకలశములు సహస్రము, మధుపూరితకలశములు నూఱు, సర్పిఃపూరితకలశములు సహస్రము, తక్రసంపూరితకలశములు లక్షయు నందుండెను. పంచలక్షఘటములు వలయువస్తువులచే నింపఁబడియుం దునుపఁబడియె. తైలము నింపినకలశములు వేయియు నందగపడుచుండెను. భోగార్హద్రవ్యవాహకము లగువృషభేంద్రములు (గోనెఎద్దులు) బహువిధశృంగారములచేఁ దనరారుచు అంకెలువేయుచుండెను. సువర్ణరజతాదిపాత్రములు సంసిద్ధముగ నుండెను. స్వర్ణపీఠములు యష్టిసమీపమున నుపవేశార్థ మమరింపఁబడియుండెను. మంచివస్త్రములు చారుతరాభరణములు, బహువిధవాద్యములు, సిద్ధపఱుపఁబడియుండెను. స్వరయంత్రములు వాయింపఁబడియెను. ఛాగలుసహస్రము, మహిషశతము, మేషనియుతము నందునుపఁబడియె. గండకమృగశతకముకూడ నచ్చటికిఁ దెప్పింపఁబడియెను. చూచువారల కనుకూలముగా స్థల మమర్పఁబడి రక్షకభటులచే రక్షితమగుచుండెను. బాలికాబాలకులయు,యువతీయువజనులయు సంఖ్య యింతయని చెప్ప నలవిగాకుండెను. గీతశాస్త్రవిశారదులయు, నర్తకులయుఁ బాటను, ఆటను విని చూచి జనులందఱు పరమానందభరితులైరి. రంభయు, నూర్వశియు, ఘృతాచియు, మేనకయు, మోహినియు, రతియుఁ, బ్రభావతియు, భానుమతియు, విప్రచిత్తియుఁ, దిలోత్తమయుఁ, జంద్రప్రభయు, సుప్రభయు, రత్నమాలయు, మదాలసయు, రేణుకయు, రమణియు, ననునప్సరస లామహా

యోగమును జూడ నరుదెంచిరి. వారి గీతము నృత్యము, రూపము నెల్లర నానందవారిరాశిమగ్నులఁ గావించెను. అన్నింటిని మించి వారికటాక్షవీక్షణము మానవుల మూర్ఛమునుంగఁ జేసెను.

అట్టితఱి శ్రీహరి గోపాలబాలకులంగూడి బలరామసహితుఁడై యచటికిఁ ద్వరితగతి నరుదెంచెను. ఆసోదరుల నిర్వురంజూచి యచ్చటివారెల్ల హర్షవిహ్వాలులైరి. క్షితిఁజెందినవారివలెఁ బులకాంచితవిగ్రహులై లేచిరి. ఆశ్రీహరి క్రీడాస్థానమునుండి వచ్చెను. ఆమహాత్మునిరూప మతిశాంతముగా నుండెను. సౌందర్యమున కాటపట్టుగఁ గనఁబడుచుండెను. వినోదమురళీవేణుశృంగశబ్దమల్లన వినవచ్చుచుండఁగా నామహాత్ముఁ డరుదెంచెను. సద్రత్నసారభూషణము లాకృష్ణగాత్రస్పర్శనమున వెలుంగుచున్నట్లుండెను. కౌస్తుభరత్నహారము రాంతకహృదయాంతరమున నింతింతనరాని కళావితతినీనుచుఁ జూడఁజూడ రెండుకన్నులు చాలవే యని యందఱకుఁ దోఁపఁజేయుచుండెను. ఆగోపాలబాలుని శ్యామవిగ్రహము చందనాగురుపంకచర్చలచేఁ బరిమళించుచుండెను. శరన్మధ్యాహ్నపంకజాభమై శ్రీపతియాస్య మొప్పారుచుండెను. శ్రీహరి యత్తఱి బాలచేష్టలకుఁ జిక్కినవానివలెఁ గరమునున్న దర్పణమునఁ దనముఖపంకజమును దిలకించుచుండెను. మనోహరచందనమునఁ గస్తూరి మేళగించి బిందువుగా నొనరించి భాలమధ్యమున నుంచఁబడియుండెను. కావున నామహాత్మునిభాలభాగ మాకాశము చం

ద్రునింగూడినట్లు వెలయుచుండెను. మాలతీకుసుమమాల శ్రీకృష్ణునిశ్యామకంఠవక్షస్థలముల మెఱయుచుండ శరత్కాలమున నాకాశము బకపంక్తిం గూడియున్నట్లు కనుపట్టెను. పీతవస్త్ర మాపరమాత్మ దేహమున నలరారుచుండెను. దానిచే విద్యుద్విరాజంబుల వెలుంగునీలనీరదమా యనునట్లు తద్దేహ మొప్పుచుండెను. మొల్లపూవులు గురివిందపూవులు సిగముడిం జుట్టంబడి యుండుటం జూడంగా ఇంద్రధనుస్సుతోంగూడిన యాకాశము స్మృతికిం దగులుచుండెను. రత్నకుండలదీప్తిచే సుస్మితవక్త్రము విలసిల్లుటచే శరత్కాలమున వికసించినపంకజముపై రవికిరణములు ప్రసరించినప్పటిశోభ కనంబడుచుండెను.

ఇట్లత్యద్భుతాకారముతోం జనుదెంచిన శ్రీకృష్ణపరబ్రహ్మమును జూచి విప్రక్షత్రియవైశ్యశూద్రులును మహర్షులును గోపాలురు నమస్కరించి శుభతమరత్నసింహాసనమున నుపవిష్టుంజేసిరి. రత్నపీఠమున నున్నశ్రీహరి నక్షత్రాంతరమున వెలయు శశాంకబింబమువలెం గనుపట్టెను. జ్యోతిస్స్వరూపుండై సనాతనుండై తనరు శ్రీకృష్ణమూర్తి నెల్లరుంగాంచి కరముహర్షించి కుశలప్రశ్నముగావించిరి. మహర్షులు మనఃపంకజవాసునిగా ధ్యానించిరి. అంత శ్రీహరి యమ్మహోత్సవమును గాంచి విస్మయంబునం బొదలినట్టు లిట్లు ప్రశ్నించెను. ఆపల్కులు సర్వజనదుర్లభములై నీతిశాస్త్రసారము లనందగియుండెను.

వల్లభరాజేంద్రా! సువ్రతా! ఈమహోత్సవ మేల తలపెట్టంబడియె? ఇం దారాధ్యుం డెవ్వండు? ఏమి యీపూజా

పద్ధతి? దీనఁగలుగుఫల మెద్ది? ఏదో యొకఫలముగల్గిన దాన సాధించు పురుషార్థ మేది? సాధనముచేత సాధింపఁదగుక్రియ యేది? ఈపూజకుఁ బ్రతిబంధముకల్గినచో నేదేవునకుఁ గ్రోధము గల్గును? ఆక్రోధమునఁగల్గు ననర్థమేది? ఈపూజ కొనసాగినచో నాదేవుఁ డిచ్చుఫలమెద్ది? ఇహలోకఫలము దీనఁగల్గునా. లేక ఆముష్మికఫలమా? కొంద ఱిహసుఖమునే యీయఁగలరు. కొందఱుదేవత లాముష్మికఫలము నీయఁగల్గుదురు. కొంద ఱిహపర సుఖములరెండింటి నీయఁజాలరు. కొంద ఱీరెండింటి నిత్తురు. *వేదవిహితముకాని పూజ సర్వదుష్ఫలములబరణి యని చెప్పంబడును. ఈపూజ యిప్పుడు కల్పింపఁబడినదియా, లేక పురుష క్రమమునఁ బూర్వకాలమునుండి వచ్చుచున్నయాచారాను సారము చేయఁబడుచున్నదియా. ఈపూజ నీవుచేయఁగా దేవుఁ డగపడునా? ఇందు నీచే నీయఁబడునాహారములఁ దానే యా దైవము భక్షించునా. లేక భక్షింపఁడా. ఏపూజయందుఁ బ్రత్యక్షముగా దైవము భుజించునో యాపూజ యుత్తమోత్తమము. విప్రరూపియగు జనార్దనుఁడు తానే నైవేద్యమును భక్షించును. బ్రాహ్మణుఁడు పరితుష్టుఁడయ్యెనేని దేవతలెల్లఁ దృప్తులగుదురు. ద్విజార్చనయందు నియుక్తుఁడగువాని కితరపూజలేల? ఎవనిచే విప్రుఁడు పూజింపఁబడునో, వానిచే సర్వదేవతలు పూజితు లగుదురు. ఎవఁడు దైవతమునకు నైవేద్యమిచ్చి విప్ర

* అవేదవిహితాపూజా సర్వహానికరండికా. అని మూలము. శ్రీకృష్ణ.

ప్రవరు భుజింపఁజేయఁడో ఆనైవేద్యము భస్మీభూతమగు. ఆపూజనము నిష్ఫలము. దేవతానైవేద్యమును ద్విజున కర్పింపవలయును. అట్లు చేసినయెడల భగవంతుఁ డానందించి వరము లొసంగి తనయింటికిం బోవును. ఏమూర్ఖుఁడు దేవతలకు నైవేద్యమిచ్చి తాను భుజించునో దేవస్వము నపహరించినపాపము నొంది నరకమును బొందును. దేవదత్తనైవేద్యమును భుజింపరాదు. శ్రీహరినైవేద్యమును మాత్రము భుజింపఁదగును. సర్వదేవతల నైవేద్యమును భుజించుటకన్న శ్రీవిష్ణునైవేద్యభోజన ముత్తమోత్తమము. ఏయన్నము విష్ణువున కర్పింపఁ బడదో అది మేధ్యేతరము. జలము మూత్రతుల్యము. అందఱికిదియే క్రమము. విశేషించి బ్రాహ్మణులకుఁ జెప్పఁబడినది. ఏబుద్ధిమంతుఁడు దైవమునకు సమర్పింపక బ్రాహ్మణునకే సమర్పించునో దేవతలు విప్రముఖంబున దానిని భుజించి కర్తకు స్వర్గము నొసఁగుదురు. కావున. సర్వప్రయత్నములచే బ్రాహ్మణపూజ చేయుము. ఇహలోకమందును బరలోకమునందును జపతపోదానపూజాయజ్ఞమహోత్సవములకన్న విప్రపూజయే యుత్తమము. బ్రాహ్మణులశరీరములం దెల్ల దేవతలుందురు. వారి పాదములయం దెల్లపుణ్యతీర్థము లుండును. పాదధూళులయం దెల్లపుణ్యము లుండును. వారిపాదప్రక్షాళనోదకమందుఁ దీర్థతోయములుండును. ఆపాదముల స్పృశింప సర్వతీర్థస్నానఫలము లభించును. భక్తిభావమున నాజలంబులం ద్రావ సర్వరోగములు నశించును. అంతియగాక సప్తజన్మకృతపాపములు

నశించును. సంశయములేదు. పంచవిధమహాపాపముల నొనరించి సద్విప్రున కెవఁడు నమస్కరించునో వాఁడు సర్వతీర్థస్నాన పుణ్యమునొంది పాపనిర్ముక్తుఁడగును. బ్రాహ్మణస్పర్శమాత్ర మునఁ బాతక ముక్తుఁడగును. విప్రదర్శనము పాపనివృత్తి హేతు వని వేదము నిర్ణయించుచున్నది. అప్రాజ్ఞుఁడుగాని ప్రాజ్ఞుఁడుగాని బ్రాహ్మణుఁడు విష్ణువిగ్రహుఁడు. హరిని సేవించు విప్రులను శ్రీహరి ప్రాణాధికులనుగాఁ దలంచును. హరి భక్తులగు ద్విజులప్రభావము దుర్లభము. ద్విజులపాదారవింద ధూళి వసుంధరను బావనముచేయుచున్నది. వారిపాదచిహ్నము పరమతీర్థమని పరికీర్తితము. వారు స్పృశించినమాత్రమునఁ దీర్థ పాపము నశించును. వారిని గౌఁగిలించుకొనుట, చక్కఁగా వారితో మాటలాడుట, వారు భుజించినపిదప భుజించుట, వారిని దర్శించుట, స్పృశించుట యనునివి పాపములఁ బోఁగొట్టును. వారికిఁ బ్రదక్షిణముచేసిన సర్వతీర్థస్నానపుణ్యము లభించును. హరిదాసులగువిప్రు లెవరు శ్రీహరికి నైవేద్యమును దొలుత నర్పించి యవ్వల భుజింతురో వారిదర్శనమున హరిదర్శనపుణ్యము లభించును. వారిపిదప భుజించిన హరిదాస్యము లభించును. శ్రీహరికి సమర్పింపక ప్రమాదమున నే నెవ్వఁడు భుజించునో ఆయన్న మపరిశుద్ధము. జలముకూడ నట్టిదేయగు. హరిభక్తుఁడగుశూద్రుఁడు నైవేద్యమును భుజింప నిచ్ఛయించి నచో ఆమము హరి కర్పించి పిదప దానిని వండుకొని భుజింపఁ దగు. విప్రక్షత్రియవైశ్యులకు సాలగ్రామార్చనమం దధికార

ముగలదు. శూద్రులకు సాలగ్రామము నర్చించునధికారము లేదు. *అన్నము సర్వజీవులకు సమర్పించి పుణ్యమునొందఁగలరు. అందుఁ బరిశుద్ధజీవుల కిచ్చిన విశిష్టపుణ్యము లభించును. కావున మనుష్యులకు నన్నదానము చేసిన నెనిమిదంతలపుణ్యము లభించును. శూద్రుఁడు వైశ్యున కన్నదాన మొసంగిన ద్విగుణపుణ్యము కల్గును. వైశ్యుఁడు క్షత్రియున కన్నమిడి తద్విగుణ ఫలంబు నొందును. క్షత్రియుఁడు బ్రాహ్మణున కన్నమిడిన శతగుణపుణ్యంబు గల్గును. శాస్త్రజ్ఞుఁడగు బ్రాహ్మణున కన్నమిడిన శతగుణపుణ్యము లభించును. శాస్త్రవేత్తయగు విప్రుఁడు భక్తుఁడగు బ్రాహ్మణున కిచ్చిన, శతగుణితపూర్వోక్తఫలము కల్గును. హరిభక్తుఁడు శ్రీహరి కన్నమును సమర్పించి తాను భుజించి నచో విష్ణువునకు విష్ణుభక్తునకు దానమిచ్చినదాత కేఫలము గలుగునో ఆఫలమును బొందును. భక్తుఁడు తృప్తినొందిన హరి తుష్టుఁడగు. శ్రీహరి తృప్తినొందిన నెల్లదేవతలు తృప్తులగుదురు. మూలములఁదడిపినఁ గొమ్మలు తృప్తిపడినట్లు ఒక్కభగవంతునకు సమర్పించినద్రవ్యములెల్లఁ బవిత్రములగు. సర్వదేవతలు రోషమొందిరేని ఎవ్వఁ డేమిచేయఁగలఁడు? మఱొక్క మాటవినుము.

### గోమాహాత్మ్యము.

ఈసంపాదించినవస్తువులలో సగము గోవర్ధనపర్వతమున

---

* అన్నంచ సర్వజీవేభ్యః పుణ్యార్థం దాతు మర్హతి, దత్వా విశిష్టజీవేభ్యో విశిష్టం పుణ్యమశ్నుతే. శ్రీకృష్ణ. ౭౫. శ్లో.

కిమ్ము. గోవులు వృద్ధినొందఁ గారణమేదో అది యాకారణమున గోవర్ధన మనంబడును. భూలోకమునందుఁ దంౘ్రీ! గోవర్ధనాద్రి వంటి పుణ్యపర్వతము వేఱొండు లేదనుట నిక్కము. ప్రతిదిన మాభూధరము నవీనతృణము గోవుల కిచ్చుచుండును. తీర్థ స్నానముల నేపుణ్యముగల్గునో, విప్రభోజనమున నేసుకృ తము లభించునో, సర్వవ్రతోపవాసంబుల సర్వవిధతపస్సుల శ్రీహరిసేవనమున భక్తజనసేవల నేపుణ్యము లభించునో,భూప్ర దక్షిణమున నేఫలముగల్గునో, సత్యవాక్కుల సర్వయజ్ఞం బుల, దీక్షల, నేయేసత్ఫలములు లభించునో యాసత్ఫలములు గోవులకుఁ దృణదానముచేసినఁ గల్గును. ఏయధముఁడు తృణ మును దినుచుండఁగా నావును వలదని వారించునో వానికి బ్రహ్మహత్య కల్గును. ప్రాయశ్చిత్తమును విధిమంతముగాఁ జేసి నఁగాని యాపాపము తొలఁగదు. సకలదేవతలు గోవు నంగ ముల నుందురు. సర్వతీర్థములు తత్పాదంబుల నివసించు. దాని గుహ్యములయందు లక్ష్మి స్వయముగా నివసించును. గోవు పాదముల నంటియున్నమృత్తికచే నెవ్వఁడు ముఖమునఁ దిల కము రచించునో తీర్థస్నానఫల మాక్షణముననే కల్గును. ప్రతి పదమం దాతనికి జయముకల్గును. ఎందు గోవులు నివసించునో యాచోటు తీర్థమనఁబడును. అచ్చోట మృతి లభించెనేని వాఁడు ముక్తుఁడగు. గోబ్రాహ్మణాంగముల నేయధముఁడు హింసిం చునో వానికి బ్రహ్మహత్య లభించును. సంశయములేదు. నారా యణాంశజనితులగు విప్రులను అట్టివగుగోవుల నెవరు హిం

సింతురో వారు కాలసూత్రనరకము నొందుదురు. ఆనరకాను భవకాలము చంద్రసూర్యు లుండునంతకాల మని సిద్ధాంతము చేయఁబడినది. అని యిట్లుపలికి శ్రీకృష్ణుఁ డూరకుండెను. ఆనంద ముప్పొంగ నందనుం జూచి నందుఁ డిట్లు బదులుచెప్పెను.

వత్సా! ఈపూజ వంశపరంపరాగతముగాని క్రొత్తది కాదు. ఇది మహేంద్రునిగురించి చేయఁబడునది. సువృష్టి నొసం గుటకై శతమఖునిగూర్చి యీపూజచేయుట వాడుక. సువృష్టి చే సస్యములు పండును. భూదేవి కలంకారములు సస్యములు. సస్యములు ప్రాణులకుఁ బ్రాణములు. జీవులు సస్యములవలన జీవింతురుకదా. వ్రజమందు నివసించువారెల్ల మహేంద్రుని పూర్వకాలమునుండి పూజింతురు. సంవత్సరాంతమున సకల విఘ్నములు శాంతించి క్షేమముగలుగుటకై యీపూజ చేయఁ బడుచునుండును.* ఇంద్రుఁడు మేఘములకు జలములకుఁ బ్రభువు. ఆయింద్రునియాజ్ఞగొనియే మేఘములు వర్షించును. ఆవృష్టి నుండి గల్గినసస్యములను మనము నితరప్రాణులు భక్షించి బ్రదు కుచున్నవారము. దేవతల నారాధించుచున్నవారము. ఈగో వులు పాలిచ్చుట ఆవృష్టిచేతనేకదా. వత్సలంగూడి హాయిగా గోవులుండుటకుం బ్రధానకారణ మావృష్టియే యని యెఱుం గఁదగు. ఆవృష్టి చేతనే యందఱు హృష్టపుష్టాంగు లైయుందురు. వృష్టిగురియుటచేతనే సస్యములు ఫలించుట, తృణములు మొలుచుట, ఆఁకలిచే జనులు బాధింపఁబడకుండుట జరగుచు

---

* బ్రహ్మపురాణాభిప్రాయము.

న్నది. ఏదేశమున మేఘములు వర్షించుచు నంబరమున వెల
యునో ఆదేశమునఁ బైయట్లు ఫలములు కలుగును. [1]మేఘము
భూమియందున్న నీటిని సూర్యకిరణములచే ధరించును. పర్జ
న్యుఁడు భూలోకము జీవించియుండుటకొఱకే వర్షించుచున్న
వాఁడు. కాఁబట్టి రాజులు ప్రావృట్కాలంబున మహావర్ష
మున నుత్సవరూపమున దేవేంద్రుని బూజింతురు. మనమును
వారియట్లే శతమఖుని బూజింపవలయును. ఇంద్రభుక్తశేషము
చేతనే మనుజులు జీవింపవలయుననఁగా ముందింద్రున కొసంగి
యావల మనము భుజింపవలయునని సిద్ధాంతము. దానఁ ద్రివ
ర్గఫలములు గలుగు. పురుషకారులగు పురుషులకు ఫలభావ
నుఁడు పర్జన్యుఁడు. [2]ఎవఁడు పారంపర్యాగతమగు నీధర్మమును
విడుచునో అట్లు విడుచుట కామముననొండె లోభముననొండె
ద్వేషముననొండె భయముననొండె అగునో వాఁడు మంగళ
ములనొందఁడు. కుమారా! మఱియొక్కమాట వినుము. త్రిలో
కాధిపతి శతముఖుఁడు. ఆతని యానతిలేక మేఘములు వర్షిం
పవు. ఇంద్రుఁడు గోపతి యగునుగదా? మేఘము లాతనికిం
గోవులవంటివి. వలసినపుడు పరిశుద్ధపయస్సుల నాతఁడు పిండి
భూదేవిని దృప్తశాలుగా నొనరించుఁజుమీ. వాతేరితమగు
తఱి మేఘమున నొకధ్వనిగల్గును. దానినే జనులు గర్జితమం

1 'యాభిరాదిత్యస్తపతిరశ్మిభిస్తాభిః పర్జన్యో వర్షతి' అని శ్రుతి. 2 య
ఏవం విసృజేద్ధర్మం పారంపర్యాగతం నరః, కామాల్లోభాద్భయాద్ద్వేషాత్స
వై నాప్నోతి శోభనమ్. శ్రీభాగవతము ౧౦ స్కం. ౨౪ అధ్యా. ౧౧ శ్లో.

దురు. అట్టిదేవేంద్రుని నీయజ్ఞమునఁ దృప్తిచేయవలయునని యీప్రయత్నము చేసితిని.

అని యిట్లు నందుఁడు తనప్రయత్నమునకుఁ గారణము తెలుపఁగాఁ బలరామునింగూడిన శ్రీకృష్ణమూర్తి పక్కన నవ్వి తండ్రింగాంచి యిట్లు పలికెను. నాయనా! పరమాద్భుతమగు వచనము నీవలన వింటిని. ఈలోకశాస్త్ర ముపహాస్యమని వేద ములయందే నిందింపఁబడినది. ఏశాస్త్రమునందైన నింద్రునినుండి వృష్టికల్గునని నిర్ణయింపఁబడలేదు. అపూర్వమగు నీ నీతివచనము నేఁడు నీవలన వింటిని. తండ్రీ! శ్రుతివిదులనీతిని వినుము. శ్రుతి సమ్మతముకానిదానిని నే వచింపను. సామవేదమునఁ జెప్పఁబడిన దానిని సజ్జనులు గ్రహింతురు. మంత్రములు వివిధములు. ఏ మంత్రమునుండిగాని యింద్రునినుండి వృష్టికల్గుననుసిద్ధాంతము లేదు. సూర్యునినుండికదా జలములు సంభవించు. ఆజలముల వలన సస్యములు వృద్ధినొందును. వృక్షములు నట్లే వర్ధిల్లును. సస్యములనుండి యన్నము, వృక్షములనుండి ఫలములు వాని వలన జీవనము సాగుచున్నది. భూమినుండి సూర్యుఁడు కిరణ ములద్వారా జలమును గ్రహించి కాలమున మరల భూమికి నిచ్చును. కావున సూర్యసముద్భవము జలమని తాత్పర్యము. సూర్యుఁడు మేఘాదులు ధాతచే నిర్మింపఁబడిరి. ప్రతిసంవత్సర మందును జలము వృష్టిరూపమున మేఘము వర్షించును. ఇట్లే ప్రతియుగమందును బ్రతికల్పమునందును జరగును. జలధరమను గజము సముద్రమునుండి తనకరమున జలమును గ్రహించి

మేఘమున కొసంగును. అది యప్పుడు ఘనమనంబడు. ఆఘనము
వా తేరితమై స్థానములయందుఁగాలోచితముగా భగవదిచ్ఛ నను
సరించి వర్షించును. ఆభగవదిచ్ఛ విరుద్ధ మయ్యె నేని ప్రతిబంధ
మనంజను. భూతభవ్యభవిష్యత్తులు మహత్తు ద్రమధ్యపదార్థము
లు విధాతృనిర్మితములు. కర్మానుసార మాధాత నిర్మించు. దాని
నెవఁడు మార్పఁగలఁడు? ఆవిధాతయు నీశ్వ రాజ్ఞ చే చరాచరప్ర
పంచము నిర్మించును. మొదట భక్ష్యమును సృజించి యవ్వల
జీవుఁడు సృజింపఁబడును. ఇది భగవంతునకు స్వభావాభ్యాసము.
అదియే కర్మమనఁబడు. సుఖదుఃఖకర్మానుభవము జీవులకుఁ గాలా
నుసారము కలుగుచుండును. యాతనాజన్మమరణరోగశోకభయ
ములు సముత్పత్తియు, విపత్తులును, కీర్త్యపకీర్తులు, పుణ్యము, స్వర్గ
వాసము, పాపము, నరకసంస్థితియు కర్మానుసారము జరగుచుండు.
మానవులకు భుక్తిముక్తిహరిదాస్యములు కర్మము ననుసరించియే
కలుగుచుండును. సకలజనకుఁ డీశ్వరుఁడు. శీలకర్మముల కభ్యాస
మిదియే. బ్రహ్మకును ఫలదాత భగవంతుఁడు. సర్వము తదిచ్ఛ
చేతనే జరగుచుండును. ఏవిరాట్పురుషునిచేఁ దత్వములు ప్రకృ
తియు నిర్మింపఁబడెనో, జగత్తు సృజింపఁబడెనో, ఆదికూర్మము,
శేషువు, భూమియు నివి యవి యననేల ఆబ్రహ్మస్తంబపర్యం
తము విరాడ్వినిర్మితమే. ఏమహాత్మునియాజ్ఞచే మరుత్తు కూర్మ
మును శేషుని భరించుచున్నదో, ఆమహాపురుషునియిచ్ఛకు
మాఱులేదు. తదాజ్ఞచేతనే శేషుఁడు వసుంధరను భరించుచున్న
వాఁడు. ఆధరిత్రి చరాచరప్రపంచమును వహించుచున్నది.

ఆమహాత్ముని యాజ్ఞానుసారమే జగత్ప్రాణుఁడు జగత్తును గాపాడుచున్నవాఁడు. ప్రభాకరుఁడు తదాజ్ఞానిబద్ధుఁడయియే సదా భ్రమించుచు భూగోళమును దపింపఁజేయుచున్నవాఁడు. అగ్ని దహించుట, మృత్యువు సదా సంచరించుచుండుట, కాలానుగుణముగ వృక్షములు మొలుచుట, పుష్పించుట, ఫలించుట, సముద్రములు తమతమస్థానమును వదలక క్రిందిభాగములను జల్లగాఁజేయుచుండుట యనుకృత్యములు శ్రీపరాత్పరుని యాజ్ఞచేతనేకదా. అట్టిమహాపురుషుని భక్తిభరమున సేవింపుము. శక్రుఁడేమిచేయఁగలఁడు? ఏమహాత్ముని భ్రూభంగలీలచేఁ బలువిధములగు బ్రహ్మాండములు పుట్టింపఁబడినవో, ఉపసంహరింపఁబడినవో, ఎన్ని యోవిధములగువిధులు కల్పింపఁబడునో ఆమహాపురుషుఁడు మృత్యువునకు మృత్యువు. కాలకాలుఁడు. విధాతకు విధాత. కావున నాసర్వేశ్వరునినాథనాథుని సర్వశరణ్యుని సేవింపుము. ఆకరుణానిధి సంతసించును. తండ్రీ! ఇరువదెనమండ్రుగు రింద్రులు నశించిన నేసనాతనుని కహోరాత్ర మగునో, నిర్గుణుఁడై సర్వాత్ముఁడగు నేమహాపురుషుని నిమేషకాలమున నష్టోత్తరశతాధికబ్రహ్మలు విలయ మందుదురో, అట్టి పరమపురుషుఁడు జగదవనదీక్ష నుండఁగా శక్రపూజ యనునిది యపహాస్యమునకు లక్ష్యముకాదా.

తండ్రీ! మఱొక్కవచనమును వినుము. మనము వనచరులము. గోపకులము. గోధనజీవులము. గోవులు మనకు దైవతములు. పర్వతములు వనములును మనకుఁ బూజ్యములు.

కర్షకులకుఁ గృషియే వృత్తి. వణిజులకు వాణిజ్యము వృత్తి. మనకు గోవులు శ్రేష్ఠవృత్తి. ఇది వేదప్రతిపాద్యము. ఏవిద్యచే నెవ్వఁడు జీవించునో ఆవిద్యయే యతనికి పరదైవమని యెఱుంగవలయు. ఆవిద్యయే పూజింపఁదగినది. అతని కుపకరించునదదియేకదా. *ఎవఁ డేవృత్తిని జీవించుచు మఱొకదానిని సత్కరించునో వానికి రెండనర్థములు సంభవించును. అవి యిహాపరముల బాధించును. సీమకృష్యంతముగాఁగలది. వనము సీమాంతమని చెప్పఁబడును. పర్వతములు వనాంతములని పేరుగాంచెను. ఆపర్వతములే మనకు వృత్తినిచ్చునవి. ఇది సత్యము. ఈవనమునఁ గామరూపములగుపర్వతము లున్నవని వినఁబడుంగదా. ఆయాయితనువులం గొని తమతమసానువులందు విహరించుచుండును.కొన్ని పర్వతములు సింహములు,వ్యాఘ్రములు, నఖరాయుధములు లోనగుజంతువులరూపమునఁ దమవనముల రక్షించుకొనుచు వనచ్ఛేదకుల భయపెట్టుచుండుట మనమెఱుఁగమా. ఏతరుణమున నీవనములఁ బాడుచేయ నెవ్వరు పూనుదురో అట్టి దుర్వృత్తుల భక్షించుమిషచే హింసించుచుండును. బ్రాహ్మణులు మంత్రయజ్ఞపరాయణులు. కర్షకులు లాంగలయజ్ఞపరాయణులు. గోపాలకులు గిరియజ్ఞాదరులు. కావున మనకు గిరులను వనములను బూజించుట విధి. కావున గోపకుల మగుమనము గిరియజ్ఞముచేయఁ బూనవలయు. కాన

* యో౽న్యస్యఫలమశ్నానః కరోత్యన్యస్యసత్క్రియాం, ద్వావనర్థౌ పలభతే ప్రేత్యచేహచ మానవః-హరివంశము. విష్ణుపర్వము. ౧౬ అ. ౫ శ్లో.

నద్దానికిఁ బ్రయత్నము చేయఁబడుఁగాక. ఇప్పుడు వృక్షమూలములందుఁగాని గిరిపాదములయందుఁగాని పూజచేయఁదగు. ఆపూజాయజ్ఞమునందు మేధ్యపశువుల వధించి విశాలవేదిక నేర్పఱచి గోప్తాలు రందఱుంగూడి కృత్యముచేయఁదగు. ఏల యూరక యాలోచించెదరు?

గోవులను శరత్కాలకుసుమహారములఁ గై చేసి పర్వతము చుట్టును బ్రదక్షిణముచేయించి యవ్వాలఁ దమస్థానములకుఁ బోవునట్లుచేయుఁడు. ఇపు డీయరణ్యము స్వాదుజలతృణవిశిష్టముగ నున్నదికదా. శరత్కాలము ప్రవర్తించుచున్నది. మేఘములు తమనైల్యమును వదలినవి. జలాశయములు నిర్మలములుగా నున్నవి. ప్రియకవృక్షములు పుష్పించి పర్వతమును గౌరవర్ణముకలదిగాఁ జేయుచున్నవి. బాణాసనపుష్పములు ఒక్కచోట శ్యామవర్ణము నాపాదించుచున్నవి. పచ్చిక ముదిరియున్నది. మయూరముల ఋతములు వినఁబడకయున్నవి. జలహీనమై నిర్మలమై బలాకావిరహితమై విద్యుత్పటలశూన్యమై, జలధరపటలము విదంతకుంజరపంక్తివలె దృశ్యమగుచున్నయది. వృక్షములు కఠోరమేఘనాదము నవతోయము నాకర్షింపఁజేయుచు నెల్లెడలఁ బర్వఁగాఁ బర్ణసముదాయభరము గలిగి సుముఖత్వము నొందియున్నవి. ఆకాశ మీూతరుణమున శ్వేతాభోష్ణీష మలరార, హంసలను చామరము లొప్పార, సంపూర్ణచంద్రమండలచ్ఛత్రము వెలయఁ బట్టాభిషేకమహోత్సవమున నున్న రాజువలెఁ గనఁబడియెడు. హంసపిండు నవ్వుచుం

డఁగా సారసపక్షులు కలఁతనొందింపఁగా జలములు జలదములు క్షయింపఁగా క్రమముగాఁ గృశత్వము నొందుచున్నవి. గోవులు క్షీరముల ద్విగుణముగా నిచ్చుచున్నవి. వృషభములు మత్తిల్లి విశేషముగా అంకెలువేయుచున్నవి. వనలక్ష్మి ద్విగుణీకృతప్రభావముతోఁ దులఁదూఁగుచున్నది. భూదేవి సస్యభూషితసర్వాంగములతోఁ గనులకు విందుగూర్చుచున్నది. గ్రహనక్షత్రములు మేఘముక్తములై యున్నవి. జలములు కమలములు చూడ నింపుగూర్చుచుండ మహానందమును బుట్టించుచున్నవి. ఇన్నియు నిట్లు వెలయుచుండఁగా మనుష్యులమనస్సులు ప్రమోదభరమున సుప్రసన్నము లయియున్నవి. మఱొక్కవిశేషమును జూడుఁడు. సూర్యభగవానుఁడు సాంద్రధారాధరవిముక్తుఁడై శరత్కాలప్రజ్వలద్దీప్తులను భూమిపై వెలయించుచుఁ దనయపారమహిమమును దెల్పుచున్నవాఁడు. రాజులు సైన్యముల నుత్సాహవంతములుగాఁ జేయుచు విజిగీషువులై దండయాత్రలకు బయలువెడలుచున్నవారు. పరరాష్ట్రాక్రమణము వారికి ముఖ్యకర్తవ్యమని యికాలము తోఁపఁజేయుచున్నది. ప్రావృట్కాలము నశింపఁగా శరత్కాలము తన ప్రభుత్వమును వెలిపుచ్చఁగానే రుచిరకూజితములఁ బక్షులును, మనోహరపరిమళములఁ బుష్పములును దశదిశల వ్యాపింపఁజేయుచుఁ దమపరోపకారపరతను వెల్లడించుచున్నవి.

కావున నోగోపాలకులారా! సకలశుభములు గల్గుటకై గోవులఁ బూజింపుఁడు. పర్వతయజ్ఞముఁ జేయ నుపక్రమింపుఁడు.

ఇంద్రుని దేవతలు పూజింతురుగాక. పర్వతములు మనచేఁ బూజింపఁబడుఁగాక. మీచే నే నిపుడు బలవంతముగ నైనను గోపూజను గిరియజ్ఞమును జేయించెదను. ఇందులకు సంశయములు లేవు. నాయందు మీకుఁ బ్రీతియుండునేని మీరు నాకు మిత్రులరేని గోవులు పూజింపఁబడుఁగాక. అందఱము గోపూజయందు బద్ధాదరులము కావలయును. న్యాయముగా నాయందు మీకెల్ల సహజప్రీతియుండినచో మీకు మేలుగలుగు నదృష్టముండినచో నాయీవాక్కును సత్యమని మీరు నమ్ముదురు. గోవులఁ బూజింతురు. పర్వతయజ్ఞము చేయుదురు. అనిపలికి కృష్ణమూర్తి యూరకుండెను. సభాసదులగుమునులు శ్రీభగవంతునిఁ బలుభంగులఁ బొగడిరి.

నందుఁడు పులకాంచితసర్వాంగుఁడై సాశ్రులోచనుఁడై వెలసెను. లోకమున మనుజులు పుణ్యవంతులేని యైనఁ బుత్త్రులచేఁ బరాజితులగుదు రనుమాట నిట నందునియెడ సత్యమయ్యెను. సభాస్తారులెల్లరు నిట్లు శ్రీకృష్ణుని వినుతించుటాలించి మన స్సంతోష ముప్పొంగ నందుఁడు పుత్త్రునిమాటలకు సమ్మతించి పర్వతయజ్ఞ మొనరింప స్వస్తివాచన మొనరించెను. ఋత్విజుల వరించెను. పర్వతములకు మునీంద్రులకుఁ బూజసల్పెను. పూజ్యతములగు బ్రాహ్మణులను గోవులను వహ్నిని బూజించెను. పూజావిధి సమాప్తముకాగా నామహాక్రతు వారంభింపఁబడియెను. అత్తఱి నానావిధవాద్యధ్వను లంబరమును బగులించెను. జయజయధ్వనులు శంఖఘోషములు, సాంద్రతమములై

వెలసెను. శ్రీకృష్ణు నుతించునాదములు శ్రుతిసుఖములై వినఁబడుచుండెను. మునిపుంగవులు వేదమంత్రముల సస్వరముగాఁ బఠించుచుండిరి. వందిజనాగ్రేసరుఁడై కంసునకు మిత్రమునగు డిండి యనువాఁడు మంగళాష్టకమును గట్టిగాఁ బఠించెను.

శ్రీకృష్ణుఁడు పర్వతముచెంతకుంబోయి యామూర్తిని రెండుగా విభజించి యాశైలమం దొకమూర్తిఁ బ్రవేశించి యాయుపహారముల భక్షింతునని తలంచెను. అంత నందుం గాంచి తండ్రీ! ముందున్న యీపర్వతమును జూడుము. దీనిని వరము గోరుము. ఇచ్చును. అనిపలుక నందుఁ డానందపరవశుండై హరిభక్తిని హరిదాస్యమును గరుణింపుమా యని ప్రార్థించెను. తరువాత నాపర్వత మొకమూర్తిని ధరించి కనఁబడి నందా! నీ వడిగినవరములఁ బ్రసాదించితిని. నీకు మేల య్యెడు మనిపలికి యావల్లవరాజొసంగినపదార్థముల భుజించి యంతర్ధానమొందెను. ఆవల గోపకులందఱును తమరు సేకరించి యచట నునిచిన దధ్యాదిపదార్థముల యథాశాస్త్రవిధి నుపహారములంగూడి పర్వతమునకు నివేదించి మేధ్యపశువుల బలిసమర్పించి యజ్ఞమును బూర్తి నొనరించిరి. అత్తఱి మేఘము సువృష్టినొసంగ నాజలధారలచేతనే యజ్ఞకృత్యము నెఱవేర్పఁబడియెను. పిదప నాపదార్థముల శ్రీకృష్ణుఁడే పర్వత మొకరూపమును దాల్చి కనఁబడినచందము నభినయించి భక్షించినట్లు కనఁబడఁ జేసెను. పదార్థములు శ్రీకృష్ణమాయచే నదృశ్యములయ్యెను. బ్రాహ్మణభోజనము సాగెను. వారెల్ల సంతృప్తులై యీయ

జ్ఞము మహావిధిమంతముగా సాగెనని పలికిరి. దక్షిణలం గైకొని పరమానందభరితులైరి. శ్రీకృష్ణుని బలుభంగుల స్తుతించిరి. శ్రీకృష్ణుఁడవ్వారికిం బ్రణమిల్లి వారి యానందపరవశులనుగాఁ జేసెను. శ్రీహరియు నవభృథానంతరము సవయస్కగోపాలకులంగూడి పాలుత్రాగి దివ్యరూపము దాల్చి సంతృప్తుఁడ నైతి నని పల్కెను. పర్వతాకారమునఁ గనంబడి దివ్యమాల్యానులేపనంబులఁ గానంబడుచుఁ బర్వతశిఖరమందు నిలువంబడిన శ్రీహరిఁ గాంచి గోపకు లచ్చటికిఁ బరుగిడిరి. కృష్ణుఁడవ్వారిని మాయాచ్ఛాదితులఁ గావించెను. వారింగూడి యాపర్వతరూపమున నున్న తనకే నమస్కరించెను. అప్పుడా శ్రీకృష్ణుని జూచి విస్మయమున గోపాలకు లిట్లు పలికిరి. భగవానుఁడా! నీవశమందున్న మేము చేయఁదగు పనియేది? మేమెల్ల భవత్కింకరులముగదా. అన శ్రీకృష్ణమూర్తి పర్వతమునుండి వినవచ్చునట్టుగా నిట్లు పలికెను.

గోపాలకులారా! ఇదిమొదలు నన్ను యజ్ఞమున నేటేటఁ దృప్తుని జేయుఁడు. మీకు గోవులయందుఁ బ్రీతిగలదేని యిట్లాచరింపుఁడు. నేను మీకు దేవతలలోఁ బ్రథమపూజ్యుఁడనని యెఱుంగుఁడు. సర్వకామముల మీకొసంగువాఁడను నేనే. నాప్రభావమున గోవులు కోటిసంఖ్యలుగా నభివృద్ధినొందును. మీకు సకలశుభముల నొసంగుదును. ప్రతివనమందును మీకు వృద్ధిగలుగున ట్లనుగ్రహించెదను. మీతో దివ్యరూపమున విహరింతును జుఁడీ. నాయం దత్యంతప్రీతి నునిచిన నందాది

గోపకులకు సకలభాగ్యములను బ్రసాదింతును. అతిత్వరగా వత్సలతోఁగూడినగోవులు నాదగ్గరకు వచ్చుఁగాక. అటులైన నాకత్యంతప్రీతికలుగును.

అనుపలుకులు వినరాఁగా గోపకులు గుంపులుగాఁగూడి యాపర్వతమునకు నీరాజనము సమర్పించిరి. వృషభసహితులై యాపర్వతమునకుఁ బ్రదక్షిణము సల్పిరి. గోవులు కుసుమస్తబకాలంకృతుల నలరుచుఁ దోఁకలు పైకెత్తి పరుగిడ సాగెను. వానిశృంగములకుఁ బూలహారములు కట్టఁబడియుండెను. అవి వందలువందలుగా వేలువేలుగాఁగూడి పరుగిడుచు నంబారవంబులు గావింప సాగెను. గోపకులు సమ్మోదమున నొడలుతెలియక యనేకవిధారణ్యకుసుమపత్రాలంకారములఁ దాల్చి రక్త పీత శ్వేతాంబరములు యథానుకూలముగా ధరించి మయూరపింఛాంగదముల బాహువులఁ గైచేసికొని సిగముడి నామయూర పత్రములనే దురిమి గుంపులుగాఁగూడి చిందులుత్రొక్కిరి. పలు భంగులఁబాడిరి. ఆడిరి. పరుగిడిరి. గోవుల వెంబడించిరి. అందుఁ గొంద ఱొడలు తెలియక వృషభముల నెక్కిరి.కొంద ఱావృషభములపైనుండియే యాడ నారంభించిరి. మఱికొందఱు గోవులఁ బూజించి నీరాజన విధానమున వాని గారవించిరి.మీరే మాపాలిటిదేవతలని కొనియాడిరి. మాభాగ్యము మీరేకదా యని కొందఱు వాని ముంగాళ్లం బట్టుకొనిరి. ఇంతలో నాదేహమున పర్వతమదృశ్యమయ్యెను.శ్రీహరియు గోపాలకులంగూడి నందా

దులున్నతావునకు వచ్చెను. గోపవృద్ధులెల్లరు భగవంతుఁడని శ్రీకృష్ణునిం బొగడిరి.

నందుఁ డంత వందిమాగధాదిస్తుతిపాఠకులకు యథేచ్ఛముగా ద్రవ్యమిచ్చి పరితుష్టులనుగా నొనరించెను. బ్రాహ్మణులకు మునులకు యథావిధిఁ బూజ లొనరించెను. తక్కుంగలవారికెల్ల యథానుకూలముగా మర్యాద లొనరించెను. రామకృష్ణులనుఁగూడి వ్రజమును బ్రవేశించెను. డిండియను వందిప్రవరునకు వస్త్రరౌప్యసువర్ణమణుల నొసంగి గారవించెను. మునిప్రవరులు సత్కృతులై రామకృష్ణులం బ్రశంసించి నందుం బొగడి తమతమనివాసములకుఁ బోయిరి. అప్సరస లావేడుకం గాంచి సురపురి కరిగి యింద్రున కావార్తలఁ బూసగ్రుచ్చినట్లు తెల్పిరి. రాజబంధువు లందఱు తమతమనగరముల కల్లనఁ బోయిరి. ఆమహోత్సవమున శ్రీహరిమహిమముఁ జక్కఁగా నెఱింగితి మని వారెల్ల నానందించుచుండిరి.

ఇక్కడ నిట్లుండఁగా దేవలోకమున నింద్రుఁ డావార్తల నెఱింగి మహత్తరక్రోధకలుషితాంతరంగుఁడయ్యెను. అత్తఱి నాక్రోధావేశమున నాతనియధరోష్ఠ మదరెను. యజ్ఞభంగ మగుటయేగాక తన్ను నిందించి రన్నమాట యతనిమనస్సునఁ జక్కఁగా నాటెను. కాఁబట్టి యిట్టిమాటలు విని యోర్వ న్యాయముకాదని తలంచెను. ప్రతీకార మొనరించి గోపాలకునకుఁ దనమహిమము నెఱింగింపవలయు ననియు నాతనికిం దోఁచెను. ఆపని నెఱవేర్చకున్న నిఁకఁ దనకు మరియాదయే

దక్కఁదనియు నొకయూహ జనించెను. ఇఁకఁ దడవుసేసినఁ గార్యభంగము గలుగునను నుద్దేశము దృఢపడియెను. ఎట్లు సాధింపఁదగునా యనునాలోచనయుఁ బొడకట్టెను. ఎట్టకేలకు నొకపద్ధతి మదిఁ బదిలపఱచుకొని యామహేంద్రుఁడు సప్త మరుత్తులను నవమేఘములను బిలుచుకొని దివ్యస్యందనము నెక్కి యతిత్వరితగతి బయలువెడలి మనోహరముగాఁ గను పట్టుచు బృందారణ్యమనుపేరఁ బరఁగుచు నందునకు నివాస భూతమై తనరారు వ్రజమును జేరెను. ఆతని ననుసరించి దేవత లెల్ల వెడలిరి. యుద్ధశాస్త్రవిశారదులగువారు తగుసాధనములఁ గైకొనియే పోయిరి. వ్యోమయానము లవ్వారికి సాయముచేయ నుండెను.

వాతధ్వనులు మేఘగర్జితము భయానకదేవసేనానినాద ములు నందనగరమును గంపింపఁజేసెను. నగరవాసులు వడఁ కిరి. వారికిఁ బ్రళయమే యిది యనునూహ జనించెను. ఇఁక బ్రదుకఁజాలమనియు నిశ్చయము వారికిం గల్గెను. నందుఁడును భీతిల్లెను. యశోదనుజేరి తనపరివారమును బిలిపించి శోకా ర్తుండై యిదేమిప్రళయమా యని యడిగెను. నీతిశాస్త్రవేత్త గావున వారినెల్ల నొక్కరహస్యస్థలమునకుం బిలుచుకొని పోయి యిట్లు పలికెను. యశోదా! ఇటురమ్ము. రోహిణీ! నా సమీపమున నుండుము. నామాట వినుఁడు. శ్రీరామకృష్ణు లం బిలుచుకొని యీవ్రజమునకుఁ గడుదూరముగాఁ బొండు. మీవెంట నగరమునఁగల బాలికాబాలకులు స్త్రీలును భయార్త

లగు నితరులును వత్తురుగాక. బలవంతులగు గోపాలకులు నాసమీపముననుండువారు. కొంతదనుక పరీక్షించి ప్రాణాపాయముకలుగునని తోఁచెనేని మేమును మీయున్నచోటికి వత్తుము. అని పలుకుచు నందుఁడు పెనుభీతిచే శ్రీకృష్ణుని స్మరించెను. దోసిలొగ్గి భక్తిచే మస్తకమువంచి కణ్వశాఖోక్త సూత్రములచే దేవేంద్రుని శచీపతిని వినుతించెను. స్వామీ మహాప్రమాదము పడితిని. క్షమింపుమా యని ప్రార్థించెను.

*ఇంద్రుఁడు, సురపతి, శక్రుఁడు, అదితిజుఁడు, పవనాగ్రజుఁడు, సహస్రాక్షుఁడు, భగాంగుఁడు, కశ్యపాంగజుఁడు, బిడౌ

---

ఇంద్రస్తుతిః.

* ఇంద్రస్సురపతిశ్శక్రోఽదితిజః పవనాగ్రజః, సహస్రాక్షో భగాంగశ్చ కశ్యపాంగజ ఏవచ. ౧. బిడౌజాశ్చ సునాశీరో మరుత్వాన్పాకశాసనః, జయంతజనక శ్శ్రీమాన్ శచీశో దైత్యసూదనః. ౨. వజ్రహస్తః కామసఖో గౌతమీవ్రతనాశనః, వృత్రహా వాసవశ్చైవ దధీచిదేహభిక్షుకః. 3. విష్ణుశ్చ వామనభ్రాతా పురుహూతః పురందరః, దివస్పతి శ్శతమఖ స్సుత్రామా గోత్రభి ద్విభుః. ౪. లేఖర్షభో బలారాతి ర్జంభభేదీ సురాశ్రయః, సంక్రందనో దుశ్చ్యవనస్తురాషాణ్మేఘవాహనః. ౫. ఆఖండలో హరిహయో నముచిప్రాణనాశనః, వృద్ధశ్రవా వృషశ్చైవ దైత్యదర్పనిషూదనః. ౬. షట్చత్వారింశ నామ్నాని పాపఘ్నాని వినిశ్చితమ్, స్తోత్రమేతత్కౌథుమోక్తం నిత్యం యది పఠే న్నరః. మహావిపత్తౌ శక్రస్తం వజ్రహస్తశ్చ రక్షతి, అతివృష్టి శిలావృష్టి వజ్రపాతాచ్చ దారుణాత్. కదాచి న్నభయం తస్య రక్షితావాసవస్స్వయం, యత్రగేహేస్తోత్ర మిదం యశ్చజానాతి పుణ్యవాన్. ౭. న తత్ర వజ్రపాతంన శిలావృష్టిశ్చ నారద-శ్రీకృష్ణజన్మఖండము. ౨౧ అ.

జుఁడు, సునాశీరుఁడు, మరుత్వంతుఁడు, పాకశాసనుఁడు, జయంతజనకుఁడు, శ్రీమంతుఁడు, శచీపతి, దైత్యసూదనుఁడు, వజ్రహస్తుఁడు, కామసఖుఁడు, గౌతమీవ్రతనాశనుఁడు, వృత్రహుఁడు, వాసవుఁడు, దధీచిదేహభిక్షుకుఁడు, విష్ణువు, వామనభ్రాత, పురుహూతుఁడు, పురందరుఁడు, దివస్పతి, శతమఖుఁడు, సుత్రాముఁడు, గోత్రభిదుఁడు, విభువు, లేఖర్షభుఁడు, బలారాతి, జంభభేది, సురాశ్రయుఁడు, సంక్రందనుఁడు, దుశ్చ్యవనుఁడు, తురాషాహుఁడు, మేఘవాహనుఁడు, ఆఖండలుఁడు, హరిహయుఁడు, నముచిప్రాణనాశనుఁడు, వృద్ధశ్రవుఁడు, వృషుఁడు, దైత్యదర్పనిషూదనుఁడు, మహేంద్రుఁడు-అనునీనలువదారు నామంబులు పాపహరంబులు. ఇది స్తోత్రరాజము. కౌథుమోక్తము. నిత్యభక్తియుక్తి నెవ్వఁడు పఠించునో వానికి శతమఖుఁడు ఆపత్తులఁ దొలఁగించుచుఁ దోడుపడు. అతివృష్టియు, శిలావృష్టియు, వజ్రపాతము ననునీమహాపదలు స్తోత్రపాఠకుని బాధింపఁజాలవు. వాని నింద్రుఁడే సంరక్షించును. ఏయింటి నీస్తోత్ర మెఱింగినవారుందురో ఆయింట పిడుగులుపడవు. శిలావర్షము కురియదు. అనిపలికి నారాయణుండు నారదుంజూచి యవ్వలికథాక్రమము నిట్లు చెప్పఁబూనెను.

నారదా! తరువాతివృత్తాంతమును వినుమా. నందుఁడిట్లు తలంపఁగా శ్రీకృష్ణుఁడు పొడసూపెను. శక్రస్తుతి నందుని నోటనుండి పఠింపఁగా వినెను. వెంటనే ఆగ్రహపరవశుఁడాయెను. ప్రజ్వలద్బ్రహ్మతేజస్సుచే వెలుంగుచు నీతియుక్తముగాఁ

దండ్రితో నిట్లుపలికెను. భీతుఁడవై తండ్రీ! ఎవనిస్తుతించితివి. ఇంద్రుఁడెవఁడు. నాచెంతనుండుతఱి భయము వదలుము. క్షణకాలమున విలాసముచేత నీమహాౕర్తిని బొడవడంగఁజేయఁజాలుదును. భీతినొందినయాగోపుల వత్సల, బాలకుల, బాలికల, స్త్రీలను గోవర్ధనాద్రికుహారమున నునిచి నీవు నిర్భీతుఁడవై యుండుము.

అని యిట్లు పలుకు శ్రీకృష్ణమూర్తిపలుకుల నాలించి మహత్తరసంతోషవార్ధినిమగ్నుఁడై నందుఁడు తదాజ్ఞను నెఱవేర్చెను. కొండగుహాయం దుండుటకన్నఁ బర్వతముక్రిందనుండుట మేలని కృష్ణుఁ డటనుండఁ బంచుటచేత నందఱు పర్వతముక్రింద నుండుద మనుకొనిరి. ఇంతలో శ్రీహరి తనయపారమహిమము కనంబడ నింద్రాదులు సిగ్గునొంద మహామునీంద్రులు తన్నుఁ బొగడుచుండ గోపాంగనలు మహార్తిఁ బాసిపోయినొంద నందునిమనంబు శాంతినొంద యశోదారోహిణులు సంతృప్తినింబొంద బ్రహ్మాండములు కుక్షినుండ వెలయు మహాత్ముఁడు జగదవనదక్షుఁడు శ్రీగోపాలకృష్ణుఁడు గోవర్ధనమహాధరమును *వామహస్తమున విలాసముగా నల్పవస్తువును బలశాలి ధరించునట్లు ధరించెను.

---

* దధార లీలయాకృష్ణశ్ఛత్రాక మివ బాలకః. అని శ్రీభాగవతము. సధృతస్సంగతోమేఘై ర్గిరి స్సవ్యేన పాణినా-అని హరివంశము. సంస్తూయమానచరితః కృష్ణశ్శైలమధారయత్-అని బ్రహ్మపురాణము. ఇతి కృత్వామతిం కృష్ణో గోవర్ధనమహీధరం, ఉత్పాట్యైకకరేణైవ ధారయామాస లీలయా-అని

## గోవర్ధనోద్ధరణము.

ఈఘట్టమున శ్రీభాగవతమునందు—

అథాహ భగవాన్ గోపాన్ హేఽంబతాతవ్రజౌకసః,
యథోపజోషం విశత గిరిగర్తం సగోధనాః. ౨౦
నత్రాసఇహ వః కార్యో మద్ధస్తాద్రినిపాతనాత్,
వాతవర్షభయేనాలం తత్త్రాణం విహితం హి వః. ౨౧

అనుశ్లోకద్వయము కన్పట్టెడు. ఈశ్లోకముల నాధారములుగాఁ గొని మహాకవి పోతనగారు తెనుఁగున,

శా. బాలుం డాడుచు నాతపత్ర మని సంభావించి పూగుత్తి కెం
గేలం దాల్చినలీల లేనగవుతోఁ గృష్ణుండు తా నమ్మహా
శైలంబున్ వలకేలఁ దాల్చి విపులచ్ఛత్త్రంబుగాఁ బట్టె నా
భీలాభ్రచ్యుతదుశ్శిలాచకితగోపీగోపగోసంతతిన్.

వ. ఇట్లు గోత్రంబు ఛత్త్రంబుగాఁబట్టి గోపజనులకు గోపాలశేఖరుం డిట్లనియె.

క. రాతల్లి రమ్ము తండ్రీ
ప్రేతలు గోపకులు రండు వినుఁ డీగర్త
క్ష్మాతలమున నుండుఁడు గో
వ్రాతముతో మీరు మీకు వలసినయెడలన్.

---

విష్ణుపురాణము. హరిర్దధార శైలంతం వామహస్తేన దండవత్-అని శ్రీకృష్ణజన్మఖండము. ఇట్లించుక భేదముగా నీవిషయము చెప్పఁబడినదని యెఱుంగునది.

శా. బాలుం డీతఁడు కొండ దొడ్డది మహాభారంబు నైరింపఁగాఁ
జాలండో యని దీనిక్రింద నిలువన్ శంకింపఁగాఁ బోల దీ
శైలాంభోనిధిజంతుసంయుతధరాచక్రంబుపైఁబడ్డ నా
కే లల్లాడదు బంధులార! నిలుఁ డీక్రిందం బ్రమోదంబునన్ -

ఆర్యులార ! చూచితిరిగదా మహాకవిభాషాంతరీకరణపద్ధతి-

ఇందు 'దధారలీలయాకృష్ణశ్ఛత్రాకమివబాలకః'. అను శ్లోకార్థముగూడఁ జేర్చి తెనిఁగింపఁబడినది.

'కృత్వా ఉద్ధృత్య ఛత్రాకం శిలీంధ్రం యథా' అని వ్యాఖ్య. ఛత్రాకము, శిలీంధ్రము-అను నీరెండుపదములకు నర్థము పుట్టగొడుగనియే. బాలుఁడు పుట్టగొడుగును అవలీలఁ దాల్చునట్లని తాత్పర్యము. తెనుఁగున విపులఛత్రమని వ్రాయఁబడినది. అనఁగా గోవర్ధనపర్వతమును ఛత్రముతోఁబోల్చుటయే మేలని మహాకవిభావము. వర్షబాధకుఁ దాళఁజాలనిగోపకప్రభృతులకు నాపర్వతమును ఛత్రమునుగాఁ బట్టెనని తాత్పర్యము తెల్పుట లోకాచారానుకూలమని మహాకవి తలంచియుండనోపు. అదిన్యాయమేకదా. మూలకర్తృభావము బాలుఁడవలీలగాఁ బుట్టగొడుగును ధరించినట్లని. ఏదియెట్లున్నను తెనుఁగున మూలార్థము లోకాచారపద్ధతిని దృఢపఱచుమాటల విస్తరింపఁబడినదని చెప్పక తప్పదు. అతిసంకుచితమూలార్థము బాలురకుంగూడఁ దెలియునట్లు పలుసారులుగానైన జెప్పుట పోతనగారి యలవాటుకదా. "బాలుం డీతఁడు కొండ దొడ్డది" యనుపద్యమునకు మూలము కలదా యని ప్రశ్నింపఁ

బని లేదు. వర్షబాధచే దిక్కుదోఁపక కుయ్యో మొఱ్ఱో యనుచు భయార్తులై నిలువ నీడదొరకినఁ జాలురా దైవమా యని పరితపించుగోపకులకుఁ దాఁ గొండనెత్తి దీనిక్రింద నుండుఁడని తెలిపినపుడు కొండ నీబాలుఁడు ధరించి యెంతకాల ముండఁ గలఁడు. ఇది నెత్తినఁబడినఁ జత్తుమే యని యూహయొకటి తోఁచుట విపరీతముకాదు. బాలుఁ డీకొండనెత్తెనుగదా. ఇతఁడు సామాన్యబాలుఁడు కాఁడు. పరమేశ్వరుఁడే యని తోఁపకపోవునా యనువాదము రాకమానదు. కాని సామాన్య దృష్టి నవలోకింపునట్టియిక్కట్టున నిట్టిపరమార్థము స్ఫురింప కుండుట సహజము. ఇదియంద తెఱంగినదియే కాని నేను గల్పించి నదికాదు. కాఁబట్టి మూలమున బీజరూపముగానున్న యర్థమును స్పష్టముగ సోదాహరణముగా నెల్లరకుం దెలిపి మనపోతనమ హాకవి తననేర్పుఱితనమును వెల్లడించెననుట యిటఁ బ్రధాన ముగా గ్రహింపఁదగువిషయము. ఇఁకఁ గథవంకకు మరలు దము.

ఇట్లు భగవంతుఁడు శ్రీకృష్ణుఁడు గోవర్ధనాద్రినెత్తి తన సకలబ్రహ్మాండధారిత్వమును బామరులకు వెల్లడించెను. గోప కులు స్త్రీబాలవృద్ధులంగూడి గోవులతో దానిక్రిందనుండఁ జనిరి. పైనున్నపర్వతము గృహమువలె వారికిం గనంబడియెను. దానిక్రింద నొక్కచినుకైనను బడదని వారికిం దోఁచెను. నవ మేఘములు విరామములేక వర్షింపఁ జొచ్చెను. కొండపైనుండి జలధారలు హిమవచ్ఛృంగనిర్గళితవియత్తరంగిణీధారల మించి

భూమిపైఁ బడఁజొచ్చెను. భూమి వాని నిలువనీయక తఱు ముచున్నదో యన నవి మహాప్రవాహములై పాఱఁజొచ్చెను. ఇది యకాండకాండప్రళయమని తోఁపింపఁజేయు నవకాశ మాతరుణమునఁ గల్గెను. ఆజలధారలు గిరిపైఁబడునప్పుడు పాషాణములు తద్వేగానీతములై పిడుగులవలె ధ్వనించుచుఁ గ్రిందఁబడఁ జొచ్చెను. ఆ రావము భయమును గల్గించెనుగాని శ్రీకృష్ణసాన్నిధ్య మాభీతి నాపెను. గోపకులు నందాదులు సుఖముగా నుండిరిగాని చీఁకటులు గ్రమ్మినందున నేదియుఁ గనఁ బడమికిఁ జింతిల్లుచుండిరి. భగవద్దివ్యతేజమే వారిమనశ్చింతలఁ బాపెను. ఇఁక వృష్టిబాధలు మనకు లేవనువిశ్వాసము వారి కెల్లరకుం గల్గెను. గోవు లంబారవములు గావించెను. వృష భములు అంకెలు వేసెను. నందాదులు శ్రీకృష్ణు నద్భుతమహి మమును దలంచి విస్మయమందిరి. బలరాముఁడుమాత్ర మాకృ త్యము తనదియే గాన నూరకుండెను.

ఈఘట్టమున శ్రీహరిదివ్యరూపమును లీలాశుకులు.

శ్లో. అస్తిస్వస్తరుణీకరాగ్రవిగళత్కల్పప్రసూనాప్లుతం
వస్తుప్రస్తుతవేణునాదలహరీనిర్వాణనిర్వాకులమ్,
హస్తోదస్తగిరీంద్రమస్తకతరుప్రస్తారవిస్తారిత
ప్రస్తస్వస్తరుసూనసంస్తరలసత్పరిస్తావి రాధాస్తుతం.

అని వినుతించి కృతకృత్యులైరి. ఈ వినుతియందు నొక యపూర్వార్థము గోచరించెడిని. అభ్యస్తలక్ష్మీస్తనం, హస్తోదస్త గిరీంద్రశబ్దములచే సర్వవ్యాపిత్వసర్వకార్యనిర్వాహణత్వములు

సూచితములు. మఱియు రాధాస్తుతమ్-అనుటచే రాధాకృష్ణుల కవినాభావసంబంధము సూచితమగుచున్నయది. ఇట్లు లీలాశుకులు ప్రకృతిపురుషసంబంధమును దెలిపి లోకమునకు మార్గదర్శకులైరి. ప్రకృతియే లేదనుమహాత్ములును గొందఱు గలరు. భగవంతుఁ డొక్కఁడే యనువాద మందఱంగీకరించినను బ్రకృతినివదలి సృష్టికార్యము జరగనేరదని వారెఱుఁగరనుట కన్న నెక్కువవారింగూర్చి చెప్ప నవసరములేదు. ప్రకృతి యుపాస్యదేవత కాదనువారు త్రిశంకుస్వర్గమున నూఁగులాడ వలసినదియే. భగవంతుఁడు సగుణబ్రహ్మమేగాని నిర్గుణుఁడు కాఁడని వారొప్పకతప్పదు. అంగీకరించుచో వారికి ముక్తి యన దేహవిముక్తియే. ఇఁక నీగొడవలో దిగ నవసరములేదు.

శ్రీహరి గోవర్ధనాద్రి నెత్తునపుడు గండోపలములుదొరలెను. మహత్తరవృక్షరాజములువ్రేళ్లతోభూమిఁ దలక్రిందుగాఁ బడియెను. శిఖరములు ఘూర్ణిల్లెను. మేఘము లట్టె మహేంద్రు నానతి నావరించెను వర్షధారలచే శిఖరములు బ్రద్దలయ్యెను. ఆప్రవాహవేగమునకు గండశిలలు వృక్షములు నిలువఁజాలక భూమిపై భయంకరధ్వను లొనరించుచుఁ బడసాగెను. చూచు వారల కిది పాషాణవృష్టియా లేక జలవృష్టియా లేక పిడుగుల వానయా యనుసందేహము కలుగకమానదయ్యెను. గర్జించు నపుడు వాయువు మేఘరూపమున ధ్వనించుచున్నవాఁడని పామరులు తలంచిరి. ఆబాధల కోర్వఁజాలక గిరికందరముల యంతరములనున్న చిలువలు వెడలిరా నారంభించెను. దానిచేఁ గందరముల నున్నకిన్నరకింపురుషుల కుండరాయి గల్గెను. పర్వ

తము చలించుటయు దాన వృక్షములు కదలుటయు నందూనఁ బూవులురాలుటయుఁ జూడఁగా భూదేవిని బూజించుచుం దము గానవయ్యెను. శ్వేతాంబరము గప్పినట్లు భూమియం తయు జలప్రవాహమున నావృతమయ్యెను. ఈకోలాహలము నకుఁ దోడుగా బెబ్బులు లార్వసాగెను. ఆధ్వనుల కులికి తక్కుముక్కిడిమృగములు కలవిలపడసాగెను. ఇటునటుదిరుగ వలనుపడమి నందేయుండ వీలుకామి వానిస్థితిని వర్ణింప నలవి గాకుండెను.

ఇట్లు పర్వతము కంపింపఁ గ్రిందనున్నగోపకులు భీతిల్లి శ్రీకృష్ణా! ఆర్తజనశరణ్యా! దీనబంధూ! కృపాసింధూ! మమ్ముం గాపాడవే యని మొఱ్ఱయిడ సాగిరి. భగవంతుఁడు దీనజన పాలనాదరుఁడు. సర్వజ్ఞుఁడు. కావునఁ బర్వతము కదలకుండ స్తంభింపఁజేసెను. ఇదియొక గొప్పపనియా. సర్వశక్తులు గల వాఁడుకదా భగవంతుఁడు! ఇట్లు స్తంభింపఁజేయఁగా నాగిరి సుషుప్తిఁ జెందినట్లుండినది. విహంగరుతములు వినరాకుండెను. శ్రీకృష్ణభుజాగ్రమున మేఘయుక్తముగనున్న యాదండికొండ పరరాజపీడితయై యుండుదేశమువలె దుస్థితియందుండెను. మేఘములుమాత్ర మాగిరిని విడనాడక వర్షించుచునే యుం డెను. గిరిక్రిందనుండుగోపకులు సుఖముగా నుండిరి.

ఇంద్రుఁడావార్త నెఱింగెను. మహాగ్రహగ్రస్తుఁడయ్యె ను. ప్రయత్నము నిష్ఫలమయ్యెఁగదా యని వగచెను. శ్రీమహా విష్ణువుశక్తిని మఱచెను. ఆగ్రహంబు పెల్లున వజ్రమును గర

మునఁ దాల్చెను. దాన శ్రీకృష్ణునిహస్తమును భేదింప నాతని తలంపైయుండు. కాని యదిశక్యమా! భగవంతుఁ డాయుద్యమము నెఱింగెను. కులిశప్రయోగమునఁ దన కేలాటిబాధయుఁ గలుగదని తెలిసియు నూరకుండిన నాదివ్యాస్త్రము నవమానించిన ట్లగునుగదా అది మహాముని దేహసంభవము. కాన నింద్రుని బాహువునే స్తంభింపఁజేసెను. అత్తఱి శ్రీకృష్ణపరమాత్మ ముఖము సుస్మితమున నలరారుచుండెను. *ఇంద్రునిం బరివేష్టించియుండు దేవతలందఱు కదలఁజాలక పోయిరి. గోడయందు లిఖింపఁబడుప్రతిమలవలె నత్తఱి నాదేవతలుండిరి.

ఇట్లింద్రుఁడు స్తంభింపఁబడి భీతిల్లెను. వెంటనే యాతని క్రోధస్థానమున భక్తి పాదుకొనియెను. దాన సమస్తప్రపంచము శ్రీకృష్ణమయముగా నాతఁడు భావించెను. క్రోధాంధకారమునఁ గానరానికన్ను లించుక కనఁబడఁజొచ్చెను. ఆదృష్టికి ద్విభుజముల రంజిల్లుచు మురళీహస్తమునఁ దేజరిల్లుచు రత్నాలంకార విరాజితుఁడై పీతవస్త్రధారియై రత్నసింహాసనస్థితుఁడై, స్మితవక్త్రపంకజ మలరారభక్తానుగ్రహకాతరుఁడై చందనోక్షిత సర్వాంగుఁడై చరాచరాకారుఁడై యలరు శ్రీకృష్ణపరమాత్మ కనఁబడియెను.ఆయద్భుతాకారమును గాంచిపులకాంచితసర్వాంగుఁడై నిశ్చేష్టుఁడయ్యెను.పూర్వముగురువుప్రసాదించినమంత్రరాజ

---

* సహామరగణం మోఘం చకార స్తంభనం విభుః, సర్వేతస్థుర్నిశ్చలాస్తే భిత్తౌ పుత్తలికాయథా-అని మూ. శ్రీకృష్ణజన్మఖండము ౨౧ అధ్యా. ౧౭౦ శ్లో.

మును జపించెను.*ఆధ్యానమున సహస్రదళపద్మసంస్థ మగు దేదీ
ప్యమానజ్యోతిస్సు కనఁబడెను. దానినడుమ దివ్యరూప మొండు
కనఁబడెను. అది మిగుల మనోహరము. నవీనజలదాకారము-
శ్యామసుందరవిగ్రహము. సద్రత్నసార నిర్మాణజ్వలన్మకరకుండ
లము. జ్వలన్మణీంద్రమకరకిరీటోజ్జ్వలశేఖరము. కంఠవక్షస్స్థల
ములఁ దేజరిల్లు కౌస్తుభరత్నవర్యమున నుద్దీపించుచుండునది-
అట్టి జగన్మోహనాకారమును గాంచి దేహముకంపింపఁ జిత్తము
భక్తిప్రవాహమున మునుకలిడుచుండఁగాఁ గరతలములజో
డించి శ్రీహరి నిట్లు వినుతించెను.

అక్షరమై నిరుపమానమై బ్రహ్మ మనంబరఁగుచు జ్యోతి
స్స్వరూపమును దాల్చి సనాతనమై గుణముల నతిక్రమించి
యాకారశూన్యమై స్వేచ్ఛామయమై అంతములేక యలరు
నీకు నమస్కారము. భక్తులు ధ్యానింప సేవింప బహువిధరూప

* పద్మకోశప్రతీకాశగ్ం హృదయంచాప్యధోముఖం, అధోనిష్ట్యావిత
స్త్యాంతేనాభ్యాఉపరి తిష్ఠతి, తస్యమధ్యే మహానగ్నిర్విశ్వార్చిర్విశ్వతోముఖః—
అని శ్రుతి.

ఇంద్రకృతకృష్ణస్తుతిః.

అక్షరం పరమం బ్రహ్మ జ్యోతీరూపం సనాతనం, గుణాతీతం నిరా
కారం స్వేచ్ఛామయమనంతకం. ౧. భక్తధ్యానాయ సేవాయై నానారూ
పధరం వరం, శుక్లరక్తపీతశ్యామం యుగానుక్రమణేనచ. ౨. శుక్ల
తేజస్స్వరూపం చ సత్యే సత్యస్వరూపిణం, త్రేతాయాం కుంకుమాకారం
జ్వలంతం బ్రహ్మతేజసా. ౩. ద్వాపరే పీతవర్ణంచ శోభితం పీతవాససా,
కృష్ణవర్ణం కలౌ కృష్ణం పరిపూర్ణతమం ప్రభుం. ౪. నవధారాధరోత్కృ

ములం దాల్చి యుగానుసారముగా శుక్లరక్తపీతశ్యామవర్ణము లం దాల్చు నీకు వందనములు. కృతయుగమందు శుక్లతేజస్స్వరూపమున నలరి సత్యస్వరూపుఁడ వగుచు, త్రేతాయుగమందుఁ గుంకుమాకృతిని ధరియించి బ్రహ్మతేజమున నెసంగుచు, ద్వాపరమునఁ బీతవర్ణమున, బీతవస్త్రమునను బ్రకాశించుచు, కలియుగమునఁ గృష్ణవర్ణమున నొప్పుచు శ్రీకృష్ణుఁ డనునామమున సదా ప్రతిభాసిల్లు నిన్ను ధ్యానించెదను. నవీనజలధరశ్యామసుందరవిగ్రహమున నొప్పుచు, నందైకనందనుండవై యశోదాదేవి కానందమునుగూర్చుచుఁ బ్రభుఁడవై, గోపికాచేతోహరుండవై, రాధికాప్రాణాధికుఁడవై వినోదమురళీశబ్దమును జేయుచు, సాటిలేనిరూపమున నవరత్నభూషణా

---

ష్టశ్యామసుందరవిగ్రహం, నందైకనందనం వందే యశోదానందనం ప్రభుం. ౫. గోపికాచేతనహారం రాధాప్రాణాధికం పరం, వినోదమురళీశబ్దం కుర్వంతం కౌతుకేన చ. ౬. రూపేణాప్రతిమేనైవ రత్నభూషణభూషితం, కందర్పకోటిసౌందర్యం బిభ్రంతం శాంతమీశ్వరమ్. ౭. క్రీడంతం రాధయాసార్ధం బృందారణ్యే చ కుత్రచిత్, కుత్రచిన్నిర్జనేఽరణ్యే రాధావక్షస్స్థలస్థితం. ౮. జలక్రీడాం ప్రకుర్వంతం రాధయాసహ కుత్రచిత్, రాధికాకబరీభారం కుర్వంతం కుత్రచిద్వనే. ౯. కుత్రచిద్రాధికాపాదే దత్తవంతమలక్తకం, సదా చర్వితతాంబూలం గృహ్ణంతం కుత్రచిన్ముదా. ౧౦. పశ్యంతం కుత్రచిద్రాధాం పశ్యంతం వక్రచక్షుషా. దత్తవంతంచ రాధాయై కృత్వా మాలాంచ కుత్రచిత్. ౧౧. కుత్రచిద్రాధయాసార్ధం గచ్ఛంతం రాసమండలం. రాధాదత్తాం గళే మాలాం ధృతవంతంచ కుత్రచిత్. ౧౨. సార్ధం గోపాలికాభిశ్చ విహరంతంచ కుత్రచిత్, రాధాం గృహీత్వా గచ్ఛం

రాజిని వెలుంగుచుండు నీకు మ్రొక్కెద. కోటిమన్మథసౌందర్య మున నలరారుచు శాంతుఁడవై, యీశ్వరుఁడవై, రాధాదేవిం గూడి విహరించుచు, ఒకప్పుడు బృందారణ్యమునను, వేఱొక తఱి నిర్జనారణ్యమునను, ఒకప్పుడు రాధావక్షస్స్థలమందును, మఱియొకతరుణమున జలక్రీడాసక్తిని, ఇంకొక్కతఱి రాధి కకుఁ గబరీభారమును జక్కనొత్తుచు, మఱియొకకాలమున రాధాపాదములకు లత్తుకంబూయుచు, సదా తాంబూలా మోదమున భాసిల్లుచు, రాధాదేవి మహాదరమునఁ జూచుచు, నామెకంఠమున దివ్యకుసుమమాలికనుగూర్చుచు,మహాసంతోష

---

తం విహాయ తాం చ కుత్రచిత్. ౧౩. విప్రపత్నీదత్తమన్నం భుక్తవంతం చ కుత్రచిత్, భుక్తవంతం తాళఫలం బాలకైస్సహ కుత్రచిత్. ౧౪.వస్త్రం గోపాలికానాంచ హరంతం కుత్రచిన్ముదా, గవాం గణం వ్యాహరంతం కుత్రచిద్బాలకైస్సహ. ౧౫. కాళీయమూర్ధ్ని పాదాబ్జం దత్తవంతంచ కుత్ర చిత్. వినోదమురళీశబ్దం కుర్వంతం కుత్రచిన్ముదా. ౧౬. గాయంతం రమ్య సంగీతం కుత్రచిద్బాలకైస్సహ, స్తుత్వా శక్రస్తవేంద్రేణ ప్రణనామ హరిం భియా. ౧౭. పురా దత్తేన గురుణా రణే వృత్రాసురేణ చ, కృష్ణేన దత్తం కృపయా బ్రహ్మణేచ తపస్యతే. ౧౮. ఏకాదశాక్షరో మంత్రః కవచం సర్వలక్షణం, దత్తమేతత్కుమారాయ పుష్కరే బ్రహ్మణా పురా. ౧౯. కుమారోంఽగిరసో దత్తం గురవేఽంగిరసా మునే, ఇదమింద్రకృతం స్తోత్రం నిత్యం భక్త్యాచ యః పఠేత్. ౨౦. సహిప్రాప్య దృఢాం భక్తిమంతే దాస్యం లభేద్ధ్రువమ్, జన్మమృత్యుజరావ్యాధి శోకేభ్యో ముచ్యతే నరః.సహి పశ్యతి స్వప్నేపి యమదూతం యమాలయమ్. ౨౧. శ్రీకృష్ణజన్మఖండాం తర్గత స్తుతి స్సమాప్తా.

మున నారాధంగూడి రాసమండలమున వసించుచు రాధా
గళమునుండి మాలికను సంగ్రహించి తా ధరించుచు, గోపి
కలతో విహరించుచు, సాటిలేక యలరుచుండు నీకు వందన
ములు. విప్రపత్నులొసఁగునన్నమును మహాదరమున భుజిం
చుచు, బాలకులంగూడి తాళఫలములం దినుచు, ముదమున
గోపికలవస్త్రముల నపహరించుచు, గోపాలబాలకులంగూడి
యాలమందలఁ గాచుచు, కాళీయఫణిఫణాగ్రములఁ బాదార
విందముల నిడుచు, మురళీగానప్రీతి నలరుచు, బాలకులం
గూడి పాడుచు నాడుచు నిజమహిమము తెలియకుండనుండు
భగవంతుఁడవగు నీకు నమస్తతులు. అని యిట్లు వినుతించి
యింద్రుఁ డిట్టులనియె. పూర్వము వృత్రాసురునితో నాకు సం

---

శ్రీభాగవతాంతర్గతస్తుతిః.

విశుద్ధసత్త్వం తవ ధామ శాంతం తపోమయం ధ్వస్తరజస్తమస్కం
మాయామయోఽయం గుణసంప్రవాహో న విద్యతే తేఽగ్రహణానుబం
ధః. ౧. కుతో ను తద్ధేతవ ఈశ తత్కృతా లోభాదయో యేఽబుధలింగ
భావాః, అథాపి దండం భగవాన్ బిభర్తి ధర్మస్య గుప్త్యై ఖలనిగ్రహాయ.
౨. పితా గురుస్త్వం జగతా మధీశ్వరో దురత్యయః కాల ఉపాత్తదండః,
హితాయ చేచ్ఛా తనుభిస్సమీహసే మానంవిధున్వన్ జగదీశ మానినాం. 3.
యే మద్విధాజ్ఞా జగదీశ మానిన స్త్వాంవీక్ష్య కాలే భయమాశు తన్మదం,
హిత్వార్యమార్గం ప్రభజంత్యపస్మయా ఈహాఖలానామపి తేఽనుశాసనం.
౪. స త్వం మమైశ్వర్యమదాప్లుతస్య కృతాగసస్తే విదుషః ప్రభావం, క్షంతుం
ప్రభో నార్హసి మూఢచేతసో మైవం పునర్భూదసతీశ మేమతిః. ౫. తవా
వతారోయమధోక్షజేహ భువో భరాణామురుభారజన్మనాం, చమూపతీ

గరము ఘటిల్లినతఱి గురువగుబృహస్పతి తపస్సుచేయు బ్రహ్మకు శ్రీకృష్ణుఁ డొసంగినమంత్ర మది యని నా కుపదేశించెను. అది పదునొకొండక్షరములుగలది. సర్వలక్షణలక్షితకవచాన్వితమై యామంత్రమలరును. బ్రహ్మ దానిని బుష్కరమునఁ గుమారస్వామి కిచ్చెను. ఆకుమారుఁ డంగిరసున కొసంగెను. అమ్ముని గురువున కుపదేశించెను. ఆమంత్రరాజము నా కాబృహస్పతి యొసంగెను. అని వినయమునఁ బలికి యూరకుండెను. ఇది యింద్రకృతమగుస్తోత్రము. దీనిని భక్తిచే నెవఁడు పఠించునో వాఁడు శ్రీకృష్ణునందు దృఢభక్తిగలిగి యంతమున భగవద్దాస్యము నొందును. జన్మమృత్యుజరావ్యాధిశోకభయము లాతనికి నుండవు. అంతియకాక స్వప్నమునందైన నాజనుఁడు యమలోకమునుగాని యమదూతలనుగాని చూడఁడు.

*ఇంద్రుఁ డిట్లు కొంతసే పూరకుండి పులకాంచితసర్వాంగుఁడై భక్తినమ్రాత్మకంధరుఁడై మరల నిట్లుపలికెను.

---

నా మభవాయ దేవ భవాయ యుష్మచ్చరణానువర్తినాం. ౬. నమస్తుభ్యం భగవతే పురుషాయ మహాత్మనే, వాసుదేవాయ కృష్ణాయ సాత్వతాంపతయే నమః. ౭. స్వచ్ఛందోపాత్తదేహాయ విశుద్ధజ్ఞానమూర్తయే, సర్వస్మై సర్వబీజాయ సర్వభూతాత్మనే నమః. ౮. మయేదం భగవాన్ గోష్ఠ నాశాయాసారవాయుభిః, చేష్టితం విహతే యజ్ఞే మానినా తీవ్రమన్యునా. ౯. త్వయేశానుగృహీతోఽస్మి ధ్వస్తస్తంభో హతోద్యమః, ఈశ్వరం గురుమాత్మానం త్వామహం శరణం గతః. ౧౦. దశమస్కంధే ౨౭ అధ్యాయః.

* ఈభాగము హరివంశాంతర్గతవిష్ణుపర్వమునుండి గ్రహింపఁబడియె నని యెఱుంగునది.

శ్రీకృష్ణా! మహాబాహూ! జ్ఞానులకు మహానందమునిడు నీరూపమును జూడఁగంటిని. గోవులయం దతిప్రీతిగల నీచే నమానుషాద్భుతకృత్యము నొనరించితివి. నాయాజ్ఞచే వర్షించు నవమేఘములు ప్రళయమును గల్గించునవి. అట్టివానినుండి గోవులను జక్కఁగాఁ గాపాడితివి. స్వామీ! పరమానంద భరితుఁడనైతిని. స్వాయంభవయోగమున నీపర్వతోత్తమను గృహమువలె నాకాశమున నిలిచియుండఁజేసిన నీప్రభావము నెవ్వఁడు మెచ్చుకొనకుండఁగలఁడు. విస్మయ మెవనికిఁ దోఁపక యుండును. నాయజ్ఞమునకు విఘ్నము నీచేఁ గల్పింపఁబడెనని యించుక రోషించితి. దాన నేఁ డహోరాత్రములు వర్షింపఁ జేసితిని. అట్టిప్రళయకాలవృష్టి దురాసదమయ్యు నవలీలగా నీచే నుపసంహరింపఁబడినది. నేను నంబరము నిలిచి వర్షింపుఁ డని మేఘముల నాజ్ఞయిడఁగా మూఁడులోకముల నెవ్వఁ డాపఁగలఁడు? శ్రీకృష్ణా! పరమేశ్వరా! నీవు మానుషదేహ మును ధరించినది నాకత్యంతప్రియము. నీవైష్ణవతేజస్సంతయు దాఁచి యిట్లు మానుషాకృతి నున్నవాఁడవు. దేవకార్యము నీచే సాధితమనియే తలంతును. స్వకీయతేజస్సుతో నీవు మనుష్యదేహమును ధరించి యుండఁగా నిన్ను సేవించువారు సకలార్థసిద్ధులం బడయఁగలరు. ఇంచుకంతయు వారికిం గొఱంత యుండదు. దేవతలకు నీవు రక్షకుఁడవు. అన్నిపనులయందు వారికిముందు నీవుందువు. సర్వలోకాధిపతివై సనాతనుఁడవగు నీవు దేవతలకు రక్షకుఁడవు. నీవొక్కఁడవే మాకెల్ల దిక్కు.

రెండవవాఁ డమరులకార్యభారమును మోయువాఁడు లేనే లేఁడు. గరుడవాహనా! ఆపత్సముద్రమగ్నులగు దేవతల నుద్ధరింప నీవు కంకణము గట్టుకొంటివి. ఇఁక మాకు భీతియేల? ఈజగత్తు నీశరీరమున నొకభాగము. అని బ్రహ్మచే సాధుమార్గమున నిర్దేశింపఁబడినది. బుద్ధిచేతను వయస్సుచేతను బరికింప నీవు సాక్షాత్స్వయంభువువు. కుంటివాఁడు త్వరగతిఁ బూనఁజాలనట్లు నిన్ననుకరింప నెవఁడు సమర్థుఁడు గలఁడు? పర్వతములలో హిమాలయము శ్రేష్ఠము. హ్రదములలో సముద్రము, పక్షిగణమున గరుత్మంతుఁడు, దేవతలలో నీవును శ్రేష్ఠులని వేదములో ఘోషించుచున్నవి. అన్నింటికిం గ్రింద జలము. దానిపైఁ బర్వతములు. మఱియు నాగములు. వానిపై భూమియు దానిపైఁ బార్థివతత్త్వము లనఁబడు మనుష్యులు నుందురు. మనుష్యలోకమున నూర్ధ్వభాగమునఁ బక్షులు సంచరించును. దానిపై రవి యుండును. ఆరవియే స్వర్గద్వారమనంబడు. రవిపై స్వర్గలోకము. విమానగమన మం దమరియుండును. అందేకదా శ్రీకృష్ణా! నే నమరాధిపతినఁ బ్రతిష్ఠింపఁబడితిని. స్వర్గమునకుఁబై బ్రహ్మలోకము గలదు. అందు బ్రహ్మర్షిగణము లుండును. అందు సోమునిగతి. జ్యోతిస్సు లందుండును. దానిపైని గోలోకము. సాధ్యులు దానిం బాలింతురు. అదియేకదా పరమేశ్వరా! మహాకాశగతమై మహత్తరమై విరాజిల్లు. దానిపైఁ దపోమయియగుగతి నీకే కలదు. బ్రహ్మ నడిగినను ఈనీతత్త్వమును దెలియఁజెప్పఁజాల కతఁడు

మినుకుచున్న వాఁడు. భూలోకమునకుం గ్రింద దుష్కృతుల
కునికిపట్టగు నాగలోకము కలదు. అది భయంకరమైనది. కర్మ
శీలురకు నీపృథ్వీ క్షేత్రము చపలచిత్తులకు నాకాశమువంటిది.
శమదమవంతులకు గతి. సుకృతకర్మము లొనరించువారి కిదియే
స్వర్గము. బ్రహ్మతపోయుక్తుల కీధరణియే పరాగతియగు బ్రహ్మ
లోకము. గోవులకుమాత్రమే గోలోక ముత్తమము. ఆగోలో
కము నీచేత ఇందే యిపుడు నిర్మింపఁబడినది. సకలోపద్రవ
ములఁ బోఁద్రోలి సుఖముగా నిటఁ బ్రభావమున నిర్మింపఁ
బడియె. గోవాక్ప్రబోధితుఁడనై బ్రహ్మయనుమతినొంది పరమేష్ఠి
యందున్న గౌరవముచే నిటఁ జేరితిని. నాయపరాధముల నో
మహానుభావా! క్షమింప నర్హుఁడవు నీవే. ఇంతియగాక సౌమ్య
మగు నిజతేజస్సుచే బ్రహ్మయు గోవులయు వాక్కుల నాలకిం
పుము. బ్రహ్మ యిట్లు నామూలమున విన్నవించుచున్న వాఁడు.
ఆకాశమున నున్నగోవులు భవదాశ్చర్యకరకృత్యముల సంతో
షించినవి. ఈగోవులు నీచేఁ జక్క రక్షింపఁబడినవి. గోవర్ధనాధో
భాగమే గోలోకమయ్యెను. వృషభములంగూడి ప్రసవము
లచే నభివృద్ధి నొందుదుము. వృషభము లొనరించుమహోప
కారకృత్యములచేఁ గర్షకులను, దివ్యపయస్సులచే దేవతలను
సంతృప్తి నొందింతుము. సకృత్ప్రవృత్తిచే శ్రీని బ్రసాదింతుము.
కావున మాకు గురువవు నీవే. ప్రాణప్రదుఁడవు నీవే. ఇది
మొదలు మా కింద్రుఁడు ప్రభువు కాఁడు. నీవే విభుఁడవు. అని
గోపక్షమునుండి పరమేష్ఠి విన్నవింపుమనియె. శ్రీకృష్ణా! ఇఁక

నావిన్నప మాలకింపుము. పయఃప్రపూర్ణ కాంచనఘటము లివి నాచే సమర్పింపఁబడినవి. వీనిచే నభిషేకింపుము. నే నింద్రుఁ డను. నీవు గోవుల కింద్రుఁడవు. ఇఁకమీఁద నిన్ను జనులెల్ల గోవిందుఁడని పిలుతురు. వినుతింతురు. పూజింతురు. గోవులచే నాపై నీకింద్రత్వ మారోపింపఁబడియెఁగాన నుపేంద్రుఁడ వనఁబరఁగుము. ఈనామమున నిన్ను సకలామర్త్య ప్రభృతులు ధ్యానింపఁగలరు. వార్షికము లనఁబడు నాల్గుమాసములు నాపూజకై నియమింపఁబడియుండెనుగదా. అందు రెండునెలలు నీ కొసఁగుచున్నవాఁడను. అది శరత్కాల మనఁబడును. కావున నిదిమొదలు రెండుమాసములుమాత్రమే నా పూజార్థము మానవు లుపయోగింతురుగాక. ఇంద్రధ్వజమెత్తిన పిదప నీవు పూజింపఁబడుదువు. నీపూజాకాలమగుశరత్కాలమున వర్షాంబుప్రభవమదమును నెమిళ్లు వదలియుండఁగలవు. స్వల్పముగాఁ గేకారవము లొనరించుచు మనోహరముగ నవి విహరింపఁగలవు. శరత్కాలమున నందఱు శాంతినొందియుండఁగలరు. త్రిశంకువు, అగస్త్యమహర్షియు నేదిక్కున సంచరింతురో ఆదక్షిణపుదిక్కున దక్షిణాయనమున సూర్యుఁడుండు తఱి శరత్కాలయుక్తమగుసమయమున నెమిళులు ధ్వనివిశేషించి చేయకుండునపుడు పక్షు లుదకంబును యాచించుతఱి ప్రవాహములు తగ్గుచున్నయదనున నదీపులినములు హంససారసప్రముఖజలవిహంగమనిబిడములై యుండుతరుణమునఁ గొంగలు మదించి కూయుచుండఁగా వృషభములు బలిసి అంకెలు

వేయఁగా గోవులు హృష్టపుష్టాంగములఁ గడవలనిండఁ బాలు పితుకుచుండఁగా భూతలమును జలమునఁ దృప్తిపఱచి మేఘములు విశ్రాంతినొందఁగా ఆకాశము నిర్మలకాంతులఁ దేజరిల్లుచుండఁగా హంసలు నడబెడంగు మెప్పునీయ విహరించుచుండఁగా వాపీసరోవరంబులయుదకంబులు కమలసంపద పెంపు మీఱుచుండఁగాఁ దటాగములు జలపూర్ణము లగుచుండఁ గృష్ణకేదారపంక్తులు శాలిసస్యములచేఁ జూడ వేడుక నింపుచుండఁ దమజలపూరమును నడుమ నునుచుకొని నదులు విలసిల్లుచుండ భూభాగములు సాధుసస్యనిబిడములగుచు మునుల కుంగూడ మనోహరత నొడఁగూర్చుచుండ వర్షము శాంతించి భూతలముచూడఁ గన్నులు చాలకుండునట్లు లలరార మార్గములు సుగమములై కనుపట్టఁ దృణములు వర్ణింపఁదగినట్లు సొంపార వృక్షములు ఫలింప నిక్షుకాండములు పెరుగ మఖములారంభింపఁబడఁగా నీపూజాకాల మగుశరత్సమయము కన్నులపండువుగా నుండఁగలదు. స్వర్గమునం దెట్లు నన్నుఁ బూజింతురో భూతలమున నట్లే నిన్నును నన్నును యజ్ఞోత్సవముల నర్చించువారు. ఏమానవు లింద్రోపేంద్రు లనఁబడు మనలం గూర్చి నమస్కరింతురో వారి కన్యాయపాలనము తొలఁగు.

అనిపలికి శతమఖుఁడు పయోనీరంధ్ర కాంచనఘటంబులఁ గైకొని యాయుపేంద్రుని గోవిందు నభిషేకించెను. ఆయభిషేకోత్సవమునుజూచి గోవులు తమంతనతామే పయస్సుల వర్షించినవి. అంతరిక్షమునుండి మేఘములు విమలజలముల శ్రీకృష్ణు

నభిషేకించెను. వనస్పతులయందెల్ల నమృతమయజలము వృంత రూపమున నాతరుణమున నలరారెను. అంత నాతరువరములు పుష్పవృష్టిగురిపించి తమయుత్సాహమును దెలిపెను. ఆకసమున దుందుభులుమ్రోసెను. మంత్రపరాయణు లగుమునులెల్ల దివ్య వాక్కుల వినుతించిరి. భూచక్రమెల్ల నత్యంతము చూడఁదగిన ట్లుండెను సాగరములు నిర్మలములయ్యెను. వాయువు సుఖస్పర్శ ముగలదియై వీచెను. సూర్యుఁడు తపింపఁజేయఁడయ్యెను. నక్ష త్రములు తమతమపదవియందుఁ బ్రకాశించుచుండెను. ఈతిబాధ లనునవి యేభాగమందు నత్తఱి లేకుండెను. రాజసముదాయము వైరమును వదలెను. పాదపములు ప్రవాళములచే నలరి పుష్ప ములఁ బరిఢవిల్లెను. ఏనుఁగులు మదధారల వర్షించెను. మృగ ములు సంతోషమును జెందెను. పర్వతములు ధాతునికర భూషితములై చెలఁగెను. లోకమంతయు దేవలోకమునకు సాటిచేయఁదగియుండెను. ఇట్లు శ్రీకృష్ణాభిషేకమహోత్సవము త్రిలోకానందదాయకమై యుండెను.

ఇట్లభిషిక్తుఁడైన గోవిందునిం గాంచి శతక్రతువు హర్షించి దివ్యమాల్యాంబరంబు లొసంగి యిట్లు పలికెను. శ్రీకృష్ణా! ఇది గోవులయందుఁ బ్రథమనియోగము చేయఁ బడియె. ఇఁక నారాకకుందగిన రెండవకారణమును వినుము. గోవిందా! సత్వరముగా మహాక్రూరుఁ డగుకంసుని వధిం పుము. కేశిదానవుని బరిమార్పుము. అరిష్టదానవుం జంపుము. ఆవలఁ జక్రవర్తివలె భూమండలము నేలుము. మఱొక్కమనవిఁ

జిత్తగింపుము. నీమేనత్తకొడుకు. నాయంశజనితుఁడు కలఁడు. వానిని నన్నుఁగా భావించి రక్షింపుము. నీమిత్రుఁడుగా నెగడుఁగాక. నీయనుగ్రహమునకుం బాత్రుఁడై నీచెప్పినట్లే ప్రవర్తించుచు నీవశమందుండి యత్యధికయశము నొందఁగలఁడు. భారతవంశమున వరిష్ఠుఁడై యద్వితీయధనుర్ధరుఁడై నెగడునట్లొనరింపుము. నీకరుణలేనిచో నతఁడు వర్ధిల్లఁజాలఁడు. ఈభారతఖండము నీయందు నాతనియందును నిలిచియున్నది. మీరిరువురు గలిసికొనినచోఁ గ్రూరరాజులు నిహతులగుదురు. మునులనడుమ సకలదేవతలు వినుచుండ నీవిషయమును బ్రతిజ్ఞ చేసితిని. కుంతీదేవియందు నాయంశమువలన నర్జునుండన మూఁడవకొడుకుద్భవించెను. ఆతఁడు కులోద్ధారకుఁడు. ఆయర్జునుఁడు సకలాస్త్రవిదుఁడు. ధానుష్కులలో నగ్రగణ్యుఁడు. ఆతనిరాకకై శస్త్రధరులగు రాజు లెదురుచూచుచున్నవారు. అనేకాక్షౌహిణీపరిమితవీరభటులు యుద్ధమును వేచియున్నవారు. వారందఱకాయర్జునుఁడు మృతిని గల్గింపఁజాలువాఁడు. దేవతలుగాని రాజేంద్రులుగాని శస్త్రాస్త్రపాటవంబున ధనుర్విద్యావిశారదత్వమున నాతనికి సాటివచ్చువారు లేరు. నీవుతప్ప నితరులు లేరని నావిశ్వాసము. ఆతఁడు నీకుబంధువు. సహాయుఁడును గాఁగలఁడు. కావున నోగోవిందా! నాకొఱకుగా నాయర్జునుఁ జెంతఁజేర్చుకొనుము. నావలెనె యాతనిం జూడుము. లోకరక్షకుఁడవు నీవు. అర్జునుని విశేషించి రక్షింపుము. గొప్పసంగ్రామములయం దాతఁడు నీచే రక్షింపఁదగువాఁడు. నీచెంతనున్న

యతనిని మృత్యువుకూడ నేమియుఁ జేయఁజాలదు. అర్జునుని నన్నుగా భావింపుము. నీయాత్మలో నేనాత్మనుగదా. నీయాత్మ యెట్టిదో అర్జునుఁ డట్టివాఁడు. నీ వీలోకమును దుష్టవిరహిత ముగా నొనరింపఁదగుదువు. బలిహ_స్తమునుండి త్రిలోకము లను ద్రిపదంబుల నాక్రమించి నాకొసంగితివి. నన్నుఁ బెద్దం జేసితివి. సత్యమం దిష్టముగలిగి సత్యవిక్రముఁడవై సత్యమును గాపాడఁ గంకణముకట్టుకొన్నవాఁడవని యెఱుంగుదు. దేవ తలు సత్యమునే యాశ్రయించియున్నవారు. నాపుత్త్రుఁడగు నర్జునుని యుద్ధరంగములందును గృహమందును గాపాడఁదగిన వాఁడవు నీవే. ఒక్కకంసుని వధించితివేని తరువాత సకలమహీ పతులకు ఘోరసంగ్రామము పోసఁగును. ఆసంగ్రామమున నర్జునుఁడు పారలంజెంది నీయనుగ్రహమున నపారయశః కీర్తుల సంపాదింపఁగలఁడు. అనిపలికి యింద్రుఁ డూరకుం డెను.

శ్రీకృష్ణుఁ డింద్రునిపల్కు లాలకించి గోవిందుఁడనం బ్రఖ్యాతినొంద నంగీకరించి సుస్మితము మోమునఁ జిందులు త్రొక్కుచుండ నిట్లు పలికెను. శతక్రతూ! నీవచనముల సం తృప్తుఁడనైతిని. నీవనువదించినమాటలయం దొక్కటియైనఁ బరి హరింపఁదగినదిలేదు. నీభావము నెఱింగితిని. అర్జునునియుత్ప_త్తి నెఱుంగుదును. పాండురాజపత్నియగు నామేనయ_త్త నెఱుంగు దును. ధర్మనిర్మితుఁడగు యుధిష్ఠిరు నెఱుంగుదును. వాయు దేవతావరజనితుఁ డగుభీమసేను నెఱుంగుదును. అశ్వినీదేవతల

నుండి ప్రభవిల్లినపుత్రద్వయము నెఱుంగుదును. వారలేకదా మాద్రేయు లనఁబడు నకులసహదేవులు. కుంతీదేవి కన్యకగా నున్నతఱి సూర్యవరప్రభావమున జనించినకానీనుఁ డనఁబడు కర్ణు నెఱుంగుదును. ఆతఁడు సూతత్వము నొందెను. ధార్తరాష్ట్రులెల్ల యుద్ధకాంక్షనుండుట నేనెఱింగినదియే. శాపపావక జ్వాలల మ్రందినపాండురాజు నెఱుంగుదు. మహేంద్రా! క్రొత్తగా నింకఁ జెప్పఁదగినవిషయము లేదు. దేవరాజ్యమును బాలింపవలసిన యవసరముకలవాఁడవు. కాన స్వర్గమున కరుగుము. అర్జునునకు శత్రువుండఁడని నమ్ముము. నాచెంతనున్న నీకొడుకును దేఱిచూడ నెవ్వరికి నలవిగాదు. అర్జునునికొఱకుఁ బాండవుల నక్షతులనుగా నొనరించి యుద్ధకార్యము ముగిసిన పిదపఁ గుంతితోటి సాగ నంపెదను. *మహేంద్రా! నీతనయుఁ డర్జునుఁ డేకార్యము సఫలముగా నొనరింపు మని నాతోఁ బలుకునో దానిని సేవకునివలె నీస్నేహపాశబద్ధుఁడనై నే నొనరించెద. నమ్ముము. అనిపలికి యింద్రుఁడు కోరినవరము లొసఁగి శ్రీకృష్ణుఁడు సాగనంపఁగా నింద్రుఁడు సురలోకమున కరిగెను. [1]శ్రీహరియు నింద్రుఁ డరుగుచుఁ బ్రార్థింప నాగోవర్ధనమును యథారీతి స్థాపించెను. ఇంద్రుఁ డంతరిక్షమునుండి పర్వతమును

---

* యచ్చ వక్ష్యతి మాం శక్ర తనుజ స్తవ సోఽర్జునః, భృత్యవ త్తత్కరిష్యామి తవ స్నేహేన యన్త్రితః-అనిమూ. హరివంశవిష్ణుపర్వము-౧౯ అధ్యా. ౧౦౧ శ్లో. 1 ఇటనుండి శ్రీకృష్ణజన్మఖండాంతర్గతవిషయము వ్రాయఁబడునని యెఱుంగునది.

యథాపూర్వకముగా నునుచుటఁ దిలకించి పరమానందభరితుఁ డయ్యెను. పర్వతముక్రిందను గుహాలయందు నున్నవారెల్ల వ్రజమును బ్రవేశించిరి. వారెల్లనిత్యపరిపూర్ణుఁడగు ప్రభువుగా భావించిరి. శ్రీహరియు వ్రజస్థానమునందున్న వారినెల్లఁ బిలుచుకొని బృందావనమున కరిగి సుఖముండెను. బ్రహ్మమై సనాతనుఁడునగు కొడుకును శ్రీకృష్ణుని గాంచి పులకాంచితసర్వాంగుఁడై భక్తిపూర్ణాశ్రులోచనుఁడై స్తుతించెను.

## నందుఁడు శ్రీకృష్ణుని వినుతించుట.

బ్రహ్మణ్యదేవుఁడై గోబ్రాహ్మణహితకరుఁడై జగద్ధితమునే యొనరించుచుఁ గృష్ణుఁడన, గోవిందుఁడన నెగడి పొలుపొందు నీకు నమస్కారము. బ్రహ్మమై పరమాత్మయై అనంతకోటిబ్రహ్మాండములే గృహములుగా నలరు నీకు వందనములు. మత్స్యాదిరూపములకు జీవరూపుఁడై సర్వసాక్షియై నిర్లిప్తుఁడై, నిర్గుణుఁడై, నిరాకారుఁడై అతిసూక్ష్మస్వరూపుఁడై స్థూలమునకంటె స్థూలతముఁడై సర్వేశ్వరుఁడై తేజోరూపుఁడై ప్రత్యక్షరూపమున నొప్పారుచు, యోగిజనులకుంగూడ ధ్యానాసా-

---

నందకృతశ్రీకృష్ణస్తుతిః.

ఓం నమో బ్రహ్మణ్యదేవాయ గోబ్రాహ్మణహితాయ చ, జగద్ధితాయ కృష్ణాయ గోవిందాయ నమోనమః. ౧. నమో బ్రహ్మణ్యదేవాయ బ్రహ్మణే పరమాత్మనే, అనంతకోటిబ్రహ్మాండధామధామ్నే నమోఽస్తు తే. ౨. నమో మత్స్యాదిరూపాణాం జీవరూపాయ సాక్షిణే, నిర్లిప్తాయ నిర్గుణాయ నిరాకారాయ తే నమః, అతిసూక్ష్మస్వరూపాయ స్థూలాత్స్థూలతమాయ చ. ౩.

ధ్యుఁడై బ్రహ్మవిష్ణుమహేశ్వరులకుంగూడ వంద్యుఁడై నిత్య
రూపుఁడై నాల్గువర్ణములకు నాల్గుయుగములందు నివాసభూ
తుఁడై శుక్లరక్తపీతశ్యామలగాత్రముల యుగక్రమంబునఁ
దాల్చి యోగియై యోగరూపుఁడై యోగిగురువై సిద్ధేశ్వ
రుఁడై సిద్ధుఁడై సిద్ధగురువై యసమానప్రభావుఁడై యొప్పుచు
వినుతికిం బాత్రుఁడ వగు నీకు నమస్కారములు. బ్రహ్మయు
విష్ణువు రుద్రుఁడు శేషువు ధర్ముఁడు రవి, లంబోదరుఁడు షడా
ననుఁడు సనకాదిమునివర్యులు నేనిన్ను నుతింపఁ జాలరో
సిద్ధేంద్రులగురువులకు గురువగు కపిలముని యేనిన్ను విను
తింప సమర్థుఁడు కాఁడో నరనారాయణు లనునాదిమమునులు స్తు
తింప శక్తులుగారో యట్టినిన్ను జడమతినగు నేను నావంటి మఱి
కొందఱు వినుతింప సమర్థులగుదు రనుటకన్న విపరీతవృత్తాంత

---

సర్వేశ్వరాయ సర్వాయ తేజోరూప నమోస్తుతే, అతిప్రత్యక్షరూపాయ
ధ్యానాసాధ్యాయ యోగినాం. ౪. బ్రహ్మవిష్ణుమహేశానాం వంద్యాయ
నిత్యరూపిణే, ధామ్నే చతుర్ణాం వర్ణానాం యుగేష్వేవ చతుర్షుచ. ౫. శుక్ల
రక్తపీతశ్యామాభిధానగుణశాలినే, యోగినే యోగరూపాయ గురవే యోగి
నామపి. ౬. సిద్ధేశ్వరాయ సిద్ధాయ సిద్ధానాం గురవే నమః, యం స్తోతు
మక్షమో బ్రహ్మా విష్ణుర్యం స్తోతుమక్షమః. ౭. యం స్తోతుమక్షమో రుద్ర
శ్శేషోయం స్తోతుమక్షమః, యం స్తోతుమక్షమో ధర్మో యం స్తోతుమక్షమో
రవిః. ౮. యం స్తోతుమక్షమో లంబోదరశ్చాపి షడాననః, యం స్తోతు
మక్షమాస్సర్వే మునయస్సనకాదయః. ౯. కపిలో నక్షమస్స్తోతుం సిద్ధేంద్రా
ణాం గురోర్గురుః, నశక్తౌ స్తవనం కర్తుం నర నారాయణా వృషీ.
౧౦. అన్యే జడధియః కే వా స్తోతుం శక్తాః పరాత్పరం, వేదా

మేమున్నది? వేదములును, వాగ్దేవియు లక్ష్మియు సరస్వతియు రాధాదేవియు సన్నుతింపఁజాలరన నిఁక విద్వాంసులు వినుతింపఁగల్గుదు రనుట కల్లగాదే. ఓపరబ్రహ్మమా! ప్రతిక్షణమందు నేఁజేయు నపరాధముల క్షమింపుము. కరుణాసింధూ! దీనబంధూ! సంసారసాగరమునుండి నన్నుద్ధరింపుము. పుణ్యక్షేత్రమునఁ దొలిజన్మమునఁ దపస్సానరించి నిన్నుఁ బుత్త్రునిగాఁ బడసితి. నీపాదకమలభక్తియు దాస్యము నొసఁగుము. బ్రహ్మత్వముగాని దేవత్వముగాని సాలోక్యాదికముగాని భవదీయాంఘ్రిసరోజదాస్యమునఁ బదాఱవభాగమును బోలవు. సురత్వముగాని ఇంద్రత్వముగాని, రాజత్వముగాని చిరజీవిత్వముగాని బుద్ధిమంతులు లెక్కపెట్టక నీదాస్యమునే వాంఛింతురు. ఈచెప్పినబ్రహ్మత్వాదికము భక్తసంరక్షణార్థ మంగీకరింపఁ బడినది. ఇది నీదాస్యమున కుపమచేయఁదగునదియగునా. ఎవఁడు

---

నశక్తా నోవాణీ న చ లక్ష్మీస్సరస్వతీ. ౧౧. న రాధా స్తవనే శక్తా కిం స్తువంతి విపశ్చితః, క్షమస్వ నిఖిలం బ్రహ్మన్నపరాధం క్షణే క్షణే. ౧౨. రక్షమాం కరుణాసింధో దీనబంధో భవార్ణవే, పురాతీర్థే తపస్తప్త్వా పుత్త్రప్రాప్తస్సనాతనః. ౧౩. స్వకీయచరణాంభోజే భక్తిం దాస్యం చ దేహి మే. బ్రహ్మత్వమమరత్వం వా సాలోక్యాదికమేవ వా. ౧౪. త్వత్పదాంభోజదాస్యస్య కలాం నార్హంతి షోడశీం, ఇంద్రత్వం వా సురత్వం వా సంప్రాప్తం విధిస్వర్గయోః. ౧౫. రాజత్వం చిరజీవిత్వం సుధియో గణయంతి కిం, ఏతద్యత్కథితం సర్వం బ్రహ్మత్వాదిక మీశ్వర. ౧౬. భక్తసంరక్షణార్థస్య నోపమా తే కిమర్హతి, త్వద్భక్తోయ స్త్వత్సదృశః కస్త్వాం తర్కితుమీశ్వరః. ౧౭. క్షణార్థాలాపమాత్రేణ పరం కర్తుం సచేశ్వరః, భక్తసంగాద్భవత్యేవ భక్తిం

నీభక్తుఁడో వాఁడు త్వత్సముఁడు. అట్టి నీకరుణను వర్ణింప నెవఁడు శక్తుఁడగును? అట్టి భక్తుఁడు, క్షణార్ధాలాపమాత్రమున మిగుల నచ్చెరు వొందించుకృత్యము లొనరింపఁగలఁడు. భక్తసంగతియే పరమపావనమైనది. నీభక్తులను మేఘము లుదకదానమున నెవనిఁ దృప్తిపఱచునో వానిని అభక్తాలాపతాపములుశుష్కింపఁ జేయఁజాలియుండును. కావున నభక్తులతో మాటలాడరాదు. ఒకప్పుడు ప్రమాదమున నభక్తులతో మాటలాడినచో ఆపాపతాపము త్వద్గుణస్మృతిసేకమునఁ బోవును. మహాత్మా! ఏపూర్వజన్మసుకృతపరిణామముచేతనో త్వద్భక్త్యంకురము తలచూపెను. అది నశింపకుండ క్షణక్షణాభివృద్ధిఁ గాంచునట్లొనరింపుము. పరబ్రహ్మము వగునీవు భక్తులవాంఛల సఫలములు చేయ నవతరించి వారికి నీదాస్య మొసఁగుదువు. నీదాసుఁడే యైనచో దాస్యమును బొందక తప్పఁడు. అనిపలికి శ్రీహరి

---

కర్తుమనేకధా. ౧౮. త్వద్భక్తజలదాలాపజలసేకేన వర్ధితే, అభక్తాలాపతాపాత్తు శుష్కతాం యాతి తత్క్షణమ్. ౧౯. త్వద్గుణస్మృతిసేకాచ్చ వర్ధితే తత్క్షణే స్ఫుటం, త్వద్భక్త్యంకురముద్భూతం స్ఫీతం మానసజం పరం. ౨౦. ననశ్యం వర్ధనీయం చ నిత్యం నిత్యం క్షణేక్షణే, తతస్సంప్రాప్య బ్రహ్మత్వం భక్తస్య జీవనాయ చ. ౨౧. దదాత్యేవ ఫలం తస్మై హరిదాస్యమనుత్తమం, సంప్రాప్య దుర్లభం దాస్యం యది దాసో బభూవహ. ౨౨. సునిశ్చయమతేనైవ జితంసర్వం భయాదికం, ఇత్యేవముక్త్వా భక్త్యా చ నంద స్తస్థౌ హరేః పురః. ౨౩. ప్రసన్నవదనః కృష్ణో దదౌ తస్మై యదీప్సితం, ఏవం నందకృతం స్తోత్రం నిత్యం భక్త్యా చ యః పఠేత్. ౨౪. సుదృఢాం భక్తిమాప్నోతి సద్యో దాస్యం లభేద్ధరేః. శ్రీకృష్ణజన్మఖండము ౨౧ అధ్యాయము.

చెంత భక్తినమ్రాత్మకంధరుఁడై నిలువఁబడి నందుఁడు తదేక ధ్యానమున నుండెను. శ్రీకృష్ణుఁడు సుప్రసన్నవదనుఁడై తదభీష్టము నొసంగెను. ఇది నందకృతమగు శ్రీకృష్ణస్తుతి. దీని నెవ్వఁడు భక్తియుతుఁడై పఠించునో వానిభక్తి దృఢమగుటయే గాక యపుడే శ్రీహరిదాస్యము లభించును. పూర్వము ద్రోణుఁడు తపమొనరించుచుండఁగా బ్రహ్మప్రత్యక్షమై ఈస్తుతి రాజము నుపదేశించెను. శ్రీహరిషడక్షరమంత్రము సుదుర్లభమగుకవచముగూడ నొసఁగెను. నందుఁడు తొలిజన్మమునఁ బుష్కరతీరమునఁ దపమొనరించుచుండ బ్రహ్మయంశమునుండి పుట్టినసౌభరి యనుముని యీస్తోత్రరాజమును షడక్షరపరమ దుర్లభమంత్రమును సర్వసిద్ధికరకవచము నొసంగెను. మంత్రము కవచము స్తోత్రము ననునీమూఁడును బరమదుర్లభములు. *ఎవని కేవిద్యప్రాక్తనజన్మమున లభించియుండునో అది వానిని వదలదు. నిశ్చయము. ఈస్తోత్రము శ్రీకృష్ణమహిమానుబోధకము. అత్యద్భుతము. సుఖప్రదము. ముక్తిదాయకము. సంసారబంధవిమోచనము.

సాధుమనీషులారా! భక్తజనాగ్రగణ్యులారా! ఈయింద్రయాగభంగమనుగాథను బఠించితిరి. దీనఁగలవిశేషములు మీకుఁ గోచరించినవేకాని క్రొత్తవి నేవ్రాయఁజాలను. ఆత్మతృప్తికై కొన్నింటిని వ్రాయుచున్నవాఁడ. ఈగాథనుండి నేర్చుకొనఁదగినవిషయము లనేకములు. వానిసిద్ధాంతములఁ

---

* యాయస్య విద్యా ప్రాచీనా నతాంత్యజతి నిశ్చితమ్-అనిమూలము.

జక్కఁగా వ్రాయ నుంకించినచో స్కాందపురాణమంత గ్రంథ మగును. అంతటి యవకాశ మిటలేదుకదా. అంతటిశక్తియు నాకుఁజాలదని మీరుమాత్ర మెఱుంగరా. కాఁబట్టి సారభూత మగుదాని నిటవ్రాసెద. ప్రతివిషయము మతమునకు దేశము నకు సంబంధించినదే యనక తప్పదు. శ్రద్ధమైఁ బఠింపుఁడు. దాన నాశ్రమము ఫలించినట్లగును.

నందాదులు బృందావనమున నొకచో గుంపుగఁగూడి యింద్రయాగముచేయ నూహించిరి. దాన సువృష్టికలిగి తృణ ములు ధాన్యములు ఫలించుననియు గోధనమునకుఁ దమకు మేలుగలుగుననియు వారియూహ. వర్షాధిపతి శచీనాథుఁడు. ఆతని యనుగ్రహమునకుఁ బాత్రులుగాకయున్న సువృష్టికలు గదు. అదిలేకున్న నడవులు నశించు. దాన గోప్రతతికి హాని వాటిల్లు. అనునదియే వారియూహ. నందునిమాటల కంద ఱామోదించిరి. ఈయాగక్రమము క్రొత్తదియుఁగాదు. పారం పర్యక్రమముగావచ్చునదియే కావున సర్వజనాంగీకృత మయ్యె ను. వలయుపరికరముల సిద్ధపఱచిరి. బలిదానమున కనువగుజం తువుల నేకరించిరి. పాప మవి వీరిని దిరస్కరింపఁజాలవు. పూజించినను ఛేదించినను ఒక్కరీతిగా నుండును. దానిమొ ఱలు వీరికిం దెలియవు. వానిదీనదృష్టులు వీరికఠినచిత్తమును మెత్తపఱుపఁజాలవు. అవియుఁ దమవంటివే యనుజ్ఞానము వీరికిలేదు. కాఁబట్టి బీయములోనగువస్తువుల సిద్ధపఱచినట్లే బలి నీయ వానిని బ్రోగుచేసిరి. ఈఘనకార్యమునకై గృహముల

నలంకరించిరి. స్త్రీపురుషులు తమగాత్రములఁ గైచేసికొనిరి. ఆబాలవృద్ధముగా వ్రజ మంతయు సంతోషమున వెల్లివిరియు నట్లుండెను. బలిజంతువులుమాత్రమే దుఃఖించుచునుండెను. ఒక్కరైన సాధుమతు లుండఁగూడదా మామొఱలాలింపఁ గూడదా యని యవి మనసుల దుఃఖించుచుండెను. పెండ్లికిం బోవునట్లుందఱు గోవర్ధనముచెంతకుం బోయిరి. వనితలు శకట ముల వాహనముల నధిష్ఠించి బాలకులఁ జెంతనుంచుకొని ముద్దులాడుచుం బోయిరి. వారికైనను జంతువులదీనాలాప ములు గోచరింపవయ్యెను. ఈయుత్తమోత్తమకార్యమునకు మహామునులుకూడ వచ్చిరఁట. యాగశాలల నిర్మించిరఁట. శాస్త్రరీతిగా నమరి యాయాగశాలలు కన్నులపండువు చేయు చుండెనఁట. వానిచెంతనున్న వధ్యస్థానము వారిచిత్తములకు వంత గల్పింపఁజాలకపోయెను గాఁబోలును. ఇట్లన్నివిధములఁ నాయజ్ఞప్రయత్నము కొనసాగెను. ఇంతలోఁ దమప్రభువును గూర్చి మహాయాగము సాగుచున్నదన్న హేతువు నూని సుర లోకమునుండి యచ్చరమిన్న లరుదెంచిరి. వారిం గాంచినంతనే యటనున్నవారెల్ల రచ్చెరువందిరఁట.

ఇట్లు శతమఖమఖమహోత్సవము సాగనుండుతఱి బల రామగోపాలబాలకాన్వితుఁడై శ్రీకృష్ణపరబ్రహ్మ మాచోట కరుదెంచెను. తా సర్వజ్ఞుఁడయ్యు నింద్రాదులయాకృతింబూని లోకరక్షణమునకై పలుభంగులఁ బాటుపడుచుండువాఁడయ్యు లోకాచారమునుబాటింప నాయాగము నెఱుఁగనివాఁడువోలె

నిట్లు ప్రశ్నించెను. తండ్రీ! ఈయాగ మెవ్వనిగుఱించి చేయఁబడుచున్నది? దీన ఫలమేమి? ఐహికమా? ఆముష్మికమా? ఆదేవత యాగ్రహించిన దానఁగలుగు కీడేమి? దేవతలంద ఱన్ని ఫలముల నీఁజాలరు. అను మొదలగు ప్రశ్నములఁ జేసెను. నందుఁడు సమాధానము చెప్పుచు నీయాగము క్రొత్తది గాదనియు వంశపరంపరగఁ జేయునదియే యనియు నీమొదలగు మాటలఁ జెప్పెను. ప్రశ్న ప్రతివచనములనుండి మన మెఱుంగఁదగు విషయములను వ్రాసెదను.

## దే వ త లు.

దేవత లనేకవిధములుగ నుందురు. కొంద ఱల్పఫల ప్రదాయకులు. కొంద ఱుత్తమఫలదాతలు. మఱికొంద ఱుత్తమోత్తమఫలదాయకులు. ఇంద్రాదు లుత్తమఫలముల నీఁజాలువారు. తదాజ్ఞాపాలకు లగు నితర దేవత లల్పఫలముల నీయ సమర్థులు. బ్రహ్మాదు లుత్తమోత్తమఫలముల నీయ సమర్థులు. ఇంద్రాదులఁ బ్రార్థించిన వృష్టిమొదలగు ఫలములు గలుగును. ఆఫలము లైహికసుఖమును గల్గించునవి. ఇతర దేవతలఁ బ్రార్థించి తదనుగ్రహమును సంపాదించిన నత్యల్పఫలములే లభించును. ఐహికసుఖము గూడ సంపూర్ణముగ వానిచే లభింపదు. బ్రహ్మాది త్రిమూర్తుల నుపాసించినచోఁ జతుర్విధపురుషార్థములు లభించును. ఇట్లగుటకుం గారణమేమనిన: మానవులు వివిధవిధకర్మముల నొనరించినవారు. వారిభక్తియుఁ గర్మానుసారముగ నుండును. ఏలోకమున నెంతసుఖ మనుభవింపఁదగునో తదనుకూల

ముగా భక్తియుఁ గుదురును. అనఁగాఁ త్రిలోకాధిపతియగునిం ద్రుని బ్రార్థించెదను.నాకీకోరిక లభింపవలయునని యామనుజుఁ డుపాసించును. ఫలము నంతియే కల్గును. భక్తుఁడు మఱియు నల్పతమములగుఫలములఁ బుత్రదారాదులంగోరి యల్ప దేవతల నుపాసించినచో నట్టిఫలములే లభించును. అవి యత్యల్పకాల సుఖమును గల్గించునవి యని వేఱుగ వచింపనక్కఱయే లేదు. చతుర్వర్గఫలప్రదాతలని, లోకాధిపతులని సర్వదేవాది దేవులని బ్రహ్మావిష్ణుమహేశ్వరుల నుపాసించినఁ బురుషార్థచతుష్టయము లభించును. ఇట్లుపాసించుట పూర్వజన్మకృతసుకృతము ననుసరిం చియే యనక తప్పదు.

ఏభక్తుఁడు సర్వదేవతాస్వరూపుఁడు భగవంతుఁ డావి రాట్టు వని యుపాసించునో ఆభక్తుఁ డేదేవతను బ్రార్థించినను సకలపురుషార్థములు లభించును. కారణమేమనఁగా నాభక్తుని చిత్తమున దేవతాతారతమ్యము లేదు. ఈరూపమున సర్వే శ్వరుఁ డొప్పుచుండునని యతఁడు ప్రార్థించును. వాస్తవముగా నొక్కఁడగు నా సర్వేశ్వరుఁడే పెక్కురూపముల నలరారును గాన భక్తునిదృఢభావముకూడ నట్టిదే యగుట సకలపురుషార్థ ముల నాదేవతయం దలరారుభగవంతుఁడే ప్రసాదించు ననుట సర్వశాస్త్రసమ్మతమార్గము.అట్లుకాదేని సకలశాస్త్రముల మూట గట్టి యగ్నిలో వేయవలసినదియేగాని వేఱుగౌరవము వాని నీయవలసినపని యుండదు.

ఉదాహరణము.

ఆర్యమహాశయులారా! ఒక్కయుదాహృతిని ఓపికమై నాలకింపుఁడు. భక్తుఁడొక్కఁడు కలియుగమున శ్రీరామ చంద్రమూర్తి నారాధించె ననుకొనుఁడు. వానిభక్తి దృఢత మమే యని నిశ్చయింపుఁడు. శ్రీరామమూర్తి త్రేతాయుగాంత మున నే యవతారమును వదలెను. వైకుంఠవాసి యగుశ్రీమ న్నారాయణమూర్తి చతుర్భుజవిరాజితుఁడు. ఇపు డీభక్తునిగతి యేమి? ఈతనితపస్సు నిష్ఫలమా. సఫలమా. పరమపదమున కేగినరామునిఁ బ్రార్థించిన లాభమేమని చెప్పవచ్చునా. లేక రాముఁ డయోధ్యలోఁ గనఁబడకుండ నున్నవాఁ డనవలెనా. అటులన్నచో రామాయణమును గాల్పవలసినదియేకదా. ఇపు డీభక్తునితపఃఫలమేమి? ఈప్రశ్నము చేయవలసినది కాదన రాదుకదా. యుక్తియుక్తము గాదనరాదుకదా. మఱేమి సమాధానము? అన్న నాలకింపుఁడు. భక్తుఁడు శ్రీరామ మూర్తిని సీతాసమేతునిగ నుపాసించును. దృఢభక్తిమై నుపా సించిన నది వ్యర్థముకాదు. సకలదేవతాస్వరూపుఁడు సర్వేశ్వ రుఁడు. భక్తుల నుద్ధరింపఁ గంకణముగట్టుకొనియుండువాఁడు. కాఁబట్టి భక్తునిదృఢభక్తికిమెచ్చి యతని మనమం దేరూపము తనదిగా నిలిచి యున్నదో, తనహృదయారవిందపీఠమున నెట్టి యాకృతిని భక్తుఁ డతఁడు నిలిపి పూజించి ధ్యానించెనో యారూపముననే ప్రత్యక్షమగును. భక్తునకుఁ గోరినవరముల నిచ్చును. తదీయకర్మానుసారముగ నతనినుద్ధరించును. ఇది భగ

వద్భక్తు లెల్ల నెఱింగినవిషయమే. ఈసిద్ధాంతము సత్యముగాక యున్న భక్తిమార్గమే నశించును. ఇది సర్వశాస్త్రసమ్మతమగు సిద్ధాంతముగాని యిందెవ్వరికేని సంశయింపఁదగినవిషయము లేదు. మున్ను కాళిదాసు విద్యనుగోరి మహాకాళికాంబ నుపాసించెను. ఆమెయుఁ దనభయంకరాకృతిని మాని శారదారూపమున నతనికి సాక్షాత్కరించెను. ఏల? ఆతఁడు కోరినది విద్య. తనరూపమో శత్రుసంహరణక్షమము. కాన నాభక్తుని కోరికకుఁ దగినదికాదు. అని యాలోచించి యాపరదేవి భక్తమనోరథానుసారము సౌమ్యరూపముగా మార్చుకొని ప్రత్యక్షమయ్యెను. ఇట్లే సర్వదేవతల నుపాసింపవచ్చును. కాని సకలబ్రహ్మాండనాయకుఁ డగుపరమేశ్వరుఁ డీరూపమును గైకొని లోకానుగ్రహమునకై యున్నవాఁడని యుపాసింపకున్నచో ఫలము తద్దేవతాధికారానుసారముగనే యుండును. సకలపురుషార్థములు లభింపఁజాలవు. కావున భక్తుఁడు మాఢ్యమును వదలి భగవంతుని యపరరూపముగా నేదేవతనే నుపాసింపవచ్చును. ఫలము వాంఛానురూపముగాఁ గల్గును. బ్రహ్మ వేఱు. విష్ణువు వేఱు. శివుఁడు వేఱు. అని భిన్నభావమున నుపాసించినఫల మల్పముగాఁ గల్గును. కారణమేమనః నాతనిభక్తి జ్ఞానసంపత్సమృద్ధముకాదు. ఈవిషయము భగవద్గీతలయందుఁ గాననగును.

శ్లో. మత్తః పరతరం నాన్య త్కించిదస్తి ధనంజయ,
మయి సర్వ మిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ. 2

రసోఽహమప్సు కౌంతేయ ప్రభాస్మి శశిసూర్యయోః,
ప్రణవస్సర్వవేదేషు శబ్దఃఖే పౌరుషం నృషు. ౮
పుణ్యోగంధః పృథివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌ,
జీవనం సర్వభూతేషు తపశ్చాస్మి తపస్విషు. ౯
బీజం మాం సర్వభూతానాం విద్ధి పార్థ సనాతనం,
బుద్ధి ర్బుద్ధిమతామస్మి తేజ స్తేజస్వినామహం. ౧౦
బలం బలవతాంచాహం కామరాగవివర్జితం,
ధర్మావిరుద్ధో భూతేషు కామోఽస్మి భరతర్షభ. ౧౧
యేచైవ సాత్వికాభావా రాజసా స్తామసాశ్చ యే,
మత్త ఏవేతి తాన్విద్ధి నత్వహం తేషుతే మయి. ౧౨

... ... ... ...

చతుర్విధా భజంతే మాం జనా స్సుకృతినోఽర్జున,
ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ. ౧౬
తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే,
ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమప్రియః.

... ... ... ...

బహూనాం జన్మనామంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే,
వాసుదేవస్సర్వమితి సమహాత్మా సుదుర్లభః. ౧౯
కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః,
తంతం నియమమాస్థాయ ప్రకృత్యా నియతాస్స్వయా.
యోయోయాంయాంతనుంభక్తశ్శ్రద్ధయార్చితుమిచ్ఛతి,
తస్య తస్యాచలాం శ్రద్ధాం తామేవ విదధా మ్యహం.
సతయా శ్రద్ధయా యుక్త స్తస్యారాధన మీహతే,

లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్.
అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్,
దేవాన్ దేవ యజోయాంతి మద్భక్తాయాంతి మా మపి.
యేషాం త్వంతగతం పాపం జనానాం పుణ్యకర్మణాం,
తే ద్వంద్వమోహా నిర్ముక్తా భజంతే మాం దృఢవ్రతాః.
(విజ్ఞానయోగము.)

ఆర్యులార! "బీజం మాం సర్వభూతానామ్" "మత్తః పరతరం నాన్యత్కించిదస్తి" అనువాక్యముల భావమేమి? "ప్రియోహి జ్ఞానినోఽత్యర్థమహం స చ మమప్రియః" అను వాక్యమునఁగల సారతరార్థమేమి? ఈభగవద్గీతావాక్యము లన్నియు పైనివ్రాయఁబడినభావమును దృఢపఱచుచున్నవి.

"కామైస్తైస్తైర్హృతజ్ఞానాః ప్రపద్యంతేఽన్యదేవతాః"
"లభతేచ తతః కామాన్ మయైవ విహితాన్ హితాన్"
"అంతవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసామ్"

అను నీమూఁడువాక్యములుపై నాభావమునే చక్కఁగాఁ దేటపఱచుచున్నవికదా. దీనిచేతనే మనమొకవిషయమును గ్రహింపవచ్చును. భగవంతుఁ డీయగ్నిరూపమున నున్నవాఁడు. సర్వభూతాంతర్యామి యనఁబరఁగువాఁ డితఁడే యని యుపాసించిన జ్ఞానికింగలుగుఫల మీతనికిం గల్గును. అట్లుగాక యగ్ని యొకదేవత. లోకోపకారపరాయణుఁడు. దేవతలలో నుత్తముఁడు. అనుబుద్ధి నుపాసించిన ఫలము తదనుగుణ్యమే. కాని జ్ఞాని యేబుద్ధితో నుపాసించి యెట్టిఫలముల నొందునో యాఘ

లముల నితఁడు పొందఁజాలఁడు. ఇట్లే శ్రీమన్నారాయణ మూర్తి యవతారములందుఁగూడ నుత్తమమధ్యమాధమతారతమ్యముగలిగి యుపాసించిన ఫలము సమానముకాదు. ఇది భక్తజనవిదితము కాని క్రొత్తగాఁ గల్పించినది కాదు. నారదాదులు గానరూపమున, వసిష్ఠాదులు ధ్యానరూపమున, దుర్వాసఃప్రభృతు లుపవాసనియతిప్రభృతివ్రతరూపముననాని రంజను నుపాసించి తుల్యఫలమునే పొందఁజాలిరి. భక్తి దృఢతమము కావలయు ననియు, నితరదేవతాబుద్ధిలేక సర్వసమత్వము గలిగి యుండవలయుననియు భగవద్గీతాదిముక్తిమార్గప్రదర్శక గ్రంథముల సార మనుటకే శంకాతంకములు లేవు.

## బ్రాహ్మణప్రశంస.

శ్రీహరి బ్రాహ్మణప్రశంసచేసెను. దానిసార మేమనఁగా? బ్రాహ్మణులు పరబ్రహ్మ మెఱిఁగియుండుట పూజ్యులైరి. వేదవేదాంగవిదులగువారలకే పూజ్యత్వముగాని జాతిసామాన్యమునకుఁ గాదు. జ్ఞాని విద్వాంసులకంటెఁ బూజ్యుఁడని యంద అంగీకరింతురు. ఏల? చదువుకొనుటకన్న దాని ప్రకార మాచరించి తదనుభవము గల్గుటయే ప్రధానమని పూర్వులభావము. ఏకాలమునఁగాని యీభావము మార్పునొందఁదగినది కానే కాదు. అట్టివారివిషయమే శ్రీకృష్ణమూర్తిచేఁ బ్రతిపాదింపఁబడినది. ఈవిషయమే మనుస్మృతి పండ్రెండవయధ్యాయమందు,

శ్లో. అజ్ఞేభ్యో గ్రంథినశ్శ్రేష్ఠా గ్రంథిభ్యో ధారిణోవరాః,
ధారిభ్యో జ్ఞానినశ్శ్రేష్ఠా జ్ఞానిభ్యోవ్యవసాయినః.౧౦౩

తపోవిద్యాచ విప్రస్య నిఃశ్రేయసకరం పరం,
తపసా కిల్బిషం హంతి విద్యయాఽమృతమశ్నుతే. ౧౦౪

అజ్ఞులనఁగా యత్కించిద్విద్య నభ్యసించినవారు. వారి కంటె సమగ్రగ్రంథపఠనముచేసినవా రుత్తములు. వారలకన్నఁ జదివినగ్రంథమును మదినిల్పుకొన్నవా రుత్తములు. వారికంటె నధీతగ్రంథార్థము నెఱిఁగినవారు శ్రేష్ఠులు. వీరందఱికంటె దాని ననుష్ఠానమున సార్థకముచేయువా రుత్తమోత్తములు. అని మనుస్మృతిభావము. ఇంతియకాక ధర్మసంశయనిర్ణయవిషయమున మను విట్లుపదేశించెను.

శ్లో. ఏకోఽపి వేదవిద్ధర్మం యం వ్యవస్యేద్ద్విజోత్తమః,
సవిజ్ఞేయః పరోధర్మో నాజ్ఞానా ముదితోఽయుతైః. ౧౧౩

వేదవిచ్ఛబ్దము వేదార్థధర్మజ్ఞపరమని గ్రహింపఁదగు. ఒక్కఁడైనను వేదార్థధర్మజ్ఞుఁడు ఏధర్మను నిర్ణయించునో అది ప్రకృష్టధర్మమనఁబడు. వేదము నెఱుఁగనివారు వేయిమంది చెప్పిన నది ధర్మము కానేరదని పైవచనతాత్పర్యము. యమస్మృతియందును,

శ్లో. ఏకోద్వౌవా త్రయోవాపి యద్బ్రూయుర్ధర్మపాఠకాః,
సధర్మ ఇతి విజ్ఞేయో నేతరేషాం సహస్రశః.

అని చెప్పఁబడినది. మఱియు మనుస్మృతియందు,

శ్లో. అవ్రతానా మమంత్రాణాం జాతిమాత్రోపజీవినాం,
సహస్రశస్సమేతానాం పరిషత్త్వం న విద్యతే. ౧౧౪

సావిత్ర్యాది బ్రహ్మచారివ్రతరహితులై మంత్రవేదాధ్యయన రహితులై బ్రాహ్మణజాతిమాత్రమును ధరించినవారు పెక్కు-మందికూడినను అది సభకాదు. ఏలయన వారు ధర్మనిర్ణయము చేయఁజాలరు. అని మనువు సిద్ధాంతముచేసెను.

దీనిసారాంశము వేదవేదాంగములఁ జదివి వానియర్థము నెఱింగి దాని ననుష్ఠానమున నలవాటుచేసికొనినవాఁడు బ్రాహ్మణుఁడనఁబడుననియు నట్టివాఁడు జగత్పూజ్యుఁడనియుఁ దేలినది కదా. అట్టిజ్ఞాని పూజ్యుఁడనుట కెవ్వరు శంకింతురు. అట్టివారినే శ్రీహరి ప్రశంసించెను. అట్టివారికి దేవతానైవేద్యమును బెట్టవలయునని యాదేశించెను. మూర్ఖుఁడైనవాఁడు దేవతానైవేద్య మట్టి భూసురుఁడుండఁగా నతనికిం బెట్టక తానే భక్షించునో వాఁడు పాపియని సిద్ధాంతీకరించెను. దేవున కర్పింపక జ్ఞానియగువిప్రున కెవ్వాఁ డన్నము పెట్టునో యాయన్నమును బ్రాహ్మణముఖమునుండి దేవతలు భక్షించి తృప్తులగుదురని యుపదేశించెను. అట్లుకావున సర్వప్రయత్నముల చేతను విప్రపూజ మంచిదనుసారాంశమును దెల్పెను.

దేవతలందఱికి నైవేద్య మిడుటకంటె విష్ణుమూర్తికి నైవేద్యమిడుట యుత్తమము.

ప్రశస్తం సర్వదేవేషు విష్ణునైవేద్యభోజనమ్.

అని చెప్పఁబడినది. సర్వదేవతానైవేద్యములకంటె విష్ణునైవేద్యభోజనము ప్రశస్తతర మని దీనిభావము. ఇచ్చట విష్ణుశబ్దము సర్వవ్యాపి యగుభగవత్పరము. సర్వవ్యాపి

సర్వాంతర్యామి, సర్వసాక్షి, సర్వకారణము ఎవరో ఆపరాత్ప రుఁడని దీనిభావము. ఆపరాత్పరుఁడే విరాట్పురుషుఁ డని గ్రహింపక తప్పదు. ఏపేరునఁ బిలిచినను ఆపరాత్పరునినే చేరును. కాఁబట్టి మతభేదముల కిటఁ జోటులేనేలేదు. త్రిమూర్తులలో నొకరగువిష్ణువన్ననే దెబ్బలాటలువచ్చును. ఆవిష్ణువే పరాత్పరుఁడన్నచో నేకలహము లుండవు. ఆవిష్ణువును శైవులు శివుఁడని ధ్యానింతురు. విష్ణుభక్తులు నారాయణుఁడని కొల్తురు. శాక్తులు పరదేవియే యని ధ్యానింతురు.

... ... ... పుంరూపేచ మదాత్మికా.

అన్న భగవద్వాక్యము సుప్రసిద్ధమేకదా. ఇట్లు వివిధమత ములవా రాభగవంతుని సేవింతురు. ఎవరు కాదనఁగలరు? అట్లు చెప్పుట కేమియధికారము కలదు. భక్తునకు మతభేదములులేవు. విష్ణుభక్తుఁడు సర్వత్ర విష్ణువునే కనుఁగొనును. శివభక్తుఁడు సర్వత్ర శంకరునే నిరీక్షించును. శంకరుఁడు విష్ణువుకన్న శ్రేష్ఠుఁడు. అని భావించెనా వాఁడు క్షుద్రుఁడగును. విష్ణుభక్తుఁడు శివునకంటె విష్ణు వధికుఁడన్న క్షుద్రభక్తుఁడే యగును. అనఁగా సకలనామరూపాధారియగు విష్ణువు తప్పఁ బ్రపంచమున వేఱొక్కపదార్థము లేదన్నదృష్టి భక్తునకుండెనా యేలాటిభేదము కనఁబడదు. తారతమ్యములు పరికింపఁబూనెనా ఆభక్తునిబుద్ధి నిర్మలము కాకపోవును. జ్ఞానముక్తి దొరకదు. కాఁబట్టియే,

యోయోయాంయాం తనుంభక్తశ్శ్రద్ధయార్చితు మిచ్ఛతి,
తస్య తస్యాచలాంభక్తిం తామేవ విదధా మ్యహం.

అన్న శ్రీకృష్ణపరబ్రహ్మోక్తి గీతలయందుఁ గనంబడియెడు. అట్టి భగవదుక్తియందు విశ్వాసములేనిచోఁ దరించుననుట కేవలము మూర్ఖపద్ధతి. దీనిచేఁ దామసగుణప్రధానులకన్న రాజసగుణ ప్రధానులు వారికంటె సత్వగుణప్రధాను లుత్తము లనుట యొకసిద్ధాంతము తేలఁగలదు. అదియు "సర్వత్ర సమదర్శనః" అనుభగవదుక్తిచే నిరాకృతమగు. కాని భేదబుద్ధిగలవారలను సభాముఖమున నోరుతెఱచి మాటలాడఁ బనికివచ్చును. ఇఁగో డవ మనకేలగాని బ్రాహ్మణప్రశంసయం దిదియు ముఖ్యము గాన నించుక వ్రాయవలసివచ్చెను. పంచవిధమహాపాతకముల నొనరించినవాఁడైనను బ్రాహ్మణసందర్శనమునఁ బాపనిర్ముక్తుఁ డగునని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. దీనికం గారణము లేకపో లేదు.

శ్లో. నహ్యమ్మయానితీర్థాని నదేవామృచ్ఛిలామయాః,
తేపునం త్యురుకాలేన దర్శనాదేవసాధవః.

అను మహాభారతప్రమాణము కలదుకదా. దీనిభావ మేమి? సర్వదేవతల నుపాసించి సకలనదీముఖంబుల స్నానము నరించి భగవత్సాక్షాత్కారమునఁ బరమపవిత్రుఁడగు సాధు వును దర్శించిన భగవంతుని దర్శించినట్లు యగును. భగవంతుని దర్శించినఁ బోవనిపాపములు లేవుకదా. ఉన్నవన్నియో భగవన్మ హిమము గొఱంతఁ గాంచునుగదా. ఇంవలిరహస్య మేమనఁగాఁ

సాధువును దర్శించువాఁడు ఈమహాత్ముఁడు భగవద్భక్తుఁడు. ఏతద్దర్శనమున నాపాపములు తొలఁగును. అన్యబుద్ధిచే దర్శించిన పైఫలము కలుగకమానదు. అట్లుకాదేని సంపూర్ణఫలము లేదని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును. అట్లే సర్వవిధములఁ బవిత్రుఁడగు బ్రాహ్మణునిదర్శనమునఁ బాపములు నశించునన్న భగవద్భక్తియందుఁ దప్పేమియుఁ గానరాదు. జాతిమాత్రుఁడగు బ్రాహ్మణబ్రువుని దర్శనమునఁ బాపములు తొలఁగునని యర్థము కాదు. ఆభావము గ్రహింపఁదగినదియుఁ గాదు. హరిదాసుఁడగు బ్రాహ్మణుఁ డుత్కృష్టుఁడనుట కిదియే కారణము. హరిదాసుఁడగుశూద్రుఁడామము (పిండిని) భగవంతునకు నైవేద్య మీవలయునని హరియే చెప్పెను. సాలగ్రామమును బూజించునధికారము శూద్రులకు లేదనియె. ఏలయనఁగా: ఇట శూద్రుఁడనఁగా భక్తిభావములేనిపామరుఁడని యర్థము. జ్ఞానియయ్యె నేని దేవతలంబూజింప నధికారిగాఁ డనువాదము తుచ్ఛవాదమగును. వాస్తవముగా జ్ఞానియయ్యె నేని భగవద్భక్తులలో నగ్రగణ్యుఁడే యగును. కాననే,

చండాలోఽస్తు సతుద్విజోఽస్తు గురురిత్యేషామనీషామమ.

అని శ్రీశంకరభగవత్పాదాచార్యులవా రుపదేశించిరి. ఎంతదనుక నజ్ఞానముగలదో యంతదనుకఁ గులభేదము లుండును. జ్ఞానశిఖరాధిరోహణము గావించినవాని కా కులభేదము లుండవు. భూమి నిమ్నోన్నతములుగ నుండినను నీటిపై భాగము సమముగ నున్నట్లు భక్తునిమానసము సర్వత్ర భగవంతునే

చూచున దగును. ఈభావ మందఱకుఁ గుదురుట దుష్కరము. ఇట నొక్కవిషయముచెప్పక తప్పినదికాదు. అధికప్రసంగమని కాని యప్రస్తుతప్రశంస యనికాని యాక్షేపింప వలదని ప్రార్థించెదను.

శ్రీరాముఁడు తపముచేయుశూద్రునిం జంపెఁగదా. భక్తుఁడగుశూద్రున కధికారముగలదన్న పైమాట నిలుచునా? అని ప్రశ్నము రాఁదగినది. సమాధానము వినుఁడు. ఏజీవుఁడు కాని కోరఁదగినవాంఛలు కోరఁదగునే కాని కోరరానివాని నర్థింపరాదు. శంబుకుఁ డనుశూద్రుఁ డత్యుగ్రతపం బొనరించుచుండెను. దాన నాతనికోర్కి ఫలింపక తప్పదు. అది ఫలింప వలనుపడనిది. కాన భగవంతుఁ డగురామునిచే నతనికిం జావు రావలసినదని తత్కర్మమే యుద్దేశించెను. కారణముండియే తీఱవలయుఁగాన రాముఁ డడవికిం బోవఁదగు పని జరగవలయు. కాఁబట్టి విప్రకుమారుఁడు చచ్చునట్లుచేసెను. దాన నావిప్రుఁడు రాజును నిందించెను. రాముఁడు ఖడ్గపాణియై బయలువెడలి దక్షిణదిశకుంబోయి యొకమునిం గాంచి నీవెవ్వఁడవని ప్రశ్నించెను. ఆముని యసత్యమాడక శ్రీరామునిం గాంచి యిట్లు పలికెను.

శ్లో. తస్య తద్వచనం శ్రుత్వా రామస్యాక్లిష్టకర్మణః,
అవాక్శిరా తథా భూత్వా వాక్యమేతదువాచహ. ౧
శూద్రయోన్యాంప్రసూతోఽస్మి శంబుకోనామనామతః,
దేవత్వం ప్రార్థయే రామ సశరీరో మహాయశః. ౨

న మిథ్యాహం వదే రామ దేవలోకజిగీషయా,
శూద్రం మాం విద్ధి కాకుత్స్థ తప ఉగ్రం సమాస్థితం. ౩
భాషత స్తస్య శూద్రస్య ఖడ్గం సురుచిరప్రభం,
నిష్కృష్య కోశాద్విమలం శిరశ్చిచ్ఛేద రాఘవః. ౪

ఉత్తరకాండము. ౭౬ సర్గము.

దీనింబట్టి శూద్రుఁడు తపముచేయరాదను సిద్ధాంతమే కనఁబడదు. ఎవ్వఁడుగాని కోరరాని కోరికంగోరి తపంబొనరింప విఘ్నము దానికిం గల్గుటయేగాక మృత్యువుకూడఁ గల్గు ననుసిద్ధాంతము దృఢపడుచున్నది. శంబుకుఁడు సశరీరస్వర్గమును గోరెను. అది యాతనికి లభించునట్టిదికాదు. లోకసహజము కూడఁ గాదు. తపస్సు ఫలించెనా వాంఛితము ఫలింపకతప్పదు. ఇపు డీతనితపస్సు నిష్ఫలమయ్యెఁగదా యనుట యవివేకము. సఫలమేయైనది. భగవంతునిచే మృతిగల్గినది. ముక్తి లభించినది. శరీరముతో స్వర్గము లభింపరాదు కనుకను, ఆతఁ డొనరించు తపము దృఢభక్తియుతము గనుకను శీఘ్రముగ శ్రీరామచంద్రునిహస్తమున మృతిలభించెను. దాన నరకప్రాప్తుఁడగునన్నియేమానవుఁ డనఁగలఁడు. వాఁడు తత్తపఃఫలముగ మహర్షులకు లభించుదివ్యపదము నొందెను. కాఁబట్టి శూద్రుఁడు తపమొనరింపరా దన్నసిద్ధాంత మీకథ ననుసరించి వచింప నలవికానేకాదు. పాత్రుఁడయ్యెనేని తాఁ బొందఁగోరుఫలమున కతని ప్రాగ్జన్మకర్మము సమ్మతించెనేని వాఁడు తపంబొనరింప నర్హుఁడేయగును. కాఁడేని విఘ్నములపా లగును. ఇది యొకశూద్రునకే

కాదు. అన్ని జాతులకును ఒక్కరీతిగా నుండును. ఎవ్వఁడెవ్వఁ
డేయేకర్మముల నొనరించియుండునో తదనుకూలమగుఫలము
నొందునేకాని తదధిక మగుఫలము నొందఁజాలఁడు. ప్రయ
త్నించినను శ్రమము నిరర్థకమగును. కావునఁ దపం బొనరింపఁ
బూనువాఁ డేజాతికిఁ జేరినవాఁడైనను ఫలమునొందుట కర్మాను
సారమే కాని యధికఫలము రానేరదు. కాఁబట్టి భగవద్భక్తికిఁ
గులభేదములు లేవు. ఉన్నవనుట పాటింపఁదగనిమాట. ఇంతటఁ
నీవిషయము నుజ్జగించి వేఱొక్కవిషయమును [illegible]
దను.

### గోప్రశంస.

బ్రాహ్మణప్రశంసచేసి పిదప శ్రీహరి తంత్రితో గోప్ర
శంసచేయుచు నిట్లు పలికెను. తంత్రీ! ఇప్పుడు సంపాదించినవస్తు
వులలో సగము గోవర్ధనాద్రి కీవలయును. అని యిట్లనుచు గోమ
హిమమును జెప్పఁబూని,

శ్లో. తీర్థస్నానేషు యత్పుణ్యం యత్పుణ్యం విప్రభోజనే,
సర్వవ్రతోపవాసేషు సర్వేష్వేవ తపస్సుచ,
యత్పుణ్యంచ మహాదానే యత్పుణ్యం హరిసేవనే.
భువః పర్యటనే యత్తు సర్వవాక్యేషు యచ్ఛ్రుతే,
యత్పుణ్యం సర్వయజ్ఞేషు దీక్షాయాం చ లభేన్నరః.
తత్పుణ్యం లభతే ప్రాజ్ఞో గోభ్యో దత్వా తృణానిచ,
భుక్తవంతీం తృణంయశ్చ గాం వారయతి పాతకీ.
బ్రహ్మహత్యా భవేత్తస్య ప్రాయశ్చిత్తాద్విశుద్ధ్యతి,

అని యూనిచెప్పెను. సకలపుణ్యకార్యములలో నుత్కృష్ట క్రియల నిటం జేర్కొనుటచే గోవులకుం దృణమొసంగుట వలన సకలపుణ్యకార్యకరణజనితపుణ్యము లభించు ననుభావము తేలును. దీనిచే గోవులరక్షించుట శ్రేష్ఠతమకార్యములలో నుత్తమోత్తమమని భావము వెల్లడింపఁబడినదికదా.

మహాశయులారా! దీనిసారము నాలకింపుఁడు. సకలరోగనివారణదక్షమై ఆరోగ్యబలముల నొసంగుచు బుద్ధివికాసమును గల్గించుక్షీరములు గోమాత నుండియే లభించుచున్నవి. తల్లియిచ్చుపాలు చిన్నతనమునందేకాని తరువాతఁ బనికిరావు. గోమాత యొసంగుపాలు జీవించియుండుదాఁకఁ బనికివచ్చును. ఆహారమునువదలిన మహామునులుగూడ గోక్షీరములఁ బరిగ్రహింతురు. మేకపాలు, మాహిషక్షీరములు లోనగుక్షీరములకంటె గోక్షీరములు పవిత్రములనుట సర్వజనాంగీకృతము. బలారోగ్యముల నొసంగుటచే నాయురభివృద్ధిని గల్గించుననుటలో సంశయములులేవు. ప్రాణాధారమగుకృషికర్మములకుపయోగించువృషభములు వానివలననే లభించుచున్నవి. చతుష్పాదజంతువులలో గోవు జ్ఞానముగలదని పామరులుగూడ నంగీకరింతురు. గోవు సకలదేవతాస్వరూప మని పురాణములు నెత్తిన నోరుంచుకొని ఘోషించుచున్నవి. గోవునంగమున నేభాగమే నపవిత్రముగాదు. మనుజులలో పెక్కు తెలంగుల మానవులకన్న గోవు లుత్తమోత్తమము లని పెద్ద లంగీ

కరించియున్నవారు. పిన్న లంగీకరించి రని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు.

ఏజంతువునుండి విశేషలాభముకల్గునో ఏదిలేకయున్న జీవనోపాయమునకుఁ గొఱంతకల్గునో యదియే తల్లివంటిదనుట నిర్వివాదాంశము. దానియందుఁ గృతజ్ఞతచూపుట విధి యని స్మృతులు మొఱ్ఱయిడుచున్నవి. అన్నిదానములలో గోదాన ముత్తమోత్తమమని సర్వవిద్వద్వరు లంగీకరించిరి. యాజ్ఞవల్క్యస్మృతియం దాచారకాండమున,

శ్లో. హేమశృంగీ శఫై రౌప్యై స్సుశీలావస్త్రసంయుతా,
స కాంస్యపాత్రా దాతవ్యా క్షీరిణీ గౌ స్సదక్షిణా. ౨౦౪
దాతాస్యాః స్వర్గ మాప్నోతి వత్సరాన్ రోమసమ్మితాన్,
కపిలాచే త్తారయతి భూయ శ్చాసప్తమం కులం. ౨౦౫
సవత్సారోమతుల్యాని యుగా న్యుభయతోముఖీం,
దాతాస్యాః స్వర్గమాప్నోతి పూర్వేణవిధినా దదత్. ౨౦౬
యావద్వత్సస్య పాదౌ ద్వౌ ముఖం యోన్యాంచ దృశ్యతే,
తావద్గౌః పృథివీజ్ఞేయా యావద్గర్భం నముంచతి. ౨౦౭

ఇట్లు గోదానము చెప్పఁబడి దానిఫలము వర్ణింపఁబడినది. గోదానము మహాఫలప్రదమగుటకుం గారణము దానివలనఁ గలుగుఫలము లనేకములు లోకుల కవసరమగుటంబట్టియే యని పరిగ్రహింపవలయును. ఇట్టి మహోపకార జంతువున కేమాత్ర ముపకారముచేసినఁ దల్లి కపకారము చేసిన ట్లగునని

సర్వజనాంగీకృతము. గోవుకొఱకుఁ దృణమును దొంగిలించినను బాపములేదని మను వుపదేశించెను.

శ్లో. వానస్పత్యం మూలఫలం దార్వగ్న్యర్థం తథైవచ,
తృణంచ గోభ్యో గ్రాసార్థ మస్తేయం మనురబ్రవీత్.

౮ అ. ౩౩౯ శ్లో.

గోరక్షణార్థము తృణము దొంగిలించినను బాపము లేద నుటచే నిఖిలజనోపకార మొనరించునది గోవనియు నట్టిదాని రక్షింప దొంగతనముచేసినను బాపములేదనుటలో గొప్ప విశేషము గలదు. దొంగతనమువలనిపాపమునకన్న గోరక్షణమువలనిపుణ్య మధికతమ మనికదా యిందలిరహస్యము.

శ్లో. ఉష్ణేవర్షతి శీతేవా మారుతేవాతివా భృశం,
నకుర్వీతాత్మనస్త్రాణం గోరకృత్వాతు శక్తితః. ౩౨

అను పరాశరస్మృత్యష్టమాధ్యాయశ్లోకము పైయర్థమును దృఢపఱచుచున్నది. స్వరక్షణమునకంటె గోరక్షణము ముందు చేయఁదగినకృత్యమని దీనిభావము. అన్నికార్యముల కంటె స్వరక్షణము ముఖ్యమన్నశాస్త్రము కనఁబడుచుండఁగా గోవుల ముందురక్షించి పిదప తన్ను రక్షించుకొనవలయు ననుట విశేషవిధిగ వచింపఁబడినది. కాఁబట్టి గోవులు పరమపవిత్రజంతువులనియు వానిరక్షణాదులు మహత్తరపుణ్యజనకములనియుఁ దేలుచున్నది. దేవతాపూజాఫలము గోపూజవలనఁ గలుగునని స్పష్టముగాఁ బురాణములు ప్రతిపాదించుచున్నవి. గోమాతృపూజ భారతభూమియందు మిగులఁ బ్రశస్తముగాఁ జేయఁబడు

చుండును. గోవులు నివసించుతావు తీర్థమని విధింపఁబడినది. గోధూళిస్నానము పవిత్రమనియుఁ బరాశరస్మృతి విధించుచున్నది.

... ... ... వాయవ్యం గోరజస్మృతమ్.

అనుటచే స్నానములైదనియు నందు గోధూళిస్నానము వాయవ్యస్నాన మనఁబడుననియు దీనిభావము. పశుధూళి పరమపవిత్రమనుటకు హేతువేమో యోజింపుఁడు. గోష్ఠమున మృతిలభించెనేని ముక్తిగలుగునని శ్రీహరి యుపదేశించెను. గోవులు నారాయణాంశజనితము లని విధింపఁబడుట చదివితిరిగదా. అంతకంటె విశేషించి వ్రాయవలసినదేమున్నది? మనుష్యజాతిలో జ్ఞానులతో సమానముగా గోజాతి పరిగణింపఁబడినది. ఏపశుజాతికింగాని యిట్టి గౌరవముకలదా. దీనిచేతనే వానిమహిమము కరతలామలకమని తేటపడలేదా. అశ్వత్థవృక్షము, శమీతరువు, వటభూరుహము, గోవు, ఇవి ప్రదక్షిణము చేసిన వారికింగల పిశాచాదిబాధల నడంచి శుభముల నొసంగుట ప్రత్యక్ష మగుచుండఁ జప్పిడిమాటలచే వ్రాయవలసిన దేమున్నది?

## వనపర్వతములు.

మహాశయులారా! గోమహిమము నుపదేశించి శ్రీకృష్ణమూర్తి వెంటనే వనపర్వతములు పూజ్యములని వచించెను. ఆవిషయము మనము చర్చింపఁదగినదియే.

శ్లో. వయం వనచరాగోపా స్సదా గోధనజీవినః,
గావోఽస్మద్దైవతం విద్ధి గిరయశ్చ వనానిచ. ౨

కర్షకాణాం కృషిర్వృత్తిః పణ్యం విపణిజీవినాం,
గావోఽస్మాకం పరావృత్తి రేతత్త్రైవిద్య ముచ్యతే. ౩

విద్యయా యో యయా యుక్తస్తస్య సా దైవతం పరమ్,
సైవ పూజ్యార్చనీయాచ సైవ తస్యోపకారిణీ. ౪

యోఽన్యస్యఫలమశ్నానః కరో త్యన్యస్య సత్క్రియా,
ద్వావనర్థౌ సలభతే ప్రేత్యచేహచ మానవః. ౫

హరివంశము విష్ణుపర్వము. ౧౬ అధ్యా.

అని శ్రీకృష్ణమూర్తి యుపదేశించెను. ఈయుపదేశము సామాన్యముకాదు. విశేషరహస్యార్థము లనేకము లిందిమిడి యున్నయవి. వాని నాలకింపుఁడు. ఇందేమియున్న దని తృణీకరింపకుఁడు. ఎవ్వాఁ డెందుండునో దేనిసాయమున బ్రదుకునో యదియే వానికిఁ బరమగతి యగు. అట్లె వాఁడు భావింపవలయు. అదియే భగవత్స్వరూపముగాఁ దలంపవలయు. లేనిచో భగవంతునికరుణ కాతఁడు పాత్రుఁడు కానేరఁడు. ఏలయనఁగా: ఏజంతువునకైనను జీవిక భగవంతుఁడే ప్రసాదించును. ముందన్నము పుట్టును. పిదప ప్రాణి యుదయించును. ఆహారము ప్రసాదించువాఁడు భగవంతుఁడు. భగవంతుఁ డనేకరూపముల నుండును. భగవత్కళ లేనిది జీవింపఁజాలునది దేదియు లేదు కదా! ఇది యంద అంగీకరింపక తప్పనిసిద్ధాంతము. తనకు

బ్రదుకుట కవకాశమిచ్చున దేదికానిదానికతఁడుకృతజ్ఞతచూపఁ దగును. అదిలేకున్నఁ గృతఘ్నుఁ డగును. గోపకులు వనచర జాతిలోఁ జేరినవారు. వనములు లేకున్న గోధనమునకు బ్రదుకు తెరువు లేదు. అదిలేకున్న వీరి కాధారము లేదు. అట్టివనముల నుండి దమరు ఫలములఁ బొందుచుండి వానిని సేవింపకున్నఁ గృతఘ్నులనఁబడుదురు కదా? కృషిచేయువాఁడు భూమినే భగవంతుఁ డని భావింపవలయు. అన్నివృత్తు లిట్టివే. వనములు పూజింపఁబడకున్న నేమికీడు చేయఁజాలు నని యూహింప కుఁడు. వనము లేమియుఁ జేయఁజాలవు. కాని వనరూపమున నున్న భగవంతుఁడే కృతఘ్నులని వీరికపకారము చేయును. తన కుపకార మేదాని నుండి కలుగునో అదియే భగవత్స్వ రూపమని భావింపవలయునని దీనిసారము. దీనిచే భగవంతుఁడు సర్వవ్యాపి యనియు నతని యేరూపమునుండిగాని లాభము నొంది దానికి భక్తి చూపకున్న వారు వృద్ధినొందరనియు కని రహస్యము. ఉపకారికిఁ బ్రతిగా భక్తిచూపుటయే యందఱి విధి. దానిని మీఱరాదని శ్రీహరి యీయుపదేశరూపమున ధర్మమును విధించెను. వృక్షములయందు భగవత్కళ లేదని వాదించువా రుండరుకదా.

"అంతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః."

అన్న ప్రాచీనసూక్తి కనఁబడియెడిని. కొంచెము దేవా నాంప్రియు లిటీవల వృక్షరహస్యములు కనుఁగొనఁబడిన వని

వాదింతురు. అది చాలపొరపాటు. శ్రీమద్వరాహమిహిరుడు బృహత్సంహితయందు వృక్షజ్ఞానము నుపదేశించెను. దానినే యిపుడు మరల నభ్యసించుచున్నారనవలయునేగాని క్రొత్తగాఁ గనిపెట్టఁబడిన దనుట శుష్కవాదము. హాతవాదమన్నను గొఱఁత లేదని నాభావము. వృక్షములనుండి యుపకారమును బొందినవాఁడు వృక్షరూపియగు శ్రీభగవంతుఁడే యుపకారము చేసెననియు, ఆభగవంతుని వృక్షరూపిగనే పూజింపవలయుననియుఁ దలంచుట సమంచితమార్గము. లేకున్న మూఢుఁడగు. అంతియకాక పరాత్పరుని సర్వవ్యాపిత్వము నంగీకరింపని పాపియు నగును.

"సర్వత్ర సమదర్శినః" అన్నసూక్తి పైభావమును దృఢపఱచుచున్నది. దీనినే,

శ్లో. విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని,
శుని చైవ శ్వపాకే చ పండితాస్సమదర్శినః.

అన్న శ్రీమహాభారతవచనము సిద్ధాంతము చేయుచున్నది. ఇట్లే పర్వతవిషయమున శ్రీహరి యుపదేశించినపద్ధతియు నూహింపఁదగును. ఏవిద్యచే నెవఁడుజీవించునో ఆవిద్యయే యతనికిఁ బరదైవతము. అదియే పూజింపఁ దగినది. అట్లు లైనచో నదియే యతని కుపకారము చేయునన్న శ్రీకృష్ణపరమాత్మ వచనమునఁ గలరహస్యార్థ మిదియే కదా. అట్టులు చేయనిచో నిహపరసుఖము లతనికి లేవనఁగా భావమేమనఁగా భగవంతుఁడు సర్వవ్యాపి యన్నవిశ్వాస మాతనికి లేదనుటయే. ఆభా

వము లేకున్న నతఁడు కృతకృత్యుఁడు కాఁజాలఁ డని మూఁటికి ముమ్మాటికి శంకాతంకములు లేక చెప్పవచ్చును.

శ్లో. యదా చైషాం వికుర్వంతి తే వనాలయజీవినః,
ఘ్నంతి తానేవ దుర్వృత్తాః పౌరుషాదేనకర్మణా. ౮
శాం. ౧౬. అధ్యా.

అనుసూక్తి పై సిద్ధాంతమును బలపఱచుచున్నయది. బుద్ధిబలమున నాలోచించినను సహాయకృతఘ్నునకు మేలు సమకూడదనియే బుద్ధిమంతులకుఁ దోఁపక మానదు. ఆర్యులార! ఇట్టిమహార్థము లీగాథనుండి యెన్నియో కనుపట్టుచున్నవి.

## పర్వతము మాటలాడుట.

ఇదియు నతివిచిత్రముగాఁ దోఁపవచ్చును. కాని యించుక యోజించిన నిది క్రొత్తవిషయము కాదు. భగవంతుఁడే రూపమున నుండఁదలఁచినను ఆరూపమును ధరింపఁగలఁడన్నసిద్ధాంత మంగీకరింపక తప్పదు. అదియే సమాధానము చెప్పకమానదు. ఆసిద్ధాంతము నమ్మకున్నచో వారికేసిద్ధాంతములు పనికిరావు. కావున నట్టినాస్తికులకు ఒప్పునట్లు చెప్పుట నాపని కాదు. ఆస్తికుల కీవిషయమున సంశయము లుండవు. కాఁబట్టి శ్రీహరియే గోపకులతో మాటలాడుచుఁ బర్వతమునుండి వారికి బదులు చెప్పుచు నీతంత్రమును నిర్వహించెను. పర్వతము మాటలాడె ననఁగానే యులికిపడి యసంగతమీవార్త యని యాక్షేపింప నక్కఱయుండదు. భగవంతుఁ

డీతంత్రము నంతయు నడిపించి నందాదుల నుద్ధరింపఁబూని భగవద్భక్తిని నెలకొల్పె ననుటయే యిందలిసారము.

గోవర్ధనపర్వతమును శ్రీకృష్ణుఁ డెత్తుట యొకగొప్పవిష యము కాదు. చతుర్దశభువనముల నాడింపఁగలభగవంతున కిది యొక యత్యల్పకార్య మని ప్రాజ్ఞు లూహించిరి. ఇందు సం దియ మొందఁదగు విషయ మేమి యున్నది? భగవంతునకుం గూడ నసాధ్యకార్యములు గలవన్న మహాత్ముల కేసమాధాన ములు వినఁబడవు. భగవంతున కశక్యమగు కార్యములే లేవన్న మాబోంట్ల కింతయుఁగూడఁ జెప్పనక్కఱలేదు. ఇట్టిమహాద్భుత కార్య మొనరించిన శ్రీకృష్ణునిం గన్నులారఁ గాంచుచుండియు నేల బాలునిగా భావించి నందాదులు యశోదాప్రభృతులు తక్కుంగల గోపాలకు లుపాసింపకపోయి రని కొందఱు సంశ యింపవచ్చు. వారిమాట యటుండనిండు. పుట్టినవారెల్ల మృతి నొందుట సహజ మని మన మెఱింగియు సంసారమహాబ్ధిని మునింగియుండుట యేకారణముచేతనో ఆకారణమే వారియం దును సమన్వయముచేసిన నీప్రశ్నమున కీయవకాశ ముండఁ బోదు. లేనిపోనిశంకలకు మదిఁ జోటిచ్చి వానిచే మనసునకుం గలంతను గల్పింపనేల? ఏలాభము కలుగదు. ఇవన్నియు భక్తికి ముక్తికి నపకారకములు. కావున నట్టివానిచే మనసును గలంత నొందఁ జేసికొనక సకలదేవతాస్వరూపునిగా శ్రీహరిని ధ్యా నించుట సమంచితమని విన్నవించుచున్నవాఁడను. గోవిందో పేంద్రశబ్దములవ్యుత్పత్తి కథయందే తెలుపఁబడినది. ఆరీతి

నాశబ్దములయర్థమును గ్రహించి తద్విధముగా ధ్యానించినఁ బరమపురుషార్థము కరతలామలకము. రిత్తకథలఁ జదువుటచే నది లభింపదు. భగవంతునిపై మదిఁ బదిలపఱుపుఁడు. నిరంతర ధ్యాన మొనరింపుఁడు. భేదబుద్ధి వదలి సర్వదేవతామయునిగ నేదేవతను ధ్యానించినను ఫల మొక్కటియే. ఉచ్చత్వనీచత్వములు కల్పించునలవాటులమఱచి యేకత్వమున ధ్యానింపుఁడు. అదియు కలికాలముననే గాక యేయుగముననైనను సముచిత మార్గము. స్తుతులఁ బారాయణముచేయునపు డించుక వాని యర్థమును గ్రహింపుఁడు.

"భక్తధ్యానాయ సేవార్థై నానారూపధరం పరం."

అన్నవచనమే సర్వత్ర కనఁబడియెడిని. దీనిభావ మేమి? అని యించుక యేకాంతముగాఁ గూరుచుండి యూహింపుఁడు. కర్మానుసారము జీవులు ధ్యానింతురు. కానఁ దదనుకూలముగా భగవంతుఁ డన్నిరూపములుగా వెలసెనన్నభావమే స్ఫురించును. ఇందు హెచ్చుతగ్గు అన్నభావ మేలాగు తోఁచును. అట్లుతోఁచుటయే ముక్తిప్రతిబంధము. ఎవ్వరికీజన్మము కడపటిది కాదో వారికెల్ల నిట్లే శంకలు కలుగుచుండుననుట నిర్వివాదాంశము.

పాఠకమహాశయులారా! మఱొక్కవిషయము మీరెఱింగినదైనను వ్రాయక విరమింప మనసు పోకున్నది. క్షమింతురు గాక. నందుఁడు శ్రీహరిని వినుతించెను. అందొక్క విషయము కన్పట్టెడిని. అనేకసంశయద్రుమముల ఛేదింప

నది తీవ్రకుఠారప్రాయము. కాన దానిని మీయెదుట విన్నవిం చెదను.

"బ్రహ్మావిష్ణుమహేశానాం వంద్యాయ నిత్యరూపిణే."

అనువాక్యము కన్పట్టెడిని. త్రిమూర్తులచే నమస్కరింపం దగిన నిత్యరూపునికొఱకు నమస్కార మని కదా దీనిభావము. అనంగా నీత్రిమూర్తులకుం గూడం బరమైన తేజోమూర్తి యొకండు కలండని దీనిచే స్పష్టమగును గదా? ఇంక విష్ణువే శివునికన్న నధికుండు. ఆతనికంటె నధికుండు లేండన్న వాదము నిస్సారమని తేలలేదా. విష్ణువును గల్పించువాం డుండంగా నింక నీవిష్ణు వెట్లు పరాత్పరుం డగును? దీనిసార మిది కాదు. కొందఱు భక్తులకు ధ్యానగమ్యుం డగునట్లు శంఖచక్రగదా పద్మధారి యగువిష్ణువుగను శ్రీపరాత్పరుండే యవతరించెనని దీనిసారము. ఇంతకంటె వేఱుమార్గము లేదు. ఈభావమున నేపురాణము చదివినను ఏవేదములు పఠించినను సరిగా నర్థ మగును. లేదా తికమకగా నర్థము స్ఫురించును. కాంబట్టి మత ద్వేషమునకుం బ్రాక్తనదుష్కర్మమే కారణము కాని గ్రంథ ములు కావు. లేనిశంకలం బెంచుకొనుట పుణ్య మల్పమగుట చేతనే యని వ్రాయ సాహసించుచున్నాండను. కేవలభక్తులగు మీరు మన్నింతు రన్ననమ్మకము నన్నెడంబాయదు. ఇంతట నీ విషయమును వదలి శ్రీకృష్ణపరమాత్మ యొనరించిన యద్భుత కృత్యముల వ్రాయంబూనెదను.

ఆర్యులారా! రెండవప్రకరణమున ధేనుకాసురపూర్వ జన్మవృత్తాంతమును వ్రాయుసమయమునఁ దిలోత్తమాబలి పుత్రశాపప్రస్తావమున దుర్వాసునివిషయ మించుక వ్రాయఁ బడియెఁ గదా. ఇట నమ్మునిచరిత్రము వ్రాసి శ్రీకృష్ణమాహాత్మ్యమును వ్రాయుట యసంగతము కాదు. దుర్వాసునివిషయ మేలయనిమాత్రము ప్రశ్నింపకుఁడు. శ్రీహరివలన నెవ రెవ్వరు కృతార్థు లయిరో ఏయేమహర్షులు గూడ నజ్ఞానమునను లోఁబడి మరలభగవదనుగ్రహమునకుఁ బాత్రులై తరించిరో వారిచరిత్రములు వ్రాయుట శ్రీకృష్ణచరిత్ర మనఁబడుఁ గదా. కావున నిట భగవత్కథామహిమమును దెలుపునీకథను వ్రాయఁ బూనితి. శ్రద్ధమై నాలకింపుఁడు.

*దుర్వాసుఁడు కాముకుఁడై మరల భగవదనుగ్రహము నొందుట.

ఈకథ నారదునకు శ్రీమన్నారాయణమూర్తి చెప్పిన యది. కథానుబంధమును వచింపఁబూని నారాయణమూర్తి నారదమునిం జూచి నారదా! అతిరహస్యవృత్తాంతము నాలకింపుము. దుర్వాసునిచరిత్రమున శ్రీకృష్ణమహిమము నెలుంగఁ దగియుండును. మునీంద్రా! ఊర్ధ్వరేతస్కుఁ డగుదుర్వాసునకు భార్యాసంయోగము గల్గెను. దీనికన్న విచిత్ర మేమి కావలయును? అవిచిత్రచరిత్రమునే వచింతు. సావధానుఁడవై వినుము.

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఇరువదినాల్గవ యధ్యాయమునుండి వ్రాయఁబడినదని గ్రహింపవలయును.

తిలోత్తమయు సాహసికుఁడును విహరించుచుండ ఆచెంత దుర్వాసుఁ డనుముని తప మొనరించుచుండె ననియు నామె కంకణధ్వను లామునితపోనియతికి భంగమును గల్గించెననియు మున్ను దెల్పియుంటిని. వారిని శపించి శాపానుగ్రహముం గూడఁ బ్రసాదించెనని వింటివి కదా. ఆపిదప నాముని తపోనియతిం బూని కూరుచుండెను. కాని మనస్సు పూర్వమువలె విచంచలతఁ గాంచక తిలోత్తమాసాహసికులశృంగారమును దలంపసాగెను. దాన నది చంచలతం గాంచెను. కొలఁదిగడియలకే యతఁడు కాముకుఁ డయ్యెను. భగవన్మహిమము నెవఁడెఱుంగఁగలఁడు? మునివరులైనను భగవన్మాయ నెఱుంగఁ జాలరుకదా. ఎఱింగినను వారినిగూడ మోసపుచ్చి తద్ద్వారా లోకమున లోకనీతిఁ గఱపుట భగవంతునిపని. అనఁగా మనోనిగ్రహము మునులకుంగూడ సులభము కాదని తెలుపుటయే యిందలినీతి. తరువాతిగాథ యేమనఁగా, జితేంద్రియుఁడైనను అసత్సంసర్గమున దోషము నొందెను. అకస్మికముగా దుర్వాసునిమనసున సురతేచ్ఛ యొదవెను. తపోనియతి తొలఁగెను. పట్టుపట్టి యాముని తపస్సుచేయఁబూనెనుగాని మన్మథుఁ డేయు తూపులతాఁకున నాతనిచిత్తము కామినీధ్యానపరవశ మయ్యెను. కనులుమూయుటయే తడవుగా హృదయము కామినిం గోరసాగెను. సురతేచ్ఛ మనమున మాటిమాటికిం బొడకట్టెను. మదనుఁ డదయుఁడై విరిశరముల మర్మముల భేదింప సాగెను.

దుర్వాసునిగతి యిట్లుండఁగా నాత్రేవన నౌర్వుఁ డను పేరఁ బరఁగు మహర్షి పుత్రికం దోడుకొని పోవుచుం డెను. ఆయనకొమరిత రూపలావణ్యాదిరాజిత. సత్పురుషుఁడు భర్త కావలయునని కోరుచుండునది. ఆపుత్రికకోర్కె సార్థకము చేయ నెంచి తండ్రి యామెను బిలుచుకొని యాత్రేవన నెచటికో పోవుచుండెను. ఔర్వముని బ్రహ్మాదేశమునయూరుప్రుల నుండి సృష్టియందు మొదట కల్గెను. తపస్సునందే మాయనను నిరతి. ఊర్ధ్వరేతస్కుఁడైయుండఁ దలఁచువాఁడు. కావున నాతనికిఁ బేరు ఔర్వుఁ డని ప్రఖ్యాత మయ్యెను. ఆమహర్షి తను దపమొనరించుచుండి పుత్రికం గనువాంఛ నొందెను. వారునే జానువునుండి కుమారి యుదయించెను కందళి యను పేర విఖ్యాతి నొందెను. ఆమెబుద్ధివిభవ ముదయించినాఁటనోటి దుర్వాసునే కోరుచు వేఱొకనియందు మది నిల్పకుండెను. ఆయౌర్వుఁడును సుతాసహితుఁడై పోవుచు నుండే దుర్వా సుఁడు తపోనిరతినున్నవాఁ డని యెఱింగి జ్వలదగ్నిశిఖాభ స్వతేజస్సలరార మహాప్రసన్నముఖుఁడై మునియగ్రాల నిల్చెను. దుర్వాసుఁడును మునిచంద్రుఁ డాతఁడు ముగ్రాల నిలుచుటం గని ససంభ్రముఁడై దిగ్గన లేచి మహానందమును బొంది సమాద రించెను. ఆతిథేయము లొనరించెను. ఔర్వుఁడును సమానం దమున మది కందళింప దుర్వాసుని గౌఁగిలించుకొని తనకు కయుఁ బుత్రికవాంఛయు దాఁచక తెల్పుఁబూని మహాత్మా! ఈమె నాకుమారిక. కందళి యని యీపెం బిల్తును. మహో

రాంగి. వయోయుతయే. ఇట్టియీనాకుమారిక త్రికరణశుద్ధిగా నిన్నే తలంచుచున్నయది. ఈమె యోనిసంభూతురాలు కాదు. ఎట్లుద్భవించెనో నీవేయెఱుంగఁ జాలుదువు. సౌందర్యముచే ముల్లోకముల మోహింపఁజేయఁజాలును. సర్వసుగుణముల కాటపట్టు. లావణ్యమున సకలలోకములఁ గలవనితలందు మిన్న యన్న యెన్నికంగన్నది. కాని యొక్కదోషము కలదు. మిగులఁ గలహప్రియురాలు. కోపమునఁ గటుభాషిణియు నగు. *లోకమున నెవ్వఁడేనియుఁ బెక్కుసద్గుణములు గలపదార్థమును ఒక్కదోషమునకై వదలఁగూడ దని పెద్దలభావము. అని పలికి ముని యూరకుండెను.

దుర్వాసుఁడును ఔర్వమునిపలుకులాలించి సంతోషము శోకము పెనఁగొనఁగా నెదుటనున్నగుణరూపమనోహరయగు నాకన్యకం గాంచెను. శరత్కాలరాకానిశాకరుని దిరస్కరించు నామెమోము, దరవికసితసరసిజములఁ వెగడు నాలేమకన్నులు, దరహాససుందరమగు నామెముఖము, పీనశ్రోణిపయోధరముల నలరు నాతన్విరూపము, నాముని కచ్చెరువు గల్గింపక విడువ లేదు. ఆతన్వంగి నవయౌవన మలర వక్రదృష్టిచే నామునిం గనుంగొనియె. రత్నాలంకారములకుఁ దనదేహము భూషణము కాఁగా నగ్నివలెఁ బరిశుద్ధమగు నంబరమును ధరించియున్న యాకన్యకను జక్కంగాంచి కుసుమశరశరాసారస్నపితగాత్రుఁ డై మునిదుర్వాసుఁడు మోహపరవశుం డయ్యెను. తనహృద

* నానాగుణయుతం ద్రవ్యం న త్యజేదేకదోషతః-అని మూలము.

యము పరితాపభరమునఁ జంచలింప నౌర్వమునిపతిం గాంచి యిట్లు పలికెను. ముల్లోకములయందు నారీమణీరూపము మోక్ష మార్గమున నరికట్టునదియే. తపఃకార్యమునకుఁ బ్రతిబంధకము. సంతతము మోహకారణము. సంసారమను కారాగారమున శృంఖలమువంటిది. నిక్క మీమాట. జ్ఞానఖడ్గముల చేతంగూడ ఛేదింప శక్యము కానిది. శంకరాదులు మహాత్ము లయ్యు నారీ రూపమునకు లోఁబడిరి. సంగిచ్ఛాయాతిరిక్తకర్మము భోగమున కంటె వేఱైనది లేదు. ఇంద్రియమునకేని, తదాధారమునకేని, విద్యకేని, మతికేని వేఱొకటి భోగాన్యకర్మము కానరాదు. సం గినీచ్ఛాయ యాదేహ ముండునదియే. భోగము భోగాంతమే. దేహేంద్రియములు జీవాంతములు. దుశ్శీలుని విద్య వరింపదు. మఱియు దుశ్శీలాంతమే. పైనిచెప్పినవన్నియుఁ బైచెప్పినట్లుండి నశించును. సుస్త్రీమాత్రము జన్మము లెన్నియెత్తినను వదలదు. సుస్త్రీకుఁ డెంతదనుక జీవించునో జన్మఖండనమెఱుఁగక యంత దనుక నుండును. జీవుఁ డెంతదనుక బ్రదుకునో యంతదనుక రోగము సుఖావహముగఁ దోఁచును. మహర్షి! అన్నింటికంటె శ్రీహరిపాదాంబుజసేవన ముత్కృష్టము. శ్రీకృష్ణపరమాత్మ పాదాంబుజముల సేవించునాకు విఘ్న మొదవెను. పూర్వజన్మ మున నేదోషమున నిది కల్గెనో యెఱుంగఁజాలను.

మఱొక్కమాట వినుము. సాహసికుఁ డనుదానవుఁడు పుంశ్చలితో విహరింప వారిశృంగారమును గాంచి నాచిత్తము కామసంయుక్త మయ్యెను. విధాత తత్ఫల మొసంగెను. ముని

చంద్రా! నీతనయాకటూక్తిసముదయము నెట్లు నిశ్చలమతిని సహించియుండఁజాలుదు? ఈమెమనోరథము నెట్లు తీర్తును. స్త్రీకటూక్తిసహిష్ణుతయనునదియన్నింటికంటెనిందయనంబరఁగు. ముల్లోకముల స్త్రీజితుఁడు మిగుల నిందితుఁ డగు. సత్పురుషు లం దతని యవమానమునకు మేరలేదు. ఐనను నీయాజ్ఞను శిరసా వహించి యాకన్యకను గ్రహించెద. *తన్నుఁ గోరివచ్చిన కన్యకను వదలినఁ గాలసూత్రనరకము లభించును. పుంశ్చలి యైన నొంటరిగా వచ్చి కామము నివారింపుమని కోరినచో జితేంద్రియుఁ డైనను దానిని ధర్మభయమున వదలెనేని యధ ర్మమున వాఁడు నరకమునఁ బడు. అని పలికి దుర్వాసుఁ డూర కుండెను.

ఔర్వమునియు నమ్మాటలకు బదులేమియుం బల్కక పుత్రికను వేదవిహితవిధానమున దుర్వాసున కొసంగెను. మునియుఁ దృప్తిమెయిఁ బరిగ్రహించెను. కన్యాదానకాల మునఁ గూఁతునకు యౌతకం బొసంగి మునియుఁ గొమరితయం దున్న ప్రీతిచే గట్టిగా రోదనముచేసెను. స్వకన్యావిరహాతురుఁడై యౌర్వముని మూర్ఛిల్లెను. కన్నకూఁతు వదలి యుండుట జ్ఞాను లకేని కష్టము కదా! ముహూర్తకాలమున సంజ్ఞ నొంది కన్య కను బోధించెను. ఆమెయుఁ దండ్రి నెడఁబాసి యుండఁజాలక బిట్టురోదనము చేయుచుండెను. అమ్మా! నీతిసారమును వివ రించెద వినుము. ఆనీతిసారము పరమదుర్లభము సుమీ

* ఉపేతాం కామినీం త్యక్త్వా కాలసూత్రం ప్రజేన్నరః-అనిమా.

హితమై సత్యమై వేదవిహితమై పరిణామసుఖావహమై యవి యలరారును. కన్యకకు వివాహానంతరము ప్రాణనాథుఁడే బంధువు. ఇహపరలోకముల నింతకంటె బంధువు లేఁడని యెంచవలయు. కాంతుని మించిన ప్రేమాస్పదుఁడు కులకాంతలకు వేఱొకఁ డుండఁడు. పతియే పరమగురువు. దేవతలఁ బూజించుట, దానము, తపము, ఉపవాసము, జపము, సర్వపుణ్యతీర్థస్నానము, సర్వమఖదీక్షయు, భూప్రదక్షిణము, బ్రాహ్మణాతిథిసేవనము, లోనగుఘనకార్యములఁ జేయఁగల్గు పుణ్యము పతిసేవాజనితపుణ్యమునఁ బదాఱవభాగమునకు సరిరాదు. ఈ పైఁజెప్పఁబడిన కార్యములు పతిభక్తియుక్తయగు కాంతల కేల? అభక్తయగువనిత తపఃప్రభృతుల నెన్నింటి నొనరించినను బుణ్యము లేదు. ఎప్పుడు కాంత దుఃఖితురాలగునో భర్తనపుడే ధ్యానింపవలయు. అది తొలఁగును. సుఖారంభమున స్మరింపవలయును. ఇది మొదటికృత్యము. పతిసేవయే పరమధర్మము. ఇది సర్వశాస్త్రసమ్మతము. తనకుంగల జ్ఞానముచే భర్తను నారాయణాధికునిగాఁ దలంపవలయు. పతిపాదాంబుజములఁ గాంచి సేవింపవలయు. అమ్మా! పరిహాసముచేఁ గాని, కోపముచేఁ గాని, భ్రాంతిచేఁ గాని, యవజ్ఞచేఁ గాని, ప్రత్యక్షపరోక్షములలో నెద్దానియందైనఁ గటూక్తుల నెవ్వతుక భర్తనాక్షేపించునో యాకాంత పాపాత్మురాలు. కామమున వాగ్యోనిదుష్ట యగుకామినికి భారతమునఁ బ్రాయశ్చిత్తము వేదోక్తముగ నొప్పునది లేనేలేదు. శతబ్రహ్మకల్పములు నరకపాతము

గలుగు. సర్వధర్మముల నెఱింగి యాచరించునదైనను నెవ్వతుక పతినింగూర్చి పరుషము లాడునో యది శతజన్మపుణ్యములం బోఁగొట్టుకొని నశించు. ఇది సత్యము.

అని హిత ముపదేశించి కన్యకను దుర్వాసున కొసంగి మునిపుంగవుఁడగు నౌర్వుఁడు తనయిచ్చం బోయెను. దుర్వాసుఁడును భార్యాసహితుఁడై సంతోషమున మది సుఖేచ్ఛ పైకొనుచుండఁ గామియై కామినిం గూడెను. ఔరా! సుకృతవంతులకుఁ గామము వాంఛామాత్రమున సిద్ధించుగదా! సురతమున కనువగు శయ్యను గల్పించుకొని యమ్మునిశ్రేష్ఠుఁడు శుభముహూర్తమున నాకామినిం గూడి నిర్జనవనమున విహరించెను. దుర్వాసుఁడు పుట్టినదిమొద లింతదనుక స్త్రీవార్తనే యెఱుంగఁడు. ఐనను దత్కాలమునఁ గామశాస్త్రవిశారదుఁడై కాంతుఁడై విహరించెను. రతితంత్రప్రోక్త బహువిధశృంగారముల నెఱింగెను. ఆనవసంగమమునఁ గందలీకామిని చొక్కి మూర్ఛిల్లెను. మునియు మూర్ఛిల్లి రేయింబవళ్లు లేవకుండెను. ఇట్లు నిత్యము కొంతకాలము రతిసుఖ మనుభవించెను. విదగ్ధయగు కామినికి విదగ్ధుఁ డగు నాయకునితో రతము చెల్లెను. తపస్సునువదలి యమ్ముని గృహాసక్తుఁ డయ్యెను. కందళియుఁ బ్రతిదినము నాయకునితో సహజగుణమునఁ గలహించుచుండెను. దుర్వాసుఁడును నీతిశాస్త్రోక్తవాక్యములచే నిత్యముబోధించుచుండెను. ఆకామినీమణి యవ్వాక్యముల లెక్కసేయక యథాపూర్వముగాఁ గలహించుచునే యుండెను. తండ్రి యుపదేశించిన

జ్ఞానముచేతం గూడ నామె శాంతురాలు కాకుండెను. ఎంత హితము బోధించినను స్వభావగుణము క్షీణింపదు. అది దురతిక్రమము కదా! నిర్హేతుకముగా నాకందళి ప్రతిదినము భర్తతోఁ గలహించుచునే కాలముఁ బుచ్చుచుండెను. జగంబులఁ దనకోపముచే గడగడలాడించునాదుర్వాసుఁడు కందళీకోపమున వణఁకుచుండెను. ఆమెపరుషోక్తులను క్షమించి యూరకుండుట కలవాటుపడియెను. మోహాతిరేకమున దయానిధి కావునఁ బ్రతిదినము బోధించుచుండెను. పరుషోక్తులు కోటిఁదిసంఖ్యాకములై పదులై యేఁబదులై పదిపదులను మించెను. కాని యమ్ముని యంతదనుక నోర్చుకొని యుండెను. ప్రతిదినము నేతమును మించు పరుషోక్తులచే దుర్వాసుని మానసము దహింపఁబడియె. నిత్యము పరుషోక్తులాడ నలవాటుపడిన యాయమ్మలమిన్న కర్మము పూర్తినొందెను. దయాళువై రతాసక్తుఁడునగునాముని తుదకు విసిగి క్రోధముఁ ద్యజింప సమర్థుఁడు కాకపోయెను. పట్టరానికోపమున నాకందళిం జూచి భస్మరాశివి కమ్మా యని శపించెను. మునినోటనుండి మాటవెడలఁగనే యాకాంత భస్మరాశియే యయ్యెను. ముల్లోకములందు నుద్ధతులకు శుభము కలుగదు కదా !

కందళి తనశరీరము భస్మరాశి కాఁగా తదాత్మప్రతిబింబ మంతరిక్షముననుండి వినయమునూది యిట్లు ప్రార్థించెను.నాథా నీవు సర్వదర్శివి. జ్ఞానచక్షుస్సుచే సదా సమస్తమును జూచుచుండు వాఁడవు. సర్వజ్ఞుఁడవు. ఇట్టినీకు నేను వేఱుగఁ జెప్పవలసిన

దేమున్నది? సరసవాక్కుగాని, పరుషవాక్కుగాని, కోపముగాని, సంతాపముగాని, లోభముగాని, మోహముగాని, కామక్షుత్పిపాసాదులుగాని,స్థౌల్యకార్శ్యములుగాని, నాశముగాని, దృశ్యాదృశ్యమగు నేదిగాని శరీరధర్మముగాని జీవాత్మల ధర్మము కాదు. శరీరము సత్వరజస్తమోరూప గుణత్రయాత్మికము అది నానాప్రకారము కదా. నేనేమి యింకఁ జెప్పవలయును. శరీర మొక్కతావున సత్వగుణాధికము. వేఱొక్కతావున రజోగుణాధికము. ఇంకొక్కతావునఁ దమోగుణాధికము. ఇట్లు త్రిగుణాత్మకము శరీరము. అంతియగాని యొక్కచోటను సమగుణముగా నుండుట లేదు. సత్వోదయమున మోక్షేచ్ఛయు రజోగుణమునఁ గర్మేచ్ఛయుఁ దమోగుణంబున జీవహింసేచ్ఛయుఁ గోపము, అహంకారములును గలుగుచున్నవి. కోపమునఁ బరుషోక్తులు వెడలును. వానిచే శత్రుత్వము పొసఁగును. దానిచే నప్పుడే యప్రియత్వము తలసూపును. అంతియగాని జీవదృష్టిచే నూహింప శత్రు వెవనికెవ్వఁ డీలోకమునఁ గలఁడు? ఎవ్వఁ డుపకారి? ఎవ్వఁ డపకారి? మిత్రుఁ డెవ్వఁడు? ఎవ్వఁడు శత్రువు? శత్రుమిత్రములకు బీజము లింద్రియములు. స్త్రీలకుఁ బ్రాణాధికుఁడు భర్త యగు. పురుషునకుఁ బ్రాణాధికురాలు భార్యయే యగు. అట్టిదంపతులకుఁ బరుషోక్తులచే శత్రుత్వ మొకక్షణకాలమున నొడఁగూడును. నాథా! ఏది నాచేఁ జెప్పఁబడెనో యది కామదోషముచేతనే యని యెఱుంగవలయు. నాయపరాధమును క్షమింపుము. ఇపు డేమిచేయుఁ

దగునో ఆజ్ఞాపింపుము. ఇపుడేమి చేయుదును? ఎందుఁ బోవుదును? నా కెందు జన్మము కాఁగలదు? జగత్త్రయమున నే నెందు జన్మించి నను నీకే భార్యనగుదును గాని యింకొకరికి భార్యను గాను. అని పలికె జీవుఁ డూరకుండెను.

ఆమాటలు శ్రుతిసంపుటములఁ జొరఁబడఁగా శోకోప హతచేతనుఁడై మూర్ఛనొందెను. మహాజ్ఞానియగు స్వాత్మా రాముఁడు చేతనఁ ద్యజించెను. ఎంతయాశ్చర్యము? విదగ్ధు లగు పురుషులకు స్త్రీవిచ్ఛేదము సకలశోకములకన్న నధికతరము కదా! అంత దుర్వాసుఁడు క్షణకాలమునఁ జేతన నొంది ప్రాణ ములఁ బరిత్యజింప నుద్యుక్తుఁడయ్యెను. అందే యోగాసన మల వరించుకొని వాయుధారణ మొనరించెను. అట్టితఱి నొక బ్రాహ్మణశిశు వచ్చటికి వచ్చెను. ఆవటువు దండమును ధరించి ఛత్త్రధారణ మొనరించి రక్తాంబరములఁ దాల్చి లలాటమున నుత్తమతిలక మలరారఁ జిఱునవ్వు ముఖసీమ తొలకాడ శ్యామ వర్ణము తనువునఁ గనంబడఁగా బ్రహ్మతేజస్సు వెలయ వయస్సు మిగులఁ జిన్నదిగాఁ గనంబడుచుండ శాంతుఁడై జ్ఞానియై వేద విద్వరుఁడై యలరారుచుండెను. ఇట్లు వచ్చిన యాబాలునిం గాంచి దుర్వాసుఁడు లేచి నమస్కరించెను. కూరుచుండఁ బ్రార్థించెను. భక్తితోఁ బూజించెను.

దుర్వాసుఁ డిట్లు పూజింప నాబ్రాహ్మణవటు వలరి యమ్ముని నాశీర్వదించెను. ఆవటువును జూచినంతనే తదాశిష ములఁ బడసినంతనే సర్వదుఃఖములు నశించి మునిమనస్సు

స్వస్థ మయ్యెను. శిశురూపమును క్షణకాలముధరించిన యాదవ
టువు కార్యదక్షుఁడుగాన నిట్లు పలికెను. ఆవాక్కులు నీతి
శాస్త్రసారభూతములై సుధాతుల్యములై కనుపట్టెను.

## శిశువు దుర్వాసునకు హిత మెుపదేశించుట.

సర్వజ్ఞా! గురుమంత్రప్రసాదమున నన్నియు నెఱుంగు
దువు. ఇట్టినీవు శోకకాతరుఁడ వగుచుండి నేనేమని యడు
గుదు? బ్రాహ్మణులకుఁ దపస్సు ధర్మము. జగత్త్రయము తపస్సా
ధ్యము. స్వధర్మముఁ బరిత్యజించి యిపు డేమిచేయుచున్నవాఁ
డవు? ఎవ్వని కెవ్వతె భార్య? ఎవ్వఁ డెవ్వతెకుఁ బ్రాణనాథుఁడు?
స్వమాయచే భగవంతుఁడు హరి మూర్ఖుల వంచించును! నీకీపత్ని
మిథ్యారూపిణి. క్షణకాల మీభ్రాంతి నీకుం గల్పింపఁబడియె.
ఇది సత్యముకాదు. చిరకాల ముండునది యీపత్ని యగునా?
వసుదేవపుత్రికయు హరికి భగినియుఁ, బార్వత్యంశసముద్భూ
తయు సుశీలయుఁ జిరంజీవినియు నగుసుందరి నీకుఁ బ్రతికల్పము
నందును భార్య కాఁగలదు. కొలఁదిదినములు తపశ్చర్యయందు
మది నిల్పుము. ఇపుడు నీదుఃఖమునకుఁ గారణభూతురాలగు
కందలి కదళీజాతిని స్వీకరించి భూతలంబున జన్మించును. శుభ
ముల నొసంగుచు ఫలప్రదయై మనోహరాకారమున వెలసి
యొక్కసంతానమునే కాంచి దుర్లభయై యుండఁగలదు. కల్పాం
తరమున నీయీభార్య శాంతగుణప్రధానురాలు కాఁగలదు.
అత్యుచ్ఛ్రితపదార్థమునకుఁ జ్యుతి శ్రుతిప్రసిద్ధము.

అని పలికి విప్రరూపమును దాల్చినభగవంతుఁడు క్షణ కాలమున నామునికి జ్ఞానోపదేశముచేసి యదృశ్యుఁ డయ్యెను. దుర్వాసుఁ డాయుపదేశమున మోహమును ద్యజించి తపో నియతియందు మదిని ద్రిప్పెను. ఆమునిపత్ని కందళి భూతల మున నరఁటిచెట్టుగాఁ బుట్టెను. సాహసికుఁడు కాళవనమున గర్దభాకారమును దాల్చియుండెను. అతిలోత్తమయు బాణాసుర పుత్రి యయ్యెను. దైత్యేంద్రుఁ డగు సాహసికుఁడు శ్రీకృష్ణ మూర్తిసుదర్శనాయుధముచేఁ బ్రాణముల వదలి మహర్షులకేని దుర్లభమగు భగవచ్చరణాంభోజదాస్యము నొందెను. తిలోత్త మయుఁ గొంతకాలమునకు స్వస్థానముం జేరెను. అతిలోత్త మయే బాణాసురునకుం బుత్రికయై శ్రీకృష్ణపౌత్రుఁడగు నని రుద్ధుని యాశ్లేషమునఁ బరిపూర్ణమనోరథసిద్ధిం బడసి స్వస్థలకుం బోయి భగవద్భక్తిం బడయఁజాలెను. అని నారాయణమూర్తి శ్రీకృష్ణచరిత్రమును నారదునకుం దెల్పి యింకేమి వినఁగోరెద వని ప్రశ్నించెను.

మహాశయులారా! శ్రీకృష్ణచరిత్రమున దుర్వాసునికథ యేల వ్రాయఁబడియె నని ప్రశ్నింపకుఁడు. ఏయేభక్తులు పూర్వ జన్మసుకృతదుష్కృతలేశమున నజ్ఞాను లగుదురో వారిని శ్రీకృష్ణపరమాత్మ యెట్లుద్ధరించెనో ఆమహిమమును దెల్పుటకే యీప్రయత్నము కదా. కాఁబట్టి శ్రీకృష్ణదివ్యమహిమము నీకథ తెల్పెడిని. కావున నిట వ్రాసితిని. ఈగాథ యనేకవిషయ ములను దెల్పఁగలదు. వానిని దెలిసికొనుట ఆచరణమున

వాని నలవరించుకొనుట ప్రధానకృత్యములు. అట్లొనరించు టయే భగవత్కథాశ్రవణఫలమని పెద్దలభావము.

దుర్వాసుఁడు తపశ్శక్తిచేఁ దిలోత్తమను సాహసికుని శపించెను. వారు ప్రార్థింప శాపమోక్షము ననుగ్రహించెను. కాని తాను జితేంద్రియుఁడ ననుగర్వమును మాత్రము పొందెను. ఏక్షణమున నీగర్వ మామునిమనసునఁ బొడసూపెనో యాక్షణముననే సర్వాంతర్యామియు సర్వద్రష్టయు సర్వసాక్షియు నగుశ్రీకృష్ణపరమాత్మ యీగర్వమును మాయింపకున్న నీముని తరింపఁజాలఁడని తలంచెను. తిలోత్తమకు సాహసికునకు శాపమోక్షము శ్రీకృష్ణమూర్తిమూలకముగనే కలుగును. కావున నిటశ్రీకృష్ణమూర్తియే యిట్లూహించెనని చెప్పనవకాశమున్నది. దుస్సహవాసముచే దోషములు పట్టుపడు నన్న సూక్తి యందఱెఱింగినదియే. సత్సహవాసముచే గుణము లలవడునన్న సూక్తియుఁ బ్రఖ్యాతమే. క్షణకాలమైనను గాముకుల సంగతి దుర్వాసునకుం గల్గెను. దానిఫల మనుభవింపక తీఱదయ్యెను. అంతియ గాక కామవిఘ్న మొనరించిన ఫలము కూడ ననుభవింపక తప్పకపోయెను. మహర్షియయ్యు నితరుల యపరాధములు క్షమింపఁ దగియుండును గదా. అట్లు చేయక యమ్ముని దారుణశాప మొసంగెను. ఇరువురును బాపఫల మనుభవింపవలసినవారైరి. ఇదియే భగవత్సంకల్పము.

దుర్వాసుఁడు తద్దర్శనముననే యత్యంతకాముకుఁ డయ్యెను. తపోనిరతి వదలెను. చిరకాలముచేసినతప స్సూరక

పోదుగాన నాసంకల్పమామునిమదిఁ బదిలముగ నెలకొనఁగనే భగవదిచ్ఛామాత్రమున నౌర్వముని కొమరితయగు కందలిం దోడ్కొని యాత్రోవనఁ బోవుచు మునిచెంతకు వచ్చెను. ఆకన్యక ముందే దుర్వాసు దప్ప నింకొక్కని వరింపనని పట్టువట్టి యుండెను. అదియు భగవత్సంకల్పమే. ముందు దుర్వాసుఁ డిట్లు కాముకుఁడు కాఁగలఁ డని భగవంతుఁ డెఱుంగును. సర్వజ్ఞుఁడు కదా పరమేశ్వరుఁడు. ఆకందళికోరికను దండ్రి మునికిం దెల్పెను. వివరముగాఁ దెల్పుచు దాఁపక యౌర్వముని దుర్వాసునితోఁ దనకొమరితయం దొక్కదోషము మాత్రము కల దనియు, సద్గుణము లెన్నియో కలవనియుఁ దెల్పుచు బహుగుణము లుండి యొక్కదోష మున్నచో నాపదార్థమును విడువరా దనియు వదిలిన బాపమువచ్చుననియుఁ దెల్పెను.

శ్లో. యస్తు దోషవతీం కన్యామనాఖ్యాయోపపాదయేత్,
తస్య తద్వితథం కుర్యాత్కన్యాదాతుర్దురాత్మనః.

మను. ౯ అ. ౭౩ శ్లో.

(దానం తత్ప్రీత్యర్పణేన వ్యర్థం కుర్యాత్. అని వ్యాఖ్య.)

అన్నస్మృతివాక్యమును మహర్షి తలంచుకొని యున్నదున్న ట్లుపదేశించుచుఁ గటూక్తులు మాటలాడు దుర్గుణము మానిచెప్పెను. దుర్వాసుఁ డామాటల విని భార్యాకటుభాషణముల వినుట మిగులఁ గష్టమనియు వానిబ్రదుకు నింద్యమనియుఁ దనభావమును దెల్పుచుఁ దన్ను వివాహమాడఁ గోరివచ్చిన కాంతను వదలుట దోషమనున్యాయమునుగూడఁ

దెల్పెను. ఔర్వమునియుఁ దనపుత్రికను ముని కొసంగెను. కన్యాదానముచేసిన పిదప నామునికి దుహిత నెడఁబాసి పోవ లయునన్నమాట మదిఁ దగిలెను. వెంటనే విలపించెను. ఔరా! మహర్షులకేనియుఁ బ్రేమానుబంధ మొక్కమాఱు త్రెంప శక్యము కాదు కదా! మునులగతి యిట్లుండ నిఁకఁ బామరుల కది మిగులఁ బీడాకరమని వేఱుగఁ జెప్పవలయునా! శకుంతల హస్తినాపురమున కరుగుతరుణమున నైష్ఠికబ్రహ్మచర్యనిరతుఁ డగు కణ్వమహర్షి,

శ్లో. యాస్యత్యద్య శకుంతలేతి హృదయం
సంస్పృష్టముత్కంఠయా
అంతర్బాష్పభరోపరోధిగదితం
చింతాజడం దర్శనం
వైక్లబ్యం మమతావదీదృశ మపి
స్నేహాదరణ్యౌకసః
పీడ్యంతే గృహిణః కథం న తనయా
విశ్లేషదుఃఖైర్నవైః.

అని పరితపించెను. ఎట్టివారికైన దేహసంబంధజనితవ్యథ మది బాధింపక మానదు. కావనే యౌర్వముని పుత్రిక నెడఁబాసి పోఁజాలక పరితపించెను. ఇంతమాత్రమున వారినియమము నకు బాధ లేదు. వా రజ్ఞానులని చెప్పనవకాశము లేదు. దీనిచే స్వాభావికాచారములు సర్వత్ర కనుపట్టుచున్నవని తెలిసికొను టయే సరసము. ఆవల నౌర్వముని దుహితకు నీతు లుపదేశిం

చెను. దానిసారము వనితలు పతిసేవకంటె నితరధర్మములు లే
వనుటయే కాని భర్తకు భార్య యేల లోఁబడియుండవలయుననుట
నవనాగరకతమాత్రము కాదు. చివరకు భర్తను మించిన బంధువే
లేఁడని, పూర్వులగు నార్యుల భావము. సకలతపము లుపవాసా
దులు భర్తృసేవాజనితపుణ్యమునఁ బదాఱవభాగమును బోల
వని చెప్పఁబడినది. సమక్షమునఁగాని పరోక్షమునగాని భర్తనా
క్షేపింపరాదని యౌర్వముని పుత్రికకు గట్టిగా నుపదేశించెను.
భర్తతోఁ బరుషవచనము లాడఁగూడ దనియు నేకద్విత్రివాక
ములు హెచ్చరించెను. ఇట్లు చెప్పుటకు హేతువేమన,
ముందుఁ దనకుమారికకుఁ గలుగనున్న యవస్థ నాముని యెఱుం
గును. కావునఁ దెలిసినంతవఱకు జాగ్రత్తగ నుండుమా యని
కూఁతురునకు, శాంతము ప్రధానము మునుల కనుభావము
మఱువకుమా యని యల్లునకు నుపదేశించెను. ఈసంబంధమున
నెంతమేలు దంపతులకుం గల్గునో యామునివరుఁ డెఱుఁగును
కాని తాఁజేయఁదగినపని శక్తివంచన లేకుండ నొనరించెను. ఉప
దేశము కాఁగానే తనదారిఁ బోయెను గాని మరల వీరిమాట
తలంచినవాఁడు కాఁడు. అదియే జ్ఞానులకు నజ్ఞానులకుంగల
భేదమని యెఱింగి తత్కాలమనోవ్యథ గల్గినను విషయమైన
దానికి మనసునఁ జోటీయక మెలంగుట బుద్ధిమంతుల లక్ష
ణము. ఇదియే యీభాగమునుండి గ్రహింపఁదగిన నీతి.

స్వభావగుణము మార్పఁ దరముగాదన్న నీతి యంద
ఱెఱుంగుదురు. కందలి తాఁగోరినభర్తనే పడయఁ జాలెను.

తండ్రియుపదేశముల గ్రహింపఁజాలెను. తా విద్యావతియు నగు. సకలధర్మముల నెఱుంగును. వయసునఁ జిన్నది కాదు. ప్రౌఢయు నగు. అయినను "స్వభావో దుర్నివారః" అన్న సూక్తికి లక్ష్యమయ్యెను. భర్తను బరుషోక్తుల నలయించు చునే యుండెను. ఇంచుకంతయు జంకక యిదిధర్మము కాదని భావింపక తండ్రియుపదేశములఁ గలనైన స్మరింపక పతితోఁ గలహించుచునే యుండెను. పాపమా మహర్షి పుట్టుకతోటి కోప స్వభావముకలవాఁడు. దేవత లాయనపేరు విన్న వడఁకుదురు. ఇఁక మనుష్యులమాట యిటఁ జెప్పనేటికి? అట్టివాఁ డయ్యుఁ గాముకుఁడు కానఁ గందళి యెట్టిపరుషోక్తు లాడినను నోరు కదల్పఁ డయ్యెను. తపఃఫలముగా శాంతాత్ముఁ డయ్యెను. ఎంత శాంతుఁ డైననేమి? దాంతుఁ డైననేమి? ఆకందళిపరుషవాక్కు లామునిశాంతము నూఁచియూఁచి తుదకుఁ గదలింపఁజాలెను. శాంతము నిలువనవకాశ మించుకంతయైనఁ గల్గింపక యాపరుషోక్తులు దానిస్థానమునఁ గ్రోధమును బ్రవేశపెట్టెను. పాపఫల మనుభవింపక పోఁ గాదన్నసూక్తి యందఱెఱింగినదియే.

ముని యొకనాఁ డోడలు తెలియక మండిపడి భస్మరాశివి కమ్మా యని యమ్మగువను శపించెను. శాపము వినఁబడఁగనే యావనితమనస్సున నొకవింతమార్పు కల్గెను. దేహము వదలిన యాతన్విజీవుఁడు తెల్పిననీతు లత్యంతశ్రద్ధమై విమర్శింపఁ దగినవి. దుర్వాసునకు బుద్ధివచ్చునట్లు చేయఁజాలినవి. సత్యముగా నందించుకంతయైన యతిశయోక్తి లేదు. ఆమాటలు

విన్నంతనే దుర్వాసుఁ డిట్టిభార్యారత్నమును బోఁగొట్టుకొం టిని గదా యని పరితపించెను. దుఃఖము నాపుకొనఁజాలక తపశ్శక్తి వమ్ముకాఁగా మూర్ఛనొందెను. తుదకు కొంతసేపటికి తెలివిరాఁగా మృతినొంద నుద్యుక్తుఁడయ్యెను. యోగాసన మలవరించుకొనియెను. ప్రాణాయామయోగమున కుపక్రమిం చెను. దానఁ గలుగుఫలమేమి ? వాయునిరోధమే. ఇఁక క్షణ కాలమున నాముని దేహమునుండి ప్రాణవాయువుల వదలింపఁ గలఁడు. ఈవిషయము శ్రీగోపాలకృష్ణమూర్తి యెఱుంగఁ జాలఁడా. ఇఁక నాలస్యముచేయఁ దగదని శిశురూపమునఁ దోఁచెను. ఆవటువును జూడఁగనే దుర్వాసుఁడు భక్తినమ్రాత్మ కంధరుఁడై నమస్కరించెను. ముందు తాఁజేయఁబూనినయోగ మేమాయె? అని ప్రశ్నింపవలదు. భగవద్దర్శనమున నన్నియు మార్పునొందును.

అంత శిశురూపమున నున్న శ్రీకృష్ణపరమాత్మ యుపదే శించిన వాక్యములు వేదసారములు. జగత్త్రయము తత్స్వాస్థ్య మనుటకంటె నెక్కువ యేమి చెప్పవలయును! "నీకిభార్య మిథ్యారూపిణి" యన్న మాటయే చాలదా! సంసారము మిథ్య. ఇది భ్రాంతి. దీనినమ్మి యేల దుఃఖించెద వన్న యొక్కమాటయే చాలును. నీభార్య మృతినొందుట లోకోపకార మని చెప్పెను. తపస్సున మదినిల్పుమా యని హెచ్చరించి యదృశ్యుఁ డయ్యెను. దాన ముని యీశిశువు భగవంతుఁడే యని నిశ్చ యించెను. భగవద్వాక్యము దుర్లంఘ్యమనియు నిదియే తత్త్వ

పాయమనియు నమ్మెను. దుఃఖముంబాసి భగవద్ధ్యానాసక్తుం డయ్యెను. ఈశిశువు శ్రీకృష్ణమూర్తియే యని యెట్లు సిద్ధాంతము చేయవచ్చునన్న ప్రశ్నము కలదని నేనెఱుంగుదు. తిలోత్తమయు సాహసికుఁడు మునియు నీమూవురే యీకథయందు ముఖ్యులు. వీరికి మూవురకును దుఃఖమును దీర్చినవాఁడు శ్రీకృష్ణపరబ్రహ్మమే. కావున నోమహాశయులారా! శ్రీకృష్ణపరమాత్మ కొందఱ కుపదేశరూపమున ముక్తిననుగ్రహించును. కొందఱ వధించి మోక్షమును బ్రసాదించును. కొందఱతో స్నేహించి సంసర్గమున నపవర్గము లభింపఁజేయును. కావున మనమెల్ల నీకాలమున నేలాటితపస్సులనొనరింపఁజాలకున్నను శ్రీకృష్ణపరబ్రహ్మనామమును స్మరించుచుఁ దత్కథలఁ బఠించుచుఁ దన్మహిమముల స్మరించుచు క్షణకాలమైన సద్వ్యయముచేయుట సముచిత మగుకార్యము. వేఱుమార్గము కానరాదు. కలికాలము దుర్భరమైనది. భగవద్భక్తి వినాశన మొనరించు సాధనము లీకాలమునఁ బెక్కు లున్నవి. భగవంతునియందు దోషముల నారోపించువారు పెక్కుమంది కలరు. వారిమాటలు యుక్తియుక్తములుగ నున్నవని చేతులాడించువారు పెక్కువేలమంది కలరు. భగవత్కథలను బఠించువారు నాగరకులు గారనువారు నిండి పుట్టగొడుగులవలె నున్నవారు. వీరిమాటలకు లోఁబడక క్షణకాలమైన జగద్గురువగు శ్రీకృష్ణమహిమమును స్మరించువారు కొలఁదిమందిమైన నుండకమానరు. ధర్మము బీజమాత్రమైన నుండకతప్పదు గదా. కాఁబట్టి యఱువదిగడియలలో

నొక్కగడియయైన భగవత్కథలం బఠించి లోకముస్థితి యెట్లున్న దని యూహించి మనము సదా విసుగునొందక చేయుకార్యములలో మనకుపకరించిన దించుకయైనఁ గలదా యనువిషయము నూహించి మనల నుద్ధరించుమార్గమును వెదకుటకై క్షణకాలమైనను వ్యయింపకున్న మరల మనుష్యజన్మము లభించుట దుర్ఘటము. ఇంతకంటె మీవంటి మహాశయులకు మిక్కిలి విన్నవింపఁజాలక విరమించి వేఱొక భగవత్కథను వ్రాయఁబూనెదను. ఈపై నీతుల ననువదించు శ్రీలీలాశుకమహర్షి యుపదేశించిన శ్రీకృష్ణకర్ణామృతశ్లోకము నుదాహరించి కథాంతరము వ్రాయఁబూనెదను.

శ్లో. తే తే భావాస్సకలజగతీలోభనీయప్రభావాః
నానాతృష్ణాసుహృది హృది మే కామమావిర్భవంతు,
వీణావేణుక్వణితలసితస్మేరవక్త్రారవిందా
న్నాహం జానే మధురమపరం నందపుణ్యాంబురాశేః.

3 ఆశ్వా. 2 శ్లో.

శ్లో. తృష్ణాతురే చేతసి జృంభమాణం
ముష్ణన్ముహుర్మోహమహాంధకారమ్,
పుష్ణాతు నః పుణ్యదయైకసింధోః,
కృష్ణస్య కారుణ్యకటాక్షకేళిః. 3 ఆ. ౯ శ్లో.

## దుర్వాసునకు శాపము కల్గుట.

*భగవత్కథాజిజ్ఞాసువులగు నోమహాశయులారా! అవ్వాలి

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము ఇరువదియైదవ యధ్యాయమునుండి సంగృహీతమని యెఱుంగనగు.

కథ నాలకింపుఁడు. దుర్వాసునిశాపమున నిటనేమి ప్రయోజనమనికాని, ఈకథ ప్రస్తుతోపయుక్తము కాదే యనికాని ప్రశ్నింపకుఁడు. శ్రీకృష్ణు నారాధించుపద్ధతు లనేకములు కలవని ముందే తెల్పియుంటిని. ఆపద్ధతులలో నొకపద్ధతి యీకథ నుండి తేలఁగలదు. కాన నీగాథ ముఖ్యమే యని తలంపుఁడు. ఇఁక దరువాతికథ నాలకింపుఁడు. అవహితులరు కండు.

నారదముని నారాయణమూర్తిం గాంచి యిట్లు ప్రశ్నించెను. శ్రీహరిచరిత్రమును వింటిని. అది మంగళప్రదము. అందును భవన్ముఖాంబురుహమునుండి యాకథ వెలువడినది. కానఁ బరమమంగళప్రదము. అవ్వలికథను వినఁగోరెదను. తనకన్య మృతినొందినపిదప నౌర్వముని యేమిచేసెనో వినవలతు. మహాత్మా! ఆనతీయవే యని వేఁడఁగా శ్రీమన్నారాయణమూర్తియు నిట్లు బదులు చెప్పెను. సరస్వతీనదీతీరమున నౌర్వముని తపమొనరించుచుండెను. హఠాత్తుగాఁ బైనుండి యొక వస్త్రము మునిమ్రోలఁ గ్రిందఁబడెను. దానిం గాంచి ముని నియమమును వదలి వస్త్ర మి ట్లాకస్మికముగాఁ గ్రిందఁబడ నేలయని యించుక యూహించి ధ్యానమున నంతయు నెఱింగి తనయావిషయకసంకటము నొందెను. శోకావేశమున నొడలు తెలియకుండెను. ఆచింత వెల్లువ దుర్వాసు నాశ్రమమునకుం బోయెను. కన్నీటిధారలచే నాభూరేణువులఁ దడిపెను. ఆశ్రమము చెంతకుం బోయి కాతరమానసుఁడై ఓకందళీ! కుమారీ! యని పలుమాఱు పిలిచెను. మామకంఠధ్వని విని దుర్వాసుఁడు

వడివడి బయటికి వచ్చి భీతినొంది విహ్వలించుచుఁ దచ్చరణాంభోరుహద్వంద్వము పయిం బడి నమస్కరించి లేచి కందళీదుఃఖావిలచిత్తుఁడు కాన విలపించెను. కందళీవృత్తాంతమునెల్ల నామూలాగ్ర మామునివరునకుం దెల్పెను. కందళి భస్మరాశి యాయెనని విన్నంతనే యౌర్వముని దుఃఖావేశమున మూర్ఛిల్లెను. జ్ఞాననిధి యయ్యుఁ బెనుమూర్ఛనొంది మృతునివలె నుండెను. మామ మృతుం డైనట్లుండుట నెఱింగి కటకటంబడి శీతలోపచారము లొనరించి చేతనగల్గునట్లు చేసెను. లబ్ధసంజ్ఞుఁడై యౌర్వముని తనయెదుటనిలువంబడియున్న యల్లునిం జూచి యిట్లు పల్కెను. అత్తఱి నమ్మునియు శోకయుతుఁడై భీతుఁడై ప్రణతకంధరుఁ డై యుండెను. పట్టరానిశోకమున బాష్పములు కన్నుల నిండియుండెను. మనోదుఃఖమునఁ గన్నులెఱ్ఱవాఱి యుండెను. ఔర్వమునియు నతిశయితక్రోధమున వణఁకుచున్న దేహముతోఁ గంపితాధరుఁడై దేఱిచూచుచుండెను.

ఓబ్రాహ్మణుఁడా! అత్రివంశమునఁ బుట్టితివి. జగత్పతికిం బౌత్రుఁడవు. నాపుత్రికయం దల్పదోష ముండఁగా దానికెన్ని యోమడుంగులుమీఱిన దండన మొనరించితివి. ఇది తగునే! శంకరాంశసంభూతుఁడవు కదా. ఆశంకరునకు శిష్యుఁడవు. వేదవేదాంగవిదుఁడవు. సర్వజ్ఞుఁడవు. గుణవంతుఁడవు. నీతల్లి యనసూయాదేవి. కమలాంశసంభూతురాలు. మహాసాధ్వి. అట్టివారికిం దనయుఁడ వయ్యును నీకిట్టి కుమతి యేల కల్గెనో

తెలియకున్నయది. ఎవనికిం దల్లి గుణవతియో తండ్రి గుణవంతుఁడో అట్టివారికొడుకు దయాహీనుఁడై పుట్టుట యచ్చెరువుగనున్నది. శ్రుతిగతిసూక్ష్మతరము కదా! నాప్రాణముల కంటె నెక్కుడుప్రీతితోఁ బెంచినకుమారికను నీకర్పించితిని. సకలసద్గుణాన్విత. అట్టినాదుహితను స్వల్పదోషమున నీచే నశింపఁజేయఁబడినది. వాగ్దోషముగలస్త్రీని పరిత్యజింపవలయునని శ్రుతి తెల్పుచున్నయది. నీవు కోపమున వదలిన రక్షించుటకు నేను దండ్రినుంటిని గదా. అట్టిరక్షకులుగల నాపుత్రిక యత్యల్ప దోషమున నేకారణమున నీచే భస్మరాశిగ నొనరింపఁబడినదో ఆకారణమున నీకు మిగులఁ బరాభవము కల్గును గాక. ఇందులకు సంశయములేదు. గొప్పజంతువులకు స్వల్పజంతువులకు సర్వజీవులకు సృష్టికర్తయుఁ బాలకుఁడు మృతిప్రదుఁడునగు భగవంతుఁడు కరుణానీరరాశి యున్నవాఁడు. అని పలికి యౌర్వ ముని పలుమాఱులు దుఃఖించి తల్లీ! కుమారికా! ఎందున్నదానవు. ఏలయిట్టిబెట్టిదంపుదుఃఖము ననుభవించితివి. ఎట్టి మృతినొందితివి. తల్లీ! ఏమిచేయుదును? ఎట్లు జీవింతును? అని పలవించి పలవించి క్రోధమున స్వాశ్రమమునకుం బోయెను.

ఔర్వముని తనయాశ్రమమునకుం బోయినంత దుర్వాసుఁడు గొంతెత్తి విలపించెను. జ్ఞానమున శోకము మఱచినను మరల రెండింతలుగా శోకము ననుభవించెను. కాలము గడువఁగా శోకాగ్ని జ్ఞానభస్మమున శాంతిల్లును. అది బంధుదర్శన శుష్కకాష్ఠసంయోగమున మరల వృద్ధినొందును. కావున మామ వచ్చి పోయినంత దుర్వాసుఁడు భార్యను దలంచుకొని

తలంచుకొని విలపింపసాగెను. తుదకుఁ దనకుఁ దా హితముప దేశించుకొనుచుఁ దపస్సుచేయ మదిఁద్రిప్పెను. నారదమునీ! ఇది దుర్వాసునిచరిత్రము. ఆతనికిఁ జిరకాలమునకు మహాపరాభవము సంభవించెను. అనిపలికిన నారాయణుం గాంచి నారదుం డిట్లనియె.

మహాత్మా! శ్రీమన్నారాయణా! దుర్వాసుఁడు శంకరాంశసంభూతుఁడు. తేజస్సుచే శంకరతుల్యుఁడు కదా? అట్టి ముని కెవ్వరివంకఁ బరాభవము కల్గెను? ఆవార్త వినఁ గోరెదనని ప్రశ్నించిన నారాయణుం డిట్టు లనియెను. మునివర్యా! వినుము. సూర్యవంశమునఁ బుట్టిన రాజేంద్రుఁ డంబరీషుఁ

## అంబరీషుని చరిత్రము.

డనఁబరఁగువాఁ డుండెను. శ్రీకృష్ణచరణాంభోజమున సదా మదిఁ జేర్చు మహాభక్తుఁడు. ఆరాజునకు రాజ్యమందుఁగాని భార్యయందుఁగాని పుత్రులయందుఁగాని ప్రజలయందుఁగాని సంపదలయందుఁగాని పుణ్యకర్మార్జితఫలంబులందుఁగాని చిత్తము క్షణమైన నాసక్తముకాదు. జాగ్రదవస్థయందును నిద్రయందుఁ గూడ శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించుచుండువాఁడు. దానిచే మహాజ్ఞాని యయ్యెను. జితేంద్రియుఁడు శాంతుఁడు విష్ణువ్రత పరాయణుండు నయ్యెను.ఆరాజున కేకాదశీవ్రతమునం దెక్కువ మక్కువ యుండెను. శ్రీకృష్ణమూర్తిని బూజించుటయే యాతని ముఖ్యకార్యముగా నుండెను. తాఁ జేయుసర్వపుణ్య కార్యములు శ్రీకృష్ణార్పణముచేయుట యారాజున కలవాటు.

అట్టిరా జెట్లు రాజ్యమును బాలింపఁజాలె నని ప్రశ్నింపరాదు. మహాదారుణమై షోడశారమై హారితుల్య తేజస్సు గలిగి, సూర్య కోటిసమప్రభమై బ్రహ్మాదులచే వినుతింపఁబడుచు, సురాసుర సంపూజితమై జగన్నాథుఁడగు శ్రీకృష్ణపరమాత్మచే రక్షింపఁ బడుచు నలరారు సుదర్శనమనుపేరుగల చక్రము శ్రీకృష్ణా నుజ్ఞచే నంబరీషునికడనుండి లోకరక్షణము చేయుచుండు. దుష్టులు తలచూపిన వారి నడంచుచుండు. కావునఁ బ్రజా రక్షణ మారాజచంద్రున కిసుమంతయుఁ గష్టదాయకము కాకుం డెను.

ఆరాజచంద్రుఁ డేకాదశీవ్రతము నాచరించి ద్వాదశీ దినమున నుదయమున స్నానమొనరించి సకాలమున శ్రీకృష్ణ పరబ్రహ్మమును బూజించి నియతులగు బ్రాహ్మణులకు దానము లొసంగి సువర్ణరజతాదికములఁగొని వారు సంతుష్టులు కాఁగా వారికి యథార్హముగా భోజనముఁ బెట్టించి తా భుజింప సమకట్టియుండెను. అట్టితఱిఁ దపస్వియు, విప్రుఁడును, ఆఁకలి బాధింపఁగా మదిచెదరనున్నవాఁడును, దండధారియు, ఛత్ర మును ధరించినవాఁడును, తెల్లనివస్త్రముదాల్చినవాఁడును నగు దుర్వాసుఁడనుముని యరుదెంచెను. ఆమునిలలాటమునఁ దిల కము భాసిల్లుచుండెను. జడలు సందె డుండెను. దేహము మిగులఁ గృశించి యుండెను. కంఠము డప్పిచే బాధపడుచుం డెను. పెదవు లెండియుండెను. ఇట్లు దుర్వాసుఁడను ముని రాఁగా నంబరీషుఁడు లేచి యెదురుచని తోడితెచ్చి నమస్క

రించి పాద్యము నొసంగి సువర్ణపీఠమునఁ గూరుచుండఁ బెట్టెను.

మహామునియు నారాజచంద్రు నాశీర్వదించి సుఖాసనమునఁ గూరుచుండెను. రాజు మహాత్మా! ఆజ్ఞ యేమని విన్నవించెను. నరపతివినయోక్తుల కలరి మునివరుఁ డాతనితో రాజా! ఆఁకలి బాధించెడిని. విధిపూర్వకముగ నన్నదానము చేయుము. అఘమర్షణమంత్రము జపించి యచిరకాలమున నే వెళ్లెదను. క్షణకాల మోర్చియుండుము. స్నానము విధిపూర్వకముగ నొనరించి వచ్చెద ననిపల్కి నదికిఁ బోయెను. ముని చనిన వెనుక రా జత్యంతచింతాక్రాంతుఁడయ్యెను. ద్వాదశిఘటికలు దాఁటుచున్నవి. భుజింపవలయు. లేకున్న వ్రతభంగ మగును. అనిచింతించుసమయమున రాజగురు వరుదెంచెను. రాజు నమస్కరించి మునివృత్తాంత మెఱిఁగించి యిట్టు లనియెను. మునివర్యుఁ డింకను రాఁడు. ద్వాదశి కడచిపోవుచున్నయది. ఈ కష్టకాలమున విధుల నూహించి చేయఁదగుపని నాదేశింపుఁడు. త్వరగాఁ గీడుమేలు నూహించి సెలవిండు. అన నాగురు వప్పుడే హితమై సత్యపూతమై వేదప్రతిపాదితమై పరిణామసుఖావహమై యలరువాక్యము నిట్లు పల్కెను. ఆగురువు వసిష్ఠమహార్షియే యని భావింపుఁడు.

రాజేంద్రా! *ద్వాదశి గడువఁగాఁ ద్రయోదశీఘటి

---

* ద్వాదశ్యాం సమతీతాయాం త్రయోదశ్యాం తు పారణం, ఉపవాసఫలం హాత్వా వ్రతినం హంతి నిశ్చితమ్. ౘ౫ శ్లో. న భోజయిత్వా మోహశ్చేదతిథిం సముపస్థితం, సత్ర స్తః క్షుధితో భుంక్తే కుంభీపాకే వ్రజే

కలలో నెవ్వఁడు పారణముచేయునో వానిపుణ్యము నశించు టయేగాక వ్రతమొనరించువాఁడు నశించును. బ్రహ్మహత్యా సమపాప మద్దానఁ గలుగుననితలంపుము. ఇది వేదప్రతిపాదితము. త్రయోదశి రాఁగా నే వ్రతపరాయణుఁడు పారణముచేయునో ఆపదార్థము సురాపానతుల్యపాపము నొసంగునని బ్రహ్మయే శాసించెను ఏమూఢుఁ డతిథికి భోజనము పెట్టక యాఁకలిచేఁ దాఁ ద్వరపడి భుజించునో యా మనుజుఁడు కుంభీపాకనరక మునఁ బడి యందు నూఱువర్షము లుండి చండాలత్వ మొందును. మఱియు సదా వ్యాధిబాధితుఁడై ప్రతిజన్మమం దును దరిద్రుఁడు నగు. కాఁబట్టి రాజేంద్రా! మహత్తరకష్ట కాలమునఁ బరమసూక్ష్మ మగుధర్మము శ్రుతిపాదితము గలదు. దానిం జెప్పెద. రెండువిధములైన శాస్త్రపద్ధతులం గాపా డుము. ఆపద్ధతి యేమనఁగా, శ్రీకృష్ణపరబ్రహ్మ పరమపావన పాదాంభోరుహాభిషేకోదకమును ద్రావి యుపవాసఫలమును రక్షింపుము. జలపాన మభక్షణతుల్యమే యగును. అని పలికి బ్రహ్మకుమారుఁ డగు వసిష్ఠముని యూరకుండెను.

అంబరీషుఁడు వసిష్ఠువచనమును విని శ్రీకృష్ణమూర్తిని స్మరించుచుఁ దత్పాదోదకము నించుకత్రాగెను. ఇంతలో దుర్వా సుఁడు స్నానమొనరించి వచ్చెను. జరగినపని నెఱింగి రాజు మ్రోల జడల నతిక్రోధమున విదలించుచు నందొకజట నూడఁ

---

క్షిప్తం. శతవర్షం తత్ర తిష్ఠ న్నరశ్చండాలతాం వ్రజేత్, వ్యాధియుక్తో దరిద్రశ్చ భవేజ్జన్మని జన్మని. శరా శ్లో.

దీసి నేలపైఁ గొట్టెను. దానినుండి యొకపురుషుఁడు వెలువడి యెను. అగ్నిశిఖవలె నతఁడు చూపట్టెను. ఖడ్గహస్తుఁడై మహా భయంకరుఁడై యప్పురుషుఁడు రాజును జంప నుద్యమించెను. అంతట శ్రీహరిచక్రము సూర్యకోటిప్రభాభాసమానమై కృత్తి రూపమును దాల్చి రాజును వధింపవచ్చు నాపురుషుని ఛేదించెను. ఆసుదర్శనమును జూచినంతనే ముని భయాతురుఁడై పరుగిడెను. సుదర్శన మాతని వెంటనంటెను. జ్వలదగ్నిజ్వాల వలె వెంటనంటి యతిరయమునఁ బరుగిడునాచక్రము నామకాని చూచెను. బ్రహ్మాండమును మీఱి నిర్విణ్ణుఁడై భయాకులుఁడై బ్రహ్మలోకమునకుం బోయి జగన్నాథునిగా నాతని భావించి శరణుచొచ్చెను. కావుమా కావుమా యని బ్రహ్మసభను బ్రవేశించెను. బ్రహ్మయుఁ ద్వరపడి లేచి మునిచంద్రా! కుశలమా యని ప్రశ్నించెను. వృత్తాంతము నామూలముగ ముని బ్రహ్మకు విన్నవించెను.

ముని వచించినపలుకుల విని బ్రహ్మయు నిట్టూర్పులు పుచ్చి తద్విధమాలోచించి సుదర్శనముం గాంచి భీతిచెంది యిట్లు చెప్పెను. వత్సా! దుర్వాసా! హరిదాసుని శపింపఁబూనితివే. భగవంతుని తేజస్సుచే నతఁడు రక్షింపఁబడుచున్నవాఁడు కదా. అట్టివాని నీలోకత్రయమున నెవఁడు హింసింపఁ గలఁడు? అల్పులుగాని అధికులుగాని భక్తులను రక్షింప భక్తవత్సలుఁడగు శ్రీహరి చక్రమును ధరించియుండును. ఆచక్రమే భక్తుల నహోరాత్రములు కాపాడుచుండును. ఏమూఢుఁడు విష్ణు

భక్తునితో ద్వేషించునో అతనిని యమునింగూడ సంహరింప శ్రీహరి సమర్థుఁడు. ఏలయనఁగా భక్తుఁడు శ్రీహరికిం బ్రాణతుల్యుఁడు. కాఁబట్టి వత్సా! వేఱుచోటికిఁ బొమ్ము. ఇట నిన్ను రక్షించువాఁడు లేఁడు. అట్లు చేయవేని నిన్నును నన్నును ఈసుదర్శనము వధింపఁగలదు. ఆచక్రము బ్రహ్మలోకమునే కాదు బ్రహ్మాండమునుగూడ క్షణకాలమున దహింపఁ జాలును. అది తేజస్సుచే విష్ణుతుల్యము. దాని నెవ్వఁడు నివారింపఁగలఁడు? అని బ్రహ్మ పలుకఁగా నాదుర్వాసుఁడు ఇఁక నిట లాభము లేదని పరువెత్తెను. భీతిల్లి శంకరుని శరణుచొరఁగోరి కైలాసమునకుం బోయెను.

కృపాసింధూ! ఆర్తుఁడనగునన్నుఁ గాపాడుమా యని ప్రార్థించెను. శివుఁడు సర్వజ్ఞుఁడు కావున మునిని కుశలప్రశ్నమొనరింపక దీనావనదక్షుఁడగు శంకరుఁడు తా మృత్యుంజయుఁడయ్యు నిట్లు పలికెను. ద్విజోత్తమా! భయపడకుము. స్థిరుఁడవు కమ్ము. నామాట నాలకింపుము. నీవు బ్రహ్మకుం బౌత్రుఁడవు. అత్రితనయుఁడవు. వేదవేదాంగముల నెఱింగినవాఁడవు. కాని నీవొనరించిన కార్యము మూర్ఖుఁడు చేయఁదగినది. వేదములయందుఁ బురాణములయందు నితిహాసములందు నెల్లయెడల నెవ్వఁడు సర్వేశ్వరుఁ డని నిర్ణయింపఁబడినదో అతనిని మూఢునివలె నెఱుంగక పోతివి. నేనును బ్రహ్మయు నింద్రుఁడును దేవతలు, వసువులు, ధర్మేందువులు, ఆదిత్యులు, మునీంద్రులు, మనువులు లోనగువారెల్ల నేభగవంతుని కనుబొమ

ముడిని విలాసముగాఁ బెట్టినమాత్రమునఁ గలుగుచుందురో నశించుచుందురో అట్టిసర్వేశ్వరునకుఁ బ్రాణములకంటె నెక్కుడగు భక్తున కపకార మేతేజస్సును నమ్మి చేయఁబూనితివి? మఱియు బ్రహ్మయు నేనును లక్ష్మీదేవియు దుర్గాదేవియు వాగ్దేవియు రాధాంబికయు శ్రీహరికి భక్తులకంటె నధికులము కాము. భగవంతునకు భక్తులే ప్రియులు. శ్రీహరి గొప్పవారికంటె నల్పులగు భక్తులనే పరమప్రేమమునఁ గాపాడుచుండును. సర్వాంతరాత్మయగు శ్రీహరి పాపిజనదుస్సహతేజోవిరాజితంబగు చక్రమును జేఁబూని భక్తరక్షణమునకై పాటుపడుచుండును. స్వాత్మతుల్య మగుచక్రమును దేజోవిరాజితమని తలంచి భక్తుల రక్షింప నియోగించి అంతతో సంతృప్తినొందక తాను గూడ నాకార్యమునకుఁ దోడ్పాటు చూపుచుండును. ఆశ్రీహరికి స్వకీయగుణనామధేయసంకీర్తనమున మహత్తరసంతోషము. భక్తసంగముకన్న మించినయానంద మాహరికి వేఱొకటి లేదు. ఛాయవలె సదా భక్తుల ననుసరించియుండును. శ్రీహరికి లక్ష్మీదేవి ప్రాణాధికప్రియురాలు. ఆమెనుమించిన ప్రేమాస్పదులు లేరు. ఆలక్ష్మియు భక్తులను ద్వేషించిన దేవుఁడామెనుగూడ వదలుననుట నిక్కము.ఇంకొక్కమాట వినుము. అందఱిలో భగవత్ప్రియులు విప్రులు. అంతియకాక స్వశరీరమునకన్నను బ్రియులని నమ్ముము. వారికంటె శ్రీహరికి భక్తులు ప్రియులు. ప్రాణములకన్న నెక్కుడుగా వారిని జూచును. మునీంద్రా! ఈశ్వరునకు మిత్రామిత్రు లను భేదము లేదు.

జగత్త్రయమున నెవఁడుశిష్టుఁడో యెవఁడు సదా తన్ను ధ్యానించుచుండునో ఆతని ననుసరించియుండును. ఓబ్రహ్మర్షీ! సకల బ్రహ్మాండములు నీటమునుఁగునట్టి మహాప్రళయము రాఁగా భక్తుల నాత్మ నిడుకొని భగవంతుఁడు కాపాడును. వారికి నాశములేదు. కాఁబట్టి బ్రాహ్మణోత్తమా! గోవిందు భజింపుము. ఆమహానీయునిపాదారవిందములఁ గొల్వుము. శ్రీహరిస్మరణమున సర్వాపదలు తొలఁగును. శీఘ్రంబ వైకుంఠలోకమున కరుగుము. వైకుంఠుని శరణుచొరుము. అభయమునిచ్చి నిన్నుఁ గాపాడును. ఆమహాత్ముఁడు కరుణాసాగరుఁడు కదా!

ఇట్లు లాశంకరుఁడు మునికి నుపదేశించుచుండఁగా సుదర్శన మరుదెంచెను. దానిజ్వాలలచేఁ గైలాసమెల్ల నావరింపఁబడియెను. సూర్యకిరణములచే లోకము వ్యాప్తమయినట్లు లపు డుండెను. ఆచక్రజ్వాలలకుఁ గైలాసవాసులు దగ్ధదేహులై శంకరా! మముంగాపాడుమా యని మొఱపెట్టసాగిరి. ఓర్వరాని తేజముల వచ్చుచక్రమును గాంచి కరుణానీరధి కాన శంకరుఁ డావిప్రు నాశీర్వదించెను. దానిబాధ లంటకుండెను. పార్వతింగూడిన శంకరుఁ డాశీర్వదింప నీకఁ జక్రజ్వాలలేమి చేయఁగలవు? శంకరుఁ డిట్లు పల్కెను. తేజస్సు తపస్సు నాచేఁ జిరకాలమునుండి సంపాదింపఁ బడుట సత్యమేని యీ బ్రాహ్మణుఁడు చక్రభీతిని బాసి విజ్వరుఁ డగుఁగాక. అత్తఱిఁ బార్వతి యిట్లు ప్రతిజ్ఞ చేసెను. *నాప్రాణనాథునియొక్కయు

* యత్పతిభోర్ద్దమ పుణ్యేషు బ్రాహ్మణశ్శరణాగతః, మమాశిషా మహాభీత్యా శీఘ్రం భవతు విజ్వరః. రా౹౹ శ్లో౹౹.

నాయొక్కయుఁ బుణ్యములచే శరణాగతుఁ డీభూసురుఁడు మహాభీతిం బాసి విజ్వరుఁ డగుఁగాక. అని పలికి పార్వతీపర మేశ్వరు లావిప్రుని వైకుంఠమునకు సాగనంపిరి. మునియు శం కరునకు నమస్కరించి వైకుంఠలోకమున కరిగెను.

శివు ననుమతినొంది మనోగమనంబున ముని వైకుంఠ లోకమున కరిగి వెంటనంటివచ్చు సుదర్శనముగని భీతినొం దుచు శ్రీహరియంతఃపురమును బ్రవేశించెను. రత్నసింహాసనా సీనుఁడై శంఖచక్రగదాపద్మములు కరకమలములందుఁ జెలు వారఁ బీతాంబరమును దాల్చి శ్యామవర్ణగాత్రుఁడై చతుర్భు జుఁడై శాంతుఁడై లక్ష్మీకాంతుఁడై మనోహరాకారమునఁ గన్నులపండువుఁ గూర్చుచు రత్నాలంకారవిభూషిత సర్వాం గుఁడై రత్నహారము లురమ్మునఁ బొల్పుసూప సుస్మిత మాసన మున కొకవింతకాంతినీయ భక్తానుగ్రహార్థము త్వరపడుచున్న స్వభావము కనుపట్ట. సకలరత్నసారవిలసత్కిరీటము భాసిల్లఁ బార్షదప్రవరులు సదా సేవింప శ్వేతచామరములు చేఁబూని పార్షదులు కొందఱు కొలువ, లక్ష్మీసేవితపాదారవిందుఁడై సర స్వతి ప్రొల నిలిచి వినుతింప సునందనందకుముదప్రచండాదులు చుట్టు బలసి నిలువ మహాత్ములు స్వగుణానువాదపురస్సరముగా గానముచేయఁ జూచుచు నానందించు భగవంతు నారినా రా యణపరబ్రహ్మమును దుర్వాసుఁడు కనియెను.

ఇట్టు లసమానమహిమమున విరాజిల్లు లోకనాయకుం జూచి మునియు దండాకృతి నమస్కరించెను. సామవేదో

స్తుతివితతి వినుతించెను. వినుతించి ముని యిట్లు పలికెను. *ఓకమలాకాంతా! నన్నుఁ గాపాడుము. కరుణానిధీ! నన్నుద్ధరింపుము. అతిదీనజనావననిరతా! దీనబంధూ! నాయార్తిఁ బాపుము. వేదవేదాంగముల సృజించిన విధాతకు నీవు జనకుఁడవు. మృత్యుదేవతలకు నీవు మృత్యువవు. కాలునకుఁ గాలుఁడవు. ఈమహాకష్టసాగరమునుండి నన్ను దరిఁ జేర్పుము. సంహారకర్తను సంహరించువాఁడవు. సర్వేశుఁడవు. సర్వకారణుఁడవు. మహావిష్ణుతరుబీజరూపా భగవంతా నారాయణా నన్నుం గావుమా. భవసాగరమున మునింగితిని. శరణాగతశోకార్త భయత్రాణపరాయణా! శ్రీమన్నారాయణా! భీతుఁడ నగు నన్ను రక్షింపుము. ఇదె నీకు మ్రొక్కుచున్నవాఁడ. వేదములం దేవస్తు వాద్య మని వినుతింపఁబడినదో వేదము లెవని

---

* దుర్వాసఃకృతశ్రీహరిస్తుతిః.

త్రాహి మాం కమలాకాంతత్రాహిమాంకరుణానిధే,దీనబంధో౽తిదీనేశ కరుణాసాగర ప్రభో. ౧. వేదవేదాంగసంస్రష్టుర్విధాతుశ్చ స్వయం విధే, మృత్యోర్మృత్యుః కాలకాల త్రాహిమాం సంకటార్ణవే. ౨. సంహారకర్తుస్సంహార స్సర్వేశస్సర్వకారణః, మహావిష్ణుతరోర్బీజ రక్షమాం భవ సాగరే. ౩. శరణాగతశోకార్తభయత్రాణపరాయణ, భగవన్నవమాం భీతం నారాయణ నమోస్తు తే. ౪. వేదేష్వాద్యం చ యద్వస్తు వేదాస్తోతుం న.చ క్షమాః, సరస్వతీ జడీ భూతా కిం స్తువంతి విపశ్చితః. ౫. శేషస్సహస్రవక్త్రేణ యం స్తోతుం జడతాం వ్రజేత్, పంచవక్త్రో జడీ భూతో జడీభూత శ్చతుర్ముఖః. ౬. శ్రుతయ స్మృతికర్తారో వాణీచేత్స్తోతుమక్షమా, కో౽హం విప్రశ్చ వేదజ్ఞః శిష్యః కిం స్తౌమి మానద. ౭. మనూనాంచ మహేంద్రాణా మష్టా

వినుతింప నసమర్థములో సరస్వతియు వినుతింపఁ జాలకుండునో అట్టి నిన్ను నిఁక నేపండితులు వినుతింపఁగలరు? ఆదిశేషువు సహస్రవదనముల నేభగవంతుని నుతింపఁజాలక జడతఁగాంచెనో, పంచవక్త్రుఁ డగునీశ్వరుఁడు జడత్వ మొందెనో చతుర్ముఖుఁడు నుతింపఁజాలక యూరకుండెనో అట్టినిన్ను నుతింపఁ నే సమర్థుఁడ నెట్లగుదువా? వేదములు స్మృతికర్తలు వాగ్దేవియు నిన్ను నుతింపఁజాలక మానిరన వేదమును బఠించినశిష్యుఁడను గాదగిన నేనునుతింపఁ బూనఁగలనా? మనువులు శతమఖులు ఇరువదియొనమండ్రుగురు గతింప దివానిశము లెవ్వని కగునో అట్టి పరిమాణముచే నూఱువత్సరము లాయువుగలబ్రహ్మయు నేమహానీయుని కనుఱెప్పపాటున మృతిఁగనునో అట్టియనిర్వచనీయుని నిన్ను నే నేమని నుతింపఁగలను?

అని యిట్లు వినుతించి భగవంతుని చరణారవిందముల యందుఁ బడి నయనారవిందజలములఁ దడిపెను. భయముచే

---

వింశతిమేగతే, దివానిశం యస్య విధేరష్టోత్తరశతాయుషః. ౮. తస్య పాతో భవేద్యస్య చక్షురున్మీలనేన చ, తమనిర్వచనీయం చ కింస్తౌమి పాహిమాం ప్రభో. ౯. ఇత్యేవం స్తవనం కృత్వా పపాత చరణాంబుజే, నయనాంబుజనీరేణ సిషేచ భయవిహ్వలః. ౧౦. దుర్వాససా కృతం స్తోత్రం హరేశ్చ పరమాత్మనః, పుణ్యదం సామవేదోక్తం జగన్మంగళనామకం. ౧౧. యః పఠేత్సంకటగ్రస్తో భక్తియుక్తశ్చ సంయతః, నారాయణస్తం కృపయా శీఘ్రమాగత్య రక్షతి. ౧౨. రాజద్వారే శ్మశానే చ కారాగారే భయాకులే, శత్రుగ్రస్తే దస్యుభీతౌ హింస్రజంతుసమన్వితే. ౧౩. వేష్టితే రాజసైన్యేనమగ్నే పోతే మహార్ణవే, స్తోత్రస్మరణమాత్రేణ ముచ్యతే నాత్ర సంశయః. ౧౪.

విహ్వలుఁ డయ్యెను. ఇది దుర్వాసుఁ డను ముని యొనరించిన స్తుతి. పరమేశ్వరుఁ డగు శ్రీకృష్ణమూర్తి దీన నలరెను. ఇది సామవేదోక్తము. జగన్మంగళకారకము. పుణ్యప్రదము. దీని నెవఁడు కష్టపరంపరలఁ జిక్కి భక్తియుక్తుఁడై పఠించునో ఆభక్తుని శ్రీకృష్ణమూర్తి యరుదెంచి కాపాడును రాజద్వారమందును, శ్మశానమునందును, కారాగృహమందును, భయము తటస్థించునపుడును, శత్రువులు చుట్టుముట్టినతరుణమునను, క్రూరజంతుభయమునందును, పరరాజసేనలువచ్చి యాక్రమింపఁ బూనినపుడును, మహార్ణవమున నౌక మునుఁగుతఱి దీని నెవరు స్మరింతురో వారి కాబాధలు తొలఁగి మనశ్చింతలు వాయును.

ఈరీతిగా దుర్వాసుఁడు వినుతింప భక్తవత్సలుఁ డగు భగవంతుఁడు నవ్వి మధురము పీయూషవర్షసమానము నగువచనము నిట్లు పలికెను. మునిచంద్రా! లెమ్ము. లెమ్ము. నీకు మేల య్యెడు. నావరమును గ్రహింపుము. అంతియగాక నావచనమును ఆలకింపుము. అది సత్యము సుఖావహము నగు. సజ్జనులనుండి శాస్త్రము వినినచో నితరులకు జ్ఞానము కల్గును. శాస్త్రములు స్వమూర్తులు గలవని సజ్జనులు తదుక్తరీతిఁ జరింతురు. వేదవిరుద్ధకర్మ మెల్లర కతినింద్యము. విద్వాంసుఁ డెవ్వఁ డట్టికర్మముల నాచరించునో వాఁడు జీవించియు మృతుఁ డైనవాఁడే. పురాణములయందు వేదములయందు నితిహాసములయందు నో బ్రాహ్మణుఁడా! విష్ణుభక్తుల మహిమము సర్వప్రకారములచేఁ బ్రతిపాదితము. నేను నా

భక్తులకుఁ బ్రాణతుల్యుఁడను. భక్తులు నాకుఁ బ్రాణసమానులు. ఏమూర్ఖుఁడు అట్టివారితో ద్వేషించునో వాఁడు నాప్రాణ ములఁ హింసించినవాఁడగు. పుత్త్రపౌత్త్రులను, కళత్రమును రాజ్యమును, ఐశ్వర్యమును విడిచి నన్నెవ్వరు ధ్యానింతురో వారికన్న నాకుఁ బ్రీతిపాత్త్రు లెవ్వరు గలరు? నాకు భక్తుల కంటెఁ బ్రాణము లెక్కువ గావు. లక్ష్మియుఁ బ్రీతిపాత్త్రురాలు కాదు. శంకరుఁడును వారికంటె నెక్కుడు కాఁడు భారతియు, బ్రహ్మయు, దుర్గయు, గణపతియు, బ్రాహ్మణులును, వేదములును, వేదజననియగు గాయత్త్రియు, గోపికలును, గోపాలకులును, రాధయు మహాత్ములును భక్తులకంటె నెక్కుడు ప్రీతికిం బాత్త్రులు కారు. మునీంద్రా! ఈమాట సత్యసారమని నమ్ముము. ప్రశంసా మాత్రమే కాదు. నిజము. నాకు భక్తులకంటెఁ బ్రియు లెవ్వ రును గారు. జ్ఞానహీనులై ఎవ్వరు నన్ను ద్వేషింతురో వారు వంచితులు. తమ్ముఁ దమ రెఱుఁగనివారే. అట్టిమూర్ఖులు నరక ప్రాప్తు లగుదురు. నాప్రాణములకంటెఁ బ్రియులగుభక్తుల నెవ్వారు ద్వేషింతురో వారిని నేనే శిక్షింతును. వేగమ శిక్షిం తును. పరలోకమనఁగా వారికి నరకమే. నేనందఱికిఁ బ్రభావ రూపుఁడను. ఈశ్వరుఁడను పరిపాలకుఁడను. అట్టినేను స్వతం త్త్రుఁడను గాను. వ్యాపకుఁడను గాను. దివానిశములు భక్తుల కధీనుఁడను గోలోకమున ద్విభుజములతోడను, వైకుంఠమునఁ జతుర్భుజములతోడను, నేనుందును. గాని, దేహము మాత్రమే యందుండును. ప్రాణములు భక్తసన్నిధి నుం

డును. భక్తు లేపదార్థమును నాకొసంగుదురో అదియే నాకాహా రము. ఇతరు లొసంగినపదార్థముల నేఁ దినను. అవ్వి యమృతోపమానము లైనను నాకు రుచింపవు.

రాజేంద్రుఁ డగునంబరీషుఁడు నిరీహుఁడు. అహింసకుఁడు. దయాశీలుఁడగు నామహనీయునకు సకలభూతహితరతున కెట్టు లపకారము చేయఁ బూనితివి? సర్వజంతువుల యందు దయగలిగి సదా పరోపకార మెవ్వరు చేయుచుందురో యట్టివారి కెవ్వ రపకారము చేయుదురో వారి నేనే హింసింతును నాభక్తుల హింసించుశత్రువుల రక్షింపనాకు శక్తిలేదు. కావున నీవు భక్తుఁడగు నంబరీషుని యాలయమునకుఁ బొమ్ము. ఆతఁడే నిన్ను రక్షించును. *మునిచంద్రా! మఱి యొకమాట వినుము. భక్తులు నాయందే హృదయమును గట్టిపెట్టి సమదర్శనులై నన్ను వశపఱచుకొందురు. పతివ్రతలగు స్త్రీలు ప్రాణనాథుని వశపఱచుకొనురీతి నన్ను వారు వశపఱచుకొనఁగా నేను వారిని వదలఁజాలక యుందును. నాసేవచే సాలోక్యాదిచతుష్టయము లభించినను వారు దానిం గోరరు. నాసేవనే కోరుదురు. దానిఫలము వారికక్కఱలేదు. ఇచ్చట మహాకవి పోతనామాత్యుఁడు,

క. పంచేంద్రియముల తెరువుల
వంచించి మనంబునందు • వగనుతులు ప్రతి

* ఈభాగము శ్రీభాగవతము నవమస్కంధము నాల్గవ యధ్యాయము ౬౫వ శ్లోకమునుండి వ్రాయఁబడిన దని యెఱుంగనగు.

షించి వహింతురు నన్నును
మంచివరుం బుణ్యసతులు ♦ మరగినభంగిన్.

అని వ్రాసెను. ఈపద్య మేశ్లోకమునకో తెలియదు. ఆలోచించి చూడఁగా,

శ్లో. మయి నిర్బద్ధహృదయాస్సాధవస్సమదర్శినః,
వశీకుర్వంతి మాం భక్త్యా సత్స్త్రియస్సత్పతిం యథా. ౬౬

అనునీశ్లోకమునకే యని తోఁచెడు. కాకున్న మూలమే లేదని చెప్పవలసివచ్చును. దీనికిఁ బూర్వశ్లోకము,

యే దారాగారపుత్రాప్తాన్ ప్రాణాన్ విత్తమిమం పరం,
హిత్వా మాం శరణంయాతాఃకథంతాం స్త్యక్తుముత్సహే.

అనునది. దీనికిఁ బోతన మహాకవి,

ఆ. తనువు మనువు విడిచి ♦ తనయులఁ జుట్టాల
నాలి విడిచి సంప♦దాలి విడిచి
*నన్న కాని యన్య ♦ మెన్నఁడునెఱుఁగని
వారి విడువ నెట్టి♦వారి నైన.

అని వ్రాసిరి. కాఁబట్టి పైపద్యము పైనుదాహృత మగుశ్లోకమునకే యని తోఁచెడిని. ఏలాఁగో యీతావున మూలార్థము చాల వదలివేయఁబడినది. "సమదర్శినః" అనుపదమునర్థముగల పదము తెనుఁగునఁ గానరాదు. "సాధవః" అనుదానికి "వరమతులు" అని వ్రాయఁబడియె. "మయి నిర్బద్ధహృదయాః"

* నన్నెకాని యన్య మెన్నఁడే నెఱుఁగని–అనుపాఠము తాటియాకులప్రతిలో నొక్కతావునఁ గన్పట్టెడిని.

అనువాక్యమునకు మూఁడుపాదములుగాఁ గంధపద్యము వ్రాయఁబడినది. "సత్స్త్రియస్సత్పతిం యథా" అనుదానికి "మంచివరుం బుణ్యసతులు మరగినభంగిన్" అని వ్రాయఁబడినది. పురంధ్రీమణులు సత్పతిని వశపఱచుకొనునట్లు నాయందు సంబద్ధహృదయులై సమదృష్టిగలవారై తనగారుసత్పురుషులు నన్ను వశపఱచుకొనుచున్నారని శ్లోకభావము. మరగినభంగిన్ అన్నవాక్యము సరసముగా లేదని విధిలేక చెప్పవలసి వచ్చినది. ఆమహాకవి భక్తాగ్రేసరుఁడు నగు శ్రీపోతనగారి భావమేమో నిర్ణయింపఁజాలక యున్నవాఁడను. (తరువాతికథ)

సాధువులే నాహృదయము.సాధువులహృదయము నేను. నాకంటె వేఱుపదార్థము దేనినే వారెఱుఁగరు. వారికంటె మిన్నయగుపదార్థము నించుకేనియు నే నెఱుఁగను. నీవిపుడు చేసినహింస యంబరీషునకుం గాదు. నీకే. కావున నాయంబరీషునికడకే పొమ్ము. సాధువులపైఁ బ్రయోగించిన తేజస్సు ప్రయోగించినవానికే యమంగళము నాపాదించును.

శ్లో. సాధవో హృదయం మహ్యం
సాధూనాం హృదయం హ్యహం,
మదన్యం తే న జానంతి
నాహం తేభ్యో మనాగపి. ౭౧

అత్రోఽపహ్యత్త్వాభిచారస్తే యత స్తంయాతు వైభవాన్,
సాధుషు ప్రహితం తేజః ప్రహర్తుః కురు తేఽశివమ్. ౭౨

అని యీఘట్టమున మూలము కన్పట్టెడిని.

క. సాధులహృదయము నాయది
సాధులహృదయంబు నేను • జగముల నెల్లన్
సాధుల నేన యెఱుంగుదు
సాధు లెఱుంగుదురు నాదు • చరితము విప్రా.

అనుపద్యము డెబ్బదియొకండవశ్లోకమునకు వ్రాయంబడినది. డెబ్బది రెండవశ్లోకమునకుం బద్యమే కానరాదు. ఎలాగో తెలియకున్నయది. రెండవశ్లోకము ముఖ్యము కాదనరాదు. చాల ముఖ్యమే యని చెప్పక తప్పదు. ఐన నద్దానిని మహాకవి వదలెను ఇంతియ కాక,

శ్లో. మత్సేవయా ప్రతీతం తే సాలోక్యాదిచతుష్టయమ్,
నేచ్ఛంతి సేవయా పూర్ణాః కుతోఽన్యత్కాలవిప్లుతమ్.

అనుశ్లోకము తెనిఁగింపఁబడలేదు. మొత్తమువిూఁద నీఘట్టమున శ్రీపోతనమహాకవి మూలమును జాల సంకుచితము చేసి భావమును మాత్రమే గ్రహించి తెనిఁగించినట్లు కనుపట్టును.

దుర్వాసా! తపస్సు విద్యయు బ్రాహ్మణునకు మేలు గూర్చునవి. దుర్వినీతుఁడగు విప్రునకు నవి విపరీతఫలముల నిచ్చును. కావున నో బ్రాహ్మణుఁడా! నాభాగతనయుఁ డగు నంబరీషునికడకుం బొమ్ము. నీకు మేలు తప్పక కల్గును. క్షమింపుమా రాజేంద్రా యని కోరుము. మహాశాంతుఁడు కాఁబట్టి యతఁడు నిన్ను క్షమించును. నీకు మేలయ్యెడు. పొమ్ము. అని భగవంతుఁడు పలుక నాదుర్వాసుఁడు విషణ్ణమానసుండై శ్రీ

కృష్ణపదాంబుజముల ధ్యానించుచు నిలువంబడియెను *అత్తఱిం బార్వతిం గూడి శంకరుఁడును ధర్మచంద్రాదులు బ్రహ్మాయు సకలమునిపుంగవులు వచ్చి భగవంతునకు నమస్కరించిరి పుల కాంచితసర్వాంగు లై భక్తినమ్రాత్మకంధరు లై యిట్లు వినుతించిరి. అందు బ్రహ్మ యిట్లు పలికెను. ఆత్మస్వరూపుఁడవగునో ప్రభూ! నీవు నిర్లిప్తుఁడవు. భక్తానుగ్రహకాతరుఁడవు. భక్తాపరాధ మొనరించిన యీబ్రాహ్మణుని రక్షింపుము. అని వినుతించెను. అంత నీశ్వరుఁడు ఓదీనబంధూ! జగన్నాథా! ఈతఁడు విప్రుఁడు కాఁడు. క్రూరకృత్య మొనరించినవాఁడు. ఐనను శరణాగతుఁడు. దీనుఁడు. కావునఁ గరుణచే నీతనిం గాపాడుము. అని వేఁడెను. అవ్వలఁ బార్వతియు నీకు భక్తుఁ డంబరీషుఁడుం ద్విజులు, అసురులు మేమెల్లం గాము. మాకందఱికంటె నా భాగతనయుఁ డతిభక్తుఁడు. సర్వేశ్వరుఁడవు కాఁబట్టి యపరాధి యైన యీవిప్రునిఁ గాపాడుమని వేఁడెను. అనంతరము ధర్ముఁడు కరయుగము ముకుళించి సర్వభూతములకు నీవ జనకుఁడవు. రక్షించువాఁడవు. దండించువాఁడవు. తనశిశువులలో నొకఁడు సోదరున కపకృతిం జేసినవానిని దండ్రి సంహరించునా. సంహరింపఁడు కదా. అన్యాయము ననుసరించి యీవిప్రప్రవరు రక్షింపుమా యని యభ్యర్థించెను. పిదప నింద్రుఁడు మహాప్రభూ! సర్వజంతువులందుఁ గరుణచే నీకు సమత్వము కలదు.

* ఇక్కథ శ్రీభాగవతమునఁ గన్పట్టదు. శ్రీకృష్ణజన్మఖండమునందే యున్నదని యెఱుంగునది.

ఈముని స్వాపరాధఫల మనుభవించెను. కాన నిపుడు
కాపాడుమా యని వాంఛించెను. తరువాత రుద్రుఁ డిట్లు పలి
కెను. శాంతిం బూనుట న్యాయము. ఇపుడు తగిన సాయ
మొనరింపుము. మొదలు తెగినవృక్షమును బాలించుట నీకుఁ
దగినపని. కావున ముని నితనిబాధఁ దీర్చి కావుము. దిక్పతి
వితతి యవ్వేల నిట్లు వేఁడెను. కృతాపరాధుఁ డైనను
బ్రాహ్మణుఁ డవధ్యుఁ డని వేదనియమము కలదు. అపరాధశమ
మొనరించి మంచిరాజు కాపాడును. నీవు మహాప్రభావవు. కరు
ణానీరరాశివి. కావున నీతనిఁ బాలింపుము. అది విని గ్రహము
లిట్లు యాచించెను. ఏమూఢుఁడు విష్ణుభక్తుల ద్వేషించునో
వానిపై దేవతలంద ఱాగ్రహింతురు. ఈతఁ డపరాధియని
మేము బాధింతుము. పిదపనీవు కాపాడుము. ఆవాక్కుల నాలిం
చి మును లిట్లు ప్రార్థించిరి. జగన్నాథా! విప్రుఁ డవమానితుఁ
డయ్యెనేని మేమెల్ల జీవన్మృతులమే. ఒకనికి దండము విధింపఁ
బడిన నాజాతివారెల్ల సిగ్గుపడుదురు. కావున నీకుఁ జాలును.
రక్షింపుమా. అపరాధి యని యాగ్రహింపకుమా. అత్రి యిట్లు
పలికెను. నాకీపుత్రుని నీవ యొసంగితివి. క్రోధియే యితఁ
డగు. సదా నీసేవకుఁడు. నీతేజస్సున నీలోకమున భయపడని
వస్తువేది కలదు? లక్ష్మి యిట్లు కోరెను. భగవానుఁడా!
బ్రాహ్మణుఁడు శరణాగతుఁ డయ్యెను. అపరాధము క్షమిం
పుము. ఇతనికొఱకై దేవతలు మునులు ప్రార్థించుచున్నవారు.
విప్రుని హింసింపరాదు కదా. కావునఁ బరిరక్షింపుము. భక్తిచే

సరస్వతి యిట్లు నుడివెను. దేవతలకు జనకుఁడవై సకలకామ ప్రదుఁడవై తగు నిన్నొక్కవరము గోరెద. సర్వజగన్నాథుఁడవు. కావున నందఱిని గాపాడుము. పార్షదు లిట్లు వాంఛించిరి. స్వామీ! నిన్ను స్మరించినంతనే సర్వమంగళము లొనఁగూడును. సకలాపదలు తొలంగును. శరణాగతుని నీతని బాలింపుమా. నర్తకు లిట్లు కోరిరి. దారిద్ర్యభంజనా! స్వామీ! మేమెల్ల నీకింకరులము. భిక్షుకులము. ఇపుడు మాకొక్కభిక్ష మిమ్ము. ద్విజపరిత్రాణమే యది. *

ఇట్లు వినుతించు భక్తాగ్రగణ్యులవినుతుల నాలకించి శరణాగతవత్సలుం డగునారాయణమూర్తి ప్రహాసభాసురముఖుండై యెల్లరు సంతోషించునట్లుగా నిట్లు వచించెను. దేవాధీశులారా! దేవతలారా! మునీంద్రులారా! నీతియుక్తమై సుఖావహమగు వాక్యమును వచించెద. ఆలకింపుఁడు. విప్రుని రక్షించెదను. మీయభిమతము కొనసాగించెద. ఇది ధ్రువము. ఒక్కమాట గలదు. దాని మీరనుసరింపవలయు. మీరెల్ల రీవైకుంఠమునుండి యంబరీషునియింటికిం బొండు. ఈవిప్రుఁ డారాజర్షికిఁ బ్రీతిగా నందుఁ బారణమొనర్పవలయు. ఈముని యతని యింటికిం బోయి యతిథియై నిర్దోషుఁడగు నాతని శపింపఁబూనెను. సుదర్శనము రక్షుఁడగు రాజును హననప్రయత్నము

* ఇఁకమీఁదికథ శ్రీభాగవతమునకు శ్రీకృష్ణజన్మఖండమునకు నించుక విరుద్ధముగాఁ గనుపట్టెడిని. కావున నీరెండింటిని సమరసము చేసి వ్రాయఁబడినదని యెఱుంగవలయు.

చేయు బ్రాహ్మణుని నెఱింగి యాతనికి శాంతి యొనరించెను. ఈముని యొకసంవత్సరమునుండి భీతుఁడై ముల్లోకములను దిరుగుచున్నవాఁడు. ఆరాజేంద్రుఁ డుపవసించి భార్యయు నుప వాసమున వెతలఁబడఁగా దుఃఖితుఁడై యున్నవాఁడు. నేనును భక్తుఁ డుపవాసమున నలఁగుటచే నుపవాసమున నున్నవాఁ డను. పాలుత్రాగుబాలకుఁ డాఁకలిగొనియుండఁ దల్లి భుజిం చునా. నాయాశీర్వచనమున నిప్పుడే యావిప్రుఁడు విగత జ్వరుం డగుఁగాక. మార్గమున నాచక్ర మీవిప్రుని బాధింప కుండును. నేనుగూడ నిశ్చింతుఁడనై భుజించి సుఖ ముండెద. * భక్తుఁ డొసఁగుద్రవ్య మేదియైన నమృతముగా భుజించి తృప్తినందుదు. లక్ష్మీదేవియొసఁగినవస్తువైన నంతప్రీతి నొసఁగఁ జాలదు. నాకు నిరంతరము భక్తుఁ డిచ్చిన పదార్థమే తృప్తినొ సంగ సమర్థమగును.

అని పలికి దుర్వాసుం గాంచి మునీంద్రా! [illegible] ప్రాజ్ఞా! వత్సా! రాజు నింటికిం బొమ్ము. దేవతలందఱు దేవ కాం తలు మునులు నిన్నుంగూడి చనుదెంతురు. అని పలికి శ్రీ[illegible]హ విష్ణువు సంతోషమున నంతఃపురమున కరిగెను. దేవతలందఱు ప్రహృష్టులై జగదీశ్వరునకు నమస్కరించి య[illegible] నృపునింటికిం బోయిరి. మునియు మనోగమనంబున [illegible] నింటికిం బోయెను. సూర్యకోటిప్రభాభాసురంబగు [illegible]

* భక్తదత్తం చ యద్వస్తు త్వా కృత్వా సు[illegible] చ యద్రివ్యం న చాహం భోక్తుమీశ్వరః, వినా భక్తప్రదా[illegible] తృప్తిం

మునివెంట భగవదాజ్ఞను శిరమునఁ దాల్చి బాధింపకుండఁ బోయెను. [1]అట రాజు సంవత్సరకాల ముపవాసముండి శుష్కకంఠోష్ఠతాలుఁడై రాజ్యపాలనమును మఱువక సింహాసనముననుండి మునిరాకం గని వెనుకొనివచ్చు సుదర్శనమును జూచి ససంభ్రముఁడై లేచి సాదరముగా వలగొని నమస్కరించి కూరుచుండఁ జేసెను. మునివార్త యెఱింగెను. [2]మునియు భగవంతునిమాటలవలన నంబరీషుఁడు భగవద్భక్తాగ్రేసరుఁడని తెలిసికొని రాజేంద్రా! నీవు సుకృతి వని పలికి నమస్కరించెను. మునిపాదముల స్పృశించుటకు లజ్జించి శ్రీహరి చక్రము నిట్లు వినుతించెను. ఓసుదర్శనమా! నీవే యగ్నివి. భగవంతుఁడగు సూర్యుఁడవు నీవే. చంద్రుఁడవు, జలము నీవే. భూమియు, ఆకాశము, వాయువు, మాత్రేంద్రియములు (పంచ తన్మాత్రలు, ఇంద్రియములు)నీవే. ఓసుదర్శనా! నీకొఱకు నమస్కరించుచున్నాఁడను. వేయియంచులుగల భగవంతునియాయుధరాజమవు. భగవత్ప్రియసాధనమవు. సర్వాస్త్రములు నీతేజస్సునఁ జెడును. నీవే పృథివీపతివి. కాఁబట్టి యీవిప్రునకు

---

దాతుమీశ్వరః - అనిమూ. 1 ఉపోష్య వత్సరం రాజా శుష్కకంఠోష్ఠతాలుకః-అని మూ.

2 ఈభాగము శ్రీభాగవతమునుండి వ్రాయఁబడిన దని యెఱుంగవలయును. ఇది పైకథకించుకవిరుద్ధముగాఁ గనుపట్టెడు. ఐనను బురాణభేదమగుట నాయపరాధ మిందేదియుం లేదు. దుర్వాసుఁ డరుదెంచి యంబరీషుని పాదములపైఁ బడినట్లు కన్పట్టెడి.

మేలు చేకూర్పుము. ధర్మము, ధైర్యము, సత్యము, యజ్ఞము నీవే. యజ్ఞకర్తవు నీవే. లోకపాలురు నీవే. సర్వాత్మకుఁడవు నీవు. తేజస్సు, పౌరుషము నీవే ఓసునాభా! అఖిలధర్మసేతుస్వరూపా! అధర్మశీలాసురధూమకేతూ! నీవు త్రైలోక్యరక్షకుఁడవు. విశుద్ధతేజస్కుఁడవు. మనోజవుఁడవు. అద్భుతకర్మముల నొనరించువాఁడవు. ఇట్టినీకు వందనము లొనరించెదను. ధర్మమయమగు నీతేజస్సుచేఁ దమస్సు నశించును. మహాత్ములకుఁ బ్రకాశము నొసంగువాఁడవు నీవేకదా! వాక్పతీ! నీమహిమము దురత్యయము. సదసత్తులనఁబడునవి నీరూపములే. పరాత్పరుఁడవు నీవే. భగవంతుఁడు నిన్నుఁ బ్రయోగింపఁగా జయింపశక్యము గాని దైత్యదానవులబలమునుబ్రవేశించి బాహూదరప్రభృత్యంగముల విదళించి విజయమునొంది ప్రకాశించువాఁడవు.

ఈఘట్టమున,

ఆ. కలఁగి నిద్ర పోవఁ ♦ గలలోన వచ్చిన
 నిన్నుఁ జూచి దీర్ఘ ♦ నిద్ర పోదు
 రసురవరులు శయ్య ♦ లందున్న సతులు ప్ర
 భాతమందు లేచి ♦ పలవరింప.

అనుపద్యమును బోతనగారు వ్రాసిరి. మూలము కనఁబడదు గాని "ఖలప్రహాణయేనిరూపితః" అన్నముక్కను బ్రధానము చేసికొని చమత్కృతిగా వ్రాసిరని తోఁచెడిని.

ఓజగత్ప్రాణమా! చక్రమా! గదాభృత్తగు భగవంతుఁడు నిన్ను దుష్టసంహారముకొఱకు నియోగించును. నీహా

దుష్టుల సంహరింతువు. నాకులదైవ మగు నీబ్రాహ్మణో త్త
మునకు శుభముల నొసంగుము. అదియే నాయందను గ్రహము
నీవు చూపినట్లు భావింతును. అని వినుతించి కరయుగ్మము
జోడించి నేను విహితధర్మమునఁ బ్రవర్తింతునేని ఇష్టవస్తువుల
నిత్తునేని మాకులదైవము బ్రాహ్మణుఁ డౌట యథార్థమేని
ఈమహాముని విజ్వరుఁ డగును గాక. అద్వితీయుఁడై సర్వగుణా
శ్రయుఁ డగు శ్రీహరి సర్వభూతాత్మభావమున నాకుం బ్రస
న్నుం డగునేని ఈవిప్రుఁడు విగతపీడుఁ డగుఁగాక. అని యిట్లు
వినుతించిన విష్ణుచక్ర మగు సుదర్శనము విప్రునివిషయమున
నోర్పు గలిగి రాజప్రార్థన మంగీకరించి యామునిని బాధింపక
తొలఁగెను. చక్రసముజ్వలత్తేజఃపరితాపము మానఁగనే దుర్వా
సుఁడు సేదదేఱి రాజేంద్రుఁడగు నంబరీషుని బరమాశిషంబుల
నలరించుచు నిట్లు పలికెను.

ఓహో! శ్రీహరిదాసులమాహాత్మ్య మిపుడు తెలిసికొంటిని.
భక్తవర్యా! రాజేంద్రా! కృతాపరాధుఁడనగు నాకు శుభము
లొసంగఁ జక్రమును బ్రార్థించితివి. రాజా! సాధువులగు
మీవంటివారికిఁ జేయ శక్యముకానిపని లేదు. త్యజింపఁదగని
పదార్థముకూడ లేదు. సకలదేవాధీశుఁడగు హరి మీవంటి
భక్తులచే వశపఱచుకొనఁబడియెఁ గదా! ఏభగవంతుని నామస్మ
రణమాత్రమునఁ బురుషుఁడు నిర్మలుఁ డగునో, అట్టి పరమ
పవిత్రపాదుఁడగు భగవంతుని సేవించు మీవంటి భక్తుల కేవిష
యమునఁ గొదువ యుండును? మహారాజా! నీచే ననుగ్రహింపఁ

బడితిని. కరుణాస్వరూపము నీహృదయమని తెలిసికొంటిని. నాయపరాధమును మఱచి నాప్రాణములు నీచే రక్షింపఁ బడియెఁ గదా. పాఠకులారా!

ఈఘట్టమునందు శ్రీభాగవతమున,

శ్లో. యన్నామశ్రుతిమాత్రేణ పుమాన్ భవతి నిర్మలః,
తస్య తీర్థపదః కింవా దాసానామవశిష్యతే.

అనుమూలమునకు శ్రీపోతనమహాకవిచంద్రుఁడు,

మ. ఒకమా ఱెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్
సకలాఘంబులుఁ బల్లటిల్లి తొలఁగున్ సంభ్రాంతితో నట్టిస
త్సుకరున్ మంగళతీర్థపాదు హరి విష్ణున్ దేవదేవేశునిన్
అకలంకస్థితిఁగొల్చుభక్తులకు లే దడ్డంబు రాజాగ్రణీ.

అను పద్యమును వ్రాసి తన సర్వతోముఖపాండిత్యమును జూపిరి. భక్తిరసమును వెల్లడించిరి. మూలార్థమునకు మెఱుఁగు పెట్టిరి. భక్తి యెట్లు కుదురవచ్చునో అట్టియుపదేశమును "ఒకమాఱెవ్వనిపేరు కర్ణములలో నొయ్యారమై సోఁకినన్" అన్నముక్కచే ననువదించిరి. మహాకవీ! నీకిదె నమస్కారము! భగవంతునినామమువలె నీనామము నావంటి పామరులకు సంస్మరణీయము.

అవ్వలికథ నాలకింపుఁడు. ఇది శ్రీకృష్ణజన్మఖండమున విచిత్రముగా ననువదింపఁబడినది. తద్విధమాదృతిమై నాలకింపుఁడు. భక్తిరసప్రవాహమున మీమానసములు మునుఁగ వలయుఁ జూఁడీ. అపుడుగాని యీకథామృతము మీకుఁ దృప్తి

నింపఁగలుగదు. కథయందలి యవాంతరవిషయములఁ దడవ కుఁడు. అది సాధుసమ్మతము కాదు.

అంబరీషుం డిట్లు మునిని సత్కరించి మృష్టాన్నమును భుజింపఁబెట్టి యాదరించెను. మునియుఁ దనయజ్ఞానమున కించుక లజ్జించుచుండియు భగవదాజ్ఞంజేసి లబ్ధజ్ఞానుండై సంతుష్టిమై భుజించెను. పిదప మహానందపరవశుఁడై పరమాశిషముల రాజున కొసంగెను. వీడుకోలు తాఁబడయఁగోరి రాజేంద్రా!

శా. కంటిన్ నేఁటికి నిన్ను నీవచనముల్ కర్ణద్వయిం బ్రీతిగా
వింటిన్నన్నముఁగొంటినీగృహమునన్ వేడ్కన్ ఫలం బబ్బె నే
మంటిం బోయెద నీచరిత్ర మమరుల్ మర్త్యుల్ సుఖాసీనులై
మింటన్ మేదిని సన్నుతింపఁగల రీమీఁదన్ నరేంద్రాగ్రణీ!

శ్లో. ప్రీతోఽస్మ్యనుగృహీతోఽస్మి తవ భాగవతస్య వై,
దర్శనస్పర్శనాలాపై రాతిథ్యేనాత్మ మేధసా. ౨౦
కర్మావదాత మేతత్తే స్వర్గాయంతి స్త్రియో ముహుః,
కీర్తిం పరమపుణ్యాం చ కీర్తయిష్యతి భూరియమ్. ౨౧

శ్రీ భాగవతము.

అని పలికి తనయిచ్ఛమెయిం బోవుచు మార్గమధ్యమున విస్మయాకులమానసుఁడై ఓహో! విష్ణుభక్తుల మాహాత్మ్యము నెఱుంగుట సామాన్యముగాదు. అది దురవగాహమైనది. ఇఁక విష్ణుభక్తులజోలికిఁ బోరాదు. నాకు బుద్ధిగల్గినది. అంబరీషునివంటి సుకృతి యీక్షితి కనఁబడఁడు అని యూహించుచుఁ దనయాశ్రమమునకుం బోయెను.

మహనీయమతులారా! భక్తవరులారా! దుర్వాసుని యితిహాసమును వింటిరికదా. ఇందనేకవిషయములు గ్రహింపఁదగినవి కలవు. నీతులఁ దెలిసికొనుటయే ప్రధానము. అవియే మనల నుద్ధరించును. ఊరక కథను జదివి పుస్తకము దాఁచి పెట్టుటవలన నేలాభము కలుగఁబోదు. అందు నేవిషయము మనము తరింప ననువదింపఁబడినదియో ఏయుద్దేశమున మహాత్ము లీకథను వ్రాసిరో యని యూహింపవలయును.

'కథాచ్ఛలేన బాలానాం నీతి స్తదిహ కథ్యతే.'

యనుసూక్తి మీ రెఱుంగనిది కాదు. భగవచ్చరిత్రపఠనము నిష్ఫలమా యని ప్రశ్నింపఁ బూనకుఁడు. అది సాధుమార్గము కాదు. భగవన్నామస్మరణమువలె భగవచ్చరిత్రము ఫలప్రదమే. కాదనువాఁడు నాస్తికుఁడే. పారాయణముమాత్రమే చాల దనియుఁ దదంతర్గతవిషయమును గ్రహించి దానిరీతి నాచరించినఁగాని భగవత్కటాక్షము కలుగదనియు, భగవత్కటాక్షము కల్గినఁగాని ముక్తి లేదనియు నాభావమని మనవిచేసితిని. ఇఁక నిందలిసారము నాలకింపుఁడు.

తొలుత నౌర్వముని పుత్రికావియోగమునకు దుఃఖించెను. ఎట్లో దానిని వదలించుకొని తప మొనరించుచుండెను. దుర్వాసుఁ డాభార్యంగూడి సుఖించుచుండెను. ముని సంసారార్ణవమును మునుంగవలయునని భగవదిచ్ఛ కాదు. కావునఁ దద్భార్య కందలి భర్తతో నెదురాడుచు వచ్చెను. పాపమా మునిపతి యెంతయు నోర్చుట కలవాటుపడియెను. క్షణమాత్ర

మునఁ గోపమును వహించువాఁడు కదా దుర్వాసుఁడు. అటు లయ్యును భార్యామోహమున నించుకంతయేనియుఁ గోప మూనక విసుగుచెందక యేమియు బదులుపలుకక యోర్చుకొని యుండెను. కాని యీతని యోర్పెంతగలదో పరీక్షింతమని కాఁబోలు కందలి మఱింతపట్టుదలతోఁ భర్తతోఁ గలహించు చుండెను. అంతశ్శత్రువిజయము కదా విజయమనఁబడు. అది సామాన్యకార్యమా! ఎంత యోర్చుకొన్నను విరామము లేక కలహించుచుండ నమ్ముని యేమిచేయం గలండు? క్రోధమునకు లోఁబడియెను. ఓర్పును క్రోధ మడఁగఁద్రొక్కెను. ముని సర్వాంగములయం దది వ్యాపించెను. అట్టితటి భగవదిచ్ఛచేఁ గందలి మఱింత కలహింపసాగెను. ఎప్పుడెప్పుడాగ్రహమును వెడలఁగ్రక్కుదమా యన్నముని కవకాశము దొరకెను. క్రోధ పరవశుఁడై శపించెను. కాని,

శ్లో. క్షమాశస్త్రం కరే యస్య దుర్జనః కిం కరిష్యతి,
అతృణాత్పతితో వహ్నిస్స్వయమేవోపశామ్యతే.

అన్న నీతిని గ్రహింపఁజాలకపోయెను. మునితపఃఫలముగా నా కందలి శాపానలదగ్ధదేహ యయ్యెను. అంతటితో మునికష్టము తొలఁగినదా. లేదు. జీవుఁడు కందలిమాటలుగా దుర్వాసునకు నీతి నుపదేశించెను. ఆవిషయము ముందే వ్రాయఁబడియెఁ గదా. అంతటితో నీకథ ముగిసిన లాభములేదు. భగవదిచ్ఛ నెఱవేఱవలదా. కందలివస్త్రము వాయువశమునఁ దండ్రియగు నౌర్వముని తపమొనరించు నదీతీరమునఁ బడియెను. ఇది జరగి

యుండునా యని సందేహింపకుఁడు. ఈశ్వరేచ్ఛచే నోడలు బెండ్లగును. బెండ్లోడలగును. సముద్రమున మంట లెగయుట వినలేదా. భూమి యాకస్మికముగఁ గ్రుంగుట, క్రొత్తభూమి కనఁబడుట మన మెఱుఁగమా. దీనికంతటికిఁ గారణము భగవ దిచ్ఛయే గానివేఱొకటికాదు. అవ్వల నౌర్వమహాముని దుఃఖ పరవశుఁడై దుర్వాసుఁ డున్నచోటికింబోయిపుత్రికాప్రేమమునఁ గందళీయని పిలిచెను. ఓయనిపలుకుకందళియం దెందుఁ గలదు? కందళి యిపు డీలోకమున లేదు. వేఱొకశాఖను మఱియొక రూపమున నున్నది. ఆపిలుపునకు దుర్వాసుఁ డరుదెంచి జరగిన విధమును దాఁపక తెల్పెను. ఔర్వమహర్షి యాగ్రహపరవశుఁ డయ్యెను. ఒక్కయపరాధమునకై పెక్కుగుణములు గలిగిననా కుమారిక నిట్టిఘోరశాపాగ్నికాహుతిగఁ జేసితివి కదా. ఇది న్యాయమా యని హెచ్చరించెను. ఈ హెచ్చరికమాత్ర మాత నికి బుద్ధిగలిగింప వలంతిగాదు. కావున నౌర్వముని యిట్లు బెట్టి దపుఁగ్రోధమున న్యాయము విచారింపక శపించితివి కాన నీకుఁ బరాభవము బాగుగాఁ గల్గఁగలదని శపించి తనదారిం బోయెను. ఈకథనుండి క్రోధము పరమదారుణశత్రువనియు దానికి లోఁబడకున్నవాఁడే ధన్యుఁడనియు, లోఁబడిన దుష్ఫల మనుభవింపక తప్పదనియు నెంతవాఁడైన నాదుష్ఫలమును మార్పఁజాలఁడనియు గ్రహింపవలయును. ఇంతియకాక యెం తటిమునీంద్రులైనను నిరీహులైనను ఒకప్పుడైన దేహసం బంధమును వదల శక్తులు కారనియు నది లేకుండువాఁ డీలోక

మున లేఁడనియు నట్టిదేహదుఃఖములు కలిగినపు డందే మదిని నిల్పక జ్ఞానులు క్షణకాలమున వివేకమును గాంతురనియు, అట్లే హద్దుమీఱి దేహతాపములంటగా వానిని మరలమరల స్మరింపక మఱచి తద్బాధ లంటకుండ మెలంగవలయుననియు, దానికి నౌర్వు నుదాహరణముగా గ్రహింపవలయుననియు నేర్చుకొనఁదగినవిషయములు.

శ్లో. సక్తాః కర్మణ్యవిద్వాంసో యథా కుర్వంతి భారత,
కుర్యాద్విద్వాం స్తథాసక్త శ్చికీర్షుర్లోకసంగ్రహమ్.
శ్రీభగవద్గీత. ౧ అ. ౨౫ శ్లో.

అను భగవద్వాక్యము పైవిషయమును దెలుపుచున్నయది.

"జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్"
అనుగీతోక్తియు నిట నుదాహరణమే యగు.

దుర్వాసుఁ డిట్టులు తనక్రోధమునకుఁ బ్రతిఫలముగా శాపమును గాంచెను. కాని శాపఫలము ననుభవింపక తప్పించుకొనఁజాలఁడు కదా. ఆఫల మనుభవించుటకే యంబరీషునికడ కేగెను.

అంబరీషుఁడు రాజచంద్రుఁడు. భక్తవర్యుఁడు. అహంకారశూన్యుఁడు. ఇంద్రియములఁ జక్కఁగా జయించినప్రోడ. పక్షపాతవిరహితుఁడై రాజ్య మేలుచుండువాఁడు. మహారాజ్యరమాధురంధరుఁ డయ్యును నియమములకు లోఁబడి దేవతాపూజ నొనరించువాఁడు. ఉపవాసము లేల యనునాస్తికాభాసులవలెఁ గాక విధుల ననుసరించి యుపవసించి భగవత్పూజ

నొనరించువాఁడు. ఏకాదశి యుపవసించి ద్వాదశిపారణ నొన రింపఁ బూనెను. వసిష్ఠుఁడు కులగురువు. భగవత్పూజ చేసి బ్రాహ్మణులకు భోజనము పెట్టి వెనుకఁ దా భుజింపఁ బూనెను. అతిథిభోజనము ప్రధానముగా భావించి దానఁ బుణ్యము లభించునని యారాజర్షి నమ్మెను. అతిథులకంటె ముందుగా భుజించుటగాని, వారితోఁటి భుజించుటగాని యాకాలమున నాచారము లేదని దీనినుండి గ్రహింపవలయును.

శ్లో. అదత్వా తు య ఏతేభ్యః పూర్వం భుంక్తే విచక్షణః,
స భుంజానో న జానాతి శ్వగృధ్రైర్జగ్ధిమాత్మనః. ౧౧౫
భుక్తవత్స్వథ విప్రేషు స్వేషు భృత్యేషు చైవ హి,
భుంజీయతాం తతః పశ్చాదవశిష్టం తు జంపతీ. ౧౧౬
దేవానృషీన్ మనుష్యాంశ్చ పితౄన్ గృహ్యాశ్చ దేవతాః,
పూజయిత్వా తతః పశ్చాద్గృహస్థశ్శేషభుగ్భవేత్. ౧౧౭
మనుస్మృతి. 3 అధ్యా.

ఆర్యులారా! అతిథిపూజన మెంతవిశేషమో పైస్మృతివా క్కులనుండి కనుఁగొనవచ్చును. పూర్వకాలమున నతిథిపూజయే ప్రధానముగా భావింపఁబడుచుండెను. అది యిక్కాలమునఁ బ్రధానముగా నెన్నఁబడుచున్నదియా? కాలమెంతటిమార్పులఁ దెలుపుచున్నదో పరికింపుఁడు. అతిథులు భృత్యులు భుజించిన పిదప గృహస్థుఁడు శేషభుక్కు కావలయునని స్మృతి హెచ్చరించు చున్నది. ఈయాచారమే యంబరీషుఁ డనుసరించెను.

భగవంతుఁడు భక్తులమనశ్శుద్ధిని బరీక్షించుచుండును. మనశ్శుద్ధి యిక్కట్టుతఱిఁగాని కనఁబడదు.

"హేమ్నస్సంలక్ష్యతే హ్యగ్నౌ విశుద్ధిశ్శ్యామికాపి వా."
అన్న కాళిదాసోక్తి సత్యదూరము కాదు కదా. అంబరీషుని యోర్పును పరీక్షించుట కిదియ యదనని భగవంతుఁ డూహించెను. బ్రాహ్మణభోజనము పూర్తియయ్యెను. అతిథిపూజ విధి రీతి నొనరించి యుచితాసనమున నున్నమునిని భోజనమున కీయకొలిపెను. ద్వాదశిముహూర్తావశిష్టముగ నున్నయది. దయ చేయవలయునని ప్రార్థించెను. మునియు రాజా! ఇదె యరు దెంచుచున్నవాఁడ. క్షణ మాఁగుము. స్నానమొనరించి వచ్చెద నని పల్కి స్నానమునకుఁ బోయెను. కాని యిపుడే దైవము పరీక్షించుతఱి. ముని నదిఁ గ్రుంకి భగవంతుని ధ్యానించుచుం డెను. ఆధ్యానమున నిరతుఁడై రాజుమాట మఱచెను. రాజు ద్వాదశిఘటికలలో భుజింపకున్న మహాపాపమని యెఱింగెను. వసిష్ఠుననుమితి భగవత్పాదోదకమును బుచ్చుకొని వేచియుం డెను.

మునియు వచ్చెను. తన్నుఁ దృణీకరించి పారణచేసెనని యూహించెను. "గృహస్థశ్చైవ భగ్నో భవేత్" అన్నస్మృతిని మీఱెఁ గదా యని నిశ్చయించెను. ఇట్టి యవివేకిని క్షమింపరాదని యాగ్రహమును సమాశ్రయించెను. భగవదిచ్ఛచే నతనికోపము వృద్ధినొందెను. పారణ చేయకుండిన నేకాదశీవ్రతఫలము తొలుమా అగునన్నస్మృతివచన మాతరుణమున నామునికి

గోచరింపలేదు. అదియు నీశ్వరేచ్ఛయే గాని మునిసమ్మతము కాదని నమ్మవలయును. ఈయాట విధిచేయించినది కాని వేఱు కాదు. ద్వాదశీనియమము మునికిఁ దెలియ దనవచ్చునా. జల పారణ శాస్త్రవిహితము కాదనవచ్చునా. వసిష్ఠముని విధినిమిాఱి చెప్పె ననవచ్చునా. రాజు మునియందు భక్తివిశ్వాసములు లేనివాఁ డనవచ్చునా. ఇందేయూహయు సరికాదు. ఇన్నివిధ ములఁ బరీక్షించువాఁడు భగవంతుఁడు. ఈపరీక్షవలన మూఁడు ఫలము లున్నవని గ్రహింపుఁడు. రాజు వ్రతనియమమును బరి క్షించుట యొకటి. మునికి శాపఫల మనుభవమునకు వచ్చునట్లు చేయుట యొకటి. లోకుల కిట్టిగుణపాఠము చెప్పి భగవద్భక్తిని గల్గించుటయొకటి. ఈమూఁడును దీనిఫలములు. కావుననే ముని యొడలుమఱచి జటపెఱికి నేలపైఁ గొట్టెను. దాన నొకపురు షుఁడు ఖడ్గహస్తుఁడై యుదయించి రాజుం జంపఁబోయెను.

పాఠకులారా! ఈఘట్టమున శ్రీభాగవతమునందు,

తయాపనిర్మమే తస్మై కృత్యాం కాలానలోపమాం
తామాపతంతీం జ్వలతీమసిహస్తాం పదా భువం,
వేపయంతీం సముద్వీక్ష్య న చచాల పదా నృపః. ॥ శ్లో.

అనుశ్లోకములు కనుపట్టెడిని. శ్రీకృష్ణజన్మఖండమున,

శ్లో. తతస్సముత్థితశ్శీఘ్రం పురుషోఽగ్నిశిఖోపమః,
ఖడ్గహస్తో మహాభీమో రాజేంద్రం హంతుముద్యతః.

అనుశ్లోకము కనుపట్టెడు. భాగవతమునందు శక్తియుదయించె నని శ్రీకృష్ణజన్మఖండమున నొకపురుషుఁ డుదయించెననియు

భేదముగాఁ జెప్పఁబడు టేల యని ప్రశ్నింపవచ్చును. క్రూర కార్యముల కాభిచారికకృత్యము లనిపేరు. పరహింసాకర కృత్యము లన్నియుఁ బై పేరుననే వ్యవహరింపఁబడుచుండును. పుంస్త్రీలింగభేదమే గాని విషయభేదము లేదు. కృత్యమునం దును భేదము లేదు. దైవతమన్నను దేవతయన్న నెట్లు భేదములేదో యిచ్చట నట్లే గ్రహింపవచ్చును. శబ్దభేదమున దోషము నాపాదింపరాదు. విషయపరిగ్రహణమే ప్రధా నము.

దుర్వాసునిక్రోధము రాజును వధింపఁబూనెను. కాని భగవదాజ్ఞయే చక్రరూపమున నందున్నది.

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,

తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం.

అన్న భగవదుక్తి నెవ్వారుగాని మఱువరాదు. ఆసూక్తిని భగ వంతుఁ డెపుడుగాని మఱువఁడు. కావున రాజు నక్రమపద్ధతిం బూని వధింపవచ్చు మునిక్రోధరూపభయంకరశక్తి నడంచి రక్షింపఁదలంచెను. అంతలో భగవచ్చక్రము సూర్యకోటిప్రభా భాసమానమై మునిక్రోధమును దహించి మునివెంటఁబడియె. అది తన్నుఁ జంపుననియే మునితలంచి పరుగిడసాగెను. కాని చక్ర మామునిని నిమేషమాత్రమున దహింపఁజాలక పోయి నదియా. శ్రీహరియుద్దేశ మది కాదు. గుణపాఠము నేర్పవలయు ననియే కావున నాతనివెంటఁ బడెను. దేహము స్పృశింపలేదు. తేజస్సుచే నాతని దహింప లేదు. దహించునన్నభీతి యాతని

మదిని బుట్టించుచుఁ గూడఁబరుగిడెను. ముని బ్రహ్మలోకమున కుం బోయెను. విష్ణుచక్రముబాధను బ్రహ్మ యాపఁగలఁడా లేఁడా యన్నయూహ మునికి లేదని చెప్ప వీలులేదు.

"ప్రాయస్సమాపన్నవిపత్తికాలే
ధియోఽపి పుంసాం మలినా భవంతి."

అన్నసూక్తిని లోకులకు నేర్పుటకే భగవంతుఁడా మునికిఁగలుగకయుండ మాయచే నాచ్ఛాదించెను. కాఁబట్టి బ్రహ్మకడకుం బోయి విష్ణుచక్రము నన్నేఁచకుండఁ గావుమా యని మొఱ్ఱపెట్టుకొనియెను. ఏమియుఁ దెలియనట్లు లావిరించి యుచితోక్తులాడి సాగనంపెను. శంకరుం గానంబోయి తనబాధలను జెప్పుకొని ముని యంగలార్చెను. శంకరుఁ దేవేవో తత్వము లుపదేశించి బుద్ధిచెప్పెను. కాని మునిభీతిఁ బాపకుండుట న్యాయము కాదని తలంచి తపస్సుమీఁద నొట్టుపెట్టి చక్రబాధలేకుండుఁ గాక యని యాశీర్వదించెను. ఆయాశీర్వాదము ఫలించెను. కాని చక్రబాధ బొత్తుగా పోయినది కాదు. విష్ణువుకడకే పొమ్మనుశంకరు నభిప్రాయానుసారము ముని శ్రీమహావిష్ణుకడకుం బోయెను. బహువిధంబుల వినుతించెను. ఆనుతికి భగవంతుని చిత్తము కరఁగెను. కాని తాఁజెప్పఁదలంచు కొన్నగుణపాఠము పూర్తికానందున భక్తులవశుండనే నను భావమును బహువిధములఁ దెల్పెను. చక్రము నిన్ను బాధింపకుండుఁగాత మని యూఱడిల్లఁ బలికెను. దుర్వాసునిం గాపాడుమని శంకరాదులు పెక్కువిధములఁ బ్రార్థించిరి. ఎంత తెన్ని

విధముల వేఁడినను భక్తపరాధీనుఁడు కాన నంబరీషునియాఁకలి నెఱుంగును గాన నతనియొద్దకే పొమ్మనియెను. ఈఘట్టమున భగవంతునిమాటలు శ్రుతిసారములు. ఆపల్కులే మనము నేర్చుకొనఁదగినవి. సాధువులకుఁ దాఁజిక్కియున్న వాఁడననియేఁ గదా. దీనిభావ మేమి? సాధువులకుం దప్ప డాంబికులకుఁ దా లోఁబడనని కదా దానిసారము. భక్తి లేక లోకమును మోహింపఁజేయుపొంటె స్తోత్రములఁ బఠించిన లాభము లేదు. పూజించిన లాభము లేదు. ధ్యానము నభినయించిన లాభము లేదు. ఉపవాసములున్న లాభము లేదు. భగవంతుని గాంచుట కుపాయము నిర్మలభక్తి. అది డాంబికము కాఁగూడదు. లోకమును వంచించునది కాఁగూడదు. స్వార్థపరము కాఁగూడదు. కేవలనిర్మలమై, భగవత్ప్రీతికరమైనదియే కావలయును. వేఱు మార్గమైన నది నిష్ఫలమగుటమాత్రము కాదు. దుష్ఫలము నొసంగునదియు నగు. ఇదియే యాభగవద్వాక్యసారము. సాధువు లొసంగినపదార్థమె నాకుఁ బ్రియము. దాని భక్షించెదను. ఇతరు లొసంగిన దెట్టిదైనను నేఁ బరిగ్రహింపను. అనునది భగవంతుని రెండవవాక్యము. దీనిసార మేమి? భక్తిపూర్వకముగా నొసంగినపదార్థము స్వల్పమైనను మేరుతుల్య మగును. డాంబికమగుభక్తిఁ గనఁబఱచుచు నొసంగినది మేరువంతపదార్థమైనను నిరర్థకము అని దీనిసారము కదా. అనఁగా భక్తుఁడు తనకుఁ గల మేలిపదార్థమును భగవత్సమర్పణ మొనరించును. భగవంతున కొసఁగి పిదపఁ దానే యనుభవించును. దానిచే

భగవంతుఁడు సంతృప్తుఁ డగును. కొందఱు తమకుం గల యైశ్వర్యగర్వమున ననేకవిధభక్ష్యవస్తువుల సిద్ధము చేయించి దేవునకర్పింతురు. కాని వారికి భక్తియుండదు. భక్తిగుణము కూడఁ దమకుఁ గలదని లోకు లెఱుంగవలయునని వారికోరిక. కాన నాపదార్థములు భగవత్ప్రీతికరములు గావు. సాధారణముగా మనయిండ్లయందు వ్రతములు చేయుట చూచుచున్నారము. పిండివంటలతోఁ గాలము గడపుట. దేవతాపూజావసరమునఁ ద్వరపడుట వాడుక. అట్టివారికిఁ దిండిపైన ప్రీతియేగాని భగవంతునియందుఁ దక్కువ. ఆపేర భుజించుటయే వారికోరిక. అంతతో నీకార్యము ముగియలేదు. పదిమందిలోఁ దమయింట తొమ్మిదివిధముల భక్ష్యములు చేసి రని చెప్పుకొనుట యింకొక యాచారము. అదెంతమాత్రము భగవత్ప్రీతికరము కాదు.

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృతమశ్నామి ప్రయతాత్మనః.

శ్రీభాగ. ౧౦. స్కం. ౮౧ అధ్యా. ౪శ్లో.

అణ్వప్యుపహృతం భక్తైః ప్రేమ్ణా భూర్యేవ మే భవేత్,
భూర్యప్యభక్తోపహృతం న మే తోషాయ కల్పతే. ౩ శ్లో.

క. దళమైనఁ బుష్పమైనను
ఫలమైనను సలిలమైనఁ బాయనిభక్తిఁ
గొలిచినజను లర్పించిన
నెలమిఁ గొని రుచిరాన్నముగనె యేను భుజింతుఁ.

అన్న భాగవతోక్తి పై సిద్ధాంతమును దృఢపఱచుచున్నది. భక్తులు నాహృదయమును వశపఱచుకొనిరనువాక్యము మూఁడవది. ఎవఁడు నన్నే నమ్మి యున్నవాఁడో వాఁడే నాహృదయమున నుండువాఁడని దీని భావము. మదినిలుకడలేక చూఁచిన పాషాణమునకెల్ల మ్రొక్కుచుండువాఁడు కృతకృత్యుఁడు కాఁజాలఁడనియు, నట్టిచంచలాత్మున కేనాటికైన నాయనుగ్రహము కలుగదనియు దీనిసారము. భగవంతుని సర్వదేవతాస్వరూపునిగాఁ దలంచి యేవిగ్రహమును జూఁచినను ఈరూపముగా నాభగవంతుఁడు కనఁబడుచున్నవాఁడని యెవ్వఁడు భావించునో వాఁడు సమదర్శనుఁ డనంబడును. అట్టివాఁడే భగవంతుని భక్తుఁడు. ఆతఁడే కృతకృత్యుఁ డని దీనితాత్పర్యము.

శ్లో. సర్వభూతస్థమాత్మానం సర్వభూతాని చాత్మని,
ఈక్షతే యోగయుక్తాత్మా సర్వత్ర సమదర్శనః. ౨౯
యో మాం పశ్యతి సర్వత్ర సర్వం చ మయి పశ్యతి,
తస్యాహం న ప్రణశ్యామి న చ మే న ప్రణశ్యతి. ౩౦
సర్వభూతస్థితం యో మాం భజత్యేకత్వమాస్థితః,
సర్వథా వర్తమానోఽపి స యోగీ మయి వర్తతే. ౩౧

భగవద్గీత. ౬ అధ్యా.

ఈవాక్యములు పైభావమును సిద్ధాంతము చేయుచున్నవి.

మహామతులారా! ఇట్లు భగవంతుఁ డన్నివిధముల నామునికి బుద్ధిగఱపెనుగాని అభిమానమును బోఁగొట్టఁదలఁచి భక్తుఁడగునంబరీషునికడకే పొమ్ము. ఆతఁ డుపవసించి యున్న

వాఁడు. ఒక్కసంవత్సర మయినది. నీవు భుజించినఁ గాని యతఁడు భుజింపఁడు. అతఁడు తృప్తిఁబొందినఁ గాని నాకుఁ దృప్తి కలుగదు. అని హితము గఱపి పంపెను. అంబరీషుఁ డొకసంవత్సర ముపవసించి యుండఁ గలఁడా యని మాత్రము ప్రశ్నింపకుఁడు. అది చేయఁదగినప్రశ్నము కాదు. ఏలయన నీకాలమున మానవులయలవాటులను బురస్కరించుకొని పూర్వుల యలవాటు లిట్లేయుండునని యూహించుట పాడి గాదు. ఈకాలమున యోగము నుపన్యసించువారే పెక్కు మంది కలరు. ఆకాలమున యోగము నభ్యసించినవారు పెక్కు మంది యుండిరి. యోగము నభ్యసించినఁగాని మనస్సు నిచం చలముగా నుండదని పూర్వులభావము. యోగమున నాలుగు మాటలు తెలిసియున్నఁ జాలునని యిప్పటివారిలోఁ గొందఱి మతము. కావున యోగమహిమ మపారమని తెలియనివారే ప్రశ్నింతురు. యోగమున వాయునిరోధము చేయవచ్చును. లంబికాదియోగము లట్టివే. దానిచే నెంతకాలమైనను క్షతిలేక యుండవచ్చును. అవయవములు యథాపూర్వకముగా నెంత కాలమైన నుండును. సడలవు. బలహీనములు కావు. కాఁబట్టి యోగియగు నంబరీషుఁ డొకసంవత్సర ముపవసించె నన్న నిం దులో విచిత్రవార్త యేదియు లేదు. ఎన్నియో వత్సరము లుపవసించియుండఁగల యోగశక్తిగలవారల కిదొక తుచ్ఛ కార్యము. భుక్తియే పరమపురుషార్థమన్నవారు సాధించుపురు షార్థము లేదు గాన నట్టివారి కిది శక్యమా యని తోఁచునే

కాని యోగాభ్యాసమున నేమాత్రము శ్రద్ధయున్న నిదికష్ట కార్యముగాఁ దోఁపదు.

ఇట్లు శ్రీహరి పలుక ముని తనయభిమానము నశింప భగవదాజ్ఞఁగొని యంబరీషునికడ కరిగెను. రాజును మునిరాక కానందించి యథావిధి సత్కరించి భగవంతునిం బ్రార్థించి పంపెను. దీన మునికి గర్వపరిహారము, రాజునకు భక్తిపరత్వము, సామాన్యులకు భగవచ్ఛక్తిపరిజ్ఞానము కలిగినది. కావున నోమహాశయులారా! ఈగాథ పరమపావనమైనది శ్రీకృష్ణ మహిమమును దెల్పునది. ఇందలివిషయాంతరముల గ్రహించి వాని మది నిలుపుఁడు. ఆరీతిఁ బ్రవర్తింపఁ బ్రయత్నింపుఁడు. అదియే చేయఁదగినపని. ఇఁక నవ్వలికథ వినుఁడు. అది శ్రీకృష్ణ పరమాత్మప్రీతికర మైనది. శ్రీకృష్ణు నారాధించువ్రత మది యాట ముఖ్యముగా వినఁదగినది. భగవద్వ్రతరాజ మనఁదగు శ్రీకృష్ణజయంతీవ్రతము నీవఱకే పఠించియుంటిరి. ఇపుడట్టిదే యగు నేకాదశీవ్రతము నాలకింపుఁడు. శ్రీకృష్ణావతారతత్వ మున నీవ్రత మేలయని ప్రశ్నింపరను విశ్వాసము నాకుం గలదు. కాన సావధానులరు గండు.

ఏకాదశీవ్రత మహిమము.

* ఇట్లు అంబరీషునికథ విని నారదముని నారాయణ మూర్తిం జూచి దేవదేవా! ద్వాదశీలంఘనదోషమును విని

* ఇది శ్రీకృష్ణజన్మఖండము ఇరువదిఆఱవయధ్యాయమునుండి సంగ్రహీతమని తెలియఁదగు.

పించితిరి. దుర్వాసునకుఁ గల్గిన పరాభవమును వింటిని. శ్రీమహా విష్ణు భక్తవరుఁడగు నంబరీషుని గాపాడిన విధము వింటిని. ఇఁక సర్వజనవాంఛాప్రదమగు నేకాదశీవ్రతవిధానమును వినఁ గోరెదను. ఈవ్రతము వేదవిశ్రుతము. మతభేదముల నిశ్చితము గాకున్నయది. శ్రుతులకుం గూడఁ గారణమవగు నీముఖమునుండి వినవలతు. సాదరమున వచింపుమా యని ప్రార్థింప నారాయణమూర్తి యిట్లు పలికెను.

మునీంద్రా ! వినుము. ఈయేకాదశీవ్రతము దేవతలకుం గూడ దుర్లభము. శ్రీకృష్ణప్రీతి జనకము తపస్వులకుఁ దపస్సునకన్న శ్రేష్ఠము. దేవతలలో శ్రీకృష్ణుఁ డెట్టు లధికుఁడో * దేవులలోఁ బ్రకృతి యట్లధికురాలు. ఆశ్రమములలో బ్రాహ్మణుఁడును, విష్ణుభక్తులలో శంకరుఁడును, పూజ్యులలో గణేశుఁడును, పండితులలో శారదాదేవియు, శాస్త్రములలో వేదములు, తీర్థములలో జాహ్నవియు, తైజసములలో స్వర్ణము, జీవులలో వైష్ణవులు,ధనములలో విద్యయు, సంగులలోఁ బ్రియురాలును, ప్రమథులలో రుద్రుఁడును, శ్రేయస్సులలో మతియు, ఇంద్రియములలో నాత్మయు, చంచలపదార్థములలో మనస్సును, గురుస్త్రీలలోఁ దల్లియు, బంధువులలోఁ బతియు, బలిష్ఠులలో దైవమును, లెక్కింపఁదగినవానిలోఁ గాలమును, మిత్రులలో సుశీలము, శత్రువులలో రోగము, కీర్తిమంతులలోఁ గీర్తియు, గృహస్థులలో గృహము, హింసకులలో ఖలుఁడు, దుష్టులలోఁ

* దేవానాం చ యథా కృష్ణో దేవీనాం ప్రకృతిర్యథా-అనిమా.

బుంశ్చలియు, తేజస్వులలో సూర్యుఁడును, సహిష్ణువులలో భూమియు, భక్షకములలో నమృతము, దాహకములలో నగ్నియు, ధనదాతలలో శ్రీయు, పతివ్రతలలోఁ బార్వతియు, ప్రజేశులలో బ్రహ్మయు, సరిత్తులలో సాగరము, శ్రుతులలో సామము, ఛందస్సులలో గాయత్రియు, వృక్షములలో నశ్వత్థము, పుష్పములలోఁ దులసియు, మాసములలో మార్గశీర్షము, ఋతువులలో వసంతర్తువు, ఆదిత్యులలో సూర్యుఁడు, రుద్రులలో శంకరుఁడు, వసువులలో భీష్ముఁడు, వర్షములలో భారతవర్షము, దేవర్షులలో నీవును, (నారదముని యని భావము) బ్రహ్మర్షులలో భృగుమునియు, నృపులలో రాముఁడు, సిద్ధులలోఁ గపిలుఁడు, యోగులలో జ్ఞానులలో సనత్కుమారుండును, గజేంద్రములలో నైరావతము, పశువులలో శరభము, శైలములలో హిమాద్రియు, మణులలోఁ గౌస్తుభము, నదులలోఁ బుష్కరరూపిణియగు సరస్వతియు, గంధర్వులలోఁ జిత్రరథుఁడును, యక్షులలోఁ గుబేరుఁడును, రాక్షసులలో సుమాలియు, నారులలో శతరూపయు, మనువులలో స్వాయంభువుఁడును, సుందరులలో రంభయు, మాయులలో మాయయు నెట్లు శ్రేష్ఠములో అట్లు వ్రతములలో నీయేకాదశీవ్రతము శ్రేష్ఠవ్రతము. ఇది నాలుగువర్ణములవారిచేత సదా యాచరింపఁదగినది. యతులకు విష్ణుభక్తులకు విశేషించి బ్రాహ్మణులకుఁ గర్తవ్యము. * బ్రహ్మహత్యాదిసకలపాపములు

* సత్యం సర్వాణి పాపాని బ్రహ్మహత్యాదికాని చ, సంత్యేవౌదన మాశ్రిత్య శ్రీకృష్ణవ్రతవాసరే - అని మూ.

శ్రీకృష్ణవ్రతదినమున నన్నము నాశ్రయించియుండును. అట్టి శ్రీహరిపూజాదినమున నెవఁడు భుజించునో యట్టిమందమతి యాపాపముల నన్నింటిని బొందును. ఈలోకమునఁ బాపఫల ముల ననుభవించి మృతినొంది నరకమునఁ బడు. ఇది ధ్రువము. యుగమున నెన్ని యేకాదసులు వచ్చునో అన్నివత్సరములు కుంభీపాకనామక మహాఘోరనరకముననుండి పిదపఁ జండాల జనిం గాంచును. గళితవ్యాధియుక్తుఁడై యేడుజన్మము లెత్తి పిదపఁ బాపనిర్ముక్తుఁ డగు. అని బ్రహ్మయే శాసించెను. ఇది యేకాదశియందు భుజించినవానికింగల్గుపాపము. ద్వాదశియందు బారణచేయక వదలినవానికిఁ గల్గుపాపముల నింతకుముందే చెప్పితిని గదా. ఇఁక దశమీలంఘనదోషమును వచింతు. వినుము. ఈవిషయము ధర్మవక్త్రమునుండి వినఁబడియె. అది వేదసారము. ఎవఁడు కలామాత్రగానున్న దశమి మూఢుఁడై లంఘించునో అట్టివానియింట నుండనొల్లక శ్రీదేవి పరుగిడును. శాపము నతిఘోరము నొసంగిపోవును. ఈజగమున వంశహా నియు యశోహానియుఁ గల్గును. మృతిగల్గుచో శతమన్వంత రము లంధకూపనరకమున వసించును *దశమియు నేకాద శియు ద్వాదశియు నేదినమునఁ గలియునో ఆదినమున భుజించి

---

* దశమ్యేకాదశీవాపి ద్వాదశీ యచ్చ వాసరే, తత్ర భుక్త్వా పరదినే ఉపోష్య వ్రతమాచరేత్. ౨౧. ద్వాదశ్యాంచ వ్రతం కృత్వా త్రయోద శ్యాం చ పారణం, ద్వాదశీలంఘనే దోషో వ్రతినాం తన్నవిద్యతే. ౨౨. సంపూర్ణైకాదశీ యత్ర ప్రభాతే కించిదేవ సా, తత్రోపోష్యాద్వితీయా చ

పరదివసమున నుపవాసముండి వ్రతమాచరింపవలయును. అనగా ద్వాదశియందు వ్రతమాచరించి త్రయోదశియందుఁ బారణచేయవలయును. ఆద్వాదశియందుఁ బారణచేయకయున్న దోషము వ్రతముచేయువారికిం గలుగదు. ఎత్తఱి సంపూర్ణైకాదశియుండి ప్రభాతమున మఱుదినమునఁ గొంచెముండెనేని ఆదినమే యుపవసింపఁ దగు. రెండవదిన మక్కఱలేదు. అఱువదిఘటిక లేకాదశియుండి మఱుదినము దినత్రయము కల్గునో అట్టితఱి గృహస్థులు తొలిదినమే యుపవసింపవలయును. యతులులోనగువారు పరదినమున నుపవసించి నిత్యకృత్య మొనరింపవలయును. వ్రతమున జాగరణాదికము పరదినముననే చేయఁదగినది. అపూర్వదినమున వ్రతమొనరించి పరదినమున నేకాదశిఘటికలు దాఁటినవెనుక పారణచేయవలయును. విష్ణుభక్తులగు యతులకు విధవలకు సమోపవాసములు చెప్పఁబడినవి. బ్రహ్మచారుల కివియే నియమములు వైష్ణవేతరులు శుక్లపక్షైకాదశీవ్రతమునే యాచరింతురు. వారికిఁ గృష్ణైకాదశీలంఘనదోషము శ్రుతిప్రోక్తము కాదు. శయనైకాదశికి (ఆషాఢశుక్లైకాదశి)బోధనైకాదశికి(కార్తికశుక్లైకాదశికి) నడుమ కృష్ణైకాదశి యుపవసింపఁ దగును. తక్కినకృష్ణపక్షమున వచ్చునేకాదసులు గృహస్థుల కుపవాసవిధి లేదు.

---

పరాచేద్యది వర్ధతే. ౨౩. షష్టిదండాత్మికా యత్ర ప్రభాతే చ తిథిత్రయం, కుర్వంతి గృహిణః పూర్వాం చైవ యత్యాదయ స్తథా. ౨౪. పరత్రానశనం కృత్వా నిత్యకృత్యం సమాచరేత్, వ్రతే జాగరణం సర్వం పూర్వత్రైవాచరే ద్బుధః. ౨౫.

నారదా! ఇది శ్రుత్యుక్తవిధి వచించితిని. ఈవ్రతవిధానము నింక వచించెద. వినుము. పూర్వదినమున హవిష్యము నొనరించి భుజించి మరల జలమునైనను ద్రాగక యొంటరిగా దర్భశయ్యయందుఁ బరుండి రాత్రి నక్తనియమమున గడుపవలయును. బ్రాహ్మ్యమనఁబడు ముహూర్తమున లేచి ప్రాతఃకాల కృత్యవితతిని నెఱవేర్చి పిదప నిత్యకృత్యమును దీర్చి స్నానము చేయవలయును. (ప్రాతఃకృత్య మనఁగా ధ్యానాదులు పిదప నిత్యకృత్యములను శౌచాదులని భావము.) అవ్వల వ్రతోపవాసమునకు సంకల్పించి శ్రీకృష్ణపరమాత్మప్రీతికొఱకీవ్రతమాచరింతు ననితలంచుచు సంధ్యానియమమును దీర్చి తర్పణమొనరించి పగటికృత్యముల యథోచితములుగా నాచరింపవలయును. దినమున నిత్యపూజనొనరించి వ్రతద్రవ్యజాతమును గూర్పవలయును. అవల భగవంతుని విధిపూర్వకముగ షోడశోపచారపూజల సంతుష్టుంగా నొనరించి ఆసనము వస్త్రము పాద్యము అర్ఘ్యము పుష్పానులేపనములు, ధూపదీపములు నైవేద్యము యజ్ఞోపవీతములు భూషణములు గంధము స్నానీయతాంబూలమధుపర్కములు, జలము నను వీని వరుసగా శాస్త్రోక్తపద్ధతి సమాచరించి పగటిని బుచ్చవలయు. నక్తమున వ్రతమాచరింపఁదగు.

అదియెట్లనఁగా పరిశుద్ధమగునాసనమునఁ గూరుచుండి యుదికి యెండవేసిన వస్త్రములం గట్టి యాచమించి శ్రీహరిని ధ్యానించి నమస్కరించి స్వస్తివాచనము చేయవలయును.

ధాన్యాధారమునందు శుభముహూర్తమున మంగళపటమున శ్రీహరి నారోపించి ఫలశాఖాచందనాక్తముగా వేదోక్తమార్గమునఁ బెద్దలం గూడి షడ్దైవతముల నారోపించి పృథగ్విహిత ధాన్యముల వారి నావహింపఁజేయవలయును. ప్రకృష్టపంచోపచారముల నాచరింపఁదగు. గణాధిపతిని సూర్యుని అగ్నిని విష్ణువును శివుని బార్వతిని జక్కఁగాఁ బూజించి నమస్కరించి శ్రీహరివ్రతము చేయవలయును. పై వివరించిన దేవతాషట్కమును బూజింపక వ్రతముచేయ నుపక్రమించిన నిత్యనైమిత్తికము లన్నియు ఫలము నీయక వ్యర్థము లగును. మునీంద్రా! వ్రతాంగకృత్యమును వివరించితిని. ఇఁకఁ గణ్వశాఖాప్రోక్తమై యిష్టమగువ్రతమును వివరించెద. వినుము

తొలుదొలుత సామవేదోక్తధ్యానమున శ్రీహరిని స్మరింప వలయును. పరాత్పరుఁ డగుశ్రీకృష్ణుని ధ్యానించి పుష్పము శిరస్సుననుంచి మరల ధ్యానింపవలయును. ఆధ్యానమును వచించెద.వినుము. అది రహస్యము. అందఱకుఁ గోర్కుల నొసంగునది. భక్తుఁ డెవ్వఁడు కాఁడో వానికిఁ దెలుపఁగూడదు. పలయున నదిభక్తప్రాణాధికము సుమీ. "నవనీరదశ్యామసుందరవిగ్రహము గలిగి శరత్పార్వణ చంద్రుని మించుముఖమొప్పార, శరత్సూర్యోదయ కాలకమల ప్రభామోచన లోచనములు విరాజిల్ల,స్వాంగసౌందర్యశోభలచేఁ బ్రకాశించు రత్నభూషణములఁ దాల్చి, ప్రసన్నము లై రతిసూచకము లై తనరు గోపికాలోచన కోణములచేఁ బలుమాఱులు చూడఁ

బడుచు, వారిప్రాణములఁ దనప్రాణములకన్న నెక్కువగా భావించుచు, రాసమండల మధ్యస్థితుఁడై రాసోల్లాససముత్సు కుఁడై, రాధావక్త్రశరచ్ఛీతాంశుసుధాపానచకోరకమై మణి రాజంబగు కౌస్తుభము వక్షస్థ్సలమున వెలుంగ పారిజాతప్రసూ నమాలాజాలములచే విరాజిల్లుచు, లలితమణిసారవినిర్మితకిరి టోజ్జ్వలశేఖరుండై, వినోదమురళీన్యస్తహస్తుఁడై సురాసుర పూజ్యుఁడై ధ్యానగమ్యుండు కాక దురారాధ్యుఁడై బ్రహ్మాది వంద్యుఁడై, సర్వకారణకారణుఁడై వెలయుచున్న పరమా త్మను శ్రీకృష్ణుని సేవించువాఁడను." అను హృద్యపద్యములచే శ్రీహరిని వినుతించి ఆవాహన మొనరించి షోడశోపచారములఁ బూజించి మంత్రములచే నీకఁ జెర్కొనఁ బోవు నుపచారముల భక్తితో నొసంగవలయును.

**ఉపచారములు.**

తపనీయముచే నిర్మింపఁబడి రత్నసారవితత్యలంకృతమై నానాచిత్రవిచిత్రమగు నాసనము నొసంగుచున్నవాఁడ. శ్రీ కృష్ణా! పరిగ్రహింపుమా యని యాసన మీవలయును. వహ్ని వలెఁ బరిశుద్ధతమమై విశ్వకర్మనిర్మితమై మూల్యహీనునది [illegible] యని వచింపనలవిగాక చెలువారు వస్త్రము నిదె యొసంగు వాఁడ. శ్రీరాధామాధవా! గ్రహింపుమా అని ప్రార్థించి వస్త్రము సమర్పింపవలయును. బంగారుపాత్రమున నునిచి పరి మళవస్తునికరాంచితమై శీతలమై కనుపట్టుజలమును పాదప్ర క్షాళనార్థ మర్పించువాఁడను. కరుణానిధీ! అంగీకరింపుమా

యని ప్రార్థించి పాద్య మీయవలయును. శంఖోదకముల గలిసి పవిత్రమై పుష్పదూర్వాచందనాక్తమగు నర్ఘ్య మిదె యర్పించెదను. భక్తవత్సలా! కరుణింపుమా యని యర్ఘ్య మొసంగవలయును. చందనాగురుసంయుతమై పరిమళవంతము నగు శుక్లపుష్పము నీకుఁ బ్రీతిని గల్గించునని నమ్మి యిచ్చుచున్నవాఁడను. సర్వకారణా! శ్రీకృష్ణా! అవధరింపుమా. అని యీయవలయును. చందనాగురుకస్తూరీకుంకుమోశీర సంయుతమై యత్యుత్తమమై సర్వేప్సితముల నీఁజాలు నీయనులేపనము సమర్పించువాఁడను. శ్రీకృష్ణా! పరిగ్రహింపుమా యని వేఁడి యీయవలయును. ఒకానొక పరమపావనవృక్షరసమయి నానా పరిమళవస్తువిహితమై సుఖదమై తగు నీధూపము నీయఁబూనితిని. పరమేశ్వరా! ప్రతిగ్రహింపుమా. అని ధూప మీయనొప్పు. రేయింబగళ్ళు ప్రకాశించుచు, రత్నసారములచే నలరింపఁబడి పునర్ధ్వాంతనాశబీజమై తగు నీదీపము నంగీకరింపుమా యని ప్రార్థించి దీపదానము చేయుటొప్పు. స్వాదువులై పరిమళవంతములై నానావిధములగు చోష్యాదులం గూడిన యీ నైవేద్యమును బ్రీతిమీఱ నోయూర్ధ్వాగామా! యంగీకరింపుమా యని నైవేద్య మిడఁగవలయు. సావిత్రీగ్రంధిసంహితమై స్వర్ణతంతువినిర్మితమై మనోహరముగా నలరారుచు, నమూల్యరత్నఖచితమై సర్వావయవభూషణమై కాంతులఁ బ్రజ్వరిల్లు నీయజ్ఞోపవీతమును నందనందనా! యవధరింపుమా యని యభ్యర్థించుచు నర్పింపఁదగు. వర్ణనీయమై ప్రధానమై

సర్వమంగళకర్మముల నుపయుక్తమై తనరు నీగంధమును దీన బంధూ! శ్రీకృష్ణా! యంగీకరింపుమా యని యొసఁగవలయు. ధాత్రీఫలపత్రోత్థమై మనోహరమై సర్వలోకవాంఛితమై యొప్పు నీవిష్ణుతైలమును భగవంతుఁడా! ప్రతిగ్రహింపుమని చేతులొగ్గి విన్నవింపవలయు. అందఱకుఁ గోరఁదగి కర్పూరాదిసువాసితమైన యీతాంబూలమును శ్రీనాథా! కైకొనుమా యని కోరుచు నట నునుపవలయు. ఎల్లరకుఁ బ్రీతిజనకమై సుమిష్టమై మధురమునగు మధువును (తేనెను) మంచిరత్నపాత్రమున నునిచి యిదె యిచ్చుచున్నవాఁడ. గోపీకాంతా! ఆస్వాదింపుమా యని యందుంచవలయును. నిర్మలమై మిగులఁ బవిత్రమై పరిమళవస్తుమిళితమైన గంగాజలమును మరల నాచరింప నిదె యిచ్చువాఁడను. మధుసూదనా! యంగీకరింపుమా యని యీయవలయును.

ఇట్లు షోడశోపచారముల విధిరీతి నొనరించి భక్తుఁడానందకందళితహృదయారవిందుఁడై మహాత్మా! నానావిధసత్పుష్పముల శుక్లతంతుసంగ్రథితమై భూషణశ్రేష్ఠమైన మాల్యము నంగీకరింపు మని యీయవలయును. ఇట్టు లొనరించి పుష్పాంజలినిడి కరయుగమును జోడించి భక్తుఁడు రాధామాధవుని వినుతింపవలయును. ఓ రాధాప్రాణనాథా! శ్రీకృష్ణా! కరుణాసాగరా! ప్రభూ! ఘోరతరసంసారసాగరమున మునింగి తిల్లియున్న నన్ను నుద్ధరింపుము. నూఱుజన్మములనుండి కలిగి యాయాసమున నుద్విగ్నుఁడనై స్వకర్మపాశనిగళబద్ధుఁడ

నై యున్న నాకు నో మహాప్రభూ! ముక్తిఁ బ్రసాదింపుము. నీపాదపద్మములపైఁ బడి శరణాగతుఁడ నగునన్ను భవపాశ భయభీతుని గాపాడుమా. భక్తివిహీనమై క్రియాశూన్యమై వేదవిధివిరహితమై వస్తుమంత్రరహితమై నాచేయునీపూజన మును సంపూర్ణ మగునట్లు ప్రసాదింపుము. వేదవిహితజ్ఞానము లేకయున్నను, సాంగవిరహితముగ నున్నను భక్తుఁడుచేయు కార్యము నీనామోచ్చారణముచేతనే శ్రీహరీ! సర్వము పూర్ణ మే యగును.

అని వినుతించి నమస్కరించి విప్రునకు దక్షిణ నొసంగి మహోత్సవము నొనరించి జాగరణము చేయవలయును. ఏమూ ఢుఁడు వ్రతోపవాసముచేసి నిద్రించునో మరల జలపానము చేయునో వాఁడు వ్రతమున నర్ధఫలమునే పొందును. ప్రయ త్నపూర్వకముగ హవిష్యాన్నము నొకమాఱే చేయఁదగినది. శ్రీకృష్ణచరణాంబుజమును స్మరించుచు వంటచేయవలయును. అన్నము ప్రాణులకుఁ బ్రాణమని పూర్వము బ్రహ్మ నిర్మించెను. అట్టియోదనమా విష్ణురూపమవగు నీవు నా కుపవాసఫలము నొసంగుమా యని భావించుచు నన్నము వండవలయును. ఇట్లు లేమానవుఁడు భక్తిచే భారతభూమియం దీవ్రతమును జేయుచున్నవాఁడో తనకంటె ముందటివారి నేడుగురను, తన వెనుకటివారి నేడుగురిని దరింపఁజేయుచుఁ దాఁ దరించును. అంతియగాక తల్లిని సోదరుని అత్తను మామను అల్లుని భృత్యుని గూడ నుద్ధరించును. ఇది నిశ్చయము. నారదమునీ!

ఇది యేకాదశీవ్రతమహిమము. వివరించితిని. శ్రీకృష్ణమహిమానుకీర్తన మిదియే. ఇది సుఖముల ముక్తినిగూడ నొసంగఁజాలు. భగవత్కథాసారమని గ్రహింపుము. ఇంక నేమి వినఁగోరుదు వని పలికెను.

పాఠకవర్యులారా! వ్రతవిషయమును బఠించితిరి. దీనింగూర్చి పెంచివ్రాయనక్కఱలేదు భక్తియుక్తుఁడై శ్రీకృష్ణమహాత్మ్యను బూజించుటయే దీనిసారము. అంతియకాదు. ఇది యాచరింపఁదగిన దనుటకు వేఱుకారణముకూడ లేకపోలేదు. పక్షమున కొకతూరి యీవ్రత మాచరింపఁదగినది. ఇది కేవలముక్తిప్రద మగుటమాత్రమే కాక ఆరోగ్యమును గూడఁ గల్గింపఁ గారణ మైయున్నది. ప్రతిమనుజునకును నిరంతరమగునలవాటులను దగ్గించుకొనుటకు శక్యముకావలయునని మనపూర్వులభావము. ప్రతిదినముచేయు నాహారమును మానియుండుట కలవాటుపడుటకే వ్రతము లుపవాసములు కల్పింపఁబడినది. క్రమముగా నదిలేకున్నఁ బ్రాణము నిలువదన్న దైన్యము తొలఁగించుకొనుటయే ప్రధానకార్యము. తనువు ప్రతివారికి లోఁబడి యుండవలయునేకాని దానికి మనము లోఁబడి యుండరాదు. అంతియగాక పదార్థవాంఛ నిరంతరముగా నుండక యపుడపుడు విశ్రామమగుచుండ వలయును. ఇట్టు లలవాటుచేయవలయును. ఒక్కవిధమగునాహారమే కాక యదిమార్పునొందుచుండవలయు. దీనిఫలమాశావిరహితత్వమే. అదితగ్గుటకివియన్నియును సాధనములు. సోపానములవంటివి.

ఇట్లుపవసించుట పదార్థవాంఛను క్షీణింపఁజేయుటయే గాక యోగమును సాధింప ననువగు. దేహము మనకు లోఁబడవల యునన్న నాహారాదినియమములు మనము చెప్పిన ట్లుండవలయుఁ గదా! మనసుకూడ నియమబద్ధము కావలయును. దానికివి యన్నియుఁ ద్రోవలు. ఉపవాసముమాత్ర మాచరించి తదుక్త పూజాదికము మానిన నాయుపవాసము నిష్ఫలము. వాఁడు పశుతుల్యుఁడు. భగవద్భక్తి నభ్యసించుటకే యిదిమార్గముగ నేర్పఱుపఁబడినది. ఇంద్రియము లలసినతఱి మనసు వశపడునా లేదా యనియు భక్తి కుదురునా లేదా యనియు, ఆహారమును మానిన మనము జీవింపఁగల మనుధైర్యము గల్గునా లేదా యనియుఁ బరీక్షించుటకే యీలాటివ్రతములు. ఈపరీక్ష ముగిసినపిదప నుపవాసము లక్కఱలేదు. సదా యిదియే ప్రధానమని యూఁగులాడుచుండిన నామనుజుఁడు తరింపఁజాలఁ డనుట నిక్కము. జ్ఞానికి వ్రతము లుపవాసములు లేవు. వాని మది సదా భగవత్పదాంబుజములందే లగ్నమయి తగు. ఉపవాసాదినియమము లక్షరాభ్యాసకాలమువంటివి. వరుసగా నున్నత పదవికి రావలయును గాని యట్లే యుండరాదు. భగవత్కారుణకుఁ బాత్రుఁడైనకొలఁది కేవలపామరాచారములకుఁ బాత్రుఁడు కాక సమత్వమునకు దృష్టాంతము కావలయు. ఇదియే దీనిరహస్యము. చిన్ననాఁటిపద్ధతులనే యవలంబించుచున్నచో నతఁడు తరింపఁజాలఁడు. సమలోష్టాశ్మకాంచనుఁడు కావలయునే కాని ఆమరణము బాహ్యాచారములకే గుఱిగా నుండరాదు. ఆచా

రములు కొలుదొలుత హితములుగనే యుండును గాని పిదప నవి క్షేమమును గల్పింపఁజాలవు. మనోనిగ్రహ మభ్యసించుట కివి పనికివచ్చును. అది కుదిరెనా యివి పరోపదేశమున కనువగున ట్లాచరింపఁ దగినవి.

శ్లో. యద్యదాచరతి శ్రేష్ఠ స్తత్తదేవేతరో జనః,
స యత్ప్రమాణం కురుతే లోక స్తదనువర్తతే.

అన్నగీతావాక్యము ఎల్లరకు విదితమే కదా. కావున జ్ఞానియగువాఁడు తానాచరించుమార్గములు లేకున్నను సదాచారములు వదలక లోకు లవిచూచి నేర్చుకొనుటకై తా నాచరించుచుఁ దదేకబద్ధుఁడు కాక యుండవలయును. లేక తదేకబద్ధుఁ డయ్యెనేని యాతనికి జ్ఞానము వ్యాగ్రూపమే గాని వేఱువిధముగా లేదని యెఱుంగవలయు. ఈవిషయమై వేమనకవి,

గీ. చదువు చదువనేల సన్న్యాసి గానేల
షణ్మతములఁ జిక్కి చావనేల
యతనిభజన చేసి యాత్మలోఁ దెలియుఁడీ
విశ్వదాభిరామ వినుర వేమ.

యని చెప్పెను. ఎంతటి జ్ఞాని? ఎంతయనుభవము కలవాఁడు. పాండిత్య మహంకారమును బుట్టింప సాధనమని యాయోగి యెఱిఁగెను. షణ్మతములు కల్పితములు. వీనినే చచ్చుదాఁక నవలంబింపవలసిన యవసరము లేదని తెలిసికొనెను. సర్వవ్యాపియగు భగవంతుని స్వాత్మారామునిగాఁ దెలిసికొని భజించినఁ గాని ముక్తి లభింపదని యనుభవమున నెఱింగెను. ఇంతకన్నఁ

దెలిసికొనఁదగినవిషయసార మేశాస్త్రమునందును లేదు అనఁగా శాస్త్రపఠనఫల మిదియే యని భావము. పాండిత్యము తరణో పాయమునకుఁ గావలయునే కాని శునకవృత్తికి గాఁగూడదు. అది దుష్ఫలము చిలుకలపలుకులవలె శాస్త్రపంక్తులను గంఠ స్థములుగాఁ జేసి సభలలో రౌద్రాకారమున వాని నప్పగిం చుట, అదియేమో పురుషార్థమని భావించుచు, సభలోఁ బ్రతి పక్షముఖపిధానము చేయుచుఁ దాఁ దరింపఁజాలక యితరులఁ దరింపఁజేయఁబూనినట్లు నటించుచు ధనము సేకరించువారు మూర్ఖులలో మూర్ఖులు. అట్లుగాక శాస్త్రపఠనఫలము తరణో పాయమని నిశ్చయించుకొని శమదమాదుల నభ్యసించి తదను గుణప్రవర్తకులై సర్వత్ర సమదర్శిత్వమున మెలఁగుట పండిత లక్షణము. కావున "అతనిభజనచేసి యాత్మలోఁ దెలియుఁడీ" అన్నమాట సకలశాస్త్రసారము. సర్వోపనిషత్ఫలము. అదితె లిసికొనినవాఁడే జ్ఞాని. అంతమాత్రమే చాలదు. అది స్వాను భవమునకు రావలయును. ఆజ్ఞానము, ఆయనుభవము కలుగు టకే యిన్నివ్రతములు, ఇన్నిపూజలు, ఇన్నియుపవాసములు కల్పింపఁబడినవి. వీనియందొక్కొక్కటి యొక్కొక్కవిషయమున మనుజున కుపకారముచేయుచుండును. ఇన్నియుపకారములను బొంది మనుజుఁడు తాఁ దరించుటకు సాధనమగు భగవద్భక్తి నలవఱచుకొని సర్వభూతాంతర్యామియని భగవంతుని నమ్మి యాత్రాదుల మాని హ్రస్వదృష్టిని వదలి సకలవిధరూపముల నెసంగు భగవంతుఁ డొక్కఁడే యనుదృఢవిశ్వాసము గలిగి

మెలఁగవలయు. అదియే తరణోపాయము. ఇట్లెఱుఁగక బాల్య
ముమొదలామృతిగా నొక్కరీతినున్న మానవుఁడు పశుతుల్యుఁ
డనుటకన్న వేఱుగఁ జెప్పవలసినదేమియు లేదు.

త్రైగుణ్యవిషయా వేదా నిస్త్రైగుణ్యో భవార్జున,
నిర్ద్వంద్వో నిత్యసత్త్వస్థో నిర్యోగక్షేమ ఆత్మవాన్. ४५

బుద్ధియుక్తో జహాతీహ ఉభే సుకృతదుష్కృతే,
తస్మాద్యోగాయ యుజ్యస్వ యోగఃకర్మసుకౌశలమ్. ५०

కర్మజం బుద్ధియుక్తాహి ఫలం త్యక్త్వా మనీషిణః,
జన్మబంధవినిర్ముక్తాః పదం గచ్ఛంత్యనామయమ్. ५१

యదా తే మోహకలిలం బుద్ధిర్వ్యతితరిష్యతి,
తదా గంతాసి నిర్వేదం శ్రోతవ్యస్య శ్రుతస్య చ. ५२

శ్రుతివిప్రతిపన్నా తే యదా స్థాస్యతి నిశ్చలా,
సమాధావచలా బుద్ధిస్తదా యోగమవాప్స్యసి. ५३

విహాయ కామాన్ యస్సర్వాన్ పుమాంశ్చరతి నిస్పృహః,
నిర్మమో నిరహంకార స్సశాంతి మధిగచ్ఛతి. ५४

భగవద్గీత, ౨ అ.

అనునీభగవదుక్తులు పైభావమును జెప్పక చెప్పుచున్న
యవి. కావున నోభక్తులారా! కేవలబాహ్యాచారములనే తర
ణోపాయములని నమ్మక భగవత్సేవయే ప్రధానమని నమ్మి ఆభగ
వంతుఁడు పాషాణరూపమున నున్నవాఁడను క్షుద్రవిశ్వాస
మును మాని తనయందే యున్నవాఁడన్నజ్ఞానము కలిగి వ్రతో
పవాసములందే కాలమును బుచ్చక వీనివలనఁ గలుగఁదగు ఫల

మేది యని విచారించి సర్వమతసారము "భగవంతుఁ డొక్కఁడే. అతఁడు సర్వాంతర్యామి" యన్నది కదా యని మదిఁ బదిలము సేసికొని. ఆపరమపురుషు నుపాసింపుఁడు. శుష్కవేదాంతుల మాయమాటలకుఁ జోటీయకుఁడు. ధనాపహరణనిరతులగు పగటిదొంగ లనఁగాఁ దగినవారు. వారికి భక్తియే లేదు. కావున నట్టివట్టిదాంభికులకు శిష్యులుగాక భగవంతుని నమ్మినఁ దరింపఁ గలరు. అదియే మనుష్యజని లభించినందున మనముచేయఁదగు పని. ఆకార్యమును సాధింపఁ గంకణముఁ గట్టుకొనుఁడు. వస్తు తత్త్వమును బరిశీలింపుఁడు. సకలశాస్త్రసార మిదియే. సకలోప దేశఫల మిదియే. దీనికన్న వేఱుగ నేదియు లేదు. ఉండ నవ కాశము లేదు. ఇది ధ్రువము. సత్యము. నిజము. ఈఘట్టి మును విరమింపఁబూనుతఱి భక్తాగ్రగణ్యుఁడగు లీలాశుకుఁడు భక్తార్తిచ్ఛేదకుఁడగు శ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానించినశ్లోక మును బఠించి తదుపాతిగాథకు మదిఁ బురికొలుపఁదగు.

శ్లో. చక్రాన్తధ్వస్తవైరివ్రజమజిత మపాస్తావనీ భారమాద్యై
రావీతం నారదాద్యైర్మునిభిరభినుతం తత్త్వనిర్ణీతి హేతోః,
సాయాహ్నే నిర్మలాంగం నిరుపమరుచిరం చింతయేన్నీలభా
సం, మంత్రీ విశ్వోదయస్థిత్యపహరణపదం ముక్తిదం వాసు
దేవమ్. 3 ఆ. ౧౦౩ శ్లో.

ఇంతియకాక యేకాదశీవ్రతపూజకు నెవ్వఁడు దైవ మో యారూపమును వర్ణించు నీశ్లోకమును బఠించినఁగాని ఫలము లేదు.

## గోపికావస్త్రాపహరణము.

శ్లో. బాలం నీలాంబుదాభం నవమణివిలసత్కింకిణీజాలబద్ధ, శ్రో
ణీజంఘాంతయుగ్మం విపులరురునఖప్రోల్లసత్కంఠభూషమ్,
ఫుల్లాంభోజాభవక్త్రం హతశకటమరుత్పూతనాద్యం ప్రస
న్నం, గోవిందం వందితేంద్రాద్యమరవరమజం పూజయేద్వా
సరాదౌ. 3 అ. ౧౦౧ శ్లో.

శ్లో. వంద్యం దేవైర్ముకుందం వికసితకురువిందాభమిందీవరాక్షం,
గోగోపీబృందవీతం జితరిపునివహం కుందమందారహాసం, నీల
గ్రీవాగ్ర్యపింఛగ్రథనసువిలసత్కుంతలం భానుమంతం,
దేవం పీతాంబరాఢ్యం యజయజ దినశో మధ్యమాహ్నే
రమాఢ్యై. 3 అ. ౧౦౨ శ్లో.

ఏకాదశీపూజావిధానమున నీదివ్యరూపమే స్మరింపఁదగిన
దనుభావము కవికున్నట్టు కనుపట్టు. కావుననే ప్రాతర్మధ్యాహ్న
కాలముల బూజించునపు డీధ్యానము పురాణప్రోక్త మని
తెలియదగు. ఇట్టిరూపమును ధ్యానించి సదా మనోగతమును
జేసికొన్నచోఁ దరించవచ్చును. ఇట్టులీఘట్టమున భక్తాగ్ర
గణ్యుఁడగు శ్రీమల్లీలాశుకభావమును సమ్మానించి శిరసా
వహించి మది భావించి యవ్వాలిభగవల్లీలలం బఠింపఁబూను
దము.

పాఠకమహాశయులారా! కథాసారము విన్న మీరు మున్ం
దేభగవల్లీల వినఁగలమో యని యువ్విళ్లూరుచుందురు. ఇట్టి

మీయుత్సాహమున కంతరాయమును గల్గింపక శ్రీకృష్ణపర మాత్మయొనరించిన యద్భుతచర్యను దెలుపఁబూనెద. ఇంద్ర యాగభంజనకథను జదివినపిదప శ్రీకృష్ణపరమాత్మ శిశురూప మున దుర్వాసునకు జ్ఞానముపదేశించినకథను బఠించితిరి. తరువాత భగవత్పూజావిధానమును భక్తపరిత్రాణసమాదర మును దెలుపుకథలం బఠించితిరి. ఇవి గోపాలకృష్ణునిలీలలు కావని సంశయింపకుఁడు. భక్తుల నెట్లురక్షించెనో యనువిష యము తెలిసికొనుటయే మనపని అది నెఱవేఱినది. ఇఁక మదిని బూర్వస్మృతికిఁ బాత్రముచేసి యింద్రయాగానంతరము శ్రీహరి యెట్లు ప్రవర్తించెనని విచారింపఁ దగియున్నది. అపని కిం బూనుదను. లేఖిని మఱలించి బాలకృష్ణునిదివ్యచరిత్రము నొకదాని వ్రాసి కృతకృత్యుఁడ నైతినని గర్వించెదను. నాయా గర్వమును స్థిరముగా నుండఁజేయుట మీపని కదా. ఇఁకఁ గథ నాలింపుఁడు.

ఇంద్రయాగభంజనమున గోపాలకులు నందాదులు శ్రీకృ ష్ణుని యమానుషచర్యలఁ దెలిసికొనిరి. భగవంతుఁడే శ్రీకృష్ణుఁ డని భావించిరి. కాని యాజ్ఞానమును శ్రీహరి నిలువనీయక మాయచే నాచ్ఛాదించి తన్ను సాధారణబాలుఁడే యని వారు భావించున ట్లొనరించెను. ఏలయనఁగా అజ్ఞానమే యంతఱిసం భ్రమింపఁ దనయవతారమునకుం దగినఫలము దొరకదు. దుష్టసం హారము ముందు కావలయును గదా. అంతియగాక గోలోక మునుండి తనతో విహరింప నవతరించిన గోపికలయాశ తీఱదు.

అదియు నొకకార్యము కదా. ఏయేజీవు లెట్టియెట్టివాంఛలు కలవారుగనుందురో వారివారి కనువగుపద్ధతిని దాఁబూని కోర్కెల ఫలింపఁజేయుట భగవంతుని పనియనుట సిద్ధాంతము. మహర్షికింగలకోర్కెయుఁ గుబ్జకుం గల్గినవాంఛయు నొక్కరీతి గానుండ నవకాశము కలదా! నారదుఁడు శ్రీహరిని పరమపురుషార్థమును గోరి తప మొనరించును. కుబ్జ మదనకోటిసుందరా కారునిగా శ్రీహరిని ధ్యానించి తత్సంగతిని గోరి ధ్యానించును. ఈయిర్వుర గోర్కెలు తీర్చుట భగవంతునికృత్యము కదా. ఇరువురకు ఫలమొక్కవిధముగ నుండునా యనిమాత్రము ప్రస్తావింపకుఁడు. భగవత్సంగతిం గాంచినకుబ్జయుఁ బరమపురుషార్థమును గోరునారదుఁడు నొక్కవిధమగుకర్మము చేసిన వారు కారుకదా! కావునఁ గర్మానుసారమే వాంఛలుదయించును. అవి నెఱవేఱినచోఁ దృప్తిమాత్రము సమానముగానుండును. ఇఁకఁ గథ యెట్లనఁగా.

బృందావనమున రామకృష్ణులు గోపాలకులు సుఖముగా నుండిరి ఇంద్రయాగభంజనము కాఁగా నందాదుల డెందము లానందపరవశము లైనవి. గోవర్ధనాద్రిని బూజించుచు, గోవుల నర్చించుట మనకృత్యమని వా రెఱింగిరి. ఆవులను గాపాడినఁగాని గోవులు తృప్తినొందవనియు, నవి తృప్తినొందినఁగాని గోపకు లూఱడిల్లరనియు నెఱింగిరి. పర్వతము లరణ్యములు కూడ మహోపకారకరణక్షమములని నిశ్చయించిరి. శ్రీకృష్ణుని

పలుకులు బాలునిపలుకులని యనాదరమునఁ జూడక వాస్తవి
ములే యని తలపోసిరి.

'బాలాదపి సుభాషితమ్'

అన్నమనువాక్యము నిశ్చయమే యని నమ్మిరి. కావున
నాయాగద్రవ్యముల శ్రీకృష్ణోక్తిననుసరించి గోవర్ధనాదులఁ
బూజించి బృందావనమును జేరి సుఖముండిరి.

ఇంతదనుక శ్రీహరి రాక్షససంహారనిరతి నుండెను గాని
గోలోకవాసులేల యవతరించిరని తలంపలేదు. తనవయస్సు
వారిని దృప్తిపఱచునంత లేకుండెను. కావున నూఱకుండెను.
ఇంచుక వయస్సు వచ్చెను. తన యెడఁబాటు నోర్వఁజాలక
భూమినవతరించినగోపికల వాంఛలం దీర్చి వారిని సంతుష్ట
మతులనుగాఁ జేయనూహించెను. వర్షాకాలము గడచెను.
*అంత శరదృతువు ప్రవేశించెను. శరత్కాలము మిగులమనో
హరమైనది. మేఘములు నిర్మలములు. నదులు విమలజలములఁ
బ్రవహించుచుఁ జూచువారల కింపుగూర్చుచుండినవి. రాజులు
యుద్ధయాత్రలకుఁ బ్రయాణము చేయు సమయ మదియే
కదా. మదనుఁడు మిత్రులంగూడి సేనాసమన్వితముగ వేఁటాడు
కాల మాశరదృతువే. ఆకాలమున శ్రీకృష్ణపరబ్రహ్మము వేణు
నాదమునఁ గడపెను. అది మునీంద్రులకుం గూడ బ్రహ్మానంద

---

* శరదృతువువిషయము ముందవసరము ననుసరించి వ్రాసెదను. ఈక
థకనుబంధముగా హేమంతకాలమును వ్రాసెదను. క్రమము తప్పినదని
యూహింపకుఁడు.

మును గల్పింపఁజాలెను. ఇఁక గోపికలమాట యిటుఁ జెప్పనేల? మఱి కొలఁదిదినములకు హేమంతకాలము ప్రవేశించెను.

హేమంతము విచిత్రమగు కాలము. ఎట్టివారికేని వనితావార్తను గల్పించునది. వనితలకును బురుషవార్తాదృతిని గల్పించునది. అట్టికాలము రాఁగా గోపికలు యమునానదీజలంబుల స్నానమాడి సైకతమూర్తింగల్పించి దానికిఁ గాత్యాయనను నామమిడి గంధపుష్పాక్షతలచేఁ బూజించి ధూపదీపనైవేద్యములొసంగి బహువిధోపహారములఁ బరితృప్తంజేసిచేతులు జోడించి యోకాత్యాయనీదేవీ! మహామాయ వన నీవేకదా! యోగిసమారాధ్యవు. మాయీప్రార్థనము నంగీకరించి నందగోపాలపుత్రుని శ్రీకృష్ణుని బ్రాణేశుంగా ననుగ్రహింపుమా యని వేఁడిరి. ఇదియే యొకమంత్రముగా జపించిరి. భక్తిభరమున మ్రొక్కిరి. ఎన్నియోవిధముల నుపహారము లిత్తుమని యాశఁ బుట్టఁ బలికిరి. పాప మాగోపికలకు సహజముగా భగవంతునిపైఁ బ్రీతిగల్గినది. కాఁబట్టి కాత్యాయనిని బ్రార్థించిరి.

శ్లో. కాత్యాయని మహామాయే మహాయోగిన్యధీశ్వరి,
నందగోపసుతం దేవి పతిం మే కురు తే నమః.

శ్రీభాగవతము. ౧౦ స్క. ౨.

ఇట్లు మంత్రజప మొనరించి కాత్యాయనిం బూజించుచు నొకమాసము గడపిరి. *ప్రతిప్రాతఃకాలమునను ఇదియే పద్ధతిగాఁ

---

* ఇక్కథ శ్రీకృష్ణజన్మఖండము ౨౭వ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని తెలియందగు.

గాత్యాయని నర్చించుచునుండిరి. అనిపలికి నారాయణుండు నారదుం జూచి మునీంద్రా! శ్రీకృష్ణునియద్భుతకార్యమును దెలుపులీల నొకదాని నెఱింగించెద. వినుము. గోపికలవస్త్రముల హరించి పిదప వారికి వరములొసంగినవిధ మద్ది తెలుపును. దానియం దనేకరహస్యార్థము లిమిడియున్నయవి.

హేమంతర్తువునఁ దొలినెలనంతయు గోపికలు కామమోహితలై భక్తిచే హవిష్యమును జేసి నైవేద్యమిడి దాని భుజించి భగవంతునిఁ బూజించుచుఁ గాలముఁబుచ్చిరి. కాళిందీతీరమునఁ బార్వతినిసుకచే నిర్మించి యందావరదేవి నావహించి మంత్రములఁ బూజింపసాగిరి. మనోహరచందనాగురుకస్తూరీకుంకుమాదులచేతను, నానాప్రకారపుష్పములచేతను బహువిధరత్నహారములచేతను ధూపదీపనైవేద్యములచేతను మణిముక్తాప్రవాళాదులనొసంగుపద్ధతులచేతను భగవతి సంతుష్టాంతరంగం జేసి భగవతీ! దేవీ! జగజ్జననీ! సృష్టిస్థిత్యంతకారిణీ! సువ్రతా! నందగోపకుమారుని భర్తగా మాకుం బ్రసాదింపుమా. అని ప్రతిదినము కోరి పూజించిరి. ఇదియే మంత్రముగా జపింపసాగిరి. ఆవల సంకల్పమొనరించి మూలమంత్రముచ్చరించుచుఁ బూజింప నారంభించిరి. ప్రణవాద్యమై, శ్రీవర్ణద్వితీయమై, దుర్గేత్యేతివర్ణగ్రథితమై చతుర్థ్యంతసర్వవిఘ్నవినాశిసీపదసంయుతమై నమోంతంబై యలరు. అది షోడశాక్షరము. పుష్పమాల్యధూపదీపప్రభృతుల నీమంత్ర ముచ్చరించుచు నొసంగిరి. ఆవలఁ బ్రవాళమాలం బూని భక్తిచే నీమం

త్రమును సహస్రధా జపించిరి. జపానంతరము వినుతించి శిర సులు ధర సోఁక వందనము లొనరించిరి.

సర్వమంగళమాంగల్యే సర్వకామప్రదే శివే,
దేహి మే వాంఛితం దేవి నమస్తే శంకరప్రియే.

అనుమంత్రము నుచ్చరించుచు నమస్కరించిరి. దక్షిణల నొసం గిరి. బ్రాహ్మణుల కన్నదానము చేసిరి. అని తెలిపి మరల నారా యణుం డిట్లు లనియె.

నారదమునీ! స్తవరాజమును వచించెద. వినుము. దానిచే బార్వతిని గోపికలు ప్రీతహృదయం జేసిరి. సర్వాభీష్టప్రదా త్రిగా దేవిని భావించిరి. ప్రపంచము సముద్రమయమై భయం కరమై చంద్రసూర్యవిహీనమై అంజనాకారతోయసంప్లుతమై చరాచరభేదము లేక యుండఁగాఁ బూర్వము విరించికల్పించి జలశయ్యఁ బరుండి జగత్పతి నిద్రించెను. బ్రహ్మయు నారా యణమూర్తి నాభికమలంబున నుండెను. మధుకైటభులనుదను జులు బ్రహ్మను బాధించిరి. అట్టితటి నా బ్రహ్మయు నీశ్వరియగు మూలప్రకృతిని ధ్యానించెను. ఆస్తోత్రరాజమును నారదమునీ అవధరింపుము. ఓదుర్గా! శివా! అభయా! మాయా, నారా యణీ, సనాతనీ, జయా, సర్వమంగళా, నాకు శుభముల నొసఁ గూర్పుము. దకారము దైత్యధ్వంసకము. ఉకారము విఘ్న నాశార్థకము. రేఫము రోగనివారకము. గకారము పాపముల నడంచునది. ఆకారము భయశత్రునాశకము. ఈయర్థమును ధ్యానించుచు నీనామమును స్మరించినఁ దదుక్తఫలము తప్పక

కల్గును. కావుననే దుర్గ హరిశక్తి. అని శ్రీహరియే సిద్ధాంతము చేసియున్నాఁడు. దుర్గశబ్దము విపత్తివాచకము. ఆకారము నాశ వాచకము. దుర్గము నశింపఁజేయునది కాన దుర్గ యనంబడియెను. దుర్గశబ్దము దైత్యేంద్రవాచకము. ఆకారము నాశవాచకము. దైత్యుల మున్ను నశింపఁజేసినది కాన దేవతలచే దుర్గా యని వినుతింపఁబడియెను. శకారము కల్యాణవాచకము. ఇకార ముత్కృష్టవాచకము వకారము సమూహబోధకము. ఆకారము దాతృవాచకము. శ్రేయఃపరంపరల నతిశయముగాఁ బ్రసాదించునుగాన శివా యనఁబడెను. అభయశబ్దము భయనాశకము. ఆకారము దాతృవాచకము. అప్పుడే అభయమును జక్కఁగా నొసంగును గాన నాజనని అభయా యని వినుతింపఁబడెను. "మా" అనునక్షరము ప్రాపణవాచకము. ఎవ్వతుక దానిని బడయఁజేయునో ఆదేవి మాయానామమునఁ బ్రసిద్ధిఁ గాంచెను. "మా" అనువర్ణము మోక్షార్థబోధకము. యాకారము ప్రాపణవాచకము. దానిని గల్పించుఁ గాన మాయా నామము కీర్తింపఁబడెను. నారాయణార్ధాంగభూత యై, తేజస్సుచేఁ దత్తుల్యయై సదా నారాయణశరీరస్థ యగుట నారాయణి యనంబడియె. సనాతనశబ్దము నిత్యనిర్గుణవాచకము. సదా నిత్యయు నిర్గుణయు నగుకతన ఆదేవి సనాతనీనామధేయముం గాంచెను. జయశబ్దము కల్యాణవాచకము. యాకారము దాతృవాచకము. జయమును సదా యొసఁగునుగాన జయానామ మాపరదేవికిఁ జెల్లెను. సర్వమంగళశబ్దము సంపూర్ణైశ్వర్య

వాచకము. ఆకారము దాతృవాచకము. సర్వమంగళదాత్రి యగుటచే సర్వమంగళాభిధాన మాపరదేవికిం జెల్లె.

నారదా! ఇది నామాష్టకము. సహస్రనామసారము. కావుననే నారాయణమూర్తి నాభిపంకజవాసుఁడగు బ్రహ్మకీస్తుతి నుపదేశించెను. ఈవిషయమును బ్రహ్మకుపదేశమిచ్చి యాజగత్పతి నిద్రించెను. మధుకైటభులు ఘోరతరపరాక్రమోపేతులు. బ్రహ్మను జంపఁ బ్రయత్నించిరి. బ్రహ్మయు భక్తితో నమస్కరించి యీస్తుతిచే వినుతించెను. దుర్గయుఁ దనస్తోత్రాల వినుతిచేయుచున్న బ్రహ్మ కీకవచము నొసంగెను. అది శ్రీకృష్ణకవచము. దివ్యమైనది. సర్వరక్షణనామకమయ్యది. అట్టికవచమును మహామాయ బ్రహ్మకొసంగి యంతర్ధానమందెను. అంతట బ్రహ్మయుఁ గవచమున సంరక్షితుఁడై నిద్రానుగ్రహమువలనను స్తోత్రప్రభావమువలనను బాధావిరహితుఁడయ్యెను. అంతట వృషభవాహనారూఢుఁడగు శంకరుఁడు దుర్గాంబికం గూడి యరుదెంచెను. పైభాగమునన్నున్న శంకరుం గాంచినంతనే బ్రహ్మకు భీతి పోయెను. జయాంబ జయ మొసంగెను. ఈస్తోత్రప్రభావమున విధి కవచంబును బొంది తత్ప్రభావమున నిర్భీతుఁ డయ్యెను. బ్రహ్మయు నీస్తోత్రకవచముల శంకరున కుపదేశించెను. త్రిపురాసురులతో యుద్ధము పొసఁగినపుడు సరథుఁడగు శంకరుఁడు పడిపోఁగా బ్రహ్మాస్త్రమును గ్రహించి నిద్రాయుతుఁడగు శ్రీహరి స్మరించెను. శ్రీహరిప్రసాదమున స్తోత్రకవచములఁ గాంచి త్రిపురాసురుల వధించెను.

ఇట్టు లాగోపికలు దుర్గాంబ నీ స్తవరాజమున వినుతించి శ్రీహరిని బతిని బడసిరి. అట్టి మహాదృష్టమునకుం గారణ మీస్తోత్రప్రభావమే. ఇది గోపకన్యాకృతస్తోత్రము. సర్వమంగళకారకము. సర్వమంగళనామధేయవిలసితము. సద్యస్కాలముననే వాంఛితార్థముల నిచ్చునది. సర్వవిఘ్నముల నివారించునది. ఇట్టియీ స్తవరాజమును త్రిసంధ్యలఁ బఠించినమానవుఁడు భుక్తిముక్తుల నొందును. శైవుఁడు గాని వైష్ణవుఁడు గాని శాక్తుఁడు గాని దుర్గాప్రసాదమునఁ గష్టవినిర్ముక్తుఁ డగును. రాజద్వారమందు శ్మశానమునందు దావాగ్నియందుఁ బ్రాణసంకటమునందు హింస్రజంతువులు చుట్టుకొన్నతఱి మహార్ణవమున నౌక మునుంగుతరుణమున సంగ్రామమున శత్రువులు నలుదెసలఁ జుట్టుకొన్నపుడు, కారాగారమునందు విపత్కాలమందు గురుశాపమందు బ్రహ్మశాపమందు బంధుద్వేషమునందు, స్థానభ్రంశమందు, ధనభ్రంశమునందు జాతిభ్రంశమునందు పతిపుత్రభేదమందు ఖలసర్పవిషాదులబాధ గలిగినకాలమందు, నీస్తోత్రపఠనమాత్రమున మానవుఁడు విపన్నిర్ముక్తుఁ డగును. వాంఛితము లెల్ల లభించును. అనుపమానైశ్వర్యములు కలుగు. ఈలోకమున సదా శ్రీహరిభక్తియు, సంతతస్మరణము కల్గును. పార్వతీప్రసాదమునఁ బరలోకమున శ్రీకృష్ణదాస్యము లభించును.

నారదా! ఇది గోపకన్యాకృతస్తుతిరాజము. దీనిచే నను దిన మాదుర్గాంబికను వినుతించిరి. పరమభక్తిచే నమస్కరించిరి.

ఆమాసమంతయు గడచనువఱకు తత్ప్రకారమే చేసిరి. మాసము పూర్ణమయ్యెను. సమాప్తిదినమున యథాపూర్వరీతిగా స్నానముచేయనూహలం గాళిందికిం బోయిరి. * పూజాద్రవ్యములు నైవేద్యపదార్థములును బరిగ్రహించి భక్తితో నటంజేరిరి. రత్నఖచితాభరణములను నానావిధామూల్య పదార్థములను దత్తీరమున నునిచిరి. మహాసుందరములై పీతలోహితశుక్లవర్ణములై తనరారు దుకూలాంబరముల నేతద్వర్ణసమ్మిశ్రితాంబరముల నందు వదలిరి. స్నానకాలమున వివస్త్రలై యుండుట స్త్రీలయలవాటు. ఇట్లు వారుంచిన తద్వస్తువులచే నాకాళిందీతీరము నిండియుండెను. చూడంజూడ వేడుకల కునికిపట్టుగానుండెను. చందనాగురుకస్తూరీవాయువులచే నాతీరమెల్లం బరిమళవంత మయ్యెను. బహువిధనైవేద్యవస్తువు లందుంచిరి. కాలదేశోద్భవములగు ఫలము లందుం గన్పట్టుచుండెను ధూపదీపసిందూరకుంకుమములచే నాయమునాతటమెల్ల నిండి చూచువారలకుం గన్నులపండువు చేయుచుండెను.

---

* ఇటనుండి ఈకథ శ్రీభాగవతమున భేదముగాం జెప్పంబడినది. కావున దానిని సమయానుసారముగ నిందుంగలిపి వ్రాసెదను. ఇంతవఱుక వ్రాసినదంతయు శ్రీకృష్ణజన్మఖండము ననుసరించియే. ఈవ్రతనియమాదులు శ్రీభాగవతమున లేవు. గోపికావస్త్రాపహరణము బాలలీలలలో నొకటిగా నందుం గనుపట్టు. శ్రీకృష్ణజన్మఖండమున విచిత్రరీతి నిది చెప్పంబడినది. కాన దానిని బ్రధానముగా వ్రాయుచు భాగవతవిషయమును నుచితరీతి నందుం గలిపి వ్రాసెదను. పాఠకులు మన్నించవలయును.

అంత నాగోపికలు తమిపెల్లిదంబున యమునానదిఁ గ్రుంకు లిడ వేడుకపడిరి. అత్తఱి వారికిం గల్గినకౌతుకమునకు మేరయే లేదనుట యతిశయోక్తి యనునలంకారమున కుదాహరణము కాదు. ఆగోపిక లత్తఱి విగతాంబరలై జలక్రీడాసమాసక్త హృదయలై శ్రీకృష్ణార్పితమానస లైయుండిరి. వారివాంఛిత ములై శ్రీకృష్ణుని భర్తగాఁ గోరుటయందే యిమిడియుండినవి. కాత్యాయనిం గొల్చుటయంతయు శ్రీకృష్ణప్రసాదమును గోరి యే. కాఁబట్టి యప్పటిగోపికలచిత్తవృత్తి వినిర్మలయోగిమాన సవృత్తిని మించి యుండెననుట పొరపాటు కాదు. భక్తిభార మున వారి కిది కర్తవ్యము, ఇది యకార్యము, అను నూహ కలుగనే లేదు. అదియే పరాకాష్ఠ. అట్టివారికి భగవంతుఁ డప్పుడ ప్రత్యక్ష మగునన్నమాట శాస్త్రవిహితమే కాని వేఱుగాదు.

పాఠకులారా! గోపికలు వ్రతమొనరించు విషయమున భద్రకాళిం బూజించు విషయమునను ఈ రెండుపురాణము లకు నద్వైతమే సిద్ధించినది.

ఏవం మాసం వ్రతం చేరుః కుమార్యః కృష్ణచేతసః,
భద్రకాళీం సమానర్చుర్భూయాన్నందసుతః పతిః. ౬
నద్యాః కదాచిదాగత్య తీరే నిక్షిప్య పూర్వవత్,
వాసాంసి కృష్ణంగాయంత్యో విజహ్రుస్సలిలే ముదా. ౭
భగవాం స్తదభిప్రేత్య కృష్ణో యోగేశ్వరేశ్వరః,
వయస్యై రాగత స్తత్రవృత స్తత్కర్మసిద్ధయే. ౮
(శ్రీభాగవతము.)

స్తోత్రము కవచము తత్కథయు హెచ్చుగా శ్రీకృష్ణ జన్మఖండమునఁ గన్పట్టెడిని. కాని ముందు మీరు చదువఁబోవు కథయందు భేదము కనఁబడియెడిని. ఇంతయును గథాప్రణాళికకు భంగముగా లేకయుండెడిని. ఇఁక నవ్వలికథ వినుఁడు.

ఇట్లు గోపికలు జలక్రీడాసమాసక్తహృదయ లగుట భగవంతుఁడు శ్రీహరి యెఱింగెను. వీరిబుద్ధిస్థిరత యెంతవఱకుఁ గలదో పరీక్షింపవలయు నని యూహించెను. తీరమందున్న వస్త్రములులోనగువస్తువులం గాంచెను. ఇదియె మంచిసమయ మీతరుణముననే స్త్రీలచిత్తవృత్తి పరీక్షింపఁ దగియుండునని నిశ్చయించి గోపాలశిశువులను మాత్రము పిలుచుకొని యచ్చటు చేరెను. అమూల్యాంబరములఁ గైకొన శిశువుల కాజ్ఞాపించెను. మధురతరపదార్థముల వారిం గూడి భక్షించెను. నాప్రీతిం బడయం గోరి కాత్యాయని నేల యాశ్రయింపవల యునో కనుఁగొనియెద నని యూహించి నైవేద్యపదార్థముల సంతృప్తిమీఱ భక్షించెను. వారలం గూడి సుంతదూరము నకుఁ బోయి యందఱుఁ గూరుచుండంబనిచెను. వారెల్ల దిట్ట ముగాఁ దిని సుఖముగాఁ గూరుచుండిరి. ప్రతిదిన మీరీతినే సాగుచుండిన బాగుండుఁగదా యని తలంచుచుండిరి. అందుఁ గొందఱు వృక్షముల నెక్కి వస్త్రములప్రోగు నందుంచుకొని యుల్లాసమునఁ గూరుచుండిరి. శ్రీదాముఁడు, సుదాముఁడు, వసుదాముఁడు, సుబలుఁడు, సుపార్శ్వుఁడు, శుభాంగుఁడు, సుందరుఁడు, చంద్రభానుఁడు, వీరభానుఁడు, సూర్యభానుఁడు,

వసుభానుఁడు, రత్నభానుఁడు, అను పండ్రెండుగురు గోపాలడింభకులు వస్త్రముల నెత్తుకొని వృక్షస్కంధముల నిడి కూరుచున్నవారు. వారెల్ల గోలోకమున శ్రీకృష్ణ పరమాత్మకు సహచరులు. శ్రీహరిసేవం గోరి భూమియం దవతరించిరి. ఈపండ్రెండుగురు రామకృష్ణులు కలిసి పదునల్వురు ఆగుంపునందుఁ బ్రధానులు. తక్కుంగలవారు పెక్కుమంది గలరు. కాని వారెల్ల వీరుచెప్పినట్లు తిరుగువారు. వీరియందెల్ల బ్రధాననాయకుఁడు శ్రీకృష్ణపరమాత్మయే.

ఇట్లసంఖ్యాకులగు గోపాలడింభకులు వస్త్రములఁ దీసికొని దూరముగాక దగ్గరగాక యుండుచోటు చేరియుండిరి. నాలుగు రొక్కగుంపుగా నుండిరి. వారినడుమఁ గొన్నివస్త్రములు రాశిగా వేయఁబడియుండెను. ఈవేడుక యేమియో చూడ వారెల్ల వేడుకపడుచుండిరి. శ్రీకృష్ణుఁడు ఆవస్త్రరాశిలోఁ బ్రధానవస్త్రములఁ గొన్నింటిని దీసికొని కదంబవృక్షాగ్ర మెక్కి కూరుచుండి గోపికలం బిల్చి విలాసమున నిట్లు పల్కెను.

ఈఘట్టమున శ్రీభాగవతమునందు,

శ్లో. తాసాం వాసాంస్యుపాదాయ నీపమారుహ్య సత్వరః,
హసద్భిః ప్రహసన్ బాలైః పరిహాసమువాచహ. ౧౦

నిమాత్రము కన్పట్టెడిని. ఈశ్లోకమునకు మహాకవి పోతన,

శా. ఉద్యద్గంధగజేంద్రగౌరవముతో • యోషాంబరంబుల్ వి
భుం, డాద్యుం డర్భకుభంగి నర్భకులతో • హాసార్థియై

క్రొంచుఁ ద, స్నదవ్యంభఃకణశీతవాతజనితా • నందంబుతో
నెక్కెఁ దా, సద్యోముక్తదురంతపాదపజను • స్సంతాప
ముగ్ నీపముగ్.

అని వ్రాసిరి. మూలార్థముం బరికింపుఁడు. పద్యగతార్థమును బరిశీలింపుఁడు. పద్య మెంతహృద్యముగ నున్నదో కనుఁ గొనుఁడు. భగవచ్చేష్టల నెన్నివిధములవర్ణించుట కవికిష్టమో యూహింపుఁడు. భగవత్కథలపట్ల భక్తుల కౌశలు తెలియవను నానుడిని దీనిచే దృఢపఱుపవచ్చును.

సంస్కృతమున వృక్షాగ్రము నెక్కి శ్రీకృష్ణమూర్తియే గోపికం బిల్చి,

శ్లో. అత్రాగత్యాబలాః కామం స్వంస్వం వాసః ప్రగృహ్యతాం,
సత్యం బ్రవాణి నోనర్మ యద్యూయం వ్రతకర్శితాః. ౧౧
న మయోదితపూర్వం వా హ్యనృతం తదిమే విదుః,
ఏకైకశః ప్రతీచ్ఛధ్వం సహై వా తనుమధ్యమాః. ౧౨
తస్య తత్క్ష్వేళితం దృష్ట్వా గోప్యః ప్రేమపరిప్లుతాః,
వ్రీడితాః ప్రేక్ష్యచాన్యోన్యం జాతహాసా న నిర్యయుః. ౧౩

అని కనుపట్టెడు. ఇప్పట్టున శ్రీపోతనమహాకవి శ్రీకృష్ణుఁడు వస్త్రములనపహరించి వృక్షము నెక్కుటం జూచి గోపికలే కృష్ణుం జేరి మావలువలు ముట్టకు మని బహువిధములఁ బలికి నట్లు వ్రాసిరి. ఈపద్యమునకు మూలము వారిభక్తిభావము

యని తోఁచెడిని. భక్తిరసప్రవాహములగు నాపద్యముల నిటఁ గొన్నింటి నుదాహరించుచున్నాఁడను.

క. మామావలువలు ముట్టకు
మామా కొనిపోకు పోకు ♦ మన్నింపు తగన్
మామాన మేల కొనియెదు
మామానసహరణ మేల ♦ మానుము కృష్ణా.

సీ. బహుజీవనముతోడ ♦ భాసిల్లియుండుటో
గోత్రంబు నిల్పుటో ♦ కూర్మితోడ
మహి నుద్ధరించుటో ♦ మనుజసింహంబవై
ప్రజలఁ గాచుటొ కాక ♦ బలిఁ దెరల్చి
పిన్నవై యుండియుఁ ♦ బెంపువహించుటో
రాజుల గెల్చుటో ♦ రణములందు
గురునాజ్ఞ చేయుటో ♦ గుణనిధివై బల
ప్రఖ్యాతిఁ జూపుటో ♦ భద్రలీల

ఆ. బుధులు మెచ్చ భువిఁ బ్ర♦బుద్ధత మెఱయుటో
కల్కితనముచేయ ♦ ఘనత గలదె
వావిలేదు వారు ♦ వారు నావారను
నెఱుక వలదె వలువ ♦ లిమ్ము కృష్ణ.

క. కొంటివి మాహృదయంబులు
కొంటివి మానంబు లజ్జఁ♦గొంటివి వలువల్
గొంటి విఁక నెట్లుచేసెదొ
కొంటెవు గద నిన్ను నెఱిఁగి♦కొంటిమి కృష్ణా.

సీ. రాజసంబున నీవు • రంజిల్లు టెఱుఁగమే
చెలరేఁగి వింతలు • చేయుచుండ
సత్త్వసంపద గల్గి • జరగుటఁ దలఁపమే
సిరిగల్గి యన్యులఁ • జెనకుచుండ
గురుతరశక్తియు•క్తుఁడ వౌట యెఱుఁగమే
తామసంబున నెగ్గు • దలఁచుచుండ
నొకభంగితో నుండ•కుంటఁ జింతింపమే
మాయావి వై మాఱు•మలయుచుండ

ఆ. నేమి జాడవాఁడ • వేపాటిగలవాఁడ
వేగుణంబు నెఱుఁగ • వెల్లయెడల
నొదిగియుండ నేర • వోరంతప్రొద్దును
బటము లీఁగదయ్య • పద్మనయన.

అని మఱియుఁ బెక్కుపలుకులు పల్కినట్లు వ్రాసిరి. ప్రతిచోటను భగవంతునిదశావతారములను వర్ణించుట వారికలవాటు. భక్తిపారవశ్య మామహాకవి నన్నిపాట్లు పెట్టినది. అట్టియవస్థ తక్కినవారి కేల రాలేదని చింతిల్లవలయునే కాని మూలము లేకున్న నేలయీపద్యములఁ గూర్చిరని విచారింపరాదు. నిక్కపుభక్తుఁడు కదా పోతనమహాకవి. మూలార్థమును విస్తరించి పాఠకులకు హృదయంగమముగాఁ జెప్పుటయందుఁ బోతనగారికిఁ బోతనగారే సాటి యనవలయును. అవ్వలికథ నాలకింపుఁడు.

* కదంబవృక్షాగ్రముననుండి శ్రీహరి గోపికలం బిల్చి యిట్లు పలికెననుట పూర్వకథాస్మృతి.

గోపికలారా! మీరెల్ల వ్రతనియమమునుండి తొలంగితిరి. నామాటల నాలకింపుఁడు. వ్రతవిధానము వినుఁడు. ఆవల నిచ్ఛానుసారము జలములఁ గ్రీడింపుఁడు. నెలవ్రతమొనరింతుమని తొలుత సంకల్పించితిరి. ఈమాసము మార్గశీర్షమనంబడు. ఇది సర్వమాసోత్తమము. ఈమాసమునం దీమంగళకర్మము చేయ నారంభించితిరి. ఇట్లు వ్రతనియమమున నున్న మీర లెట్లు వివస్త్రలై స్నాన మొనరింప నీపవిత్రనదీజలంబుల దిగితిరి ఇట్లు స్నానముచేయుట వ్రతాంగస్నాననియమమునకు హానియగు. అట్టిహానిం గూర్చితిరి పరిధేయములగు వస్త్రములను బుష్పమాల్యాదులను, తక్కినవ్రతార్హవస్తువుల నేల తెచ్చితిరి? నియమము కదా ప్రధానము? కాని నేల పాటింపరు. [1] వ్రతమునందు ఏస్త్రీ వివస్త్రయై స్నానముచేయునో రోషమున నొడలు తెలియనివరుణుఁడు తాను ఆస్త్రీకపకారము చేయనెంచును. వరుణుఁడు క్రోధావిలమతి కాఁగాఁ దదనుచరులగు కింకరులు వస్త్రములను ఇతరవస్తువులను అపహరింతురు ఇఁక మీరెట్లు వివస్త్రలై పోవుదురు? వ్రతవిధాన మేమి కాఁగలదు? ఈవ్రత మెవ్వని నారాధింపఁ బ్రారంభముచేయఁబడి

---

* ఈభాగము శ్రీకృష్ణజన్మఖండముననుసరించి వ్రాయఁబడినది.

1 వ్రతేతు నగ్నా యా స్నాతి తాం రుష్టో వరుణస్స్వయం, వరుణానుచరాశ్చక్రుర్వాసోవస్త్రాపనిర్హృతిమ్. అని మూలము.

నదో ఆ దేవత మీవస్త్రముల నేల రక్షింపకుండినది. అట్టిదేవిని ఈశ్వరినిగా నుతించితిరి. వస్త్రముల రక్షింప లేకపోయినదే ఆ దేవి యెట్లు పూజ్యయగును? సురేశ్వరియగునాదేవి యీవ్రత ఫలమును మీకొసంగ నెట్లు సమర్థురా లగును? ఎవ్వతె ఫలము నీయ సమర్థురా లగునో ఆదేవతయే సర్వకర్మశక్తురా లగును. ఏదేవత వ్రతఫలము నీయసమర్థురాలు కాదో ఆదేవత యెట్లు పూజ్యురా లగును? యోజింపుఁడు. ప్రకృతము మీవస్త్రము లను బుష్పమాల్యాదులను రక్షింపఁజాలనిదేవత మీకు నిఁక నేలాగున వాంఛితముల నీఁజాలును. అట్టియశక్తురాలగు దేవతను బూజించి లాభమేమి?

ఇప్పట్టునఁ దెనుఁగుభాగవతమునందు,

క. రాజుల నెఱుఁగవు బలిమిని
 రాజిల్లెడుచీరలీవు • రమణుల మింకన్
 రాజున కెఱిఁగించెద మో
 రాజీవదళాక్ష నీవు • రాజవె ధరకున్.

అనుపద్యరత్నము కనుపట్టెడు. ఎంతచక్కనిపాకమున నీపద్యము పడినది! ఎంతటి యద్భుతార్థమున విరాజిల్లుచున్నది? ఇంచుక విన్నవించెద. నవధరింపుఁడు. కృష్ణా! నీవు కడుఁజిన్నవాఁడవు. బలిమిని=కండగర్వముచేత, రాజులనెఱుఁగవు=ప్రభువుల నెఱుఁగవు. అనఁగా నిట్టిపనిచేసిన నీవిషయమునెఱింగినరాజు లేమి యాగ్రహింతురో ఎట్టిదండనమును విధింతురో యని తెలిసికొనఁజాలవు. కేవలము మూర్ఖుఁడవు. ఈచీరలు అమూల్య

ములు. సద్వర్ణవిరాజితములు. రాజపత్నుల కర్హ్యాములు. అట్టి యీచీరల నియ్యవు. రమణులము = మేము స్త్రీలము సుమీ. మావిషయమై యెట్టియపకారముచేసినను అది గొప్ప తప్పగును. ఇంకన్ రాజున కెఱింగించెదము=ఇప్పటికైన మావలువలు మాకొసంగిన సరే. లేకున్న రాజునకు విన్నవింతుము. క్రూర దండనము చేయును జుమీ.

శ్లో. వాసః పశ్వన్నపానానాం గృహోపకరణస్యచ,
ఏతేనైవ ప్రకారేణ మధ్యమం సాహసం స్మృతమ్.

అని నారదస్మృతియం దున్నది.

శ్లో. పశువస్త్రాన్నపానాని గృహోపకరణం తథా,
హింసయన్ చౌరవద్దాప్యోద్విశతాద్యందమం తథా.

అని బృహస్పతిస్మృతియందుఁ జెప్పబడెను. కావున దండనము రాజు చేయక విడువరాదు కాన రాజున కెఱింగింతు మని వారి భావ మని గ్రహింపఁదగును. ఓ రాజీవదళాక్షా! తామరరేకుల వంటి కన్నులుగలవాఁడా. (అనఁగా నీవు బాలుఁడవు. అపరాధానపరాధముల నెఱుంగఁజాలవని భావము) నీవు ధరకున్ రాజవె. నీవు భూపాలకుఁడవా. కావు కదా, యని ప్రతీతికార్థము.

ఓకృష్ణా ! బలిమినిన్=సర్వాతిశాయిబలము గలవాఁడవు కాన దానిచే, రాజుల నెఱుఁగవు. రాజు లెవ్వరని నీకుం దెలియదు. నీవుండఁగా రాజనువాఁ డుండఁ జెల్లునా యని భావము. ఇంకన్ రాజిల్లెడుచీర లీవు? ఇంకనైన నీమనోహరాంబరము

లీయవు? ఇయ్యకున్న నేమిచేయుదువో తెలియఁజాలవా. రమ
ణులము సుమీ. నీయందే ప్రేమము గలవారము.

శ్లో. అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్.

అనునీప్రతిజ్ఞను మఱచితివా యని తాత్పర్యము. రాజున కెటే
గించెద వో రాజీవదళాక్ష = నీవు తామరరేకులవంటి కన్నులుఁ
గలవాఁడవు. కావున మాయీపరాభవమును జంద్రునకు విన్న
వింతుము. చంద్రుఁడు ప్రత్యక్షమగు. నీకన్నులు మూఁతపడును
లే. మఱి యేమిచేయఁ గలవు? నీవు రాజవె ధరకుఁ. నీవు
గోవర్ధనపర్వతమున కధీశుఁడవా? గోవర్ధనాద్రి నెత్తితినన్న
గర్వము నీకున్నదా. కానీ లే. నీకన్నులు మూఁతపడఁజేయుదు
మని రెండవ యర్థము ఇట్లు చమత్కారముగా మహాకవి పద్య
రత్నమును బ్రసాదించెను. దీనికి మూలము లేకున్న నేమి? సంద
ర్భానుసారముగా నున్నది.

ఇఁకఁ గథను వ్రాసెదను. శ్రీహరి యిట్లు పలుకఁగా
విని యాగోపికలప్పుడు తీరమును జూచిరి. వస్త్రములుగాని యుప
హారాదిపరికరములుగాని యందు లేకుండెను. వారు చింతాబ్ధి
మునింగిరి జలములందే యుండి వివస్త్రలై దుఃఖించిరి. మన
వస్త్రము లెచ్చటికిం గొంపోఁబడినవి? వస్తువు లెందున్నవి? అని
కొందఱు తమ సఖుల నడిగిరి ఇట్లు విషాదమునంది గోపికలా
కృష్ణునితో దోసిలొగ్గి వినయభక్తు లుట్టిపడ నిట్లు పలికిరి. ఈ
శ్వరా! మాకట్టుచీరల ననుగ్రహింపుము మేము నీకింకరులము.

మాయాత్మల స్పృశింపఁదగు నీవాపరిధానముల స్పృశింపరాదు. వ్రతార్హపదార్థములు గలవు. అవి దేవస్వములు. భగవత్సమర్పణము చేయక ముందే గ్రహింపఁ దగవు కాదు. నీవు వేదవేత్తవు. నీవెఱుంగని విషయములు లేవు. మహాత్మా! ధాత వస్త్రములం దాల్చి వ్రతమాచరింతుము. కాన మావస్త్రముల ననుగ్రహింపుము. నీవు భక్షింప నెన్నియో పదార్థములు కలవు. వీని నేల భక్షింపవలయు. ఇవి నైవేద్యార్హములు. కావున భక్షణార్హములు కావు.

అని గోపిక లిట్లు లాగోవిందుఁ బ్రార్థించునంతలో శ్రీదాముఁడు వస్త్రరాశిలోఁ గొంతభాగము తనదగ్గరనున్న దానిని గనఁబఱచి వారు చూచుచుండ దూరముగాఁ బరుగిడెను. ఇట్టు లంబరములఁ గొని పరుగిడు శ్రీదామునిం గాంచి యాగోపికల కందఱ కీశ్వరి యగు రాధాదేవి క్రోధయుక్తయై గోపికలతో నిట్లు పలికెను. ఓసుశీలా, ఓశశికళా, ఓచంద్రముఖీ, మాధవీ, కదంబమాలా, కుంతీ, యమునా, సర్వమంగళా, పద్మముఖీ, సావిత్రీ, పారిజాతా, జాహ్నవీ, సుధాముఖీ, పద్మా, గౌరీ, స్వయంప్రభా, కాళికా, కమలా, దుర్గా, సరస్వతీ, భారతీ, అపూర్ణా, రతీ, గంగా, అంబికా, సతీ, సుందరీ, కృష్ణప్రియా, మధుమతీ, చంపా, చందననందినీ, మీరెల్ల వెసలి పరుగిడు నీగోపాలబాలునిఁ గట్టి తీసికొని రండు. త్వరపడుఁడు. వాఁడు పరుగిడుచున్నవాఁడు. అని రాధాదేవి యాజ్ఞాపింపఁగానే ఆతొందఱలో నేమియు నాలోచింపక నీటినుండి వెలువడి క్రోధ

మున వివస్త్రలయ్యెనిదియేమని యూహింపక యొకవిధముగా మర్మము తెలియకుండఁ బరుగిడిరి. వీరు బయలువెడలఁగనే వీరి చెలికత్తియలు వేలకు వేలుగా వారినే యనుసరించి క్రోధసంరక్తలోచనలై పరుగిడిరి. శ్రీదామునిం బట్టుకొని తెచ్చి రాధాదేవి కప్పగించుమూహ వారి కపుడుండినవి. వీరిని జూడఁగనే ఆగుడ్డల రాశి నెత్తుకొని పరుగిడసాగెను. గోపాలకు లందఱు వస్త్రముల నుంచుకొని కూరుచున్నచోటికే శ్రీదాముఁడు పరుగిడసాగెను. ఆగోపికలును వానివెనుకొని వేగముగాఁ బరుగిడిరి.

ఇట్లు పరుగిడి వస్త్రచోరులగు గోపకులను వేగముగాఁ బరుగిడి చుట్టుముట్టిరి. వీరందఱు చుట్టుముట్టఁగా నాబాలకులాతురపడి వస్త్రములమూట నెత్తుకొని శ్రీకృష్ణమూర్తి యున్న తావునకుఁ బరుగిడిరి. ఇట్లు పరుగెత్తుబాలకుల నాగోపికలు నిలు నిలుమని యదలించిరి. గోపికలవలని భయముచే నాగోపబాలకులు వస్త్రముల శ్రీకష్ణునికడ నుంచిరి. శ్రీకృష్ణమూర్తియు నాయంశుకముల నాచెట్టుకొమ్మలయందెల్ల నునిచెను. ఆకదంబవృక్షమాగోపికాంగనల వస్త్రములరంగులచే విచిత్రముగాఁ బ్రకాశించెను. ఇట్లు వస్త్రములనెల్ల నాకదంబవృక్షము కొమ్మల నునిచి వారికిం గొన వీలులేకుండఁ జేసి యాగోపికలతో, పరిహాసపూర్వకముగా నిట్లు పలికెను.

ఓగోపికలారా! వివస్త్రలై యిపు డేమి చేయఁగలరు? వస్త్రములఁ గోరుదురేని చేతులు జోడించి ప్రార్థింపుఁడు. అది యిష్టములేకున్న నిపుడే పోయి మీకునీశ్వరియగు రాధికాదేవిని బ్రార్థింపుఁడు. ఈవస్త్రములే వలయునేని చేతులొగ్గి ప్రార్థింపుఁడు. అట్లు వేఁడరేని వస్త్రముల నేనిచ్చువాఁడను గాను జుఁడీ! ఇపుడు మీకీశ్వరియగు రాధిక నా కేమియాజ్ఞ చేయఁగలదో చూచెదఁ గాక. ఏదేవతం గూర్చి మీరీవ్రతము నాచరించుచున్నవారో యాకాత్యాయని నన్నేమిచేయఁగలదో చూచెదఁ గాక. మీరెల్లం బోయి నేనిట్లుపలికితి నని మీరా ధికకుం దెల్పుఁడు. అని శ్రీకృష్ణమూర్తి పలుకఁగా విని యా గోపకన్యకలెల్ల లోచనకోణముల శ్రీహరిం జూచి రాధికాపరిసరమునకుం బోయిరి. శ్రీహరి పల్కినట్లే యామెకుం దెల్పిరి. కామపీడిత యగు నారాధాదేవి పక్కున నవ్వెను. మఱియు వారిపల్కు లాలకించి పులకాంచితసర్వాంగియై సిగ్గుచే స్మితమంకురింప శ్రీహరికడకుం బోనొల్లదయ్యెను.

అంతట నారాధాదేవి జలమునందే యోగాసనము నలవరించి శ్రీకృష్ణపాదారవిందముల ధ్యానించెను. బ్రహ్మేశానం తధర్ములకుంగూడ వంద్యుఁడై సర్వవాంఛాప్రదుండగుశ్రీహరిని బ్రార్థించెను. శ్రీమాధవ పాదాంబుజముల స్మరించి స్మరించి సాశ్రుపూర్ణవిలోచన యై భావాతిరేకమువలనఁ బ్రాణేశ్వరుని నిర్గుణపరబ్రహ్మము నిట్లు వినుతించెను.

* ఓగోలోకాధిపతీ, నీవు గోపీశ్వరుఁడవు. నాప్రాణేశుఁడవు. ప్రాణములకంటెఁ బ్రియతముఁడవు. దీనులకు బంధువవు. దీనులఁ గాచుప్రభువవు. సర్వేశ్వరుఁడవు. ఇట్టి నీకు నమస్కారము చేయుదానను. గోపాలకప్రభువా! గోసమూహామునకు దిక్కు నీవే. యశోదాదేవి కానందమును గూర్చువాఁడవు. నందకుమారకా, సదానందుఁడవు. నిత్యానందుఁడ వన నీవే. ఇట్టి నీకు వందనములు. ఇంద్రునకుఁ గల కండకావరము నడంచితివి. బ్రహ్మయహంకారము నిర్మూలించితివి. కాళీయఫణిదర్పము నపహరించితివి. ప్రాణనాథా! శ్రీకృష్ణా! నీకు నతు లొనరించుచున్నదానను. శివానంతబ్రహ్మబ్రాహ్మణులకు నీవే యధిపతివి. పరాత్పరుఁడ వన్న నీవే. బ్రహ్మస్వరూపుఁడవు. బ్రహ్మజ్ఞుఁడవు. బ్రహ్మయుత్పత్తికి నీవే యాధారభూ

---

రాధాకృతశ్రీకృష్ణస్తుతిః.

*గోలోకనాథ గోపీశ మదీశప్రాణవల్లభ, హేదీనబంధో దీనేశ సర్వేశ్వర నమోఽస్తుతే. ౧. గోపేశ గోసమూహేశ యశోదానందవర్ధన, నందాత్మజ సదానంద నిత్యానంద నమోఽస్తు తే. ౨. శతమన్యో ర్మన్యుభగ్న బ్రహ్మదర్పవినాశక, కాలీయదమన ప్రాణనాథ కృష్ణ నమోఽస్తు తే. ౩. శివానంతేశ బ్రహ్మేశ బ్రాహ్మణేశ పరాత్పర, బ్రహ్మస్వరూప బ్రహ్మజ్ఞ బ్రహ్మబీజ నమోఽస్తుతే. ౪. చరాచరతరో ర్బీజ గుణాతీత గుణాత్మక, గుణబీజ గుణాధార గుణేశ్వర నమోఽస్తుతే. ౫. అణిమాదికసిద్ధీశ సిద్ధే స్సిద్ధిస్వరూపక, తప స్తపస్విం స్తపసాం బీజరూప నమోఽస్తుతే. ౬. య దనిర్వచనీయం చ వస్తు నిర్వచనీయకం, తత్స్వరూపతయోర్బీజ సర్వబీజ నమోఽస్తుతే. ౭. అహం సరస్వతీ ల్లక్ష్మీ ర్దుర్గా గంగా శ్రుతిప్రసూః, యస్య పాదార్చనా న్నిత్యం పూజా

తుండవు. ఇట్టి నీకు మ్రొక్కుచున్నదానను. చరాచరసృష్టి యను మహావృక్షమునకు బీజము నీవే. గుణాతీతుండవు. గుణాధారుండవు. గుణముల కధిపతివి. ఇట్టి నీకుం జేమోడ్పు లర్పించుదానను. అణిమాద్యష్టసిద్ధుల కధిపతివి నీవే కదా! సిద్ధులకు సిద్ధిస్వరూపుండవు కూడ నీవే. తప మన నీవే. తపస్సుచేయుదువు: తపోబీజరూపుండవు. ఇట్టినీ కంజలి ఘటించుచున్నదానను. ఏవస్తు వనిర్వచనీయమో ఏది నిర్వచనీయమో, తత్స్వరూపుండవు. వారికి బీజభూతుండవు. సర్వబీజరూపుండవు. అట్టి నీ కభివాదనములు. స్వామీ! నేను, సరస్వతియు, లక్ష్మియు, దుర్గయు వేదజననియగు గంగానదియు, నేనీపాదారవిందార్చనమువలనం బూజ్యతం గాంచితిమో యట్టి నీకు వినతులు. ఎవ్వని

---

తస్మై నమో నమః. ౮. స్పర్శనే యస్య భృత్యానాం ధ్యానేనచ దివానిశం, పవిత్రాణిచ తీర్థాని తస్మైభగవతే నమః. ౯. ఇత్యేవ ముక్త్వా సా దేవీ జలే సన్న్యస్య విగ్రహం, మనః ప్రాణాంశ్చ శ్రీకృష్ణే తస్థౌ స్థాణుసమాసతీ. ౧౦. రాధాకృతం హరేః స్తోత్రం త్రిసంధ్యం యః పఠేన్నరః, హరిభక్తిం చ దాస్యం చ లభేద్రాధాగతిం ధ్రువమ్. ౧౧. విపత్తౌ యః పఠేద్భక్త్యా సద్యస్సంపత్తి మాప్నుయాత్, చిరకాలగతం ద్రవ్యం హృతం నష్టంచ లభ్యతే. ౧౨. బంధువృద్ధి ర్భవేత్తస్య ప్రసన్నం మానసం పరం, చింతాగ్రస్తః పఠేద్భక్త్యా పరాం నిర్వృత్తి మాప్నుయాత్. ౧౩. పతిభేదే పుత్రభేదే మిత్రభేదే చ సంకటే, మాసం భక్త్యా యది పఠేత్సద్య స్సందర్శనం లభేత్. ౧౪. భక్త్యా కుమారీ స్తోత్రంచ శృణుయా ద్వత్సరం యది, శ్రీకృష్ణ సదృశం కాంతం గుణవంతం లభేద్ధ్రువం. ౧౫. శ్రీకృష్ణజన్మఖండే సప్తవింశతితమోఽధ్యాయః.

భృత్యులస్పర్శమువలన, రేయింబవళ్లు ధ్యానించుటవలనఁ బవి త్రతీర్థము లగుదురో, ఆనీకు సాష్టాంగప్రణతులు.

అని పలికి యారాధాదేవి తత్పావనజలంబుల శ్రీకృష్ణ విగ్రహమును లిఖించి మనఃప్రాణముల శ్రీకృష్ణునందుఁ జేర్చి స్థాణువలె నుండెను. ఇది రాధాకృతశ్రీకృష్ణస్తోత్రము. హరి ప్రీతికరము. త్రికాలములయం దెవ్వఁడు పఠించునో అతఁడు హరిభక్తిని దాస్యమును రాధాగతిని బొందును. ఎవ్వఁ డాప త్కాలమున భక్తితోఁ బఠించునో అప్పుడే యాబాధ తొలఁగి సంపద లలరారును చిరకాలముక్రిందట నపహృత మగు ద్రవ్యము దొరకును. ఈస్తుతి పాఠకునకు నుపకారబుద్ధి గల్గును. మనఃకష్టములు తొలఁగి ప్రసన్నుఁ డయియుండును. చింతా గ్రస్తుఁడు పఠించిన ఆచింత తొలఁగును. ధ్రువము. పతిభేదము, పుత్రభేదము, మిత్రభేదము గలిగినతఱి ఎవ్వరే నొకమాసము భక్తిచేఁ బఠించిన నపుడే యాకష్టములు తొలఁగును. కన్యక భక్తిచే నీస్తుతిని వత్సరము విన్నయెడల గుణవంతుఁడై శ్రీకృ ష్ణతుల్యుఁ డగుకాంతుని బొందును.

ఇట్టు లారాధిక జలములయందే యుండి శ్రీకృష్ణపాదా రవిందముల ధ్యానించి వినుతించి కన్నులు తెఱువఁగనే యామె దృష్టికిఁ బ్రపంచమంతయు శ్రీకృష్ణమయంబుగాఁ గనుపట్టెను. యమునాతీరమంతయు వస్త్రద్రవ్యమయముగాఁ గనుపట్టెను. ఆవిధ మాలోచించి యిది కలయా యని రాధిక యూహిం చెను కాని ప్రత్యక్షముగాఁ గన్పడువానిం జూచినంతన పుల

కాంచితసర్వాంగిరై రాధిక పరమానందభరితురా లయ్యెను. ము న్నేద్రవ్య మేచోట నునుపఁబడియుండునో ఆద్రవ్య మా చోటనే యుండినట్లు గోపికలు కాంచిరి. అప్పుడే నీటినుండి వెడలి తమతమవస్త్రములం గైకొని ధరించి యథావిధి నా వ్రతము నాచరించిరి. కాత్యాయనివలన నిష్టవరముల నొంది వారెల్ల నిండ్లకుం బోయిరి.

పాఠకులారా! ఈఘట్టమున శ్రీభాగవతమున నించుక భేదముగాఁ బైకథ వ్రాయఁబడినది. ఆభేదము తెలిపినఁ గాని గోపికావస్త్రాపహరణ కథయందలి వాస్తవార్థము తేటపడదు. భేదమెంతయో లేదుగాని యున్నట్లు తోఁచును. పరమతముల వారీవిషయమునే ప్రధానముగా గ్రహించి శ్రీకృష్ణచరితము నాక్షేపింతురు. అట్టి దూషణముల నాలకించియు మనలోఁ గొందఱు సరే యని తల లూఁచుచుందురు. దానఁ గలుగుచెట్ట నూహింపఁజాలరు. కావున నిందిసుమంతయు నాక్షేపింపఁ దగిన విషయము లేనేలేదు. ఆమాట దృఢపడుట కీభాగవత కథ వ్రాయవలసివచ్చినది.

శ్రీకృష్ణుఁడు నీరువెడలివచ్చి వస్త్రములు పుచ్చుకొనుఁ డనఁగానె కాంతలెల్ల యథోచితరీతి వెడలివచ్చిరనియు, వారిం గాంచి గోపాలబాలకుఁడు మీరు వివస్త్రలై వ్రతాంగస్నానము చేయఁదగ దనియు, ఆపాపపరిహారముగా నమస్కరింపుఁ డని హెచ్చరించెననియు ముందే వ్రాయఁబడియెఁ గదా. ఆపిదప నాగోపాంగనలెల్ల శ్రీకృష్ణునానతిరీతి ధర్మయుక్తముగా నొక

చేతితో నమస్కరించిరి. ఆనమస్కారము క్రొత్తపద్ధతిగా నుండెను ఒంటిచేతి నమస్కారము భారతభూమి నుండునాచారము కాదు కదా! కావున శ్రీహరి వారలం గాంచి నవ్వుచు ధర్మయుక్తముగా నిట్టులు పలికెను. గోపికలారా! మీరిట్లు నమస్కరించుట ధర్మహితము కాదు. * ఎవ్వఁడొక్కహస్తముచే భగవంతుఁడగు నచ్యుతునకు నమస్కరించునో వానికి హస్తచ్ఛేదమే దండమని ధర్మవేత్తలు పలుకుదురు. కాన రెండు చేతులు జోడించి భక్తిమీఱ నమస్కరింపవలయును. అట్లు చేసిన నాకుఁ బరమప్రియము గల్గును. మీరీపాపమును దొలఁగించుకొనఁ గోరుదురేని రెండుచేతులతో నమస్కరింపుఁడు. వస్త్రముల గ్రహింపుఁడు. [1]అని శ్రీహరి పలుకఁగా నావ్రజాంగనాశిరోమణులు వస్త్రహీనముగా స్నానమొనరించినందున వ్రతభంగ మాయెనని విన్నంతన మదులు చలింప దానికి భంగము గాకయుండఁ జేయఁగోరి పాపాపనోదనార్థము చేతులు జోడించి శ్రీహరికి నమస్కరించిరి. శ్రీహరియే సర్వపాపపరిహారకుఁ డని నమ్మిరి.

ఇట్లు గోపికలు తాఁ జెప్పినట్లు నమస్కరింప భగవంతుఁ

---

* ఏకేన పాణినా యో వై ప్రణమే ద్దేవ మచ్యుతం, తస్య దండః కరచ్ఛేద ఇతి ధర్మవిదో విదుః-అని మూలము. 1 ఇత్యచ్యుతే నాభిహితం వ్రజాబలా మత్వా వివస్త్రాప్లవనం వ్రతచ్యుతిం, తత్పూర్తికామా స్తదశేషకర్మణాం సాక్షాత్కృతం నేము రవద్యమృద్యతః-అని మూలము. ఈయర్థము స్పష్టముగాఁ గల పద్యము తెనుఁగున లేదు. కారణ మేమో.

డగు దేవకీనందనుఁడు వారి కావస్త్రము నెల్ల నొసంగెను. కరు ణయు స్నేహము వారిపైఁ దనకుఁ గలదని తేటపఱచెను. ఇట్లు గోపిక లాకృష్ణునిచే వంచింపఁబడియు, వస్త్రము లపహరింపఁబడి సిగ్గు వదలి బయటికి వచ్చునట్లు చేయఁబడియు, నుపహాస వచనములు పలుకఁబడియుఁ జెప్పినది ధర్మయుక్తమని విలాస ముగా మాటలాడఁబడియు, వస్త్రము లపహరించి కష్టపెట్టఁ బడియు నిట్లు లెన్నియోవిధములఁ జింతఁ గల్గింపఁబడినను ప్రియ సంగనిర్వృతిచే దోషబుద్ధి నూనక శ్రీహరిని సాదరముగా వీక్షించిరి. పరమానందము నందిరి. ప్రాణేశుఁ డీలాగున మనతో వినోదించుటయే పురుషార్థమని భావించిరి. అంతియకాని యిట్టియిక్కట్టున నిట్లుచేయవచ్చునా యనునాగ్రహము వారికిం గలుగదయ్యెను.

(ఈఘట్టమునఁ దెనుఁగున మూలార్థమును బోధించు పద్యరత్నము కానరాదు. ఈయర్థమే మార్చిమార్చి భక్తశిఖా మణి పోతనమహాకవి,

సీ. శృంగారవతులార ♦ సిగ్గేల మిముఁ గూడి
పిన్ననాఁటనుగోలెఁ ♦ బెరిఁగినాఁడ
నెఱుఁగనే మీలోన ♦ నెప్పుడు నున్నాఁడ
నేను జూడనిమర్మ ♦ మెద్ది గలదు
వ్రతనిష్ఠ లై యుండి ♦ వలువలు గట్టక
నీరు సొత్తురె మీరు ♦ నియతి దప్పి

కాత్యాయనీదేవిఁ ♦ గల్లసేయుట కాక
యీరీతి నోఁచువా ♦ రెందుఁ గలరు

ఆ. వ్రతఫలంబు మీరు ♦ వలచినఁ జక్కఁగ
నింతులెల్లఁ జేతు ♦ లెత్తి మ్రొక్కి
చేరి పుచ్చుకొనుఁడు ♦ చీరలు సిగ్గు పో
నాడనేల యెగ్గు ♦ లాడనేల.

ఆ. చీర లపహరించి ♦ సిగ్గులు విడిపించి
పరిహాసించి యైనఁ ♦ బరఁగ మనకు
ఘనుఁడు నోము కొఱఁత ♦ గాకుండ మ్రొక్కించె
ననుచు హరి నుతించి ♦ రబల లెల్ల.

క. ఉల్లములు నొవ్వ నాడినఁ
గల్లలుచేసినను నగినఁ ♦ గలఁచిననైనన్
వల్లభులు చేయుకృత్యము
వల్లభలకు నెగ్గుగాదు ♦ వల్లభ మధిపా.

అని కనుపట్టెడు. [కొంత పెంచియుఁ గొంత వదలియుఁ గొంత వేఱొకభంగి మార్చియు మహాకవి లోకులకు హితమగునట్లు వ్రాసెనని గ్రహించుట యుత్తమము.]

ఇట్టులాగోపిక లానందపరవశలై హరియొసంగినవస్త్రములఁ దాల్చి తమరు గోరినప్రియుఁడు కనఁబడుటచే మఱింత యుత్సాహము గలవారలై శ్రీకృష్ణసక్తమగుచిత్తము మరల్పరామి సిగ్గుచే విశాలములగు చూపులు వెలయఁగాలు గదల్పక యందే యుండిరి. భగవంతుఁ డాగోపికలభావ మెఱింగి తనపాదస్పర్శనకుతూహలమున నిందే యున్నవారు కదా యని

యూహించి వ్రతనియతలగువారికి సంకల్పము తానే చెప్పఁ బూనెను.

కాంతలారా! మీరు నన్నర్చింప సంకల్పించితిరని నేనె ఱుఁగుదును. ఆవ్రతము నేనంగీకరించితినేని తప్పక ఫలముని చ్చును లేకున్న నిష్ఫల మగును. అంతియ గాదు. నాయందా సక్త మగు మతి యెవ్వరికిం గల్గదో వారికామము కేవలకామ ఫలములనే యొసంగును. నాయం దాసక్తమతులగువారి కామము సకలార్థప్రదము. వేఁగఁజేయఁబడిగాని, వండఁబడి గాని, యవాదులగు ధాన్యములు విత్తిన మొలక లెత్తఁజా లవు. అట్లు కామమునకు సంకల్పించిన సంకల్పము ఫలింపదు. నిష్కామసంకల్పము సకలార్థముల నీయఁజాలును. కావున నోగోపికలారా! వ్రజమునకుం జనుఁడు. మీవ్రతము ఫలిం చిన దని భావింపుఁడు. నాతోఁ గూడి యీరాత్రులయందు విహరింపుఁడు. ఆర్యామహాదేవిం గూర్చి యీకోరికచేఁ గదా మీ రీవ్రతము చేసితిరి. ఆర్యాదేవి యిచ్చిన దీవరమే. కావున నిశ్శంకల నింటికిం జనుఁడు. మీరు పతివ్రతలుగాఁ బొగడొం దుదురు. అని శ్రీకృష్ణపరమాత్మ పలుకఁగాఁ దదాజ్ఞంగొని సఫ లమనోరథ లై యాగోపకన్యకలెల్ల శ్రీహరిపాదాంభోజముల ధ్యానించుచు నతికష్టముమీఁద నటనుండి కదలిరి. ఎట్లో వ్రజమును బ్రవేశించిరి.

మహామతులారా! భక్తిభరితస్వాంతులారా! గోపికా వస్త్రాపహరణకథను జదివితిరి. పురాణభేదములవలనఁ గథాభేద

మెంతమాత్రమో తెలిసికొంటిరి. ఇఁక నిందలి సారాంశమును వినుఁడు. గోపికావస్త్రాపహరణమే శ్రీకృష్ణచరిత్రమునకుం గళంకము గల్గించినదని కొంద ఱందురు. ఇదియే కృష్ణచరిత్రమును విఖ్యాతినొందునట్లు చేసిన దని నాభావము. ఈకథనుండి నేర్చు కొనఁదగిన విషయములందు ముఖ్యమైనది యనన్యభక్తి. ఇది యొక్కఁడే యిందు ముఖ్యము. ఇంక ననేకవిషయము లిందుఁ గలవు. అవి యెల్ల నేర్చుకొనఁదగినవి కా వని నాభావము కాదు. ఇం దిది ముఖ్యతమమని వ్రాయుట సత్యమా కాదా యను విషయము పాఠకులకే గోచరించును. ఇఁక సారాంశము వినుఁడు.

హేమంతకాల మారంభ మయ్యెను. ప్రాతస్స్నానము చేయువారల కాకాలమే పరీక్షాకాలము. కావుననే కాఁబోలు భగవంతుఁడు "కంపంతంతంపునీమహే" అని చెప్పెను. గ్రీష్మ కాలమునఁ బంచాగ్నిమధ్యమము. హేమంతకాలమున శీతల జలమధ్యవాసము భక్తునిచిత్తవృత్తిని బరీక్షించుట కేర్పడినవి కాని వృథా కల్పితములు కావు. హేమంతమునఁ బంచాగ్ని మధ్య స్థితి, గ్రీష్మ కాలమున శీతలజలమధ్యవాసము చేయుట సులభము. కాని పెద్దలు పరీక్షాపద్ధతుల మిగులఁ జక్కఁగా నేర్పఱచిరి. శ్రీహరిపైఁ గలభక్తి తేటపడునని వారిభావ మైనట్లు కనుపట్టును. అట్టియిక్కట్టుల మనలోఁ గొందఱు వేదాంతవాక్య ముల వల్లింతురు.

శ్లో. మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే,

సకృద్గీతాంభసిస్నానం సంసారమలమోచనమ్.

అను శ్లోకము.

క. తా నై తే పరిశుద్ధుఁడు
మే నై తే ముట్టుబోకి ♦ మేనో తానో
పూనికఁ జేసెడితీర్థ
స్నానం బది యెవరికన్న ♦ సంపగిమన్నా.

అనుపద్యము వారికి శరణములు. ఈయుదాహరణములు కోటి బ్రహ్మహత్యలు చేసి "మహాదేవా" యన్న నవి నశించునని చెప్పినట్లున్నవి. అయ్యో! ఎంతటి యవివేకము. పై వాక్యములు ప్రమాణములు కావా యను ప్రశ్నము రావచ్చును. కాని యవియెవ్వరికని యూహించుకొనిన సులభముగాఁ దదర్థము తేలును. దేహాభిమానము లేక సమలోష్టాశ్మకాంచనుఁ డగు వానికి స్నానము ప్రధానము కాదనుట సర్వవిద్వదంగీకృతము. అది లేక హేమంతకాలప్రాతస్స్నానమునకే యైన నది వంచన చేయుటకే కాక మఱెందుల కగును? దొంగతనము చేసి యిది తప్పు కాదా యని యడుగ

"అమేధ్యాదపి కాంచనమ్"

అన్న మనుస్మృతివాక్యభాగమును జదివి ఎటులైనఁ గాంచనము సంపాదింప దగునన్న సమాధానము చెప్పుట యెట్లో ఇదియు నట్టిదే. కావున మహాజ్ఞానులధర్మములు కర్మఠుల కుపయుక్తము లనరాదు. అజాతిభిక్షు సర్వసంగపరిత్యాగ మొనరించినమహాత్ము నకుఁగాని యితరులకుఁగాదు. మతధర్మముల నుల్లంఘింపఁదగిన

వారు సమలోష్టాశ్మకాంచనులుగాని యందఱుం గారు. కాంతా కాంచనములపైని ఆశ దిగవిడిచినవాఁడే జ్ఞాని. అట్టివానిధర్మ ముల నంద అనుసరింపఁ దగరు. మహాత్ములగుజ్ఞానులుకూడ లోకసంగ్రహార్థమై సదాచారముల నాశ్రయింతురు. ఏలన తమ్ముఁజూచి యితరులు నేర్చుకొందు రని. ఇట్లుండ వైరాగ్య సంపత్తి లేక చచ్చుమాటలు నాలుగు మాట లాడ నేర్చుకొని వేదాంతులమని చెప్పుకొనుటయు, దుర్వృత్తిలోఁ బ్రవేశించి యీ వేదాంతవాక్యములు వల్లించి దానిం గప్పిపుచ్చుటయు హేయకృత్యములు. వారు మహాపాపమతులు. వారిచెంత కైనఁ బోరాదు. వారిశుష్కవాక్యముల వినరాదు. ఏలన, శ్రీ శంకరభగవత్పాదులుగారు,

"సన్న్యస్య శ్రవణం కుర్యాత్."

అని వచించిరి. వేదాంతవిషయములు వినుటకుం గూడ వైరాగ్య సంపద కావలెనఁట. అబ్బా! ఎంత యోగ్యత యుండినఁ గాని వేదాంతము జోలికిం బోరాదు? సంసారవార్తావిముఖుఁడు కావలయునని పైవాక్యమునకు భావము. అట్లులేక పర వంచనము చేయుచు దురభ్యాసములు గల్గి వానిం గప్పిపుచ్చ నీవేదాంతము నుపయోగించుట తల్లిని హీనకార్యములందు నియోగించునట్టిది కాక మఱేమిటి? కాఁబట్టి స్మృతిహితము లగు ధర్మము లవశ్యానుష్ఠేయములని స్పష్టము కాక మానదు.

హేమంతకాలదినములు రాఁగానే గోపికలు యమునా నదీస్నాన మొనరించి యుదయకాలమునందే కాత్యాయనీదేవి

నారాధింపఁబూనిరి. తెల్లవాఱుజామముననే లేచి స్నానార్థము నదికిం బోయి యం దుషఃకాలముననే యవగాహనస్నానము విధిమంతముగా నాచరించి భగవంతుని ధ్యానించిరి. ఒడ్డున కేతెంచి యిసుకతోఁ గాత్యాయనిం జేసి దానికిఁ బూజచే యుచుఁ దమకుం గల యుపహారముల నైవేద్య మిడుచుండిరి. తల్లీ! కాత్యాయనీ! మాకు శ్రీకృష్ణుఁడు భర్త యగునట్లు వరము లిమ్మా యని ప్రార్థించిరి. దుర్గామంత్రమును యథా శక్తి భక్తియుక్తిమై జపించిరి. దుర్గా, శివా, అభయా, మాయా, నారాయణీ, సనాతనీ, జయా, సర్వమంగళా నామధే యముల నెనిమిదింటిని అర్థయుక్తముగాఁ బఠించి ధ్యానించిరి; ఓజగదంబా! నందనందనుఁడు మాకు భర్త యగునట్టు లనుగ్ర హింపుమా యని వేఁడిరి. దివ్యకుసుమదామముల నాయంబ నలంకరించిరి. దివ్యనైవేద్యపదార్థము లర్పించి తృప్తినొందించితి మనిసంతసించిరి. కవచమును బఠించిరి. సకలవిధములఁ బూజించి సంతుష్ట యగు నాయంబను గృష్ణమూర్తి మాకుఁ బతిగాఁ బ్రసా దింపుమా యని ప్రార్థించిరి.

ఇట్లు హేమంతకాలాదిభాగమగు మార్గశీర్షమాసము నంతయుఁ బూజించుచుండిరి. కడపటిదినమున నంబకు వివిధవి ధనైవేద్యవస్తువులం గొని స్నానమున కరిగిరి. నదీకూలమున నావస్తువుల నిడిరి. స్త్రీలచిత్తము సదా కౌతుకాయత్తము. కాన నాఁడు వ్రతాంతదివసము. కావునఁ గాత్యాయనీదేవి తమకు వరము నొసంగునని నమ్మి రాధాప్రభృతులందఱు వివస్త్రలై నది

లో దిగిరి. అదియొక్కటియే వారొనరించిన ప్రమాదకార్యము. ఎట్టివారికేని ప్రమాదములు కలుగునన నీకవనితల కొక్కప్రమాదము గలుగుట గొప్పతప్పుగా భావింపఁదగినది కానే కాదు. ఈయకార్యము వారికెఱిఁగింప భగవంతుఁడు తలంచెను. మార్గశీర్షమాసమంతయు నాహిమసమ్మిశ్రజలముల వారు మునుంగుట యేయుద్దేశము నెఱవేఱుటకో శ్రీహరికిఁ దెలియును. వారి కంతటిశ్రమమున కోర్పుశక్తి యెట్లు కలిగెనో భగవంతుఁ డెఱింగెను. కాని వ్రతనియమమును మఱచుట పాడిగా దిది వారికిం దెలియఁజేసి మనోరథములఁ బూరించవలయునని మదిఁ దలఁచెను. వెంటనే తనతోడిబాలుర నందఱం బిలుచుకొని యట కేగెను.

శ్రీకృష్ణుఁడు భూలోకమున నవతరించుటకును దెవ్వరెవ్వ రేయేకారణముల నవతరించిరో తొలిసంపుటమందే చదివియుందురు. రాధ యిపు డెవ్వరియింటఁ బుట్టెనో గోపికలు గోలోకమునుండి యేటి కవతరించిరో చదివియే యుందురు. ఆవిషయములు మఱవఁగూడదు. అవి హృదయమున మెదలుచుండిన నిందలికృత్యము లేమాత్రము తప్పుగాఁదోఁపవు. కావుననే భగవంతుఁ డచటికి మిత్రులం గలిసి పోయెను. యమునాతీర మాతరుణమున నమూల్యాలంకారములతో భూపురంధ్రిని గైసేయ నెట్లుండునో యట్లుండెను. అమూల్యాంబరము లందుఁ గనఁబడుచుండెను. పుష్పదామములు, మణిఖచితకాంచనభూషణములు, రత్నహారములు, మహితపదార్థములు ఎన్నియో

యందు వెలయుచుండెను. ఇన్నియు నిండుండ నాలేనులు కోమ లశరీరముల నాహిమమిశ్ర కాళిందీవారిపూరమున ముంచి శీత మున వడవడ వడంకుచుండుట మనోగోచర మయ్యెను. ఇదియే వీరిని పరీక్షింపఁదగినయద నని హృదయమునఁ దలంచెను. ముదముమీఱ నాబాలకులకు సంజ్ఞ చేసెను.వారెల్ల వస్త్రములఁ గొందఱు, పదార్థములఁ గొందఱు కైకొనిరి. ఎవ్వరుగాని యా రత్నహారములజోలికిఁ బోరైరి. భగవంతుని గూడి యాచేరువ నొక్కచో వృక్షాగ్రములపైఁ గూరుచుండిరి. శ్రీహరి కదంబ వృక్షమునెక్కెను.నైవేద్యవస్తువులఁ బ్రీతిమీఱఁబాలకులంగూడి దైవమారగించెను. పరమసంతోషమున బాలురతో నుండెను.

శ్రీదామాదులు పండ్రెండుగురు బాలకులలో ముఖ్యులుగా నెన్నఁదగినవారు. శ్రీదామునిచరిత్ర మింతకుముందే చదివితిరి గదా. అతఁడే యీశ్రీదాముఁ డని తలంపుఁడు. ఈపండ్రెండుగురు గోపికాంబరములం గొని వృక్షస్కంధములఁ గూరుచున్నవారు.తక్కినవారు వీరు చెప్పినట్లే చేయు డింభకులు. వీరెల్ల గుంపులు గుంపులుగా నుండిరి. ఈస్థలమున తెనుఁగు భాగవతమునందు మాత్రము శ్రీకృష్ణుఁడు వస్త్రములు కొని పోవుచుండ స్త్రీలు కనుంగొని మావస్త్రముల నపహరింపకుమా యని పలికినట్లు, అంతియగాక దశావతారములఁ జెప్పి నుతించినట్లు వ్రాయఁబడినది. శ్రీభాగవతమునందు శ్రీకృష్ణుఁడు వారియంబరముల గ్రహించి బాలకులతోఁ గదంబవృక్షము నెక్కి గోపికలారా! మీమీవస్త్రములు నాదగ్గర నున్నని. ఇచ్చటికి వచ్చి తీసికొనిపొండు. అని గట్టిగాఁ బలుక నావాక్యముల నాలించి,

(ఏవం బ్రువతి గోవిందే నర్మణాక్షిప్తచేతసః,
ఆకంఠమగ్నాః)తమయంబరములుకొనిపోయిరనియెఱింగిసిగ్గుచే
నాశీతజలములనే యుండి ప్రార్థించినట్లున్నది సంస్కృతమున
నిట్లుండఁగా మహాకవి యట్లేల వ్రాసిరో తెలియఁజాలకున్న
వాఁడ. వ్రాసినఁ దప్పేమియు లేదుగాని యించుక విరసముగా
నుండునేమో యని నాయల్పమతికిం దోఁచెడిని. మహాత్ముల కది
సరసముగనే తోఁపవచ్చు ననియు నాభావము.

ఇట్లు శ్రీహరి వృక్షాగ్రమున నుండియే గోపికలం
బిల్చి మీవ్రతనియమము తప్పినది. వ్రతాంగస్నానము కదా
యిపుడు మీరొనరించుస్నానము. వివస్త్రలై మీరు చేయ
రాదు. అట్లు చేసిన జలాధిదేవత యగు వరుణుఁడు కోపగిం
చును. తద్భృత్యులు మీవస్త్రముల నపహరింతురు. అంతియ
కాక మఱొక్కమాట వినుఁడు. ఈవ్రతమున మీరారా
ధించు మహాదేవత మీవస్త్రముల సంరక్షింప లేకపోయిన నింక
మిమ్మెట్లు కాపాడఁగలదు? మీవస్త్రములను కాపాడలేని దేవిని
జగదీశ్వరీ! అని నుతించితిరే. ఎట్లు సకలపురుషార్థముల
నొసంగఁజాలని దేవత పూజ్యారాలగును? అని పలికెను గదా.
దీని భావమేమి? గోపికలు సదా మత్పదాంబుజాధీనమానసలు.
అట్టి వీరు క్రొత్తగాఁ గాత్యాయనిం బూజించి యామె వర
మీయ నేను బతిగా లభింపవలయునా యని యూహించెను.
ఎవ్వరినైన నొక్కదేవతనే నమ్మవలయును. ఒకొక్కకోరిక
కొకొక్కదేవతను బూజింపరాదు. సర్వాంతర్యామియగు భగ

వంతు నేరూపమున ధ్యానించినను సమానమే కాని కార్యము లెన్నిగలవో అందఱదేవతల నుపాసింపరాదు. భక్తి వివిధరీతులఁ జెదఱరాదు. అట్లు చెదఱిన నది యేనాఁటికి స్థిరతం గాంచలేదు. అట్లు మీరేల యోజింపక కాత్యాయని నీకార్యమునకై పూజించితిరి! అని భగవంతుఁడు ప్రశ్నించెను.

స్నానము చేయునపుడు వస్త్రహీనముగాఁ జేయరాదనియు నట్లు చేయుట జలక్రీడాదులయందు నర్హము కావచ్చునుగాని కర్మాంగస్నానమందు యుక్తము కాదనియు, నట్లు చేసితిరి గానఁ దత్ఫలము ననుభవింపక తప్పదనియు శ్రీహరి లోకుల కుపదేశించె నని గ్రహింపవలయు.

"యే తీర్థాని ప్రచరంతి సృకావంతో నిషంగిణః"

అని యజుర్వేదము చెప్పుచున్నది. జలములయందు విణ్మూత్రాదుల వదలిన నందున్న దేవత లాగ్రహింతురని శ్రుతి హెచ్చరించుచున్నది. ఆశ్రుత్యర్థమే శ్రీహరి మరల వచించెను. ఒక్కమాట యైనను హితము చెప్పనిమాట భగవంతుని కంఠము నుండి వెలువడదు. కాన మీరు స్నానవిధిని మీఱితిరని హెచ్చరించెను. అంతలో శ్రీదాముఁ డావస్త్రరాశి నెత్తుకొని వారుచూచునట్లుగాఁ బరుగిడెను. రాధ యాతని గాంచి యాగ్రహించెను. ఏల? శ్రీదామునిచరిత్రమును స్మరింపుఁడు. రాధ కేల యాగ్రహము కలిగెనో స్పష్టమగును. చెంతనున్న చేడియం బిల్చి ఆపరుగిడు శ్రీదామునిఁ బట్టుకొనుఁడని యాజ్ఞాపించెను.

క. క్రోధము తపముం జెఱచును
క్రోధమె యణిమాదులైన•గుణములఁ బాపుం
క్రోధము ధర్మక్రియలకు
బాధయగుం గ్రోధి•గాఁ దపస్వికి జనునే.

అను మహాభారతపద్యము మరల భగవంతుఁడు స్మృతికి వచ్చు నట్లుచేసె నని గ్రహింపవలయు. జలములనుండివస్త్రహీనలై యెట్లు పోవుదు రన్నంతమాత్రపుటూహ యామె కాసమయమునఁ దోఁపకపోయెఁగదా. కావుననే భగవత్కార్యములయందైనఁ గ్రోధమునకుఁ జోటీయక శాంతమున నుండవలయు నని స్మృతి హెచ్చరించుచున్నది.

రాధ పలికినంతనే యీపని కెట్లు గడంగుదుమని యూహింపక వారెల్లఁ బరుగిడిరి. అపుడు వారి కోడలు తెలియదని చెప్పుటకు శంక కలుగునా. ఆశ్రీదాముఁడు శ్రీహరియున్నకడకే పరుగిడెను. అత్తఱి గోపాలబాలకుఁ డేమిచెప్పెనో పరికింపుఁడు. ఇపుడు మీరేమిచేయఁగల రనెఁగదా. దీనిభావ మేమి ? వ్రతవిధానమును మాఱినమీకు దైవప్రసాదము కలుగునా యనియే కదా. ఈసర్వాపరాధములకుం బరిహారముగా నమస్కరింపుఁ డనియె. నమస్కారశబ్దమున కర్థ మేమనఁగా.

"మత్తస్త్వముత్కృష్టస్త్వత్తోఽహమపకృష్టః"
"నాకంటె నీవు గొప్పవాఁడవు నీకంటె నేనల్పుఁడను"

అనునదియే.

ఆభావమును గనఁబఱుపుఁడు. క్షమింతు ననియెను. ఈమాట

లకు మీాకథిపురాలగు రాధిక యేమనునో కనుఁగొనుఁ డన వారెల్ల నటకుం బోయిరి. శ్రీహరి వచించినట్లే తెల్పిరి. ఆమె పక్కున నవ్వెను. ఏల? అప్పటికి రాధిక కాత్మజ్ఞానము కల్గెను? పతికంటె దైవము లేఁడు. అట్టినాప్రాణేశుని వదలి యన్యదేవతను బూజించుచున్నదాననే ఏల యిట్టిప్రమాదము నాకిప్పట్టునఁ గల్గె నని నవ్వెను. పూర్వస్మృతి కలుగఁగా నందే యుండి యోగాసనమలవరించి శ్రీహరిపాదసరసిజములధ్యానించిగోలోకనాథా! నాయపరాధము క్షమింపుమా యని ప్రార్థించెను. బహునామముల వినుతించెను. ఆవినుతి గోలోకమునఁ దాను శ్రీహరికిం బ్రియపత్ని ననునర్థమును గనఁబఱచునని యారాధిక తలపోసెను. వెంటనే శ్రీహరి సుప్రసన్నుఁడై రాధిక వాస్తవమును గ్రహించినది. ఇంకఁ జాలును. ఇదియ కదా నాపరీక్ష అని భగవంతుఁడాలోచించెను. అంతలో నారాధా దృష్టికిఁ బ్రపంచమంతయు శ్రీకృష్ణమయముగా గనుపట్టెను అంతియ గాక,

శ్లో. యత్ర స్థానే యదాధారే యద్ద్రవ్యం సంస్థితం పురా,
వస్త్రైశ్చ సహితం సర్వం తత్ప్రాపుర్గోపకన్యకాః.

అనునట్లు పూర్వముండిన తావులనే తమవస్త్రములులోనగు వస్తువు లున్నట్లు వారు కనుంగొనిరి. వెంటనే నీరువెడలి వస్త్రములం దాల్చి వ్రతపూర్తి నొందించి కాత్యాయని యొసంగిన వరములఁ బొంది తమతమ యిండ్లకుం బోయిరి.

పాఠకులారా! తత్వజిజ్ఞాసువులారా! ఇందలి విశేష మెఱుంగుఁడు. యమునాతీరమందలి వస్త్రము లట్లేయున్నవి. స్నానము చేయువారు చేయుచునే యుండిరి. కాని వివస్త్రలై స్నానము చేయఁగూడదన్న భావము వారికి శ్రీహరి యీ భ్రాంతిని గల్గించి తెల్పెను. వస్త్రములు దొంగిలింపఁబడలేదు. గోపిక లవమానము నొందను లేదు. ఇదొకభ్రాంతి కల్పిత మయ్యెను. అనఁగా భ్రాంతియే సకలమును గల్పించును. తన్నివారణమే జ్ఞానము. రాధకు స్వరూపజ్ఞానము కలుగఁగా భగవంతుఁ డాభ్రాంతిని దొలఁగించెను. ఉంచినవట్లే యుండెను. ఇట్టు లీపరమపవిత్రగాథ భగవంతుని మహిమమును, ఆమహానీయుని సర్వజ్ఞత్వమును వేయినోళ్లఁ గొనియాడుచుండ వస్త్రములు దొంగిలి యాడువారికి మానభంగమును గల్గించెను గదా మీకృష్ణుఁ డని వ్రేలుపెట్టి చూపువా రెంతవారో నేఁ జెప్పనక్కఱలేదు. ఎంతయో దూరముననుండి కార్యాంతర నిమగ్నుఁ డయ్యు,

శ్లో. ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యా చింతితో హరిః,
గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజనప్రియ.
కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ,
హే నాథ హే రమానాథ వ్రజనాథార్తినాశన.
కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన,
కృష్ణ కృష్ణ మహాయోగిన్ విశ్వాత్మన్ విశ్వభావన.
ప్రపన్నాం పాహి గోవింద కురుమధ్యేఽవసీదతీమ్,

ఇత్యనుస్మృత్య కృష్ణం సా హరిం త్రిభువనేశ్వరమ్.
ప్రారుదద్దుఃఖితా రాజన్ ముఖ మాచ్ఛాద్య భామినీ,
యాజ్ఞసేన్యా వచశ్శ్రుత్వా కృష్ణో గహ్వరితోఽభవత్.
త్యక్త్వా శయ్యాసనం పద్భ్యాం కృపాళుః కృపయాభ్యగాత్,
కృష్ణం చ విష్ణుం చ హరిం నరం చ త్రాణాయ విక్రోశతి
యాజ్ఞసేనీ, తతస్తు ధర్మోంతరితో మహాత్మా సమావృణో
ద్వై వివిధైస్సువస్త్రైః.
ఆకృష్యమాణే వసనే ద్రౌపద్యాస్తు విశాంపతే,
తద్రూపమపరం వస్త్రం ప్రాదురాసీ దనేకశః. ౪౪

(శ్రీమహాభారతమున సభాపర్వము ౬౭ అధ్యా.)

అను ద్రౌపదీవాక్యము విని యక్షయాంబరముల నొసంగిన మహాత్ముఁడు కరుణానీరధి గోపికల మానహానియగున ట్లంబరముల హరించె నని దూషించుటకంటెఁ దెలివితక్కువ వేఱొకటి కానరాదు. రాధాదేవి ధ్యానము చేయఁగనే వస్త్రము లెప్పటిచోటనే యుండినవి. హరించిన దెవ్వరు? గోపికల భ్రాంతియే. దీనిచే నమ్మియున్న దేవతను వదలి వేఱొక్క దైవమును గోరిక కొనసాగఁజేయు మని ప్రార్థించుట కేవల మవివేకమని తేలెడిని. సర్వవాంఛితముల నొసంగున దెవ్వరో యట్టి భగవంతు నాశ్రయింపుఁడీ యని శ్రీకృష్ణుఁ డుపదేశించెను. కావునఁ దానమ్మియున్న దైవమును వదలి వేఱొక దేవత నాశ్రయించి మొదటిదైవము నాయందనుగ్రహించునట్లు వర మిమ్మా యని కోరుట యసంగత మనునీతి కనుపట్టుచున్న యది. ఈప్రార్థనము

మొదటిదేవతకడఁ జేసియుండఁ గూడదా ఏల యింత చాంచల్యము? ఇట్టిచంచలత్వము బుద్ధియందుఁ గలుగ నేదేవత నాశ్రయించినను లాభములే దనునీతిని శ్రీహరి. గోపికల కుపదేశించినట్లు కనుఁగొనవచ్చును. ఇంతియగాక మఱియొకగొప్ప విషయ మీకథనుండి గ్రహింపవచ్చును. ఏదనఁగా.

రాధాదికాంతామణులు నదీతీరమున నిసుకతో నొక ప్రతిమ నేర్పఱచి యవయవములు చక్కఁగా నాప్రతిమ కమరి యుండకున్నను ఆవిగ్రహమునే కాత్యాయనిగా భావించి పూజించిరి. అంతకు ముందు సర్వవ్యాపియగు దేవత నారాధించుచుండిరి. అనఁగా ధ్యానించుచుండిరి. అట్టివా రిప్పట్టున నిసుకతో బొమ్మను చేసి పూజించిరి. ఇది మంచిది కాదని శ్రీకృష్ణుని భావము. ప్రతిమార్చనము దూష్యము కాదుకాని యది ప్రథమసోపానము. దానినే సదా చేయరాదు.

'అంతరర్చనసుప్రీతా బహిరర్చనలోలుపా'

అని శ్యామామహిమమునఁ గనుపట్టెడు.

'అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా'

అని లలితాసహస్రమునఁ జూపట్టెడిని. అంతస్స్వాత్మప్రవణం ముఖం చిత్తవృత్తిర్యేషాం తైః సమ్యగారాధ్యా. బహిర్విషయైకప్రవణం ముఖం యేషాం తేషాం సుదుర్లభా = అని భాష్యము.

ఈ విషయమునే శ్రీమచ్ఛంకరభగవత్పాదులుగారు సౌందర్యలహరియందు

శ్లో.మహీం మూలాధారే కమపి మణిపూరే హుతవహం
స్థితం స్వాధిష్ఠానే హృదిమరుతమాకాశముపరి,
మనోఽపి భ్రూమధ్యే సకలమపి భిత్వాకులపథం
సహస్రారే పద్మే సహ రహసి పత్యా విహరసి.

అని శ్లోకమున స్వమతమును దెలిపిరి. శ్రీస్వాములవారికి సమయ మతమునందభిమాన మెక్కుడుగ నున్నయట్లు కనుపట్టెడిని. సమయమత మనఁగా బాహ్యపూజ మాని ఇష్టదైవమును దన దేహాంతర్గతషట్చక్రములయందే యథానురూపముగా విన్య సించి ధ్యానించి పూజింపవలయు ననుటయే. అనఁగాఁ బ్రతి మానవుఁడును దొలుదొలుత మనస్సున నిష్టదేవతారూపము పొడకట్టుటకై బాహ్యపూజ చేసి కొంతకాల మైనపిదప నారూపమునే మనోగమ్యముగా నొనరించుకొని హృదయ పద్మమునందే యారాధించవలయును. అంతియ గాని చిన్న నాఁటిపాఠమే ఆమరణము వల్లించిన లాభములేదు. కావుననే శ్రీకృష్ణమూర్తి రాధాదేవికి విగ్రహార్చనము మరల నారంభిం చితివా యని బుద్ధిచెప్పఁ బూని ఆయుపదేశ మీమిషచేఁ జేసెనని గ్రహించుట మంచిది. ఆవిషయము నెఱింగి రాధా దేవి,

శ్లో.జలే యోగాసనం కృత్వా దధ్యౌ కృష్ణపదాంబుజమ్,
బ్రహ్మేశానంతధర్మాణాం వంద్య మీప్సితదం పరమ్.

శ్రీకృష్ణజన్మఖండము.

యమునాజలమునందే యుండి యోగాసన మమర్చుకొని మనః

పంకజపీఠమున శ్రీకృష్ణపరబ్రహ్మము పాదారవిందముల నిలిపి ధ్యానించెను. క్షణకాలమున యథాపూర్వముగా వలువలు లోనగువస్తువు లుండెను. అంతియ కాక,

స్తుత్వై వం చతురున్మీల్య దృష్ట్వా కృష్ణమయం జగత్.

ధ్యానించి కన్నులు తెఱచునంతలోఁ బ్రపంచమంతయు శ్రీకృష్ణమయముగాఁ గనుపట్టెను.

ఆర్యులార! ఇదియే యిందలి సారతరభాగము. ఉపాసకుఁ డిష్టదైవమును భగవంతుఁ డనియే నమ్మవలయుఁ గాని దిక్పాలకుఁ డనియో లేక యింకొకఁ డనియో భావింపరాదు. సర్వేశ్వరుఁడగు శ్రీమన్నారాయణమూర్తియే యీరూపమున నున్నవాఁడని తలంపవలయు. కొందఱు ఇది యశాస్త్రమందురు. ఏలన వారిబుద్ధి సమత్వమును గాంచలేదు. సర్వము భగవదంశమని యన్నిమతములవా రంగీకరించుచుండఁగా వేదములు భగవంతుఁడొక్కఁడే యని మొఱ్ఱయిడుచుండఁగా మన మనుమానింప నేలొకో తెలియకున్నది. సర్వశబ్దము లాభగవంతునకుఁ జెల్లవన్న నాతఁడు దైవమే కాఁడు. శంకరుఁ డని యొకభక్తుఁడు ధ్యానించినను, నారాయణుఁ డని వేఱొకఁడు ధ్యానించినను, పరాపశక్తి యని యింకనొక్కభక్తుఁడు నుతించినను సర్వరూపములుగల యాపరాత్పరుఁ డారూపమున నాభక్తుని యెదుటఁ దోఁచి కాంక్షితముల నతని కర్హము లని తోఁచినవాని నొసంగును. కావున భక్తుఁడగు నుపాసకుఁడు ధ్యానింపఁ దగుపద్ధతి యిదియే. ఈయుపదేశమే రాధాధ్యానము మనకుఁ

జేయుచున్నయది. ఈయుపదేశమును బరమముగా భావించి వృథా మతాభిమానమును మాని యితరమతధర్మముల, ఇతర దేవతల నీచముగా భావింపక సర్వదేవతారూపుఁడు భగవంతుఁడను నుపనిషద్వాక్యమును నమ్మి తరించునుపాయమును వెదకికొనవలయును. లేకున్న మరల మనుష్యజన్మమైన లభించుట దుర్లభము. పెడదారిఁ ద్రొక్కి కుమతముల నాశ్రయించి ప్రధానతత్వమును మఱచి వృథా పాపముల సంపాదింపఁ గంకణము కట్టుకొననేల? నోటిమాటలచేఁ బాపము నార్జించి చెడనేల?

> యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం,
> మమ వర్త్మానువర్తంతే మనుష్యాః పార్థ సర్వశః.
> సర్వభూతస్థితం యో మాం భజ త్యేకత్వ మాస్థితః,
> సర్వథా వర్తమానోపి స యోగీ మయి వర్తతే.

అని శ్రీభగవద్గీతావాక్యము లుపదేశించుచుంటే వానినైనం దలంపక యీదేవతకంటె నాదేవత పొడవు. వానికంటె వీఁడు పొట్టివాఁడు అని వాదింపనేల? వృథా పాప మార్జించుకొనుటయే గాక లాభ మేమున్నది? ఇట్లు చేయుట తనజీవితమును బాడుచేసికొనుటయే గాక పేజ్లోకఫలము నార్జింప నవకాశము లేదు. కావున మహాత్ములారా! ఈగాథనుండి విగ్రహపూజ సదా చేయఁ దగదనియు, సర్వశబ్దవాచ్యుఁడగు భగవంతుని నిష్టరూపమున నారాధించి సర్వాంతర్యామిగా భావింపవలయుననియు, దేహమును గేవలసుఖానుభూతికుమ మని భావింపక

కష్టముల ననుభవింప నర్హముగఁజేసి దృఢబుద్ధి గలిగి సదా భగవంతు నాశ్రయింప వలయుననియు, మనము గ్రహింపవలసిన ముఖ్యవిషయములు. ఇంతియ గాక చూచినవిగ్రహము నెల్లఁ గోరికలం గోరక మనశ్చాంచల్యమును సంకుచితము చేసినఁగాని కడతేఱఁజాలమనియు గ్రహింపవలయు. ఆహారాదినియమముల దేహము మనకు లొంగియుండునట్లు లభ్యసింపవలయునే కాని మన మాయింద్రియసంతతికి లోఁబడియుండుపద్ధతుల నవలంబింపరా దనియు నది పురోవృద్ధికి భంగకర మనియు గ్రహింపఁదగు. ఇట్టి వింక నెన్ని యోనీతుల నీమహాగాథ మనకుఁ దెల్పుచు భగవంతుఁడగు శ్రీకృష్ణపరమాత్మవగు సర్వజ్ఞత్వ సర్వనియంతృత్వ సర్వేశ్వరత్వముల వెల్లడించుచు నసమానవిఖ్యాతి నెసంగుచున్నది. ఇట్టికథను జదివి యందలినీతుల గ్రహించి వాని నుచితరీతి నభ్యసింపవలయు ననుటకంటె నెక్కువగా వ్రాయఁ జాలను. ఈకథానాయకుఁడగు శ్రీకృష్ణభగవంతునిఁ బరమభక్తుఁడగు లీలాశుకమహాకవి యెట్లు వినుతించెనో ఆపద్యరత్నమును పఠించి భగవంతు నొకపరి ధ్యానించి వేఱుకథ కుపక్రమించు టొప్పుఁ గదా.

శ్లో. దేవః పాయా త్పయసి విమలే యామునే మజ్జతీనాం
యాచంతీనామనునయపదై రంచితా న్యంశుకాని,
లజ్జాలోలై రలసవిలసై రున్మిషత్పంచబాణై
ర్గోపస్త్రీణాం నయనకుసుమై రర్చితః కేశవో నః. ౨ ఆ. 3 శ్లో.
నిధిం లావణ్యానాం నిఖిలజగదాశ్చర్యనిలయం

నిజావాసం భాసాం నిరవధికనిశ్శ్రేయసరసమ్,
సుధాధారాసారం సుకృతపరిపాకం మృగదృశాం
ప్రపద్యే మాంగల్యం ప్రథమ మధిదైవం కృతధియామ్.

౨ ఆ. ౪౫ శ్లో.

## రాధాదేవి యొనరించిన గౌరీవ్రతవిధానము.

* ఇట్లు నారాయణమూర్తి గోపికావస్త్రాపహారణకథను జెప్పఁగనే నారదముని యిట్లు ప్రశ్నించెను. మహాత్మా! నారాయణా! రాధాదికాంతామతల్లిక లొనరించిన వ్రతవిధాన మెట్టిది? ఆవ్రతము పేరేమి? దానివలనఁ గలుగుఫల మెట్టిది? అందు నే యేద్రవ్యము లుపయోగింపఁదగును? దక్షిణ యెంత? వ్రతాంతమున రహస్యకృత్య మేమేని గలదా? ఈవిషయముల నెల్ల విస్తరించి వచింపుమా. ఈయది నారాయణీకథ కదా? అని నారదుఁడు ప్రశ్నింప భగవంతుఁ డాప్రశ్నమును విని నవ్వి యాకథను సవిస్తరముగాఁ జెప్పనారంభించి యిట్లులనియెఁ వత్సా! నారదా! ఈవ్రతవిధానమెల్ల నావలన వినఁగోరితివి కదా. చక్కఁగా నాలకింపుము. ఆవ్రతము గౌరీవ్రతమని విఖ్యాతి నొందినది. మార్గశీర్షమాసమున నది స్త్రీలచే నాచరింపఁదగినది. పురుషులు కూడ నావ్రతమును జేయవచ్చును. ధర్మార్థకామమోక్షములను పురుషార్థము లొనఁగూడును. అంతియగాక శ్రీకృష్ణభక్తి దృఢమగు. దేశభేదమం దీవ్రత మించుకమార్పు

* ఈవిషయము గూడ శ్రీకృష్ణజన్మఖండము నిరువదేడవ యధ్యాయశిష్టభాగమునుండియే గ్రహింపఁబడినదని గ్రహింపవలయుం.

గలిగియుండు. కాముకు లీవ్రతమాచరించిన నెల్లకామము లొనఁగూడు. ప్రధానఫలము భర్తృసిద్ధియే.

తొలిదిన ముపవసించి వస్త్రముల నాఱవేసి నియతు రాలై ప్రాతఃకాలముననే లేచి మార్గము పరిశుద్ధముగానుండు నట్లు నదీతటమునకుం బోవలయును. స్నానమాచరించి ధౌత వస్త్రములఁ దాల్చి కన్యక దేవపట్టమును నానావిధద్రవ్యము లచేఁ బూజించి ఘటమునం దావాహనము చేయవలయును. గణాధిపతిని, సూర్యుని, అగ్నిని, నారాయణుని, శంకరుని దుర్గను నీయాఱుగురను బంచోపచారములఁ బూజించి వ్రత మారంభింపవలయును ఆఘటమునకుఁ గ్రిందఁ బిండి పోసి చతు రస్రమండలమును లిఖించి యందుఁ జందనాగురుకస్తూరికుంకు మాదులఁ జల్లి యిసుకపోసి యందు దశభుజముల విలసిల్లు దుర్గాంబను లిఖింపవలయును. కపాలమందు సిందూరమును, దానిక్రిందఁ జందనేందుకము నిడవలయును. ఆదేవిని ధ్యానించి యెదుట నిలువంబడి చేతులొగ్గి యావాహనమును జేయవల యును. అందుఁ దొలుత నీమంత్రమును బఠించి పిదపఁ బూజ సేయ నారంభించవలయును.

హే గౌరి శంకరార్ధాంగి యథా త్వం శంకరప్రియా,
తథా మాం కురు కల్యాణి కాంతకాంతాం సుదుర్లభామ్.

అని ప్రార్థింపవలయును. ఈదేవీధ్యానము సామవేదోక్తము కలదు. అతి గుహ్యము. సర్వకామప్రదము. ఓనారదా! మునీం ద్రులకే నెఱుంగరాని యాస్తుతిని వచించెదను. అవహితుఁడవు

కమ్ము. ఈస్తోత్రముచేతనే సిద్ధులు దుర్గతి నశింపఁజేయుదుర్గ
నారాధింతురు. శివాహ్వయమును దాల్చి శివప్రియురాలై శివ
ముల నొసంగుచు శివునివక్షస్థ్సలమున నివసించి, ఇంచుకచిఱు
నవ్వు మోము నలంకరింప, మిగులఁ బ్రతిష్ఠ గలిగి, సురుచిర
నయనముల విరాజిల్లుచు, నవయౌవనవిరాజితయై, రత్నాభరణ
భూషితయై, రత్నకంకణకేయూరనూపురములచే నలరారుచు,
రత్నకుండలయుగళమండితగండస్థలముల నొప్పుచు, మాలతీ
మాల్యసంసక్తకబరభ్రమరాన్వితయై, కస్తూరీబిందుసంయుతసిం
దూరతిలక మలర, నగ్నివలె నిర్మల మగునంబరమును దాల్చి
రత్నకిరీటమును ధరించి మనోహరాంగియై మణీంద్రసారసంసక్త
రత్నమాలావిరాజమానయై, పారిజాతకుసుమ మాలాజాలము
లింపునుగూర్ప, పీనకఠినశ్రోణి వెలయఁ బాలిండ్లచే నించుక
వంగి, నవయౌవనభారమున దేహము మురువుసూప, బ్రహ్మాదు
లచే వినుతింపఁబడుచు, సూర్యకోటిప్రభాభాసమానయై, పక్వ
బింబాధరోష్ఠియై, చారుచంపకతుల్యతనుచ్ఛాయ గలిగి ముత్తి
యములచాలును గెలిసేయుచు నొక్కరీతిగా నలరు దంతపంక్తి
యమరియుండ, మోక్షప్రదాత్రియై శరచ్చంద్రముఖియై యల
రారు పరదేవిని భజించుచున్నాను. అని ధ్యానించి శిరోభాగ
మునఁ బుష్పము నునిచి మరలఁ గుసుమమును గ్రహించి భక్తి
యుక్తుఁడై మరలఁ బైవిధముగా ధ్యానించి పూజింపవల
యును.

పిదప షోడశోపచారములఁ బూజించి పూర్వోక్తమంత్ర

మును బఠించి ధ్యానింపవలయును. పూర్వోక్తస్తోత్రముచేతనే నమస్కరింప వలయును. మరల మ్రొక్కి నియతేంద్రియుఁడై కథను వినవలయును. అని భగవంతుఁ డాదేశింప నారద ముని దేవా, నారాయణా! వ్రతమును, తద్విధానమును, ఫల మును, అద్భుతమగుస్తోత్రమును వివరించితివి. ఇపుడు గౌరీ వ్రతకథను వినఁగోరుచున్నవాఁడ. కరుణించి వచింపుమా. ఈవ్రతము భూలోకమున నెవ్వరు చేసిరి? ఎవరిచే నిది ప్రక టింపఁజేయఁబడియె. ఈవిషయమును వివరించి నాసందియముఁల నడఁపుమా యని వేఁడ నారాయణుం డిట్లనియె.

## గౌరీవ్రతకథ.

కుశధ్వజునిపుత్త్రిక వేదవతియను సాధ్వీమణి గలదు. ఆమె యీవ్రతము నాచరించెను. పుష్కరమనుమహాతీర్థమున దోలుత నారంభించెను. వ్రతసమాప్తిదినమున జగదంబిక ప్రత్య క్షమయ్యెను. యోగినులు లక్షమంది యామెవెంత నుండిరి. ఆమె తనుకాంతి సూర్యకోటిప్రభను దిరస్కరించుచుండెను. శాతకుంభవినిర్మితదివ్యస్యందనము నెక్కియుండెను. ఆపరమే శ్వరి సుస్మితప్రసన్నముఖియై భక్తిచే నెదుట నిలువఁబడియుం డిన యావేదవతి కిట్లుపలికెను. వేదవతీ! నీకు శుభము లగుఁ గాక. యథేప్సితవరము నిచ్చెద వినుము. నీవాచరించిన యీ వ్రతముచే సంతోషించితిని. నీకోరికల నీడేర్చెదను. అని పార్వతి పలుక ఆమాట లాలకించి హృష్టమానసయై చేతు లొగ్గి నమస్కరించి యాసాధ్వి యిట్లు ప్రార్థించెను.

భగవతీ! కాత్యాయనీ! నారాయణుని నాకు భర్తయగు

నట్లు ప్రసాదింపుము. ఇదియ నాయీాప్సితము. వేఱొకవరము నందు నాకు వాంఛ లేదు. ఆభగవంతునియందు దృఢభక్తిని బ్రసాదింపుము. అని వేదవతి వేఁడఁగా నామాటల నాలకించి జగదంబిక నవ్వి రథమునుండి దిగి హరిప్రియను గూర్చి యిట్లు పలికెను. ఓజగన్మాతా! సర్వమెఱుకపడినది. నీవు సాక్షాల్లక్ష్మివి. భారతభూమిని పాదపంకజపరాగముచేఁ బవిత్ర మొనరింప వచ్చితివి. నీపాదరజస్సుచే వసుంధర పవిత్ర యగును. సకలతీర్థములు పవిత్రములగును. నీ వీవ్రతము నాచరించుట లోకశిక్షార్థమే. నీవు తప మొనరింపుము. నీవు శ్రీమన్నారాయణునకుఁ గాంతవు ప్రతిజన్మమందును గాఁగలవు. శ్రీమహావిష్ణువు వసుంధరాభారము నడంప నవతరింపఁగలఁడు. దశరథనందనుఁడగు రాముఁడై శత్రువిధ్వంసనము చేయును. బ్రాహ్మణశాపమున రక్కసులైన యిద్దఱుభక్తుల నిర్మూలించును. ఆరాముఁడు త్రేతాయుగమున నయోధ్యానగరమున నావిర్భవింపఁగలఁడు. నీవీరూపము సంకుచితముగాఁ జేసికొని మిథిలానగరమునకుం బొమ్ము. శిశువుగా నుండుము. అట్టినిన్నుఁ బుత్త్రికఁగాఁ గాంచి జనకమహారాజు అయోనిసంభూతురాల వగునీచేఁ బరమపావనమతి కాఁగలఁడు. నిన్నుఁ జక్కఁగాఁ బెంచును. సీతయనఁ బ్రఖ్యాతి నొందఁగలవు. రాముఁడు మిథిలానగరమున కరిగి నిన్నుఁ బెండ్లియాడఁగలఁడు. శ్రీమన్నారాయణునకుఁ బ్రతికల్పమందును నీవు పత్నివి కాఁగలవు. అని యావేదవతి నాలింగనము చేసికొని పార్వతి తన యునికిపట్టునకుం బోయెను.

ఆవేదవతి మిథిలానగరమునకుం బోయి శిశురూపము నాశ్రయించి నాగటిచాలునందు సుఖముగా నివసించెను. తన మాయచే భూమినంటక కాఁగలకార్యమును గోరి యందుం డెను. జనకుఁ డాకన్నియను ముద్రితలోచనయై నగ్నయై యుంటఁ గాంచి కరము హర్షించెను. మఱియు నాకుమారిక పుటముపెట్టినబంగరువంటి తనుకాంతి కలిగి తేజస్సుచే నాభూమిని వెలిగించుచు నేడ్చుచుండెను. జనకుఁ డంతట నాబాలికను గాంచి యెత్తుకొని హృదయమున నిడుకొని యింటికిం దీసికొని పోవుచుండఁగా "ఓజనకరాజా! ఈయయోనిసంభూతను లక్ష్మి యని భావింపుము. నీకు నారాయణుఁ డల్లుఁడు కాఁగలఁడు. నామాట నమ్ముము" అని యశరీరి వాణ్యొక్కటి వినవచ్చెను. ఆమాటల నాలకించి జనకుఁ డాకన్యకారత్నమును గొనిచని పరమానందమునఁ దనపత్ని కిచ్చి చక్కఁగాఁ బోషింపు మని యాజ్ఞ చేసెను. ఆమెయు యౌవనము రాఁగా దాశరథిని భర్తగాఁబడసెను. త్రిలోకనాయకుఁడగు పురాణపురుషు నీవ్రతప్రభావముననే నాథునిగఁ బడయఁజాలెను. ఈవ్రతమును మునిపతివసిష్ఠుఁడు లోకమున విఖ్యాతి నొందఁజేసెను. ఆవ్రతమునే యిపు డిట రాధ యొనరించెను. శ్రీకృష్ణునిఁ బ్రాణవల్లభునిగాఁ బొందఁగోరియే వ్రతపరాయణురా లయ్యెను. గోపాంగనలెల్ల నీవ్రతప్రభావమున శ్రీకృష్ణుని భర్తనుగఁ బడయఁ గల్గిరి. మునిచంద్రమా! ఇది గౌరీవ్రతకథ. భారతభూమి నేకుమారిక యీవ్రతము నాచరించునో నాకన్యక భర్తను శ్రీకృ

ష్ణతుల్యుని గాంచఁ గల్గును. సంశయము లేదు. అని పలికి నారా యణుండు మరల నారదున కిట్టులనియెను.

నారదమునీంద్రా! ఈవ్రతమునే యాగోపికలు మార్గశీర్షమాస మంతయు నొనరించిరి. స్తోత్రరాజమునఁ బ్రతి దినము వినుతించిరి. సమాప్తిదినమున నాగోపికలు వ్రతపూర్తి నొనరించి ముదమునఁ గణ్వశాఖాప్రోక్తస్తోత్రమునఁ బరమేశ్వరిని వినుతించిరి. ఏస్తోత్రమున నాయంబికను వినుతించి సత్యపరాయణయగుసీత యప్పుడే రాజీవలోచనుని శ్రీరామచంద్రుని భర్తగాఁ బడసెనో ఆస్తుతిని వచించెద. మునీ! వినుమా. *అని నారాయణమూర్తి ఆస్తోత్రమును దెలిపెను. ఈస్తోత్ర

---

జానకీకృత పార్వతీస్తుతిః.

శక్తిస్వరూపే సర్వేషాం సర్వాధారే గుణాశ్రయే, సదా శంకరయుక్తే చ పతిం దేహి నమోఽస్తుతే. ౧. సృష్టిస్థిత్యంతరూపేణ సృష్టిస్థిత్యంతరూపిణీ, సృష్టిస్థిత్యంతబీజానాం బీజరూపే నమోఽస్తుతే. ౨. హే గౌరి పతిమర్మజ్ఞే పతివ్రతపరాయణే, పతివ్రతే పతిరతే పతిం దేహి నమోఽస్తుతే. ౩. సర్వమంగళమాంగల్యే సర్వమంగళసంయుతే, సర్వమంగళబీజేచ నమస్తే సర్వమంగళే. ౪. సర్వప్రియే సర్వబీజే సర్వాశుభవినాశిని, సర్వేశే సర్వజనకే నమస్తే శంకరప్రియే. ౫. పరమాత్మస్వరూపేచ నిత్యరూపే సనాతని, సాకారే చ నిరాకారే సర్వరూపే నమోఽస్తుతే. ౬. క్షుత్తృష్ణేచ్ఛా దయా శ్రద్ధా నిద్రా తంద్రా స్మృతిః క్షమా, ఏతాస్తవ కలాస్సర్వా నారాయణి నమోఽస్తుతే. ౭. లజ్జా మేధా తుష్టి పుష్టి శాంతిసంపత్తిబుద్ధయః, ఏతాస్తవకలాస్సర్వాస్స్వరూపే నమోఽస్తుతే. ౮. దృష్టాదృష్టస్వరూపే చ తయోర్బీజఫలప్రదే, సర్వానిర్వచనీయే చ మహా

మును వ్రతసమాప్తిదినమున రాధాదేవి గోపికలం గూడి దేవిం గూర్చి నమస్కరించి వినుతించి వ్రతమును బూర్ణముగ నొనరించెను. సద్బ్రాహ్మణులకు వేయిగోవుల దానమిచ్చి సువర్ణశతములను సంతోషమున దాన మొసంగెను. పురోహితునకు భూరిదక్షిణల నొసంగెను. వేయిమందిభూసురులను భుజింపఁజేసెను. సాదరముగా వారిని బహూకరించెను. వాద్యముల వాయింపఁజేసెను. భిక్షుకులకు ధన మొసంగెను.

అట్టితఱి దుర్గతినాశని యగుదుర్గాదేవి యాకసమునుండి బ్రహ్మతేజస్సుచే వెలుఁగొందుచు నావిర్భవించెను. యోగినీశత మాభగవతివెంట నుండెను. ముఖమున శుద్ధస్మితము నాట్యమాడుచుండెను. సింహవాహనారూఢయై దశభుజము లొప్పరత్నాలంకారభూషిత యైయుండెను. ఆదేవి సువర్ణనిర్మితమై రత్నసారమున నలరు కప్పువస్త్రముకనంబడు రథమునుండి వేగంబ డిగి రాధాదేవిని కౌఁగిటం జేర్చుకొనియెను. గోపాంగన లాపరదేవిం గాంచి హర్షమున నమస్కరించిరి. ఆదుర్గయు మీవాంఛితములు ఫలించుఁగాక యని యాశిషముల నొసం

---

మాయై నమోఽస్తుతే. ౯. శివే శంకరసౌభాగ్యయుక్తే సౌభాగ్యదాయిని, హరిం కాంతంచ సౌభాగ్యం దేహి దేవి నమోఽస్తుతే.౧౦. స్తోత్రేణానేన యా స్తుత్వా సమాప్తిదివసే శివాం, నమంతి పరయా భక్త్యా తా లభంతే హరిం పతిం. ౧౧. ఇహ కాంతసుఖం భుక్త్వా పతిం ప్రాప్య పరాత్పరం, దివ్యం స్యందనమారుహ్య యాంత్యంతే కృష్ణసన్నిధిమ్. ౧౨. శ్రీకృష్ణజన్మఖండము ౨౭ అధ్యాయము.

గెను. ఇట్లు గోపికలకు వర మిచ్చి వారితోడ సాదరముగ సం భాషించి స్మేరాననసరోరుహుఁడై రాధికను గాంచి యిట్లు పలి కెను. రాధాదేవీ! సర్వేశ్వరునకుఁ బ్రాణములకంటె నధికురా లవు. జగదంబికవు. మాయామానుషరూపిణివి. ఇట్టినీ వీవ్ర తము నాచరించుట లోకశిక్షార్థమే కాని వేఱు కాదు. శ్రీగో లోకనాథుని, గోలోకమును, శ్రీశైలమును, గిరిజాతటమును, దివ్యమగు రాసమండలమును, మనోహరబృందావనమును, స్త్రీ మానసచోరుఁడగు శ్రీకృష్ణచరితమును, కామశాస్త్రపండితుఁ డగు శ్రీగోకులనాయకునిమహిమము నేమని స్మరించుచున్నదా నవు? నీవు శ్రీకృష్ణార్ధాంగసంభూతురాలవు. తేజోవిశేషమున శ్రీకృష్ణతుల్యవు. దేవీగణ మంతయుఁ ద్వదంగసంభూతిం గాం చిన యదియే. ఇపుడు మానుషత్వము నొందితివి. నీవు శ్రీహ రికిఁ బ్రాణములవంటిదానవు. నీకు శ్రీహరియు నట్లే. శ్రుతుల యందు మీకిర్వురకు భేదములేదు. ఇట్టి నీ వెట్లు మానుషత్వ మొందితినని భ్రమించెదవు. పూర్వము బ్రహ్మదేవుఁ డఱువది వేలసంవత్సరములు తపస్సు చేసియు నీపాదారవిందమును గనుఁ గొనఁజాలక పోయెను. అట్టి నీవెట్లు మనుష్యస్త్రీగా భావింపఁ బడుదువు? శ్రీకృష్ణునానతిం బూని నీవు గోపీవేషమును వహిం చితివి? ఈభూలోకమునకు వచ్చితివి? ఇట్టి నీవెట్లు మానుషస్త్రీ వగుదువు? మనువంశసంభూతుఁడగు సుయజ్ఞుఁడు నీకటాక్షమున గోలోకమును బొందఁగల్గెను. అట్టి నీవెట్లు మనుష్యస్త్రీవగుదువు? నీమంత్రమును జపించి నీకవచమును బారాయణము చేసి పరశు

రాముఁడు ఇరువదొక్కపర్యాయములు భూమండలమును నరపతివిహీనముగా నొనరింపఁ గల్గెను? అట్టినీవెట్లు మనుజనారి వగుదువు? అంతియ గాక పరశురాముఁడు నీమంత్రము నీశ్వరునివలన నుపదేశము వడసి పుష్కరతీర్థమందు జపించి సిద్ధుఁడై కార్తవీర్యునిం బొలియించెను. అట్టినీ వెట్లు మనుష్యకాంత వగుదువు? మఱియు నాపరశురాముఁడే నీనామజపము చేసి గణపతి దంతమును ఖేదింపఁ జాలెను గద? అట్టి నిన్ను మానుషకామిని వనుట చెల్లునా? పూర్వము నేను(దుర్గను)విక్రమించి కోపమున లోకమును భస్మము చేయఁబూన నీభక్తుఁడగు శంకరుఁ డీలోకమును రక్షించెను గదా. అట్టినీ వెట్లు మనుజస్త్రీవగుదువు? ప్రతికల్పమందును శ్రీకృష్ణుఁడు నాకు భర్త గావలయునని నీవు కోరి యీవ్రత మొనరించుచుందువు.ఇది లోకహితార్థము కాని వేఱు కాదు. రాధాదేవీ! శ్రీదామునిశాపమున లోకభారావతారార్థమై యీభూతలమున నీవున్నదానవు కదా? ఇట్టినీవు మనుష్యస్త్రీ వగుదువా? ఇది యాశ్చర్యము కాదా? నీ వయోనిసంభూతురాలవు. జన్మమృత్యుభయముల నపహరించుదానవు. కళావతీపుత్రికవు. పుణ్యస్వరూపురాలవు. ఇట్టినీవు మర్త్యకాంత వగుదువా? ఓగజగమనా, జగదంబా, రాధాదేవీ! ఇఁక మూఁడు మాసములకు మనోహరమగు మధుమాసమునందు, నిర్జనమై నిర్మలమగు రాసమండలమున రాత్రులయందు సర్వగోపికాకాంతలం గూడి బృందావనమునందే మహానందమున శ్రీహరిం గూడి విహరించుభాగ్యము నీకుం గలుగఁగలదు. భూతలమున

రాసక్రీడ జరగఁ దగినదని బ్రహ్మ లిఖించెను. అందు శ్రీహరినిఁ గూడి నీవు విహరింపదానికి భంగము కల్గించువాఁడెవ్వఁడు ఓహరి? ప్రియురాలా! నేనెట్లు శంకరునకు సౌభాగ్యవృద్ధి చేయుదాననో అట్లే నీవు శ్రీకృష్ణునకు సౌభాగ్యవృద్ధినొనఁగూర్చుదానవు కమ్మా. పాలయందు ధావళ్యము, వహ్నియందు దాహికాశక్తియు, భూమియందు గంధగుణము, జలమందు శైత్యము ఎట్లు స్వభావానపాయిగుణములో అట్లే శ్రీహరియందు నీయునికియుఁ గలదు. నిన్ను దేవత యని గాని మానుషి యనిగాని రాక్షసి యని గాని యేమన్న నననిమ్ము. నీకంటె భగవంతునకు సౌభాగ్యము కలిగినది లేదు; కలుగఁబోదు. నావరప్రభావమువలనఁ బరాత్పరుఁడు గుణాతీతుఁడు బ్రహ్మాదివందితుఁడు నగు శ్రీకృష్ణుఁడు నీకధీనుఁడు కాఁగలఁడు. నీపతి బ్రహ్మానంతశివారాధ్యుఁడు నీకు వశుఁడు కాఁగలఁడు. అంతియ గాక సర్వయోగ్యులకును ధ్యానాసాధ్యుఁడు నగు. స్త్రీజాతియందు, నిన్ను మించిన భాగ్యవతి కలుగక యుండుఁ గాక. భూభారము క్షీణింపఁగా శ్రీకృష్ణునిం గూడి గోలోకమునకుం బోఁగలవు. నారదా! ఇట్లు పలికి పార్వతి యచ్చటనే యంతర్హితురా లయ్యెను.

అంతట రాధాదేవి గోపికలం గూడి యింటికిం బోవ నుద్యుక్తురాలయ్యెను. అట్టితఱి శ్రీకృష్ణుఁడు రాధాపురోభాగమునఁ బ్రత్యక్షమయ్యెను. రాధయు శ్యామసుందరాకారుని, పీతకౌశేయవస్త్రుని, నానాలంకారభూషితుని, మాలతీవనమాలావిభూషితాజానుబాహుని, సుస్మితాస్యుని, భక్తానుగ్రహకాత

రుని, చందనోక్షితసర్వాంగుని, శరత్పంకజలోచనుని, శరత్పా ర్వణశీతాంశుముఖుని, సురుచిరమణిగణఖచితమకుటవిరాజితమ స్తకుని, పరిపక్వదాడిమీబీజాభరదనుని, సుమనోహరుని, వినోదమురళీహస్తన్యస్తలీలాసరోరుహుని, కోటికందర్పలావ ణ్యుని లీలాధామమనోహరుని, గుణాతీతుని, బ్రహ్మానంతశివాది సంస్తూయమానుని, బరబ్రహ్మస్వరూపుని,బ్రహ్మణ్యుని, శ్రుతివిత త్యనిరూపితుని, అవ్యక్తుని, అక్షరుని, జ్యోతిస్స్వరూపుని, సనాతనుని, మంగళాలయుని, మంగళుని, మంగళహేతువును, మంగళప్రదుని, శ్రీకృష్ణుని నెదుటఁ గాంచి యాయద్భుతాకార మున కచ్చెరువందుచు నమస్కరించెను. మఱియు నామనోహరా కారునిఁ గన్నులారఁగాంచి కామబాణప్రపీడితయై మూర్ఛిల్లెను. చేతనవతి యై యాముఖమును గాంచి కాంచి సస్మితయు వక్ర లోచనయు నై లజ్జచే మరల మరలఁ దనమోమును వసనాంచల మున నాచ్ఛాదించుకొనియెను.

శ్రీకృష్ణమూర్తియుఁ బ్రసన్నవదనేక్షణుఁడై రాధం జూచి యిట్లు పలికెను. ఆపలుకు లోకారాధకే కాక యట నున్న వారికెల్ల వినఁబడుచుండెను. "ప్రాణాధికప్రియురాలా, రాధా! నీయిష్టమునుగూర్చు వరమును వేఁడుము. ఓగోపిక లారా! వరములఁ గోరుఁడు." అని శ్రీహరి పలుకగనే రాధి కయు సంమోదభరసమాక్రాంతస్వాంతయై వరమును గోరెను. గోపికలు తమసంకల్పముల నెఱవేర్చుకల్పతరువును శ్రీకృ ష్ణునిం జూచి వరములు గోరిరి. అందు రాధిక చేతులు ముకు

ళించి స్వామీ! నీపాదారవిందమునందు నాచిత్తభ్రమరము సదా లగ్న మగుఁగాక. అందలి మకరందమును సదా పానము చేయుఁగాక. ప్రతిజన్మమందును నీవు నాప్రాణనాథుఁడవు కావలయును. నీపదాబ్జద్వయమందు సదా సుదుర్లభభక్తి నాకు నెలకొన ననుగ్రహింపుము. నాచిత్తము స్వప్నమునందును, జాగ్రదవస్థయందును రేయింబగళ్లు నీగుణస్మరణమునందే నిమగ్నమగున ట్లనుగ్రహింపుము. ఇదియ నావాంఛితము. గోపికలాదరంబున నిట్లు పల్కిరి. రాధ నెట్లు ప్రాణప్రియనుగా భావింతువో మమ్మున ట్లే దివానిశములు భావింపుము. మాకుఁ బ్రాణనాథుఁడవుగాఁ బ్రతిజన్మమునందు నగుదువు గాక.

వారిపలుకు లెల్ల నాలకించి శ్రీహరి యట్లే యగుఁగాక యని వర మిచ్చెను. యశోదానందవర్ధనుఁడగు శ్రీబాలకృష్ణుఁడు పలికి వేయిదళములతోఁ గూడిన క్రీడాపంకజమును రాధాదేవి కొసఁగుచు సదా తనచే లాలితమగు మాలతీమాలను గూడ నతిప్రీతిచే నిచ్చెను. ఎన్నియో మాలికలను బుష్పములను గోపికల కొసంగుచుఁ జిఱునవ్వునఁ దనయానందాతిశయమును వారలకుం దెలుపుచు నిట్లు పలికెను. మూఁడు నెలలు నేఁటినుండి గడువఁగా మీరెల్ల నన్నుంగూడి మనోహరమగు బృందారణ్యమున రాసమండలమునఁ గ్రీడింపఁ గలరు. నేనెట్లో మీరట్లే. మనకు భేదమే లేదు. నేను మీకుఁ బ్రాణరూపుఁడను. మీరెల్ల నాకుఁ బ్రాణసమానులరు. ఈవ్రతము లోకశిక్షార్థము కాని స్వప్రయోజనార్థము కాదు. గోలోకమునుండి

నను౦ గూడ వచ్చితిరి. నన్నుఁ గూడియే గోలోకమునకు రాఁగలరు. ఇఁక మీరిండ్లకుం బొండు. నేను మీకుఁ బ్రతిజన్మ మునందును భర్తనే యగుదును. మీరు నాకుఁ బ్రాణములకంటె మిక్కిలిగ గారవింపఁ దగుదురు. సంశయము లేదు. అని పలికి శ్రీహరి యాయమునాతీరమందే నివసించెను. గోపికలందఱు శ్రీకృష్ణుని దనివిసననిచూపులఁ జూచుచు నందే నిలిచిరి. వారిమనస్సులు హర్షాంబురాశి నిమగ్నము లయ్యెను. వారిలోచనములు వక్రవీక్షణముల నలరారెను. అపుడు గోపికలు శ్రీకృష్ణముఖచంద్రుని నేత్రచకోరములఁ బానము చేసిరి. "శ్రీకృష్ణా జయజయ" యని పలుకుచు భగవదాజ్ఞచే వారిండ్లకుం బోయిరి. శ్రీకృష్ణమూర్తియుఁ దోడిబాలురం గూడి యందించుకసేపు విహరించి స్వాలయమునకుం బోయెను. నారదమునీ! ఇది శ్రీకృష్ణచరితామృతమున నొకబిందువు. గోపీవస్త్రహరణ మనుపేర నిది పరఁగు. సర్వలోకసుఖావహము. ఇంకేమి వినఁగోరుదువో పలుకుము. అని పలికి నారాయణుఁడు మౌనముద్రం దాల్చెను.

పాఠకులారా! రాధాదికాంత లొనరించిన గౌరీవ్రతకథను జదివితిరి. వ్రతవిధానమునుగూర్చిగాని కథను గూర్చి కాని వ్రాయఁదగినవిషయములు లేవుకాని దీని గ్రహించు పద్ధతిం గూర్చి కొన్నివిషయములు వ్రాయక తప్పదు. రాధాదికాంతాలలామలు గౌరీవ్రత మొనరించుటయన నర్థమేమి? గౌరీదేవి యిష్టార్థదాయిని యనియు, పెక్కుమంది యాదేవి

నాశ్రయించి యిష్టార్థములఁ బొందిరనియు, మన పూర్వ వ్రతము నాచరించిన మనకోరికయగు శ్రీకృష్ణుఁడు భర్త కాఁగలఁడనియు భావించి పూజించుటయే కదా. దీనిభావము. ప్రతివ్రతమునకు నుపవాసవిధి చెప్పఁబడుచుండును. ప్రాయశ్చిత్తవ్రతవిధానమున నుపవాసనియమ ముండును. ఏల యనఁగా నుపవాసమున నింద్రియము లించుక శోషిల్లు. దాన బలము తగ్గిన ట్లగపడును. ఇంద్రియములు శోషిల్లుటచే మనస్సునఁ బ్రతిక్షణమునఁ బొడము కోరిక లించుక తగ్గుచలను జూపు. వాంఛితములు తగ్గుటయే కదా వ్రతఫలము. పలువాంఛలకు లోనగు మన స్వైకకార్య మునందే నియతమగునట్లు చేయుటయే మనకర్తవ్యము. ఏకాగ్రమనస్సుండినఁ గదా పురుషార్థములను సాధింపఁ జాలుదుము. అందులకుగా నుపవాసము చెప్పఁబడును. ఇంతియ కాక యింద్రియములు తేలికగా నుండుట మనశ్శుద్ధి కావశ్యకము. మన శ్శుద్ధియుండుటయే వ్రతమునకు ఫలము. సంయతేంద్రియుఁడై సత్కార్యముల నాచరింపవలయునని చెప్పుట యేతదర్థమే కదా? కావున నుపవాసము చాల మంచిది. దిట్టముగా భుజించి సంతోషముగా నుండుతఱి మనమనస్సు బాహ్యసుఖముల నింద్రియములనుండి మరలింపఁ జాలుననుట యోగమున నించుకేని పరిచయము లేనివాని మాట. కొందఱు ఉపవాసములేల యని యందురు. అట్టివారందులకు బదులిడుట యనవసరమే యైనను వ్రాయక తప్పకున్నది. చిత్తము స్వాధీనమై యుండువారికి నుపవాసము లక్కఱలేదు. గాని అది సాధించువారికి మాత్రము కావలెను. సాధారణముగా నెల్లరకు మనస్సు

స్వాధీనమున నుండదని చెప్పుటకు జంకు నక్కఱలేదు. కావుననే

"చంచలం హి మనః కృష్ణ ప్రమాథి బలవద్దృఢం,
తస్యాహం నిగ్రహం మన్యే వాయోరివ సుదుష్కరమ్.
అసంశయం మహాబాహో మనో దుర్నిగ్రహం చలం,
అభ్యాసేన తు కౌంతేయ వైరాగ్యేణ చ గృహ్యతే.
అసంశయాత్మనో యోగో దుష్ప్రాప ఇతి మే మతిః,
వశ్యాత్మనా తు యతతా శక్యోఽవాప్తు ముపాయతః."

భగవద్గీత. ౬ అధ్యా. ౩౬ శ్లో.

అను భగవద్వాక్యము సర్వజనసమ్మతమై యలరారుచున్నది. మనోనియమనము కొఱకే యోగశాస్త్రములు చాలకున్నవి. అభ్యాసకులకు శతాయుష్యము చాలకున్నది. అట్టిమనస్సును చక్కఁగా భుజించి స్రక్చందనాదిసుఖములకు లోనగుచు నిచ్ఛానురీతిఁ జరించుచు మనస్సును సంయమనముచేయుట యెన్ని బ్రహ్మకల్పములకైన శక్యముగానిపని యనుట నిరాతంకమార్గము. కావుననే మనస్సు నేకాగ్రముగా నుంచుకొనుటకే యుపవాసాదినియమములు చెప్పఁబడినవని గ్రహించుట సాధుమార్గము. ప్రతివ్రతమునకు నొకకథ చెప్పఁబడుచుండును గదా అది యెందులకు? అన్నప్రశ్నము రావచ్చును. సమాధాన మేమనఁగా ఏకార్యమైనను వాంఛాపూర్తికై చేయఁబడుచుండును. ఇది సర్వజనవిదితము. ఆపని యాకృత్యమున నెఱవేఱునా యను శంక తొలుత నెవ్వరికిం గాని కలుగక

మానదు. పూర్వ మీవ్రతమును వీరొనరించి కృతకృత్యులైరి అని యుదాహరణము చెప్పిన నొకయింత యూఱట కల్గును. ఇట్టికష్టములనుండిన వీరీవ్రతమున భగవంతు నారాధించి కృతకృత్యులైరని కథ చెప్పుచుండును. దానిని విన్నతోడనే మనకు నీకోరికలు కొనసాగవచ్చు నన్ననమ్మకము దాన జనించును. అదియే కథాశ్రవణమునకు ఫలము. నియతచిత్తుల కిది యనవసరమన్న ననవచ్చుఁగాని తెలుచుగా నందఱు నియతచిత్తులుగారు కదా. అట్టివారి కుపకరించినఁ జాలునని పెద్దలభావము. ఏవిధముననైన భగవద్భక్తిని గల్గించుటయే పూర్వసాధుజనుల భావము. అందులకే యిన్నివ్రతములు కల్పింపఁబడినవి. ఎట్టికర్మముల నొనరించినవారి కట్టిఫలముల నొసఁగుహార్పువ్రతాదుల యం దభిరుచి కల్గు. దానికిం దగు ఫలము గలుగు. ఇవన్నియు నొకదాని కొకటి యన్నరీతి భక్తి కుదుర్పు సాధనములగు నని గ్రహించుట యుత్తమము.

సీత గౌరీవ్రతము చేసినదియా?

వేదవతియే సీత యనుమాటనుమాత్రము మఱువకుఁడు. భగవత్కటాక్షమేదో యొక తపోనియతిఁ బూనకున్న లభింపదనుమాట నిక్కము. దానికనేకమార్గములు కలవు. శంకరుఁడు తారకమంత్రరాజమును జపించుననుటయు, శ్రీవిష్ణువు శివనామపారాయణపరాయణుఁ డగుటయుఁ బురాణప్రసిద్ధము. ఈవిషయమునఁ గొందఱు మహాత్ములు భిన్నాభిప్రాయు లగుదురని నేనెఱుంగుదును. అట్టివారిని సమ్మతింపఁజేయుశక్తి నాకు లేదనుట నిక్కము. పురాణములలోఁ గూడఁ గొన్ని ప్రమా

ణాములు కావను మహాత్ములును గలరు. తమదేవతయని యొక్క దేవతను జెప్పుకొనువారును గలరు. ఆదేవత వారికి దత్త పుత్త్రుఁ డేమో నేనెఱుంగను కాని యట్టివారు దేవానాం ప్రియులని మాత్రము నేనెఱుంగుదును. విష్ణువు మాదేవుఁడని శివుఁడు మాదేవుఁడని శక్తి మాదేవత యని చెప్పువా రుండిన నంతకన్న లోకమునఁ బామరులు లేరని యొక్కమాట చెప్పి వారినిసత్కరించుచున్న వాఁడను. మన దేహమే మనకు లోఁబడనపుడు కనఁబడని దేవతల మావారనుట కన్నఁ బ్రమాదమేమికలదు? భగవంతుని బూజించుటకుఁ గొందఱకే యధికారము కలదన్న వాదము దుర్వాదము. ఆదేవునకును గౌరవమంతమాత్రమే కలదేమో. సర్వలోకాధిపతి, సర్వేశ్వరుఁడు, సర్వకర్త యన్న వినుతికిం దగిన శ్రీమన్నారాయణమూర్తిని గూర్చి యట్లు చెప్పరాదనుట న్యాయము. వేదవతియు సాక్షాల్లక్ష్మియే యైనను లోకులకు మార్గముచూపుటకై తపస్సు చేయుట విధి. లోకుల నుద్ధరించుటకుఁ బూనుకొన్న మహాత్ములు తమకక్కఱలేని కార్యములను గూడ మార్గదర్శకు లగుటకుగాఁ దమరు చేయుచుందురు. ఇట్లుండ నిఁక మహాలక్ష్మి ప్రపంచములోని స్త్రీలకెల్లఁ జతుర్విధ పురుషార్థముల నొసంగఁ బాటుపడు మహాసాధ్వి తాను గౌరీవ్రతమాచరించుటయందుఁ గల తప్పేదో తోఁచకున్నది. ఈ విషయము మనకుఁ గథయే బోధించుచున్నది. గౌరి ప్రత్యక్షమై వేదవతితో,

"వ్రతం తే లోకశిక్షార్థం మాయామానుషరూపిణి,"

అని చెప్పినదఁట. దీనిభావమేమి? మహాలక్ష్మీ కీవ్రతమాచరించు టవలనఁ గాఁదగిన ఫలము లేకున్నను దన్నుదాహరణముగా నునుచుకొని యెందఱో నారీమణు లీవ్రతమును చేసి కృత కృత్యలు కావచ్చునని యూహించెనని గ్రహించుట న్యాయ్య ము. ఇట్లే గౌరీదేవి మహాలక్ష్మిని బూజించి సకలాభీష్టములఁ జెందె నని పురాణాంతరమునఁ గనఁబడియెడు. పురాణముల తాత్పర్య మేమి? అనుసిద్ధాంతము వీనినుండి తేలును. ఏపురా ణము కాని, ఏవ్రతము గాని, ఏనియమము గాని ఒక్కదేవతనే వర్ణించును. ఎవ్వరి కేపురాణకథయందు నేవ్రతమం దేనియమ మునం దిచ్ఛ యుదయించునో దాని విధిమంతనుగా నాచరిం చిన వాంఛితములు నెఱవేఱును అన్నసిద్ధాంతమే దృఢపడు చున్నది. దీనిచే నితరదేవతాదూషణము తొలఁగును. సమత్వ మలవడును. జాతివైషమ్యములు తగ్గును. మతకలహములు తల చూపవు. అన్నిపురాణములునీవిషయమునే తెల్పుచున్నను అజ్ఞా నముచే నస్మదాదులు గ్రహింపలేకున్నారు. ఇది పూర్వజన్మకృత పాపఫల మనుటకంటె వేఱొకమాట చెప్పశక్యము కాకున్నది.

కావున నోపుణ్యాత్ములారా! ఇతరదేవతాదూషణము చేయక తానుపాసించుదేవతయే యందఱికంటె నుత్కృష్టుఁ డని తలంపక సర్వదేవతాస్వరూపుఁ డొక్కభగవంతుఁడే ఆయాయిరూపముల నలరారుచున్నవాఁడు. అతని నమ్మినఁ గాని మంచిమార్గము దొరకదు. అని నమ్మి యొకొక్కవాంఛ కొకొక్కదేవత నుపాసింపక సర్వదేవతాస్వరూపునిగా

నొక్క దైవమునే నమ్మి దృఢభక్తితో నుపాసింపుఁడు. అట్టి మహాత్ముఁడు శ్రీకృష్ణపరమాత్మ యని తలంపుఁడు. అనవసరము లగు వాదములలోఁ బ్రవేశించి పరదూషణముఁ జేసి పరమత ముల నిందించి ఇతరదైవతముల నపహాసించి వృథా పాపము నొడిగట్టుకొనకుఁడు. ఇదియే మంచి త్రోవ. ఇదియే యభి వృద్ధికి మార్గము. ఇదియే సర్వజనసమ్మతముకాఁదగిన మార్గము. ఇదియే సర్వవేదశాస్త్రసారము. చక్కఁగా మథించిచూడఁగా నింతకంటె నుత్కృష్టమార్గము వేఱొక్కటి కానరాదు. సత్య ముగా లేదని నానమ్మకము. ఇంతకన్న నధికము వ్రాయఁబూ నక యిప్పటికే యెక్కువగాఁ బునరుక్తిదోషమునకు లక్ష్య ముగా వ్రాసితినేమోయని భీతి నొందుచు విరమించుచు ముందటిభగవల్లీలను వ్రాయ నారంభించుచున్నవాఁడను.

"క. వినఁదగు నెవ్వరు చెప్పిన
వినినంతన వేగపడక • వివరింపఁ దగుం
గని కల్లనిజముఁ దెలిసిన
మనుజుఁడె పో నీతివిదుఁడు • మహిలో సుమతీ."

అన్న సూక్తిని మదిఁ బాదుకొలుపుఁడు. అవ్వలి శ్రీకృష్ణపరమా త్మయద్భుతకథల నాలకింపుఁడు.

భక్తవరులారా! రాధాదేవి వ్రతమాచరించుటయు, దుర్గాంబ ప్రత్యక్షమై వరములిచ్చుటయు ఆవ్రతము లోకు లకు మార్గముచూపునిమిత్తమేగాని వేఱుఫలము రాధాం బకు లేదని దుర్గయే తెలుపుటయు శ్రీకృష్ణపరమాత్మ రాధా

దేవిం గరుణించి వర మొసంగుటయు నంతియకాక గోపికల కెల్ల నిష్టవరము లొసంగి యిఁక మూఁడునెలలకు రాసమండల మున నాతో మీ రెల్ల విహరింపఁగలరని యాజ్ఞాపించుటయును జదివితిరి. గోలోకమునుండి యవతరించిన రాధికప్రభావము కొంతమాత్రమే తెలియఁజాలితిరి. ముందు రాసక్రీడను జదువఁగలరు. దానితత్త్వ మిదియని ముందెఱింగినఁగాని రాసమండల మన నేమో రాసేశ్వరి యన నెవ్వరో బోధపడదు. కాన ముందు రాధాదేవిమహిమమును విన మీ కర్ణముల నియమింపుఁడు. మీచిత్త మాకర్ణముల యందే ప్రవర్తింపఁ బ్రార్థింపుఁడు. మనస్సునాజ్ఞాపింప వీలులేదు. అది మఱింత చంచలమగును. కావున మానసమా! మాపైఁ గరుణించి యించుక భగవత్కథల నాలకింప ననుగ్రహింపుమా యని వేఁడవలయు. అది కనికరించెనా మనము కృతార్థుల మగుదుము.

## రాధాంబికామంత్రమహిమము.

* నారదముని నారాయణమూర్తివలన ననేకగాథల నాలకింపుచు నిట్లు ప్రశ్నించెను. మహాత్మా! శ్రీమన్నారాయణా! ప్రకృతివిషయముల ననేకభంగుల వింటిని. ఆమహిమముల నెఱింగినఁ గాని జన్మసంసారబంధములనుండి తప్పించుకొన శక్యముకాదు. ఇపుడు రహస్యములలో రహస్యమై వేదగోపితమగు రాధాదుర్గావిధానమును వినఁగోరుచున్నవాఁడను. పర

---

* ఈకథ దేవీభాగవతము నవమస్కంధము ఏఁబదియవ యధ్యాయమునుండి గ్రహింపఁబడినదని యెఱుంగవలయును.

తత్వము లనంబడు రాధాదుర్గల మహిమములనుఁ గొన్నింటిని దెల్పితిరి. ఆకథల నాలకించిన నామది వేఱొకగాథను విన్గోర కున్నయది. ఏయిర్వురి యంశమే యీప్రపంచమో, యేయిర్వుర యాజ్ఞ యీచరాచరప్రపంచమున నడచుచున్నదో, యెవ్వరి భక్తిచే ముక్తి కరతలామలకమో యాదేవతలమహిమము వినుపింపుమా యని ప్రార్థింపఁగా నారాయణమూర్తి కరుణాతరంగితాంతరంగుఁడై యిట్లు పలికెను.

నారదమునీ! చక్కఁగా వినుము. ప్రశ్నమునకుఁ దగు నుత్తరము చెప్పెదను. అది పరమపావనము. వేదవిహితము. ఇతరులకు వచింపఁ దగదు. సారతమమైనది కదా యీవిషయము. విని దీని నితరులకుఁ దెల్పకుము. ఏలన నిది రహస్యము కదా. మూలప్రకృతియే ప్రపంచోద్భవహేతువు. ప్రాణబుద్ధ్యధిదైవతమగు శక్తియుగ్మము తొలుత పుట్టెను. అదియే సర్వజీవుల నియమించునది. ప్రేరేపించునదియు నగు. దానియధీనమే యీప్రపంచమంతయు నని యెఱుంగుము. *విరాట్టుమొదలు చరాచరమంతయు తద్వశంగత మనునదియే నీవిట గ్రహింపఁ దగినది. ఆదేవతాద్వయప్రసాదము లేక ముక్తి దుర్లభ మనుట స్పష్టము. కావునఁ దత్ప్రసాదమును బడయఁగోరి నిత్యము సేవింపవలయును.

అందు రాధాంబామంత్రము నాలకింపుము. భక్తియుక్తుఁడవు కమ్ము. ఏతన్మంత్రమును బ్రహ్మావిష్ణ్వాదులు నిరంతరము

---

* తదధీనం జగత్సర్వం విరాడాదిచరాచరమ్-అనిమూ.

సేవించుచుందురు. ఇది పరాత్పరము. తొలుత లక్ష్మీబీజము నుచ్చరించి పిదపఁ జతుర్థ్యంతముగ రాధాశబ్దమును బలికి తరువాత వహ్నిభార్య నుచ్చరింపవలయు. ఇదియే రాధాషడక్షరమంత్రము. ధర్మార్థకామమోక్షప్రదము. ఈమంత్రమునకు ముందు మాయాబీజమును జేర్చినచో వాంఛాచింతామణి యగు. ఎన్నివదనము లున్నను ఈమంత్రమాహాత్మ్యమును వర్ణింపశక్యముగాదు. ఈమంత్రరాజనును దొలుత శ్రీకృష్ణమూర్తియే మూలదేవిచే రాసమండలమున నుపదేశరూపమునఁ బరిగ్రహించెను. మహాభక్తితత్పరుఁ డయ్యెను. శ్రీకృష్ణమూర్తినుండి విష్ణువు పరిగ్రహించెను. విరాట్టగుబ్రహ్మ యావిష్ణువునుండి గ్రహించెను. వారినుండి ధర్ముఁడు, ఆధర్మునినుండి నేను బడసితిమి. ఇది దీని గురుపరంపర యని తెలియఁదగు. ఆమంత్రమును సదా నేను జపించుచుందును కాన నేను ఋషినైతిని. బ్రహ్మాదిదేవత లందఱు నిత్యము ధ్యానించుచుందురు. రాధాదేవి నర్చింపక కృష్ణార్చనము చేయరాదు. ఎవ్వనికే నట్టి యధికారము లేదు. విష్ణుభక్తులెల్లరును దొలుత రాధిక నర్చించి పిదప శ్రీకృష్ణు నర్చింతురు. ఏలన రాధిక శ్రీకృష్ణప్రాణాధిదేవి యగు. పరమాత్మ తదధీనుఁ డగు. రాసేశ్వరి యతనికి నిత్యాదేవి యగు. ఆమె లేక యతఁ డుండఁజాలఁడు. *సకలకామముల నొసంగుటచే నామె రాధయనం బ్రసిద్ధి వహించెను. ఈ రాధామంత్రము లనేకములు కలవు. వానికెల్ల ఋషిని నేనే

*రాధ్నోతి సకలాన్ కామాం స్తస్మా ద్రాధేతి కీర్తితా-అని మూ.

యని యెఱుంగునది. గాయత్రి ఛందస్సు. దేవత శ్రీరాధికాంబిక. తారము బీజము. శక్తి బీజమే యీమంత్రమునకు శక్తి యనఁబరఁగు. [1]మూలమంత్రముచేతనే షడంగన్యాసము చేయఁదగినది. పిదప రాసనాయికయగు రాధాదేవిని ఇట్లు ధ్యానించవలయును. ఈస్తుతి సామవేదార్థము గలది.

రాధాస్తుతి.

[2]శ్లో. శ్వేతచంపకవర్ణాభాం శరదిందుసమాననాం,
కోటిచంద్రప్రతీకాశాం శరదంభోజలోచనాం.
బింబాధరాం పృథుశ్రోణీం కాంచీయుతనితంబినీం,
కుందపంక్తిసమానాభదంతపంక్తివిరాజితాం.
క్షౌమాంబరపరీధానాం వహ్నిశుద్ధాంశుకాన్వితాం,
ఈషద్ధాస్యప్రసన్నాస్యాం కరికుంభయుగస్తనీం,
సదా ద్వాదశవర్షీయాం రత్నభూషణభూషితాం.
శృంగారసింధులహరీం భక్తానుగ్రహకాతరాం,
మల్లికామాలతీమాలాకేశపాశవిరాజితాం.
సుకుమారాంగలతికాం రాసమండలమధ్యగాం,
వరాభయకరాం శాంతాం శశ్వత్సుస్థిరయౌవనాం.
రత్నసింహాసనాసీనాం గోపీమండలనాయికాం,

---

1 కీలక మనుసంజ్ఞకొన్నిమంత్రములకు లేదు. అట్లే యీరాధామంత్రమునకుం గూడ బీజశక్తులేకాని కీలకము లేదని యెఱుంగవలయును.

2 ఇది మంత్రాంగధ్యాన మాట నట్లే వ్రాయఁబడినది. దీనితాత్పర్యము వ్రాయకుండుట కిదియే కారణ మని యెఱుంగవలయును.

కృష్ణప్రాణాధికాం వేదబోధితాం పరమేశ్వరీం.

అని యిట్లు ధ్యానించి బాహ్యపూజ చేయవలయును. సాల గ్రామమందుఁ గాని, సంపుటమునందుఁ గాని అష్టదళశోభిత యంత్రమందుఁ గాని, దేవి నావహించి పూజింపవలయును. పూజ విధియుతముగా నుండవలయు. తొలుత నావాహన మొనరించి పిదప నాసనాదిక మర్పింపవలయును. ఆసనాదుల కెల్ల మూలమంత్రమే ప్రధానము. పాదములయందుఁ బాద్యము, మస్తకమునం దర్ఘ్యము, ముఖమం దాచమనీయము సమర్పించవలయు. ఆచమనము మూలమంత్రము నుచ్చరించి మూఁడుపర్యాయము లర్పింపవలయును. మధుపర్కమును దరువాత సమర్పింపవలయును. పాలిచ్చుగోవు నొక్కదాని నొసఁగవలయును. పిదప నాయంత్రమును స్నానమందిరమునకుం గొంపోయినట్లు భావించవలయును. అభ్యంగాదిస్నానవిధిని గల్పించి వస్త్రయుగ్మము నర్పించి సురుచిరచందనచర్చల నలంకరించి నానాలంకారశోభితాంగినిగఁ జేయవలయును. బహువిధపుష్పమాలికలను దులసీదళమిశ్రితములుగా నొనరించి పారిజాతప్రసూనములు పంకజములు సమర్పించవలయును.

ఇట్లు రాధాంబ నర్చించి పిదప పరివారదేవతలం బూజింపవలయును. అగ్నీశాసురవాయు వీదిక్కులందును మధ్యభాగమునను బరివారదేవతల నర్చింపవలయును. ఆవల నష్టదళపద్మంబున దక్షిణావర్తముగా నగ్రదళమున మాలావతిని, ఆగ్నేయ కోణమందు మాధవిని, దక్షిణమున రత్నమాలను, అసుర

కోణమున సుశీలకను, బశ్చిమభాగమున శశికళను, వాయుకో
ణమునఁ బారిజాతను, ఉత్తరమునఁ బరావతిని, ఈశానకోణ
మునఁ బ్రియకారిణియగు సుందరిని బూజింపవలయును. ఆయ
ష్టదళపద్మమునకు వెలుపల బ్రహ్మాదులను, ఇంద్రాదిదిక్పాలకు
లను, వజ్రాద్యాయుధములను బూజింపవలయును. తరువాత
నావరణదేవతాయుతముగ దేవిని గంధాద్యుపచారములచే
నర్చింపవలయును. రాజోపచారములచేతను బూజింపవలయును.
ఇట్లు పూజించి సహస్రనామాదులచే నంబను వినుతింపవల
యును. ప్రతిదినము సహస్రసంఖ్య జపము చేయవలయును.
ఈరీతి రాసేశ్వరిని బరదేవిని రాధికను బూజింపవలయును.
ఆతఁడు విష్ణుతుల్యుఁ డగును. అంతియగాక యంతమందు
గోలోకమున కేగును.

ఏభక్తుఁడు కార్తికపూర్ణిమయందు శ్రీరాధాజన్మోత్స
వము శ్రద్ధాయుతుఁడై చేయునో ఆతనిమది శ్రీరాసేశ్వరి సదా
నివసించును. ఒకానొకకారణమున శ్రీరాధిక బృందావనము
నందు వృషభానునిపుత్త్రికగా జన్మించెను. కాని ఆదేవి గోలోక
వాసినియే యని తలంపవలయును. నారదా! ఇచటఁ జెప్పఁబడిన
బడిన మంత్రరాజమును వర్ణసంఖ్యానియమమున జపించి పురశ్చ
రణవిధిచేత జపదశాంశము హోమము చేయవలయును. పరిమళ
ద్రవ్యములను గలిపినపూవులచేహోమము చేయవలయును. అని
నారాయణమూర్తి పలికిన నారదమునియు సంతుష్టమానసుఁడై
మహాత్మా! రాధికాస్తోత్రము నెఱింగింపుము. దానిచేఁ గదా

దేవి ప్రసన్నురాలగును. అని ప్రార్థింప నారాయణమూర్తి యిట్లు బదులుచెప్పెను. నారదా! రాధాస్తుతిని దీని నెవఁడు త్రికాలములఁ బఠించునో రాధాదేవిని స్మరించునో వానికి లభింపని పదార్థము లోకమున లేదు. దేహాంతమున గోలోకమున రాసమండలమున నుండును. ఇది పరమరహస్యము. ఎవ్వరికి నవిధిగా నుపదేశింపరాదు. *

పరమపావనమతులారా ! రాధామంత్రము, దాని నుపాసించుపద్ధతియు, దేని నారాధించురీతియు వింటిరి కదా.

---

శ్రీరాధాస్తుతిః.

నమస్తే పరమేశాని రాసమండలవాసిని, రాసేశ్వరి నమస్తేఽస్తు కృష్ణప్రాణాధికప్రియే. ౧. నమస్త్రైలోక్యజనని ప్రసీద కరుణార్ణవే, బ్రహ్మవిష్ణ్వాదిభిర్దేవై ర్వంద్యమానపదాంబుజే. ౨ నమ స్సరస్వతీరూపే నమ స్సావిత్రి శంకరి, గంగాపద్మావతీరూపే షష్ఠి మంగళచండికే. ౩. నమస్తే తులసీరూపే నమో లక్ష్మీస్వరూపిణి, నమో దుర్గే భగవతీ నమస్తే సర్వరూపిణి. ౪. మూలప్రకృతిరూపాం త్వాం భజామః కరుణార్ణవాం, సంసారసాగరా దస్మా నుద్ధరాంబ దయాంకురు. ౫. ఇదం స్తోత్రం త్రిసంధ్యం యః పఠేద్రాధాం స్మరన్నరః, న తస్య దుర్లభం కించి త్కదాచిచ్చ భవిష్యతి. ౬. దేహాంతే చ వసేన్నిత్యం గోలోకే రాసమండలే, ఇదం రహస్యం పరమం న చాఖ్యేయం తు కస్యచిత్. ౭.

* దీనితరువాతికథ దుర్గామంత్రవిధానముకాన నిట నవసరము కనఁబడమిని వదలితిని. దుర్గాదేవియు రాధాదేవియు మూలప్రకృతిరూపాంతరములవంటివా రని దీనిసారము. దీనిచే మతవైషమ్యము లజ్ఞానకల్పితము లనియు, వానివలనఁ గలుగునది దుష్ఫలమే యనియు గ్రహింపవలయును.

ఇటం జెప్పందగినవిషయ మొక్కటియే కలదు. సర్వశక్తి రాధ యనియు, రజస్తమశ్శక్తి దుర్గయనియు నెఱుంగనగును. ఈయి ర్వురకు భేదమే లేదని దీనినుండి గ్రహింపవలయు. తారత మ్యము గలదని భావింపరాదు. భగవంతుండు తదధీనుండనియు నెఱుంగనగు. అనంగా భగవంతుండు సర్వసాక్షియై ప్రకృతి ద్వారా ప్రపంచకార్యముల నన్నింటిని జేయించు ననియు, తా నిరంజనుండై యుండుననియు దీనిసారము. ఈయర్థమే శ్రీశంక రాచార్య భగవత్పాదులు గారు,

"శివశ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం
నచే దేవం దేవో నఖలు కుశల స్స్పందితుమపి."

అనువాక్యముచే దృఢపఱచిరి. కావునం బ్రకృతి యనంగాం బార్వతి యని బెదరక పెక్కునామములచే నాలోకమాత విల సిల్లుననియు, నెవ్వరేపేరున ధ్యానించినను సమానఫలమే యనియు గ్రహించుట తరణోపాయము. అట్లు గాక ప్రకృ తియే లేదనియు నంతటిని భగవంతుండే నడుముకట్టుకొని చేయుచున్నాండనియు వాదింపకుండు. అది మొండిపట్టు. పరమే శ్వరుని యిచ్ఛయే ప్రకృతి యని భావించినచో నేలాటిచిక్కు లుండవు. లేనిపోని మతాభిమానము లుంచుకొని కలహిం చుట చెట్టుకొట్టి దానిక్రిందం గూరుచున్నట్టిది. తరణోపా యము దాన లేదు. సాధింపంబోవు పురుషార్థము లేదు. లేని దాని నున్నట్లు భావించి వృథా పాపము సంపాదించుకొనుట కన్న వెఱ్ఱితనము వేఱుగనేమున్నది? భక్తులగు మీరెల్ల నట్టి

కువాదములకు మీ మదులఁ జోటీయరని నమ్మెదను అది వట్టి కాలక్షేపముగా నెన్నుకొనుఁడు. ఇఁక నవ్వాలి భగవల్లీల నాలకింపుఁడు. అది విచిత్రతమమైనదిగాన నవహితులరగుఁడు.

### శ్రీకృష్ణమూర్తి వరుణనగరమునుండి నందుని గొనితెచ్చుట.

* యమునాతీరమున విహరించి విహరించి శ్రీహరి తోడి బాలురం గూడి బృందావనము చేరెను గదా. కొలఁదిదినములు శ్రీకృష్ణుని చిత్రచరిత్రమెఱుకపడక యుండెను. కారణము లేకుండఁ గార్యము సాగదు కదా. యథాపూర్వముగా నందఱు బృందావనమున హాయిగా నుండిరి. బాలకృష్ణుఁడు బాలురతో వినోదక్రీడల సల్పుచునే యుండెను. నందుఁ డేకాదశీవ్రత మాచరించెను. ఆనాఁ డుపవసించెను. శ్రీహరిని బూజించెను. విధిమంతముగనేపూజాదు లొనరించెను. తఱచుగా నందుఁ డుపవాసములు సల్పువాఁడు కాఁడు. భగవంతుఁడే శ్రీకృష్ణుఁ డని గర్గముని తెల్పెను గదా. అదిమొదలించుక తెలివి గలిగియే మెలఁగుచుండెను. ఇంద్రయాగమున నాపల్కులు మఱింత దృఢపడియెను. కాన బాలునిగా భావించినను కేవలపుత్రప్రీతిచేఁ గాక యించుకభగవత్ప్రీతిచే గారవించుచుండువాఁడు. ఆనాఁ డీవ్రతముచేయు బుద్ధి పుట్టెనుగాన సవిధిగా వ్రతమాచరించెను. మఱుదినము ద్వాదశి సకాలమునఁ బారణచేయవలయును. కావున నారేయి నిద్రపట్టమిఁ గాఁబోలు స్నానకాలమును

* ఈకథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౨౮ అధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

మఱచి శుభాలున లేచి యమునానదికి స్నానమునకుఁ బోయెను. గోపకులును గూడఁ బోయిరి. అది యర్ధరాత్రసమయము. జలములలో నందుఁడు దిగి స్నానము చేయుచుండెను.

వరుణుఁడు జలాధిదేవత. జలములలో నెవఁడు గాని దిగునపుడు వరుణప్రార్థనము చేయవలయును. అదియు సకాలమునసే సేయఁదగును. ఇది భగవదాజ్ఞ. నందుఁ డది మఱచెను. వరుణదూతలు వేళగానివేళలయందు జలములఁ దిరుగుచుందురఁట. ఆతరుణమున నొకదూత నందుని మునిఁగియుండఁగా నల్లే గ్రహించి కామగమనమున వరుణనగరమునుజేర్చి తనయేలిక కప్పగించెను. ఈవార్త గోపకు లెఱుఁగరు. మునిఁగిననందుఁడు పైకి రాలేదే యని చూచిరి. నీటమునిఁగిరి. పరిశోధించిరి. ఇందునందు నెమకిరి. ఎందును గానరాఁడే యని యాక్రోశించిరి. శ్రీకృష్ణా! బలదేవా! యని బిలిచిరి. ఈయన్యాయమేమో పరిశీలింపుఁడీ యని యార్తిమెయిం బలికిరి. ఇఁక గతియేమనిరి. ఈవ్రతమేల పూనెనయ్యా యని వ్రతమును దెగడిరి. ఈనీట గ్రాహములున్నవే. ఇఁక నేమిచేయవచ్చు నని చేతులు పిసికికొనిరి.

ఆయారావముల శ్రీహరి యాలకించెను. తండ్రివృత్తాంతము నెఱింగెను. బాలకులౌట వీ రెఱుఁగక యార్తిఁ బడలుచున్నవారే యని నవ్వెను. వెంటనే వరుణపురమున కరిగెను. ఏగుతటి నాక్రోశింప వలదని గోపకులకుం దెల్పెను. వారు నూఱటఁ జెందిరి. వరుణనగరమునకుం బోవఁగనే వరుణుఁడు

సకలలోకాధీశుఁడు నాగృహమునకు విచ్చేసెనే యని పరమా నందభరితుఁ డయ్యెను. ఎదురు వచ్చెను. సకలవిధోపచార ములఁ బూజించెను. 'కృతకృత్యోఽస్మి' యనియెను. తత్పాదో దకమును శిరమునఁ జల్లుకొనెను. ఎంతటి ధన్యుఁడను! అని యచ్చెరువొందెను. నాగృహము పవిత్రమయ్యెను. నాదేహము కృతకృత్య మయ్యెను. నాయదృష్టము ఫలించెను అని వినయ మునఁ బలికెను. మఱియు నిటలఘటితకరపుటుండై వినుతిం చెను. ఈఘట్టమున శ్రీభాగవతమునందు,

శ్లో. నమస్తుభ్యం భగవతే బ్రహ్మణే పరమాత్మనే,
న యత్ర శ్రూయతే మాయాలోకసృష్టివికల్పనా. ౬

అనుశ్లోకము కన్పట్టెడు. దీనికిఁ బోతనమహాకవి,

ఉ. ఏపరమేశ్వరుం జగము లిన్నిటిఁ గప్పినమాయ కప్పఁగా
నోపక పారతంత్ర్యమున నుండు మహాత్మక! యట్టి నీకు ను
ద్దీపితభద్రమూర్తికి సుధీజనరక్షణవర్తికిం దనూ
తాపము పాయ మ్రొక్కెద నుదారతపోధనచక్రవర్తికిన్.

అనుపద్యమును వ్రాసిరి. మూలార్థ మెంత పెంచి వ్రాయఁబడి నదో చూడుఁడు. ఉద్దీపితభద్రమూర్తికిన్=అనునది ప్రాసరక్ష ణార్థమని తలంపకుఁడు. విశేషార్థమున్నది. తుభ్యమ్=అన్న మూ లమున కీపదము తెనుఁగు నీకొఱకున్ అన్నఁ జాలునా. బాగు కాదు. సకలశుభనిలయమూర్తి యనుట యిట నెంతయో తగి యున్నయది. పరమాత్మనే= అన్నదానికి సుధీజనరక్షణవర్తికిన్= అని వ్రాసిరి. ఇది చాల సొగసుగానున్నది. ఈశ్వరుఁ డనఁగా

రక్షకుఁ డని భావము. పరమశబ్దమునకు నిరుపమానమని యర్థము. దీనితాత్పర్య మేది? సుధీజనరక్షణవ_ర్తికి = అనునదియే యని యూహింప వచ్చును. ఔరా! భాషాంతరీకరణ మిట్లుండ వలయునేమో.

ఇట్లు వినుతించి వరుణుఁడు శ్రీహరీ! కరుణాశరధీ! నా భృత్యుఁ డెఱుఁగక యీపని జేసెను. మీతండ్రినిం గొని తెచ్చెను. ఇది మహాపరాధమే కాని యిది నాయదృష్టముగా మాఱినది. తమ రరుదెంచితిరి. ఇంతకన్న నా కేమికావలయును. బ్రహ్మానంద మనుభవించితిని. ఈభృత్యునియవినీతిని క్షమింపుము. నన్నుం బ్రసాదమేదురదృష్టి నవలోకింపుము. అని ప్రార్థింపఁగా శ్రీహరి యాతని సాదరమున వీక్షించి ప్రీతిమై సంభాషించి సేవకు నను గ్రహించి తండ్రిం దోడుకొని క్షణకాలముననే యరుదెంచెను. నందుఁడు వరుణనగరమునుండి శ్రీహరి తన్నుం బిలుచుకొనివచ్చుట తనబంధువుల కచ్చెరువుపుట్టఁ జెప్పెను. వారెల్లఁ బరమానందసాగరమున నోలలాడుచు శ్రీకృష్ణుఁ డీశ్వరుం డని స్పష్టముగాఁ దలపోసి యిఁక మనకు భవార్ణవ నిమగ్నత్వము లేదని తలంచిరి. హరియును వారలతలంపుల నెఱింగి సుస్మితమున వాని నాదరించెను. మఱియు వీర లీసంసారబంధములం దగులుకొని పరిభ్రమించుచున్నవారు. వీనినుండి విము_క్తికి మార్గ మెఱుఁగరని తలపోసి తమస్సు నతిక్రమించి యున్న తనలోకమును జూపెను.

శో. సత్యం జ్ఞానమనంతం చ బ్రహ్మ జ్యోతి స్సనాతనం,

యద్ధి పశ్యంతి మునయో గుణాపాయే సమాహితాః. ౧౫

మ. అని చింతించి దయాళువై నహరి మాయాదూరమై జ్యో
తిర్మయము, యనిరూప్యంబయి సత్యమై యెఱుకయై యానంద
మై బ్రహ్మమై, యనఘాత్ముల్ గుణనాశ మందుఁ గనునిత్యా
త్మీయలోకంబు గ్రక్కునఁ జూపెం గరుణార్ద్రచిత్తుఁ డగు
చున్ గోపాలకశ్రేణికిన్.

*శ్లో. తే తు బ్రహ్మహ్రదం నీతా మగ్నాః కృష్ణేన చోద్ధృతాః,
దదృశు ర్బ్రహ్మణో లోకం యత్రాక్రూరోఽధ్యగా త్పురా.

ఈశ్లోకమున కేలాకో పద్యము గానరాదు. వచనమున నాల్గు
మాటలు వ్రాయఁబడినవి. కారణ మూహింపఁజాలకున్నాఁడను.
"ఇట్లు హరి మున్నక్రూరుండు పొందినలోకం బంతయుఁ జూపి

*బ్రహ్మహ్రదం=బ్రహ్మైవ హ్రద ఇవ హ్రదః. తత్ర నిమగ్నస్య విశేషవిజ్ఞా
నాభావాత్. తం బ్రహ్మహ్రదం. తే తు నీతాః ప్రాపితా స్తస్మిన్ మగ్నాశ్చ.
తుశబ్దోక్తం విశేషణమాహ. పునః కృష్ణేనోద్ధృతాః సమాధేరుత్థాపితాస్సం
తో బ్రహ్మణ స్తస్యైవ లోకం వైకుంఠాఖ్యం దదృశురితి. నను బ్రహ్మనిమ
గ్నానాం పునర్లోకదర్శనమఘటితమేవేత్యాశంక్య ఆహ. యత్రేతి. యత్ర
యస్మిన్ కృష్ణే నిమిత్తే సతి పూర్వమక్రూరః అధ్యగాత్ దృష్టవాన్. శుక
పరీక్షిత్సంవాదాత్ప్రాక్తనత్వాత్. భూతనిర్దేశః. నహ్యాశ్చర్యైశ్వర్యే భగ
వతి కించిదప్యసంభావ్యమితి భావః. అథవా అక్రూరో యత్ర దృష్టవాన్.
తస్య యమునాహ్రదస్య బ్రహ్మహ్రద ఇతి నామ. తం హ్రదం నీతా మగ్నా
స్సంతో బ్రహ్మలోకం దదృశుః. పునశ్చ కృష్ణేనోద్ధృతాః పూర్వవ త్తం
దృష్ట్వా విస్మితా బభూవురితి వ్యవహితాన్వయో ప్రసిద్ధకల్పనా చ సోఢ
వ్యేతి=అని వ్యాఖ్య.

బ్రహ్మలోకంబు చూపినం జూచి" అని కనుపట్టెడు. ఇంతటి విశేషార్థము గలచోట నింత సంకుచిత మేల చేయఁబడియెనో పాఠకులు గ్రహింపఁజాల రనియే వారిభావమని తోఁచెడిని. గోరంత కొండంతలుగాఁ జేయుమహాత్ములు దీనిని బెంచి వ్రాయ కపోరు.

అంత నందాదులు పరమప్రీతహృదయులై శ్రీహరిని భగవంతుఁ డనియే నమ్మి పూజించిరి. పలురీతుల వినుతించి తదా కారమును ధ్యానించి కృతకృత్యు లైరి.

మహామతులారా! ఇదొక చిన్న భగవల్లీల. దీనినుండి మనము గ్రహింపఁదగు విషయములు కొన్ని గలవు. అవి పర మార్థవిషయములు మాత్రమే గాక వ్యావహారికవిషయములు నై యున్నయవి. నందుఁ డుపవాసము సలిపి భగవంతు నారా ధించెను. ఇది స్వభావమే గాని యిందేదియు విశేషము కాన రాదు. నందుఁడు ప్రతియేకాదశి నుపవసించునా లేక ఒకా నొకనాఁడుమాత్ర మా యను శంకలు సమాధానములు మనకు వలదు. అనఁగా నిట నది యవసరమే యైనను గథకు సంబం ధించినది కాదు. ఏకాదశీవ్రతము నంద ఆచరించినట్లు కను పట్టదు. అంబరీషాదులు కొలఁదిమందియే దాని శ్రద్ధగా నాచ రించినట్లు కనఁబడెడు. వ్రతము లనేకవిధములు. భగవంతు నారాధించుట కనేకమార్గములు కలవు. ఏకాదశీవ్రతము కూడ నందొక్కమార్గము. ఈమార్గము ననుసరించువారు కొందఱు గలరు. మహర్షు లీవ్రతము నాచరించినట్టు తలఁచుగాఁ బురాణ

ములయందుఁ గనఁబడదు. ఏకాదశి యుపవసించి ద్వాదశి పారణచేయుట ఋషులకు ననుకూలించుమార్గము కాదు. తపోనిరతుల కిదియేమో మహావ్రతమని తోఁచదు. నిరంత రోపవాసములు చేయుచు సదా భగవంతు నెద నిల్పి విడువక దర్శించువారికి ద్వాదశి యుదయముననే భుక్తికై వెదకికొనుట కష్టమే. వ్రతములు మహర్షులాచరించినజాడ కానరాదు. ఏతపస్సుచేయని మనవంటి గృహస్థుల కీలాటివ్రతములు విధిం పఁబడినట్లు కనుపట్టెడు. ఈచర్చ యింతట వదలుటయే మం చిది.

నందుఁడు ద్వాదశిపారణ చేయుపొంటె నకాలమున స్నానమునకుఁ బోవుటయే యిట విచారించఁదగినది. అట్టితఱి వరుణదూత యాతనిం బట్టుకొని పోయెను గదా. మనుష్యుల కాహారనిద్రానియమములు కలవు. ఇవి రెండు శరీరభరణసాధ నములు. ఇవి లేకున్న మనుష్యుఁడు జీవింపఁజాలఁడు అందు నాహారమునకంటె నిద్ర యెక్కుడు సహాయము చేయును. జాగరణము కొలఁదివ్రతములకే విధింపఁబడినది. నిద్రను భం గము చేసినచో మహాపాపము గలుగునని పురాణములఁ గనఁ బడియెడిని.

శ్లో. నిద్రాభంగః కథాచ్ఛేదో దంపత్యోః ప్రీతిభేదనమ్,
శిశుమాతృవిభేదశ్చ బ్రహ్మహత్యాసమం స్మృతమ్.

అని దేవిభాగవతము హెచ్చరించుచున్నది. కావుననే నిద్రించువారిని దగ్గరకుం బోయి తటాలునఁ దట్టి లేపఁగూడ

దనియు, దూరమునుండి మెల్లమెల్లనఁ బిలువవలయుననియుఁ బెద్దలు చెప్పుచుందురు. ఆచారముకూడ నట్లే కలదు. తటాలున నిద్రకు భంగము కల్గించినఁ గొంద ఱులికిపడి లేచి యాపిలిచినవానిం బ్రహరించుట నేనెఱుఁగుదును. కొందఱులికిపడి లేచి పరుగిడుదురు. కొందఱు గుండె చెదఱి మృతినొందుదురు. ఇవన్నియు నూహించియే మనపూర్వు లాచారరూపమునఁ గొన్నింటిని, విధిరూపమునఁ గొన్నింటిని ధర్మముల నాదేశించిరి. వీనిని బాటింపకుండుటచేఁ బరమార్థము నశించునని నేనమ్మఁజాల కున్నవాఁడఁగాని వీని ద్యజించుటచేఁ గొన్ని తరుణములందుఁ జేటువాటిల్లును గాన నవశ్యము వాని నాచరించియే తీఱవలయును. ఆయాచారమునకు విరుద్ధముగాఁ బ్రవర్తించినచో దేవత లాగ్రహింతురు.

నందుఁ డుపవాసశ్రమము నొందికాఁబోలు నిద్రరామి నకాలమున లేచెను. నదికి స్నానమునకుం బోయెను. ఈస్నానప్రయత్నము క్షుద్బాధానివృత్త్యర్థమే యని యూహింపవచ్చును. పాప మాకాలము స్నానమునకుం బోయెను. "కష్టాత్కష్టతరం క్షుధా" యన్నసూక్తి యంద ఱెఱుంగుదురు కదా. దీనిచే నకాలమున స్నానమునకుం బోరాదన్న నియమమును మీఱెను గదా. జలజంతువులకు నాహారనిద్రాదులు మన కున్నట్లు కలవు. అట్టిజంతువులకు నిద్రాభంగముచేసిన దోషముకూడఁ గలుగుననియు నది లేకుండ నారోగ్యమునకు బాధ కలుగకుండ నాచారనియమములు కల్పింపఁబడినవి. అర్ధరాత్ర

మున స్నానమునకుం బోఁగా విధినతిక్రమించినదుష్టుఁ డీతఁ డని వరుణదూత నందునిం బట్టుకొని తనయేలికపరిసరమున కీడ్చుకొనిపోయెను. శ్రీకృష్ణుఁ డచటికిం బోయి తండ్రిని బిలుచుకొనివచ్చుటం గూర్చి యచ్చెరువుపడవలసిన దేమున్నది? భగవంతున కిది యొక గొప్పకార్యము కాదు కదా? కాన దానిం గూర్చి మనము చర్చింప నవసరము లేదని నాయూహ. వరుణదూత వచ్చి నందునిం బట్టుకొని పోయెనన్నది యుక్తికిను కూలముగ నున్నదా యను ప్రశ్నము రాఁ దగినదే. ఆగ్రహింపక మీరుండిన నేనొక చిన్నకథను దెల్పెద. అది సత్యేతరమని తలంపవలదు. నాచరిత్రముగాన నాకత్యంతవిశ్వాసమున్నది.

పదునాల్గవసంవత్సరమునఁ గాశియందు విద్యాభ్యాసము చేయఁ బోయియుంటిని. పరదేశమగుట నాయీడున కించుక కష్టముగనే యుండెను. హనుమద్ఘట్టమున శ్రీబోధాయనకాశీనాథశాస్త్రిగారియింట నుంటిని. విద్యార్థులలో నాకంటె నల్పవిద్య నభ్యసించువాఁడు లేకుండెను. కావున రాత్రిభుక్తి నాకొదవదయ్యెను. ఒకరాత్రి పరుంటిని. నిద్ర పట్టలేదు. ఎట్లో రాత్రిని గడపితి. మఱునాఁ డొకమఠమున సంతర్పణము జరగుననియు నొక్కరూప్యము దక్షిణయనియుఁ దెలిసెను. నేనున్నయింటివారు మిగులదయార్ద్రహృదయులు. నన్నును వారితోఁడ రావచ్చునని పిల్చిరి. పదునొకండు గంటలమీఁద భుక్తికి వెళ్లవలయు ననిరి. ఉదయమునుండి నాయాఁకలి యిట్టిదని వచింపఁ

జాలను. కష్టముగనే యుండెను. ఆశ యెన్నితిప్పలనైనఁ బెట్టును. గర్భదరిద్రుఁడనుగా నను భావించుకొనుచుంటిని. వేళ కావచ్చినది. మధ్యాహ్నకాలస్నానమునకుఁ గేదారఘట్టమునకుఁ బోతిని. ఎవ్వరును లేరు. స్నానముచేసిన క్షుద్బాధ కొంత తగ్గునని యే రెండవపర్యాయము స్నానమునకుం బోయితిని గదా. ఈఁత నాకప్పటి కలవాటున లేదు. నీటిలో దిగితిని. రెండవసోపానమున నడుగిడఁగా నా కాలు జాఱెను. నీటిలోనికిం బోవుచు నప్పటినాదుఃఖస్థితిని దలంచుకొనుచు లోపలి కరుగుచుంటిని. జీవితేచ్ఛ తొలఁగెను. ఇంతలో నన్నెవ్వరో వెంట్రుకలం బట్టిలాగిన ట్లాయెను. నీటిచెంతనున్న సోపానమున నుండినపుడు తెలివివచ్చెను. నలుప్రక్కల నెవ్వరును లేరు. దూరముగా గంగానదిలో నొకపడవ పోవుచుండెను. అందున్నవారు వచ్చి నన్ను రక్షించి యంతలో నంతదూరము పోయి రనుట కేవల మసత్యము. శ్రీమద్విశ్వేశ్వరుని యర్ధాంగలక్ష్మి యన్నపూర్ణాదేవియే నన్ను రక్షించెనని తలంచితిని. తదాదిగా సర్వరక్షకునియందు భక్తి కుదిరినది.

"అడవి రక్షలేనియబలుండు వర్ధిల్లు
రక్షకుండు మందిరమునఁ జచ్చు."

అన్నమాట నామది నాటెను. ఇంతవఱకు దృఢముగనే యున్నవి.

మహాత్ములారా! నాయీకథ సత్యముని మఱియొకపర్యాయము విన్నవించుచున్నవాఁడను. కావున దేవతలు సదా

తిరుగుచు నార్తులను గాపాడుచుందురని నమ్ముఁడు. అట్లే దుష్టుల శిక్షింతురనియు నమ్ముఁడు. ధర్మమును మీఱినవారిని వెదకుచుందురు. అట్లె జలాధిదేవతయగు వరుణుఁడు తనదూతలం బంపి నదీప్రాంతముల నరయుచుండును. అకాలస్నానము చేయు నందుని గొనిపోవుటయు విశేషము కాదు. కాని యీవిషయము నసత్యమనువారిని నమ్మించుటమాత్రము కష్టము. ఏదియెట్లున్నను నదులకు బావులకుఁ జెఱువులకు నకాలమున స్నానముచేయఁ బోరాదనియుఁ బోయిన హానికల్గుననియు నిదియే సదాచారమత మనియు గ్రహింపఁదగినది. ఇఁకఁ దరువాతి దగు శ్రీకృష్ణలీల నవధరింపుఁడు.

## వేణుగానము.

శ్లో. అంగుళ్యగ్రై రరుణకిరణై ర్ముక్తసంరుద్ధరంధ్రం
వారం వారం వదనమరుతా వేణు మాపూరయంతమ్,
వ్యత్యస్తాంఘ్రిం వికచకమలచ్ఛాయవిస్తారినేత్రం
వందే బృందావనసుచరితం నందగోపాలసూనుమ్.

శ్రీకృష్ణకర్ణామృతము ౨ ఆ. ౫ శ్లో.

అధరే వినివేశ్య వంశనాళం వివరాణ్యస్య సలీలమంగుళీభిః,
ముహురంతరయన్ ముహుర్వివృణ్వన్మధురం గాయతి మాధవో వనాంతే.

౨ ఆ. ౧౪ శ్లో.

* భక్తులారా! ఇఁకముందు భగవంతునిశృంగారలీలలు

---

* ఈగాథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౨౯ అధ్యాయమునుండి గ్రహింపఁబడినది. శ్రీకృష్ణజన్మఖండాదులయం దీకథ కానరాదు.



శ్రీకృష్ణభగవానులు

Lakshmi Art, Bombay, 8.

వ్రాయఁబడును. కాని యవి విశేషార్థములు గలవి గాని సామాన్యములు గావనియు నెఱుంగుఁడు ఇంతకుఁ గొంతవెనుక హేమంతర్తువునగోపికావస్త్రాపహరణము వ్రాయఁబడినది. ఇపుడు శరత్కాలవేణుగానము వ్రాయఁబడుచున్న దే?ఏలయనియాక్షే పింపకుఁడు. కథలను వరుసఁగా వ్రాయునపుడు పురాణభేదముల ననుబట్టి యిటునటు మాఱుచుండును. కావున ముందు గోపికా వస్త్రాపహరణము వ్రాయక రాసక్రీడ వ్రాయ వలనుపడలేదు. ఆకథ పిదప దీనిని వ్రాయవలసివచ్చినది. కాఁబట్టి క్షమింతురని నమ్మెదను. ఈలీలయందే విశేషసంశయముల కవకాశము కలదు. వానిని దొలఁగించుకొని తత్సారతరార్థమును మది నిలుపు కొనినఁ గాని భక్తి దృఢపడదు. అది నెఱవేఱినఁగాని ముక్తి కుదురదు. ఇఁకఁ గథ నాలకింపుఁడు.

భగవంతుఁడు శ్రీకృష్ణమూర్తి యొకానొకదినమున నీగోపికలు గోలోకాభ్యాసమును మఱచినారా. లేక నావేణు గానానంద మనుభవించు నభిలాషలు గలవారుగ నున్నారా?పరీ క్షింతమని యూహించెను. గోలోకమునుండి తా నవతరించు తఱిఁ దనవిరహమును భరింపఁజాలక మనుష్యలోకములఁ దమ రుకూడ నవతరించిరి కదా. అట్టిగోపిక లిపుడు గోలోకమునుం డియే యవతరించినగోపకులకు భార్యలుగానైరి. కాఁబట్టి పర భార్యలమన్న బుద్ధి వీరి నాభక్తినుండి మఱలించినదియా. లేక మఱలింపఁజాలక నిలిచినదియా చూతమని నిశ్చయించెను. పలు త్రోవల భక్తులఁ బరీక్షించునాచారము భగవంతునకు సహా

జము. గోలోకాభ్యాసములకును, మనుష్యలోకాభ్యాసములకుఁ జాల భేదము. రాధవలెనే యీగోపికలెల్ల శ్రీకృష్ణునకుఁ బ్రియరాండ్రు. రాసమండలమున శ్రీకృష్ణునిం గూడి విహరిం చువారు. మనుష్యలోకమునఁ గల యాచారములనే యవలం బింపక పూర్వాచారములఁ బాటించుటచేతనే శ్రీకృష్ణునిఁ జూడ కున్నఁ బరితపించుచుండువారు. భగవంతుఁడు కేవలబాల్యావస్థ యందున్నపుడు తద్వృద్ధబుద్ధులుగా వారితనువు లుండినవే కాని మనుష్యమాత్రుల కుండినట్లు లేవు. ఈవిధము భగవంతుఁ డెఱుఁగును. కాని తా సర్వజ్ఞుఁడైనను తనవాడుకలు లోకులకు నుదాహరణములు కావలయు నను నుద్దేశమునఁ బరిశీలించు చుండు వాఁడు. ఆయాచారమునే యీకథయందును బాటిం చెను.

శరత్కాలము నిర్మలతమమని లోకవిదితము. సాధార ణముగా సుఖానుభవకాల మది యనియే యందఱు భావిం తురు. అందును బూర్ణిమాతిథి రమణీయతమ మనుట క్రొత్తది కాదు. * శరన్మల్లికలు విరహోద్దీపకములుగా నలంకారశాస్త్ర జ్ఞులు వర్ణింతురు. తలఁచుగా మల్లికాలత వసంతర్తువునఁ బుష్పిం

* శరత్కాలము మల్లిక వికసింపదు. కాన శరన్మల్లికయన నర్థము వికసించినమల్లికాపుష్పమని కొంద ఱర్థము చెప్పుదురు. కాని శరచ్ఛబ్దమునకు నగము పూచినదనునర్థము ప్రాయశః కానరాదు. శరత్కాలమునఁ గొన్నిమల్లి కాలతలు పుష్పించును. ఆజాతిమల్లికాకుసుమములే పరిమళభారవిలసితములని గ్రహించుట సరసము. 'శరదోత్ఫుల్లమల్లికాః' అని భాగవతమున నున్నది.

చున్నదైనను ఒకానొకజాతిమల్లికాలత శరత్కాలమున బూయు నలవాటు కలది. దానికుసుమము లత్యంతపరిమళమిళితములు. విచిత్రవినోదకథలయందు మది వ్యాపింపఁ జేయునవి. బృందావనమున యమునాతీరమున విచిత్రమల్లికాలతలు తరువరములవలంబనములుగా నల్లియుండును. ఆసైకతభూములు శీతలభూరుహములు. వాని నాధారముగా భావించి ప్రాఁకినలతావిశేషములు, శీతలమందమారుతము, నిర్మలజలము, శ్రుతులకింపుఁబెంచుశుకపికాదిపత్త్రివితతికూజితములు ఆటిగుండెకలవానికేని ఒక్కవిధమగు మార్పును గల్గించునన నిఁక రసికజనులమాట యెత్తి యిటఁ జెప్పనేటికి? అట్టిశరత్కాలమున శ్రీహరి యొకనాఁడు ముందువ్రాసినట్లూహించెను. తా నిర్లిప్తుఁడయ్యు యోగమాయను జక్కఁగా నాశ్రయించెను. ఆయోగమాయ కొండలఁ బెండ్లగాఁ జేయఁ జాలును. బెండ్లను గొండలుగాఁ జేయఁగలదు. దానిని మించినశక్తి లోకమున లేనేలేదు. ఏలన నది భగవచ్ఛక్తి. దానిని మించున దేదియుండును?

ఆనాఁడు పున్నమకూడ నయ్యెను. ఓహో! శరత్కాలపూర్ణిమా తిథి. యమునాతీరము. బృందావనము. వీనిమహిమము చెప్పశక్యమా. తెలియ సాధ్యమా. వాని కవియే సాటి. కావున యోగమాయను సమాశ్రయించి భగవంతుఁడు విహరించునెపమున గోలోకవాసిస్త్రీజనమును బరీక్షింపఁ గోరెను. అత్తఱిఁ జంద్రోదయ మయ్యెను. శశాంకుఁడు విరహోద్దీపకపదార్థములలోఁ బరిగణింపఁబడినవాఁడే. అందును శరద్రాత్రికాలీ

తాంశుఁడు. ఇఁక నడుగవలసినదేమి? ఈఘట్టమున మూలమున కన్న మహాకవి పోతనగారి పద్యములు హృద్యములై తనరారు చున్నవి. మూలము నిస్సారమని చెప్పఁదరమా దాని నాధార ముగాఁ గొని సరసరీతులఁ బద్యముల నల్లి మహాకవి తనచతుర తను వెల్లడించెను. పద్యములన్నియు నట్లేయున్నందున నొకటి రెండు మాత్రము వ్రాయుచున్నవాఁడను.

ఆ. కామతంత్రటీక ♦ కలువలజోక కం
దర్పుడాక విటుల ♦ తాల్మిపోక
చకితచక్రశాక(వాక)♦సంప్రీతజనలోక
గాక వచ్చె మేలు ♦ రాక యగుచు.

దీనికి మూలము మృగ్యమే.

క. పతి తనకరములఁ గుంకుము
సతిమొగమున నలఁదుభంగి ♦ సముదయవేళాం
చితకరరాగమున నిశా
పతి రంజించెన్ నరేంద్ర ♦ ప్రాక్సతి మొగమున్.

దీనికి మూలము-

తదోడురాజః కకుభః కరైర్ముఖం
ప్రాచ్యావిలింప న్నరుణేన శంతమైః,
సచర్షణీనా ముదగాచ్ఛుచోమృజన్
ప్రియః ప్రియాయా ఇవ దీర్ఘదర్శనః.

ఈ యర్థమంతయుఁ బద్యమునఁ గానరాదు. కాని ప్రత్యేకముగా దానిం జదివిన ముద్దులు మూటగట్టుచున్నది.

ఈక్రిందిపద్యమునకు మూలమే లేదు. కాని యతిశయరస ప్రవాహ మని వర్ణింపఁ దగి యున్నది.

సీ. విటసేనపై దండు • వెడలెడువలతేని
    గొల్లెనపై హేమ•కుంభ మనఁగఁ
గాముకధృతివల్లి•కలు త్రెంప నెత్తిన
    శంబరాంతకుచేతి•చక్ర మనఁగ
మారుండు పాంథుల • మానాటవులు గాల్పఁ
    గూర్చిన నిప్పుల•కుప్ప యనఁగ
విరహిమృగమ్ముల • వేఁటాడ మదనుండు
    తెచ్చిన మోహన•దీప మనఁగ
ఆ. వింతనునుపు గల్గి • వృత్తమై యరుణమై
కాంతితోఁ జకోర•గణము లుబ్బఁ
బొడుపుఁ గొండచక్కిఁ • బొడిచె రాకాచంద్ర
మండలంబు గగన•మండలమున.

ఆచంద్రోదయకాలమున శ్రీజగన్నాటకసూత్రధారుఁడు కరముల మురళిం దాల్చి జగన్మోహనమయి యవ్యక్తమధుర ముగాఁ దనరు గీతమును బాడెను. (జగౌ కలం వామదృశాం మనోహరం)

పాఠకులారా! ఇంచుక మది నేకాగ్రము చేసి యిట నాలోచింపుఁడు. ఆపాట నవయువతులకే మనోహర మఁట. ఇతరులకు వినఁబడదా. రసము నొక్కఁడేని గ్రహింపఁజాలఁడా. దీని తాత్పర్యము వేఱు. ఆమధురనాదము గోలోకమునుండి

యవతరించిన గోపికలకే వినఁబడును. తక్కినవారికి వినఁబడదు. కావుననే భర్తలు యోగమాయాపరవశులై తమసతు లెందే గిరో తెలిసికొనఁ జాలక పోయిరి. ఏరీతిగా నాగీతము వారికి మాత్రము వినఁబడునో అట్లే మురళీనాదరూపమునఁ బాడెను గదా. ఈశక్తి యందఱకుం గలదా. గోపికలు తప్పఁ దక్కిన వారందఱు బధిరు లనవలయును. ఇంతియకాని వేఱు మాట చెప్ప నవకాశ మిట లేదు. అట్టిశక్తి భగవంతునకుఁ గలదా యని ప్రశ్నించుట యున్మత్తప్రలాపము వంటిది. భగవంతుఁడు సర్వశక్తిసమన్వితుఁడు కాఁడనువా రుండరు ఉన్నచో వారు వెఱ్ఱివారే. భాగవతమున నిట్లు చెప్పుటచేత శ్రీకృష్ణుని సర్వశక్తిమత్త్వము వెల్లడి యయ్యెను గదా. ఇఁక నట్టిమహాత్ముఁడు పరభార్యలను ఆకర్షించె ననుట పిచ్చితనము కాదా. తనగానమును గోపికలకు మాత్రమే వినవచ్చునట్లు పాడెను. అనఁగా వారిభక్తి యెంతమాత్రము స్థిరమో పరీక్షింపఁ దలంచెనని భావము. ఇఁకఁ దరువాతికథ వినుఁడు.

ఆగీత మారాత్రికాలమున గోపికలశ్రవణరంధ్రములఁ బ్రవేశించి హృదయపద్మమును వికసింపఁజేయఁ జాలెను. తదానందమున గోపికలతనువు లతను సునిశితశరాసారమునఁ గంపించెను. ఓపిక లెచటికో పోయెను. శ్రీకృష్ణుఁ డంతట వారిమనస్సుల నపహరించెను. ఒకరితో నొకరు తెల్పుకొన నూహింపక పోయిరి. తనకు మాత్రమే యీగానము వినఁబడిన దని తలంచి యితరుల కెఱుకపడకుండఁ బోవలయునని శ్రీహరిని దర్శించిన

గాని బ్రదుక వలనుపడదనియుఁ బ్రతిగోపికయుఁ దలంచెను. వెంటనే యిల్లు వదలిరి. కుండలము లూఁగులాడుచుండఁగా గమనవేగము మందగమన లనుశబ్ద మసత్యమని దృఢపఱచు చుండఁగా బయలువెడలిరి. ప్రొద్దు చాలఁ గడువ లేదు. కావు ననే వీరిపయన మెవ్వరును గనుఁగొన లేదు. భగవత్ప్రియుక్త యోగమాయ యందఱ నాచ్ఛాదించి యుండెను. మచ్చుగుండ చల్లినట్లు పురుషులు గాని యితరకాంతలు గాని యెవ్వ రెఱుం గకపోయిరి. కొందఱు గోపికలు పాలు పిదుకుచు నట్లెపోయిరి. కొందఱు పిదుకుటకుఁగాఁ గూరుచుండి పిదుకకయే పోయిరి. పాలు కాచుటకై ప్రొయ్యిమీఁద నునుపఁబోయినకాంత యట్లె యాపని చేయక పయనము సాగించెను. ఒక్కకామినీ మణి కాఁగినపాలు దింపఁబోయి మఱచి వెడలెను. మఱి యొక్కపూఁబోఁడి లేదూడలఁ బాలుత్రాగ మెడకట్టులు వద లించుచు నట్లె మఱచిపోయెను. దూడలు పాలుత్రాఁగఁ గట్టి వేయ మఱచి వేఱొక యన్నులమిన్న తదేకమనస్కయై యము నాతీరమునకుం బోయెను. ఒక్కవనితారత్నము భర్త బడలి యుండఁగా శుశ్రూషచేయుచు నట్లె పరుగిడెను. ఆతఁ డేమి పోయెదవని యడుగ మఱచెను. ఒకలతాంగి భుజింపఁ గూరు చుండి యకార్య మెంత నెఱవేఱెనో తెలియకయే పరు వెత్తెను. ఒక్క తన్వంగి యిల్లలుకుచుండి యేగెను. ఒక్క రామావతంసము చందనము పూసికొనుచుండి వెఱ్ఱియెత్తినట్లు నడిచెను. ఒక్కకన్యక వస్త్రాలంకారము వ్యత్యయముగ నొన

రించి సత్వరగతిఁ బోయెను. ఒక్కయోషారత్నము కృష్ణుని చెంత కరుగుటకన్న నిది యొకపనియా యని చేయుచున్నపని వదలి పరువెత్తెను.

కొందఱు పరుగిడుతఱి నెందులకో యను నూహచే భర్తగాని బంధువుకాని తల్లిగాని తండ్రిగాని సోదరుఁడుకాని వలదనుచున్నను బోయిరి. కాని యాపిదప ముందా తేపించినవా రాసంగతి మఱచిరి. అత్తఱి గోపికలమానసము లెందుండినవి. శ్రీకృష్ణునం దుండెను. పాప మాకాంత లేమిచేయుదురు? తమ తమ మనస్సులు తమయందు లేనపుడు చేయుచున్న దేమని, చేయఁదగినపని యేమని చేయఁగలపని యేమని యెఱుంగఁజా లుదురా? అది సాధ్యమా. ముందు పోవుచున్న కాంతను వెనుకఁ బోవుతరుణి పిలుచుట గాని యెచ్చటి కేగుచున్నదో యని యూహించుటగాని లేదు. అత్తరుణముననే

'ఎవరికి వారే యమునాతీరే'

అను నానుడి కలిగి యుండవచ్చును. ఇట్టు లెవ్వరిత్రోవ వారిదే యన్నట్లు వడివడి నడచిరి. కొందఱంగన లంతర్గృహములనుండి వెడలువెరవు దొరకమి మనస్సులచేతనే పోయిరి. ఇంటిలో నున్నట్లు వా రెఱుఁగక కృష్ణునితో సల్లాపించుచుండినట్లే తలంచిరి. ఆసుఖము నందఱనుభవించినట్లే యనుభవించిరి. కొం దఱు మందయానలు భగవంతుఁడని యెఱుంగక సుందరాంగుఁ డనియే భావించి యింటినుండియే మనస్సులచేఁ గౌఁగిలించి

తత్సుఖ మనుభవించి గుణమయతనువుల వదలి ముక్తికిం బోవు నర్హత నొందిరి.

ఈఘట్టమున శ్రీభాగవతమునందు—

శ్లో. కామం క్రోధం భయం స్నేహమైక్యం సౌహృదమేవ వా,
నిత్యం హరౌ విదధతో యాంతి తన్మయతాం హితే.

అని కనుపట్టెడు. దీనికి మహాకవిగారు,

ఆ. బాంధవముననైనఁ • బగనైన వగనైనఁ
ప్రీతినైనఁ బ్రాణ•భీతినైన
భక్తినైన హరికిఁ • బరతంత్రులైయుండు
జనులు మోక్షమునకుఁ • జనుదు రధిప.

అని వ్రాసిరి.

ఇట్లు గోపిక లోపికలు లేక శ్రీహరిదివ్యగానము నాలకింపఁ బోయిరి. ఈగానమునకే శరద్గాన మనిపేరు శ్రీహరికరకమలమున వెలయుమురళియే బిందువు. దానిధ్వనియే నాదము. దాని నాలకించి చొక్కుటయే కళ ఇవియే నాద బిందు కళలని వేదాంతులు వాడుపదముల కర్థము. ఈగోపిక లాకాలమున పరమహంసగతులు గలిగి, నియతిం గాంచి మౌనవ్రతపరాయణలై తదేకధ్యానమున శ్రీకృష్ణపాదారవిందములచేఁ బరిపూతమగు కాళిందీతీరమునకుం బోయిరి. అందు శ్రీహరి యొక్క సైకతస్థలమునఁ గూరుచుండి మురళిని ముఖకమలసీమం జేర్చి మధురగీతము పాడుచు భక్తులఁ జూడఁ గోరుచుండెను. ఇట్లు తలంచుచుండఁగనే గోపికలు పరవశలై పరుగిడుచు వచ్చిరి.

ఒకరినొకరు చూచుచుండియు వారిని జూడనట్లే నటించిరి. "కృష్ణగృహీతమానసాః" అనుట స్పష్టమే కదా! వారిమానసములు వారియందు లేవు. శ్రీకృష్ణపాదారవిందములపై వ్రాలియున్నవి. కాఁబట్టి ముందు పోవువారిని చూచుచుండియుఁ జూడన ట్లుండిరి. మన స్సేయింద్రియమునఁ బ్రవేశించునో ఆయింద్రియమే పనిచేయునట్లు మనకు స్పష్టమగును. ఇపుడు గోపికామానసములు శ్రీకృష్ణుని జూచుచున్నవి. కాఁబట్టియే ఎవ్వ రగపడినను శ్రీకృష్ణుఁడే యని వారికిఁ దోఁచుచుండెను.

ఇట్లుః గోపకాంతలు పరవశలై కాళిందీతటమును జేరిరి. ఒక్కరు గాదు. ఇద్దఱు గాదు. వందలకు వందలు. వేలకువేలు. అన్నట్లు మిక్కుటముగాఁ జేరిరి. వారిరాక భగవంతుఁ డెఱిఁగెను. వీరిని మోహింపఁజేసి వీరిభక్తిని బరీక్షించెదనని మనమున నూహించెను. ఆయూహ ఫలించునదియే కదా! అట్లే ఫలించెను. కాంతలెల్ల నట నిలువఁబడిరి. ఎవ్వరికిని గాని మాటాడఁ దోఁచలేదు. ముక్తిసామ్రాజ్యపట్టాభిషిక్తములు గదా శ్రీహరి పాదములు. వానిం జూచుచుండిరి. కూరుచుండఁగాని మాటలాడఁగాని వారికిఁ దోఁచదయ్యెను. ఆగానామృతమున మునిఁగిరి. పైకిఁ దేలఁజాలకపోయిరి. ఆయానంద మిట్టిదని వర్ణింప నేరితరము? దానిని దెల్పుమాట లేభాషయందు నుండవు. అనిర్వచనీయానందమును నిర్వచింపఁజాలున దేది? భగవద్భక్తియే. దానికి దేహము లేదు. కాన నది తెలుపఁజాలదు. తనలోఁ దానే యానందించుచుండును. అట్లే గోపిక లాత్మలయందే

యానందము ననుభవించుచునుండిరి. ఒక్కరిని వేఱొక్క రెఱుఁగరు. ఈభక్తినే "పరాకాష్ఠ" యందురు. తన్ను దాఁ దెలియకుండుట. దానికే మహానంద మని పేరు. దానికి సాటి యదియే కాని వేఱు లేదు.

*ఆసమయమున మాయఁ దాల్చిన ట్లున్నశ్రీహరి మంద హాసము ముఖరంగమునఁ జిందులాడ లలితవాక్కుల వారి మోహింపఁజేయుచు నిట్లు పలికెను. ఆవాగ్విలాసములు.

"గగనం గగనాకారం సాగర స్సాగరోపమః,
రామరావణయో ర్యుద్ధం రామరావణయోరివ."

అన్నట్టివి. వాని కవియే సాటి. అనన్వయాలంకారమున కుదాహరణము లనఁదగినవి. అంతకన్న మంచిమాట లేదు. భగవంతుని యప్పటిమాటలంబట్టి చూడఁగా రామావతారమును స్మృతికిం దెచ్చుచుండెను ఇట మూలమును వ్రాసి దానియందలి చమత్కృతిని వ్రాయకుండుట సరసముకాదు.

స్వాగతం వో మహాభాగాః ప్రియం కిం కరవాణి వః,
వ్రజస్యానామయం కచ్చి ద్బ్రూతాగమనకారణమ్. ౧౮. శ్లో.

మహాభాగాః=పవిత్రచరిత్రలారా! మీయాగమనమునకు సంతసించితిని. నేఁ జేయఁదగు హితమేది? వ్రజమునకేమేఁగష్టము లేదు కదా? మీ రేల వచ్చితిరి. చెప్పుఁడు=అని ప్రాతీతికార్థము. విశేషార్థ మేమనఁగా-మహాభాగాః=ఓయదృష్టవతులారా! మీ

---

* అవద ద్వదతాంశ్రేష్ఠో వాచఃపేశైర్విమోహయన్ - అని మూ. వాచఃపేశైః వాగ్విలాసైః-అని వ్యాఖ్య.

కన్న నదృష్టముగలవారుండ వీలులేదు. ఏలయన నా యేకాం తసేవ మీకు లభించినది. ఇది యోగులకేని సంభవించునది కాదు. ఇంతకంటె నదృష్ట మీలోకమున లేదు. కావున నిట నన్నుం గాంచి యానంద మనుభవింపఁ జాలు నదృష్టము మీకే కల్గినది. మహానందమున నొంటరిగానున్న నన్నుం జూడ నీ తరుణమున వచ్చితిరే? ఎంతటి భక్తిపరవశలు? ఔరా! పూర్వవాసనను మఱువలేదు. సంసారమునఁ బడి దరిగానని వారివలెఁ గాక మీరు మేలుకొంటిరి. కావుననే యదృష్టవతులు మీరని భావము. వః స్వాగతమ్=మీకు స్వాగతము. అనఁగా మీరాక సంతసము గూర్చె నని భావము. మీరు తరుణులుగానుండియు మానవుల యలవాటులఁ బాటింపక భర్తయాజ్ఞ లేక మనోనాయకుఁడ నగు నన్నే శరణముగా నమ్మి వచ్చితిరి. ఇదే స్వాగతము. అనఁగా మీరు లోకాతీతలు. లోకాతీతము గోలోకము. అచ్చటి యాచారములను బాటించువారు కావున రాసమండలమునందలి యలవాటులు మీకు వదలకున్నవి. ఆపరీక్షకే యీగీతము. మీరు వచ్చుట నాకుఁ బరమానందము. ఇతరులు గలరు. వారేమనుకొందురో యను నజ్ఞానము లేక సర్వము నేనే యని నమ్మి నన్నుం జూడ వచ్చుట ముక్తిహేతువుగాన బంధనివృత్తిని గోరి యిటకు వచ్చితిరే. ఇంతకంటె నాకానందమేమి కావలయును? శుభాగమనమన నిదియే. అని దీనిసారము.

ప్రియం కిం కరవాణి వః?

మీ కేప్రియ మొనఁగూర్తును? ఏకాంతమున నన్ను సేవించు వాంఛకంటె మీకుఁ గావలసిన ప్రియ మేది? ఇంకేమేని గోరిన నిత్తును గాని మీరింతకంటె నెక్కుడు వాంఛగలవారు కారని నేనెఱుంగుదును. భక్తులు నాదాస్యమునే కోరుదురు. అదియే వారికిఁ బరమానందము. మీరు తపస్సులుచేసి నాసంగతినే కోరితిరి. ఆవర మిచ్చి యుంటిని. తత్ఫలమే మీకుఁగల గోలోకనివాసము. నాయెడఁబాటు నోర్వలేకయే కదా యిట జన్మించితిరి. నన్ను గతిగాఁ గోరితిరి. ఆపరీక్ష పూర్తియైనది. ఇఁక నేనేమిప్రియ మొనఁగూర్తును? అని విశేషార్థము. వాచః పేశైర్విమోహయన్. అని ముందే చెప్పఁబడియెఁ గదా. దానిని మఱువకుండ నన్వయింపవలయు.

భగవంతుఁ డీరీతిఁ బ్రశ్నించి లోకాచారమును బాటించువాఁడై యింకను బరీక్షించుచున్నాఁడు. "ప్రియం కిం కరవాణి వః" అన్న వాక్యముచేత నాపరీక్ష సిద్ధమగుచుండఁగా మరల నీవాక్య మేల యని ప్రశ్నింపకుఁడు. స్థూణానిఖననన్యాయము ననుసరించి యీపరీక్ష న్యాయమే. స్తంభము నాటి గట్టిగా నున్నదో లేదో చూతమని యూఁతురు ఆలాగే మరల స్వామి ప్రశ్నించుచున్నాఁడు. అందు లోకాచారములఁ బాటించి ప్రశ్నించి గోపికల పరవశత్వము నరయుచున్నాఁడు.

వ్రజస్యానామయం కచ్చిత్?

మీ నివాసప్రదేశమున కేమేని భయముగలదా. ఆమయము వ్యాధి. అనఁగా భూభాగమునకు, వ్యాధి యనఁగా

ఏజంతువులవలననేని భీతి కలదా? యనిభావము. ఇది ప్రాతీతి కార్థము. వాస్తవార్థ మేమనఁగా, ఏజంతువుచేతనైన మీనివాసమునకు భంగము కలదా యని ప్రశ్నము. లేదని దీనిసారము. బృందావనమును బాధించువారిని సంహరించితిని. ప్రచ్ఛన్నరూపమున నున్నవారికి శాపవిముక్తిం బ్రసాదించితిని. ఇంకే బాధ కలుగ నవకాశమున్నది? అని ప్రశ్నించెను. ఏవిషయమునను సంశయము లేని మీ రేల వచ్చితిరి? అని యడిగెను. తెలియనట్లు నటించుచున్నాఁడు. ఏయూహాతోఁ జనుదెంచితిరో తెల్పుఁడని భావము.

ఆర్యులార! ఈయొక్కశ్లోకముచే భగవంతుని పరమకరుణాపరత్వము సర్వనియంతృత్వము, వెల్లడించెను. ఈశ్లోకమునను మనమహాకవిగారు,

శా. మేలా మీకు భయంబు పుట్టదు గదా • మీమందవర్గ సింహశార్దూలానేకపముఖ్యముల్ దిరిగెడిన్ • మారంబు లేతెంతురే, యేలా వచ్చితి రినిశాసమయ మం•దిచ్చోట వర్తింతురే, చాలుం జాలు లతాంగులార! చనుఁడీ • సంప్రీతితో మందకున్.

ఈపద్యమునం దెంతయర్థ మిమిడియున్నదో పాఠకులూహింతురు గాక. ఒక్కొక్కమాటయందు నెన్నియోయర్థము లిమిడియుండును. వానినెల్ల నిటఁ దెల్ప వీలులేకున్నయది.

పై శ్లోకమున కీయర్థము గలదా యని ప్రశ్నింపరాదు. అట్లు భావము. లేనిచో నీకథయందు రస మేమున్నది? భగవంతుఁడు ధర్మసంస్థాపనము చేయనవతరించిన శ్రీకృష్ణమూర్తి భర్తల వదలివచ్చిన స్త్రీలతోఁ జమత్కారముగా మాటలాడెననుటకంటెఁ దెలివితక్కువప్రసంగ మేమియుండును? కావున భక్తిమెయి భగవత్కథలఁ జదివిననే ఫలము. విపరీతభావనచేఁ జదివిన విపరీతఫలము గలుగును. ఇఁక నవ్వలికథ నాలకింపుఁడు. అన్నితావుల నీకథయందుఁ బైయర్థమునే భావించుచుఁ గథను బఠింపుఁడు. ఆనందము కల్గును. ఆయానందము వెలుపలఁ జెప్ప వీలులేనిది. వేఱొకటి లోపల సుఖమును గల్గింపనిది. కాన విపరీతార్థములఁ బాటింపనిమదితోఁ జదువుఁడు.

*పురంధ్రీమణులారా! ఇది రాత్రికాలము. భయంకరరూపము. క్రూరజంతువు లిందునందుఁ దిరుగుచుండు. ఇపుడు ప్రొద్దు చాల గడువలేదు. మీనివాసమునకు మరలి పొండు. ఇట్టితావుల స్త్రీలుండరాదు. అందును మీరు సుందరాంగులు

---

*ఈభాగమునకు నంతరార్థము గలదు. అందు యిటుల వ్రాయఁబడును. కథకు సంబంధము లేదే యని విసుగునొందకుఁడు. ఈయర్థమే ప్రధానమని తలంపఁజను. నేర్చుకోఁదగినవిషయము లిందే యున్నవి. ఇది రజని. భయంకరరూపము గలది. భక్తియుక్తచిత్తలారా! భయంకరముగాఁ గనఁబడుచు నేకాంతదర్శనమునకు (ధ్యానమునకు) ప్రధానమగు కాలమిదియె. మహర్షులు గుహాలయం దుండి నిశ్చలబుద్ధితో ధ్యానింతురు ఏల? ఆకాలమున బుద్ధి పలుభంగులఁ బరుగులిడక యించుక నిశ్చలతఁ గాంచును. అంతకంటెం భగవద్ధ్యానమునకు సుసమయము లేదు. కావున భయంకర

కదా. మీరు నివసింపఁదగినతా విది కాదు సుఁడీ. మీతల్లులు,
తండ్రులు, పుత్రులు, సోదరులు, నాయకులు మిమ్ముం గానక
వెదకుచుందురు. బంధువులకు మీవలన నొక భీతి మనస్సులఁ
గలుగఁగూడదు. వారెల్ల మీమేలు కోరినవారు కదా! ఈఘ
ట్టమున మూలమునఁ గలయర్థమునే విస్తరించి మహాకవిగారు
పద్యమును వ్రాసిరి అది యిదియే.

---

ముగాఁ గనఁబడుచు ధ్యానమునకు మిగుల సహాయముచేయురాత్రి యిది.
రాత్రియందు మనస్సు భగవంతునియందు లీనమగునట్లు యోగు లభ్యసింతురు.
అట్టికాల మిది. క్రూరసత్త్వనిషేవితము సుఁడీ. క్రూరములగు జంతువులు తిరు
గుచుందు నని భయంపడక సర్వభూతాంతర్వర్తి యగు పరాత్పరుని తెలిసి
కొని యా జ్ఞాన మనుభవమునఁ గుదిరినదియా లేదా యని పరీక్షించుట
తగినపని. సమదర్శిత్వము గావలయునన్నమాట అది కలిగినదన్న దెట్లు దృష్ట
మగును. క్రూరజంతువులయం దున్న యాత్మను మనము ప్రేమించిన నది
ప్రేమించును. అపుడు క్రూరమనుమాట నిలుచునా. అట్టిజ్ఞానము సంపాదింపుఁ
డని శ్రీహరిభావము. వ్రజం ప్రతి యాత. మీయిండ్లకుఁ బొమ్మని కాదు.
మీరు నిశ్చయముగా నిటకు వచ్చితిరి. దీన నాయందుఁ గల సంప్రీతి స్పష్ట
మాయె. కాఁబట్టి గోలోకమునకు వేగముగాఁ బోఁదగుదురు. ఇట నిలువ
రాదు. చాలకాల మిఁక నిట నుండనేల? మీరు స్త్రీలుకదా. అందును సుమ
ధ్యమలు. మీకు రాసమండలము నివాసార్హము. ఆచోట నృత్యము మీకుం
గృత్యము. తల్లిదండ్రులు లోనగువారు మీరగపడకున్న వెదకుదురు. వారికిఁ
గష్టమును గల్గింపకుఁడు. ఇది ప్రత్యుపకారనియమమునకు నుదాహరణము.
మీకీలోకమున సంబంధము గలవారు కలరే. వారు మీరెందుబోయినది తెలి
సికొనఁజాలక వెదుకుదురు. కాన వారికష్టములఁ దీర్పుఁడు. మీరిల్లు వన్నె
నమ్మితిరో వారికిని మీవంటి నమ్మకము నాయందుఁ గుదురునట్లు చేయుఁడు.

సీ. ప్రాణేశుఁ డెటేఁగినఁ • బ్రాణంబునకుఁ దెగు
దండించు నెటేఁగిన • ధరణివిభుఁడు
మామ యెఱింగిన • మనువెల్లఁ జెడిపోవుఁ
దలవరి యెటేఁగినఁ • దగులుచేయుఁ
దలిదండ్రు లెటేఁగినఁ • దలలెత్తకుండుదు
రేరా లెఱింగిన • నెత్తిపొడుచు
నాత్మజు లెటేఁగిన • నాదరింపరు చూచి
బంధువు లెటేఁగిన • బహి యొనర్తు

ఆ. రితరు లెటేఁగిరేని • యెంతయుఁ జుల్కఁగాఁ
జూతు రెందు నందు • సుఖము లేదు
యశము లేదు నిర్భ•యానందమును లేదు
జారుఁ జేరఁ జనదు • చారుముఖికి.

దీనికిముందే యీయర్థముగలపద్యము వ్రాయఁబడియున్నను నిది కొంసరుగా వ్రాయఁబడిన ట్లగపడుచున్నది. నీతిని బోధించుట యామహాత్మునకు నైజము గాన నవకాశము దొరకిన నొక్కయర్థమే మార్గాంతరమునఁ గూడ వచించుచుందురు. వారి యుద్రేకమునకు నమస్కారము.

---

అదియే వారిఋణమును దీర్చుకొనుపద్ధతి. "స్వయం తీర్ణం పరాన్ తారయతి" అన్నసామెతను మఱువకుఁడు. మీరు నన్ను నమ్మి తరించితిరి. వారి నట్లే తరింపఁజేయుఁడు. నాయం దనన్యభక్తి కుదురునట్లు చేయుఁ డని యాశయము.

గోపికలారా! సురుచిరకుసుమముల విరాజిల్లు నీవనమును జూచితిరి. సంపూర్ణచంద్రకళలచే రంజింపఁజేయఁబడిన దిది. ఇందలి పావనతరువులు కాళిందీజలములనుండి వెడలివచ్చు శీతలవాతము సోఁకునఁ గంపింపఁజేయఁబడుచుఁ జిగురుటాకులచే మనోహరములుగా నుండును. కావునఁ బరుగిడివచ్చి చూడనర్హమైనదే యీవనము. ఏనిం జూచితిరి. ఇఁక మరలి పొండు. కనుక నోపతివ్రతలారా! ఆలస్యము చేయక ఘోషమునకుం బొండు. పతులకు సేవ లొనరింపుఁడు. సచ్చరిత్రలగు స్త్రీమణులఁ గొలువుఁడు. మిమ్ముఁ జూడకున్న బాలకు లేడ్తురు. దూడ లంబారవములఁ గావించును. కాన శిశువులకుఁ బాలిచ్చి దూడలకుఁ బాలు త్రావుఁడు. తరువాత మిగిలిన పయసులఁ బిదుకుఁడు.

*సుచరిత్రలారా! నాయందు మీకుఁ గలస్నేహరూపమగుభక్తిచే నాయందే మీచిత్తముల నునిచినవారలు గావున నిచ్చటికి వచ్చితిరి. చాల మంచిపని చేసితిరి. సకలజంతువులు

---

* అథవా మదభిస్నేహాద్భవత్యో యన్త్రితాశయాః, ఆగతా హ్యుపపన్నంతత్ప్రీయంతే మయి జంతవః. అనుమూలమునకు మహాకవి.

చ. వనితలు నన్నుఁ గోరి యిటు వచ్చితి రింత కొఱంత లేదు మే
లొనరె సమస్తజంతువులు నోటిఁ బ్రియంబులు గావె నాకునై
నను నిలువంగఁ బోలదు సనాతనధర్మము లాఁడువారికిం
బెనిమిటులన్ భజించుటలు పెద్దలు చెప్పుచునుందు రెల్లెడన్.

అని వ్రాసిరి. ఆహా! ఎంత చక్కఁగా నున్నది!

నాపైఁ బ్రీతికలవియే కదా. కావున మీరు వచ్చుట న్యాయమే. నన్ను స్నేహమునఁ గోరనిజంతువు లేప్రపంచముల లేవు. ఐనను గపటమునఁ గాక సహజప్రీతిచే స్త్రీలు భర్తను సేవింప వలయును. అది వారికిఁ బరమధర్మము. దానిని మించినధర్మమే లేదు. ఆసేవయనునది లాభమును గోరి కాఁగూడదు. కోరికతోఁ గాక భగవంతుని సేవించిన నెట్టిలాభములు గలవో ఆభగవద్రూపునిగా భర్తను జింతించి సేవ లొనర్చిన నట్టిఫలమే కలుగును. కావుననే స్త్రీలకు భర్తనుమించిన దైవము లేఁడని శాస్త్రము లుద్ఘోషించుచుండును. మీరును నన్నుఁగాఁ దలంచి ప్రాణనాయకుని శుశ్రూషలచే నలరింపుఁడు. ఆరూపముననే నేను వాంఛితార్థములఁ బ్రసాదింతును. సంశయింపకుఁడు. ఐనను లోకాచారమును బాటింపక పోరాదు. పాటింపనిచో దీనియంతరార్థ మెఱుఁగక దుష్టస్త్రీలు పరపురుషులచెంతకుం బోయిన దోష మేమని వాదింతురు. ఆయువతులకు సదాచారమలవడునట్లు మీరు నడుచుకొనవలయును. కాఁబట్టియే మహర్షులు గూడఁ బామరుల నుద్ధరించుపొంటె నాచారములఁ బాటింతురు. అట్లు మీరు పతిశుశ్రూష లొనర్చినచో నో కల్యాణులారా! లోకోపకార మగును. బంధువుల కానందము గల్గించినవా రగుదురు. అది యెట్లో సంతానములఁ బోషించుటయు నట్టిదే. ఈరెండుకార్యములు మీకవశ్యానుష్ఠేయములు. దీనిచే భగవత్సాక్షాత్కారము గల్గును. భగవత్ప్రీతినిగల్గించునది సదాచారము నవలంబించుటయే కదా. ఇంకొక్కపలుకు చెప్పెద.

ఆలకింపుఁడు. *భర్త దురాచారనిరతుఁడైనను, అదృష్టహీనుఁడైనను, వృద్ధు నైనను,జడుఁడైనను,రోగియైనను,నిర్ధనుఁడైనను, స్త్రీ లాతనివదలిపెట్టరాదు.ఎవ్వతె యట్లువదలకయతనిప్రేమించి సేవించునో యాకాంతయేపుణ్యవతినాఁబరఁగు.పురంధ్రులారా! †స్వర్గమును లభింపకుండఁజేసి, యశస్సును బోఁగొట్టి, తుచ్ఛమై, కష్టములఁ గల్గింపఁజాలి, భయావహమై, ఏవను గల్గించుచు, సర్వత్ర దుష్కీర్తిని వ్యాపించునట్లుగాఁ జేయునది యుపపతి వాంఛ. దానిం బూనునారులు లోకమున నిందలపాలగుదురు. పరలోకమందును వారికి సుఖము లేదు. సకలకష్టములపాలగుదురు. కులకాంతలారా! నాచరిత్రముల నాలకించినను, నన్నుం జూచినను, నన్ను మనంబున నిలిపి ధ్యానించినను, నానామస్మరణము చేసినను నాకృపకుంబాత్రతఁ గాంతురు. సదా సన్నిధి నున్నంతనే యెక్కువ లాభము లేదు. కావున మీమీగృహంబుల కేగుఁడు. మనస్సు ప్రధానము. దానిచే నన్నుం జూచినం జాలును. నేత్రములచేఁ జూచినంతనే గొప్పలాభమని భావింపకుఁడు. మనఃపరిశుద్ధత యత్యంతప్రధానము. కాఁబట్టి సదా నను జింతించుచు నుండుఁడు. మీకుఁ గృతార్థత గల్గును. వేయేల? వచ్చినందులకే పరమానందము. ఇఁకఁ ద్వరగా నింటికిం

* దుశ్శీలో దుర్భగో వృద్ధో జడో రోగ్యధనోపి వా, పతిః స్త్రీభిర్నహాతవ్యో లోకేప్సుభిరపాతకీ-అనియూ. ఇట్టి శ్లోకమునకుఁ దెనుఁగునఁ బద్యము గానరాదు. ఏలొకో? †అస్వర్గ్య మయశస్యం చ ఫల్గుకృచ్ఛ్రం భయావహం, జుగుప్సితం చ సర్వత్ర హ్యౌపపత్యం కులస్త్రియః-అని యూ. దీనికిని దెలుఁగునఁ బద్యరత్నము గానరాదు. ఏటికో?

బోయిన నంతకంటె నానందము నాకుండదు. కాంతలారా! ఇంటికిం బోయి భర్తను సేవింపుఁడు. అని పరమానందమునఁ బలికి శ్రీహరి యూరకుండెను.

## గోపికలు శ్రీహరిం బ్రార్థించుట.

ఈపలుకులు శ్రీహరిముఖమునుండి వెడలఁగనే గోపికల కూఱటగల్గుటకు బదులు విచారమాచోటున నెలకొనియెను. విప్రియములుగ నామాటలు తోఁచెను. విషణ్ణహృదయ లైరి. భగ్నసంకల్ప లైరి. తీర్పరాని చింతాసముద్రమునఁ దుదకు మునింగిరి. *దుఃఖభారమున వారిమోము లెండిపోయెను. నిట్టూర్పులచే బింబాధరములు వాడినవి. భూమిని బాదనఖముల గీతలు పడఁ జేయుచుఁ గాటుక కన్నులనుండి ధారలుగాఁ గా రున నశ్రువులచే వక్షస్స్థలకుంకుమమును గడుగుచున్నట్లు నిలు

* కృత్వా ముఖాన్యవశుచశ్శ్వసనేన శుష్యద్బింబాధరాణి చరణేన భువం లిఖంత్యః, అస్త్రైరుపాత్తమషిభిః కుచకుంకుమాని తస్థుర్మృజంత్య ఉరుదుఃఖభరాశ్చ తూష్ణీమ్-అని మూ. దీనికి మహాకవి,

సీ. విరహాగ్నిశిఖలతో • వెడలు నిట్టూర్పుల ముమ్మరంబుగఁ దాఁకి • మోము లెండఁ
గన్నుల వెడలెడి • కజ్జలధారలు • కుచకుంకుమంబులఁ • గ్రొచ్చి పాఱఁ
జెక్కులఁ జేర్చిన • చేతులవేఁడిమి మోముఁదమ్ముల మేలి • మురువు డిందఁ
బోరెఁబోరెఁ బుంఖానుపుంఖంబులై తాఁకుమదనుకోలల ధైర్య • మహిమ చెదర

తే. దుఃఖభరమున మాటలు • తొట్రుపడఁగఁ
బ్రియము లాడని ప్రియుఁ జూచి • బెగ్గడిల్లి,
చరణముల నేల వ్రాయుచు • సంభ్రమమునఁ
గాంత లెల్లను పగల నాక్రాంత లగుచు. అని వ్రాసెను.

చుండిరి. పాపమాగోపికలకు శ్రీకృష్ణవచనములు మనసునకింపు గానార్పంజాలక పోయెను. వారలు మాయామోహితలు గదా. మాయాతీతుఁడు భగవంతుఁడు. వీరు మాయను జయింపం జాలరు. దానికి భగవత్కటాక్షమే ప్రధానము. అది లేనున్నం ప్రసాదము లభింపదు. కావున నత్తఱి నత్తరుణీమణులు గోలోకజ్ఞానమును మఱచిరి. కావున నప్రియములాడుచున్నట్టి చందమును గనఁబఱచు శ్రీకృష్ణుని జూచిరి. ఈకాంతలు తదర్థమే సర్వకామములు మఱలించి వచ్చియుండువారు. కాన నప్రియములుగాఁ దోఁచుభంగిని బలుకు శ్రీహరిం దిలకించి యేడ్పుచే దృష్టి చెదఱిన నయనములం దుడుచుకొని కోపమునఁ బలుకులు తొట్రిలుచుండ ననురాగభరము తమ్ముం బురికొలుప నిట్లు పల్కిరి.

భగవానుఁడా! లోకవిభూ! మే మనన్యగతికలము. సర్వము వదలుకొని నీపాదమూలముల నాశ్రయించితిమి. ఇట్టిమమ్ము నీవిట్లు పలుకుట న్యాయమా. నీవారిని వదలుట న్యాయము కాదు. ముక్తులఁగోరు వారిని గాచునట్లు మమ్మీసంసారవిముక్తిం గోరినవారినిగ భావించి కాపాడుమా. వదలుట న్యాయవిరుద్ధము. శ్రీకృష్ణా! విభూ! నిన్ను నెఱనమ్మితిమి కాన మమ్ముం గోర్కులఁదీర్చి రక్షింపుము. నీవాదిపురుషుఁడవు కదా. దేవాదిదేవా! పతి పుత్త్రులు బంధువులు ననువీరి ననుసరించి వర్తించుట స్త్రీలకు ధర్మమని వచించితివి. సకలధర్మముల నెఱింగినమహాత్ముఁడవు కదా. ఇట్టినీవే యామాటల నుపదేశిం

చితివి. అది న్యాయమే కాని ఉపదేశధోరణియం దొక్కమాట విన్నవింతుము. సకలలోకేశ్వరుఁడవగు నీవే కదా దేహమును దాల్చిన యందఱకు బంధువవు. ఆత్మవు. అట్టి నీయందే సకల వాంఛలు నిలిపి కొలుచు మమ్ము విడనాడుట వేఱుతత్వము లుపదేశించుట యేటికో తెలియఁజాలకున్నవారము. మఱి యొక మాట విన్నవింతుము. నేర్పఱితనము కలవారు నీయందే రతి గల్గి యుందురు. స్వాత్మలయందు సదా నిన్నే భావించుచుందురు. సకలపీడలను గల్గించు నీపతిసుతాదులతో నేమి లాభము? దగ్గరఁ జేరుకొలఁది కష్టములు మెండగును గాని వదలిపోవు. నీయందు రతి నుంచిన సకలకష్టములు తొలఁగిపోవును. కావున నిన్నుఁ బ్రేమించితిమి. నాథా! ప్రసాదదృష్టిఁ జూడుమా. పరమేశ్వరా! మాయాశను వృథ పుచ్చకుమా. నీవరవిందనేత్రుఁడవు. దయారసము చిప్పిలుచుండు నీయపాంగదృష్టుల మమ్ము ద్ధరింపుము. నీయందే యనురక్తలము. నిన్నే పరమేశ్వరుఁడవని నమ్మియున్నవారము. అట్టిమమ్ము గృహములకుం బొండు. అని యుపదేశించుట యాశ్రితరక్షణబిరుదాంచితుఁడవగు నీకు న్యాయమా. ఒక్కమా టాలోచింపుము. మేమబలలము కదా. మా ప్రీతిని గ్రహించి మమ్ముద్ధరింపుము. మముఁ బ్రీతచిత్తలఁ జేయుము. మాయాశలఁ దూలఁగొట్టకుము. ఇదె నమస్కారములు. ఇదె మాచిత్తపద్మములు. వీనిచే నీపాదముల నర్చింతుము. శ్రీబాలగోపాలా! * మాచిత్తములఁ జమత్కార

---

* ప్రాణనాయకా! మాచిత్తము నపహరించితివి. అనఁగా మనస్సున

ముగా నపహరించితివి. గృహముల నింతవనుక సుఖముగనే
యుంటిమి. అట్టిమే మిత్తతతి మనమ్ము లపహరింపఁబడినకతన
మాగృహంబుల కెట్లు పోవఁజాలుదుము. మాహస్తములు గృ
హకృత్యములఁ జేయఁ జాలవు. పాదము లింటికిఁ బోవఁబూన
రాకున్నవి. నీపాదములఁజేరుదమన్న నుంకించుచున్నవి. మరలు
దమన్నఁ గదలవు. నాథా! ఎట్లు గృహముల కరుగఁగలము?
ఏమి చేయువారము. ఈఘట్టమున మహాకవి మూలమునకు
మెఱుగుపెట్టు పద్యరత్నమును వ్రాసెను.

---

గోపస్త్రీలవిధ మెట్టి దని తలంచితివి. అంతమాత్రమున మాచిత్తములు స్వదే
కశరణము లైనవి. మాచిత్తముల నీవశమున నునుచుకొని [illegible] పొంది
నిన నెట్లు పోవనేర్తుము. ఆలోచింపుము. మామనసుల మాకిమ్ము. అనఁగా
మామనోవాంఛలఁ దీర్పుము. నీతోడి రాసమండలమున విహరించునపుడు
గోలోకమున మిమ్ము వీడనన్న వాగ్దానమును చెల్లింపుము. మాను [illegible]మణుఁ
డవు నీవు. ఈతనువులు కల్పితములు. ఈభర్తలు కల్పితులు. కార్యార్థమై
యేర్పడినట్లు లోకదృష్టిచేఁ గనఁబడుచున్నవారు. అంతియ కాని మాకు భర్త
పరిపాలకుఁడు. దైవము సమస్తము నీవే. కాని యితరు లేమనుకొందురో
కొందు పొందనుట న్యాయమా. మనుష్యదేహములలన నించుక పొంగఁబడినను
జ్ఞానమన్యథా వ్యాపించునా? కావున మాచిత్తమునఁ గల కాంక్షలఁ దీర్పుము.
మాపాదములు హస్తములు మావశమున నిపుడు లేవు. మాపాదములతో నిన్ను
జేరుదము. ఇదొక యాత్ర. మాహస్తములచే నీసేవ చేయుదుము. నిన్నుఁ
బూజింతుము. ఇదొక యాత్ర. మామనంబుల నిన్ను ధ్యానింతుము. ఇదొక
యాత్ర. ఈమూఁడు కార్యములు చేయుటకే యీయవయవముల మాకిచ్చి
తివి. అది యాపనులు చేయఁబూనవలదనుచున్నాఁడవే. ఇది న్యాయవిరు
ద్ధము కాదా యని గోపికలభావమని గ్రహింపక తప్పదు.

సీ. నీపాదకమలంబు • నెమ్మి డగ్గఱఁగాని
తరలిపోవంగఁ బా•దములు రావు
నీకరాబ్జంబులు • నెఱి నంటితివఁగాని
తక్కినపనికి హ•స్తములు రావు
నీవాగమృతధార • నిండఁ గ్రోలఁగఁగాని
చెవు లన్యభాషలు • చేరి వినవు
నీసుందరాకృతి • నియతిఁ జూడఁగఁగాని
చూడ దన్యంబులఁ • జూడ్కికవలు
ఆ. నిన్నుగాని పలుక•నేరవు మాజిహ్వ
లొల్లననుచుఁ బలుక • నోడవీవు
మామనంబులెల్ల • మరపించి దొంగిలి
తేమిసేయువార • మింకఁ గృష్ణ.

ఇట్లు చమత్కృతిమీఱం బలికి మఱియుఁ దృప్తిచెందక యిట్లనిరి. స్వామీ! మరలిపొమ్మని మీరాజ్ఞాపించితిరి గాని మాపాదములు మాయాజ్ఞలో నుండక యన్యథాభావమున నున్నవి. కాఁబట్టి మా కిపుడుగలిగిన యీపరితాపమును బాపుము. నీవీ మురళికొసఁగిన యధరామృతమున మాయంగజతాపమును దీర్పుము. (అనఁగాఁ జక్కనిమాటల మమ్మానందింపఁజేయుము. దాన మాయంగజతాప మనఁగా దేహమునఁ గల్గిన సంతాపము సంసారదుఃఖరూపమైనది నశించును. ఇదియే కదా భగవంతుఁడవగు నిన్నుఁ గోరఁదగిన దని భావము.) హాసముతోఁ గూడిన యవ్యక్తమధురగీతమున హృదయసంతాపము నార్పు

ము. మనోదుఃఖములు లేకయుండఁ బాపుము. దాన మాకు ముక్తి దొరకును. ఈలోకమును విడిపోవుటయే ముక్తి. రాస మండలమే ముక్తిస్థానము. అది దొరకునట్లు చేయుము. వేలు కాంతులు మాకు లేవు. అట్టివాంఛను దీర్పవేని నిమ్ము వద లము.నిరంతరము ధ్యానింతుము. "అన్యథా శరణం నాస్తి"అం దుము.)ఆమీఁదిపని నీదియే కదా? ఏల యింక నాలస్యము. మా వాంఛలఁ దీర్పకున్న మే మిటనుండి కదలము సుమా! శ్రీ హరీ! సర్వలోకశరణ్యా! నీపాదపద్మములు శ్రీమహాలక్ష్మికొలు కీఁబడినవి. మహోత్సవమున నామె సదా పూజించుచుండును. నీ వరణ్యజనప్రియుఁడవు. మే మటనీనివాసమున సుఖపడు వారము. కావున నొకక్షణకాలము నీపాదాబ్జముల మాకుఁ గటాక్షింపుము. ఎట్లో పూర్వజన్మతపస్సులు ఫలించినందున వానిం జూడం జాలితిమి. తద్దర్శనమున మామనసులు మావశ మున లేక తద్వశము లైనవి. వాని మరల్పఁజాలము. మరల నిండ్లకుం బోవఁ దలంపు లేదు. మరల సంసారపంకమునఁ జొరఁ బడలేము. నిన్నే సేవించుచుందుము. ఆసేవానందము మాకొద వున ట్లనుగ్రహింపుము. ఆసుఖమును ముక్తిగా భావించి హా యిగా నుందుము.

*శ్రీకృష్ణా! ఏనీపాదాంబుజరజస్సును సేవాలాభమునఁ బొంది శ్రీదేవి నిస్సపత్నీకమగు నీవక్షఃపదమున నధివసించెను.

---

*శ్రీహరీ! భక్తులు నీపాదరజస్సును గోరుదురు. ఏల? ఆరజస్సుచే రజ స్సు నశించును. శ్రీదేవి నిన్ను సేవించి నీహృదయము నొందఁజాలెను. అనఁగా

ఆపద మనన్యలభ్యము కదా. ఆశ్రీదేవికటాక్షమును, ఆపాదరజ
స్సును గోరుచున్నవారము. ఇతరదేవతానుగ్రహము మాకు
వలదు. దానం బొందం బోవుఫలము మేమాసింపము. మామ
నోరథము నీడేర్పుము. మరల నిండ్లకుం బోయి సుఖముండుం
డనకుము. ఇదియ మాప్రార్థనము. నీహృదయమున నుండునట్టి
యదృష్టమును బడసియు లక్ష్మీదేవి నీపాదరజస్సునే కోరియు
న్నది కదా. మేమట్లుకోరుట యపరాధమా. [1]ప్రాణేశా నీసుం
దరమందహాసమును గాంచి తీవ్రకామతప్తచిత్తల మైతిమి. ఇట్టి
మాకు భవదీయదాస్య మనుగ్రహింపుము. నీవు దుఃఖహంతవు
కదా. నీయనుగ్రహమును బడయంగోరి గృహములను వదలి

---

నీమనోరంజని యయ్యెను. సదా నీకరుణకుం బాత్రురా లయ్యెనని భావము.
హృదయమున లక్ష్మియున్న దనంగా విష్ణువక్షమునః గూరుచుండునని యర్థము
కాదు. భర్తవక్షమున రెండుపాదములుంచి కూరుచుండునా. సదా శ్రీపర
మాత్మ హృదయమున స్మరింపందగిన మహాదృష్టమును బొందెనని దాని భావ
ము. భక్తులు భగవత్పాదసేవనే కోరుచుందురు. అదియే ప్రపత్తిమార్గము.
అదియే శరణోపాయము. దానిచే గర్వనిర్వాపణ మగును. రజోగుణము నశిం
చును. ఇంకం దమోగుణమునకు దావెక్కడిది? కావుననే రజోనివృత్తి భక్తుని
కృత్యమని పెద్దలందురు. అది లభించినంగాని భగవత్కరుణకుం బాత్రుండు
కాండు. కావుననే గోపికలు శ్రీహరిపాదసేవలనే కోరిరి. లక్ష్మీదేవియుం
దునిచిన క్షితిని మాయందునుపమా యని వేడిరి. అది వేసుట యపరాధ మగు
నా. పాతివ్రత్యమునకు భంగ మగునా. కాదు. భగవంతునిం గోరుటలో
నపరాధము గలనుటకంటె హేయ మేది కలదు? అని విశేషముగ గ్రహిం
పం దగు. 1 శ్రీకృష్ణా! పాపాళినిహంతవు కదా. సంసారము పాపాల
వాలము. తన్నివృత్తి నీవలనం గలుగును. వృజినార్దననామము నీకుం గలదు.

వచ్చితిమి. నీయుపాసనాశ మమ్ము వదలదు. కాఁబట్టి మమ్ముద్ధ
రింపుము. మావాంఛలు నీదాస్యమును బడయుటకు కొఱకే
త్వరపడుచున్నవి. నవమణికుండలములఁ జెలువారు గండస్థల
ములుగలిగి యధరామృతమున కాలవాలమై మందహాసావలో
కనములుగలిగి యందముల కాలవాల మగు నీముద్దుమోమును
శ్రీదేవికే మనోహరమని వినుతింగాంచినదానిం గాంచితిమి.
భక్తులకు సదా అభయదానమును బ్రసాదించు నీబాహుదండ
ముల దర్శించితిమి. నీకు దాసీజనములమే [illegible] మమ్ముం
గాపాడుమా. సాధువులు భగవంతుని ముక్తినాథా యని వేఁడు
దురు. యోగులు జ్యోతిస్స్వరూపునిగాఁ బ్రార్థింతురు. మునులు

---

మే మట్టిపాపములను దొలఁగించుకొనఁ గోరి వచ్చితిమి. [illegible] కోరఁదగని
దని యెట్లందువు? నీసుందరమందహాసము గాంచి [illegible] మైతిమి.
ఇందేమి యపరాధమున్నది. మాకామము నీదాస్యము. [illegible] దని.
అదియే కావలసినది. ఆలాభము మాకుఁ గల్గినది. [illegible] చెప్పుట
నీకు విధి. ఇచట కామశబ్దమునకు [illegible] యర్థము. [illegible], పురుషభూషణ.
దేహి దాస్యమ్-అనువాక్యముచే గ్రహింపవలయును. [illegible] యని
యర్థము చెప్పిన [illegible] దాస్యమును గోరరు. [illegible] అట్లు
గాక దాస్యమును గోరిరి. ఇందు గోపికలు కామపరతంత్రలని యెట్లు
చెప్పఁదగును? మహాభక్తిపరవశలు. పురుషభూషణ యనఁగా [illegible]
యని యర్థము. ముక్తిని గోరక దాస్యము గోరుట కేవల భక్తి [illegible]
ణము. అట్టివారికి భర్తల వదలుట పాడి యెట్లగును? సర్వసంగపరి
త్యాగము చేసి భగవంతునే యాశ్రయింపవలయునని కదా శ్రుతులు
ఘోషించుచున్నవి.

జ్ఞానమయాంగా యని యభ్యర్థింతురు. కవులు లోకనాయకా యని వాంఛింతురు. స్త్రీలు సుందరమందహాసరుచిరాపాంగా యని దీనలై మ్రొక్కుదురు. ఇన్నింటికి భగవంతుఁడు పాత్రుఁడు. వాంఛితము అందఱకొక్కటియే యగును. ఇందు భేదముగాని, అయుక్తముగాని కానరాదు. సర్వరూపుఁడు కదా భగవంతుఁడు. ఎట్లు ప్రార్థించినను సంకల్పము సచ్ఛబ్దవాచ్యమాయెనేని నిర్దుష్ట మనక తప్పదు. అని మఱియు వారిట్లు ప్రార్థించిరి. *ముల్లోకములయందును సుందరతమమగు నీరూ

---

"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ."

అన్నగీతోక్తి స్త్రీల కన్వయింపదా. కావున నిట హేయమగునర్థ మొక్కమాటయైన లేదు. అని గ్రహించుటయే బుద్ధిమల్లక్షణము. *మూఁడు లోకములయందు నీరూపమువంటి రూపము గనఁబడునా. వేదాంతవేద్యము. నిర్మలము నగును గదా నీరూపము. దానిం గాంచిన గోవులు, పక్షులు, వృక్షములు, మృగములు కూడ మహాహర్షమున దేహముల మఱచును. ఇఁకఁ దక్కినవారి మాట యిటఁ జెప్పనేటికి? నీగాన మవ్యక్త మనఁగా నిట్టిదని వచింప వాక్కులకు సాధ్యమా. కాదు కదా. ఆగాన ముపనిషదర్థప్రతిపాదకము. కాన దాని నాలకించిన స్త్రీలు నిన్నుఁ జూడఁ గోరకుందురా యని ప్రశ్నము. ప్రకృతి మాయందు విశేషముగాఁ బ్రతిఫలించియుండును. మే మెఱిఁగిన త్రిలోకములు నీగానానందము నెఱుంగఁజాలరని భావము. సచ్చరిత్రులెవ్వరైన నిన్ను వాంఛింతురు. మహర్షులు కూడ ముగ్ధులగుదురు. అట్టినీనిరుపమాన రూపమును బ్రత్యక్షముగాఁ జూచినవారెవ్వరైన నిన్నే చూడ వాంఛింతురు. అనఁగా నీదర్శనమున నీయందే యాసక్తి కలవారగుదురు. అదియే కదా నీదర్శనఫలము. నీదర్శనానంతర మీఘోరసంసారసాగరమునఁ బడకుండుటయే గదా దర్శనఫల మని గోపికల భావము.

పమును జూచి గోవులు పక్షులు వృక్షములు మృగములు గూడ గగుర్పాటు నొందును. ఇట్టిదని వచింప నలవిగాక యతిమనో జ్ఞమగు నీవేణుగానము నాలకించి యేవనితామణి సచ్చరితము గలది చపలచిత్త కాకుండెడు. అందఱు వాంఛింతురు. అట్టిమా వాంఛలఁ దీర్పుము. మమ్ముఁ గృతకృత్యతం గాంచఁ జేయుము. ఇదియే మావాంఛ యని ప్రార్థించిరి. శ్రీకృష్ణా! నీవాదిపురు షుఁడవు. సురలోకరక్షకుఁడవు. అట్టినీవీగోకులమునఁ గలుగ నున్న యార్తులను బోలఁగింప నవతరించితివి. ఇది సత్యము. కాన నార్తబంధూ యని పిలువఁ దగినవాఁడవు. అట్టినీవు నీదివ్యక రారవిందమును మాశిరములయందును వక్షోరుహములయందు నునుపుము అదియే మేముకోరునది. మేము నీదాసీనివహము కదా. మాకోరికలఁ దీర్చుట మీకు విధి యని భక్తిభావముల విన్నవించిరి.

ఆర్యులారా! ఈఘట్టమున నొక్కమాట విన్నవింపక మాన నయితిగాదు. గోపికలు శ్రీకృష్ణునిం బ్రార్థించుతఱి నీక రమును మాకుచములయందు శిరస్సునందు నునుపుమని వేఁడిరి. దీనఁ గృష్ణుఁడు జారుఁడను కల్పన కవకాశము కలదనికొంద అందురు. కాన అశ్లోకమును వ్రాసి దానియంతరార్థమును నాకుఁ దెలిసినదానిని విన్నవించెదను. చిత్తగింపుఁడు. తప్పుగాఁ దోఁచిన దూషింపకుఁడు.

శ్లో. వ్యక్తం భవాన్ వ్రజజనార్తిహరోఽభిజాతో
దేవో యథాదిపురుష స్సురలోకగోప్తా,

తన్నో విధేహి కరపంకజమార్తబంధో
తప్తస్తనేషు చ శిరస్సు చ కింకరీణామ్. అని మూలము.
దీనికి మహాకవి పోతన,

క. అమరులఁ గాచిన హరి క్రియఁ
గమలేక్షణ నీవు నేఁడు ♦ కరుణ నభయహ
స్తము మాయురముల శిరములఁ
బ్రమదంబున నిడుము మూర్ఛ. ♦ పాల్పడకుండన్. అని

వ్రాసెను. ఔరా! ఎట్టి రసమును మహాకవి గ్రహించెను. సెబాసు! మహాకవీ! పరమభక్తుఁడవు. ఉపనిషదర్థమును గ్రహించితివి! నీకిదె నమస్కారసహస్రము. కంటిరి కదా మూలము; దానికిఁ దెలుఁగుపద్యమును ఆలకింపుఁడు. శ్రీమన్నారాయణునకుఁ జతుర్భుజములు, శంఖచక్రగదాపద్మములు ధరించినవి ఇది క్రొత్తది గాదు. పద్మహస్త మనఁగా నభయహస్తము. కర పంకజం అన్న మూలమునకు నభయహస్తమని యర్థము చెప్పకుండుట తెలివితక్కువయె. అభయహస్తము లేదని యెవ్వఁడనఁడు కదా. పంచహస్తము లప్రసిద్ధములు కదా. భగవంతుఁ డభయహస్తుఁడు కాఁడనుటకన్నఁ బాపము వేఱుగ లేదు. కాన గోపికలు శ్రీకృష్ణా నీయభయహస్తము మాతప్తస్తనములపై నునుపు మనిరి. అనఁగా నీవెప్పుడు కనఁబడకపోదువో యని తపించుచున్న మాహృదయతాపము శాంతించునట్లు అభయహస్తమం దునుపుమనిరి. స్తనములపై నునుపుమా యనుట కామవికారముచేతఁ గదా యని యాక్షేపింపరాదు. శిరస్సున నును

పుమనిరి. అదేల? కావున భగవంతునియెడ లజ్జ యుండరాదు. అది భక్తులకు నుండదు. గోపిక లత్యంతభక్తిపరవశలు. కపట భక్తి నభినయించువారు కారు. కావున మాస్తనములయం దునుపుమనిరి.

శ్లో. మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే,
శ్రద్ధయా పరయోపేతా స్తే మే యుక్తతమా మతాః.
౧౨ అ ౨ శ్లో.

మయి సర్వాణి కర్మాణి సన్న్యస్యాధ్యాత్మ చేతసా,
నిరాశీ నిర్మమో భూత్వా యుధ్యస్వ విగతజ్వరః.
౩ అ. ౩౦ శ్లో.

మయి చానన్యయోగేన భక్తిరవ్యభిచారిణీ,
వివిక్తదేశసేవిత్వ మరతిర్జనసంసది. ౧౩ అ. ౧౧ శ్లో.
మయ్యాసక్తమనాః పార్థ యోగం యుంజన్ మదాశ్రయః,
అసంశయం సమగ్రం మాం యథా జ్ఞాస్యసి తచ్ఛృణు.
౭ అ. ౧ శ్లో.

అన్నగీతావాక్యములు పైయర్థమును దెలుపుచున్నవి. కావునం గలరా. సంశయము నొందక విపరీతార్థములం గల్పింపక భక్తి పరవశులగు టుత్తమము. ఇందు గోపికలభావము మమ్ముద్ధరింపుమా యనియే కాని వేఱు గాదు. ఏశ్లోకమునందును ఆభావము కానరాదు. అభయహస్తమును మాహృదయమున నునుపుమా యన్నచోటం దప్పు గలదని యెవ్వరును జెప్పలేదు. జగజ్జనకునందు లజ్జ యునుప నవసరము లేదు. శిరములయందు

మీహస్తము నునుపుమా యన నర్థమేమి? గురువుశిష్యున కుప
దేశముచేయునపుడు శిరసున ననఁగా బ్రహ్మరంధ్రస్థానమును
దక్షిణహస్తమున నంటి యుపదేశించును. దానికే హస్తమస్తక
సంయోగ మని పేరు. ఆయర్థమే యిటఁ గనఁబడియెడు. శ్రీ
హరీ! నీవు మాకుఁ బరమగురుఁడవు. నీమంత్రము నుపదే
శింపుము. దానఁ దరింతుమని గోపిక లడిగిరి. కామాతుర
లైనచోఁ గౌఁగిలింపుమా యని వేఁడక శిరముల నీహస్తము ను
పుమని యేల ప్రార్థింతురు? దీనిసార మేమనఁగా, భగవంతా!
శ్రీకృష్ణా! నీదివ్యమంత్రముపదేశించి మాహృదయదౌర్బల్యము
నడంపు మనునదియే కాని వేఱొక్కమాటయు వచింప నవకా
శము లేదు. ఆస్తికాభాసులకు విపరీతార్థము స్ఫురించునేమో
కాని ఆస్తికుల కిందు సంశయింపఁదగినవిషయములే లేవు ఇఁకఁ
గథప్రక్కకు మరలుదము.

ఇట్లు గోపిక లత్యంతశ్రద్ధాభక్తులతోఁ బ్రార్థించిరి. గృహ
ములకుఁ బోనొల్ల మనిరి. నిన్నుఁ దప్ప నింకొకరి నాశ్రయింపఁ
జాల మనిరి. సంసారము మాకు వలదనిరి. మరల నీసంసార
కూపమునఁ బడఁద్రోయఁబోకుమా యనిరి. ప్రార్థించిరి.
దైన్య ముట్టిపడ భాషించిరి. భగవంతుఁడు వారియూహల నెఱిం
గెను. వారు మాయామోహితలయ్యు స్వరూపజ్ఞానము గల
వారుగా నున్నవారని తెలిసికొనియె. ఇట్టిపట్టుదలగలవారు
గాన, గురువు శిష్యునిపట్టుదల నెఱింగి యుపదేశించి కృతకృ
త్యునిం జేయునట్లు వీరి కిపుడుకలిగినపరితాపము నార్పవలయు

నని నిశ్చయించెను. *ఇట్లు నిశ్చయించి యోగీశ్వరేశ్వరుండగు శ్రీకృష్ణపరమాత్మ వారిమనోవైకల్యము నెఱింగి పక్కున నవ్వి దయతోఁ గూడినట్టిభావము నభినయించి తనయాత్మారామత్వము గనంబడఁజేయ వారిని సంతోషపఱచెను. వారితత్తఱపాటు నడంచెను.

అప్పుడు శ్రీహరి యోగీశ్వరధ్యానగమ్యుఁడు గావున వారిమానసములఁ దనతేజస్సు నుద్దీపింపఁజేసి వారికదొకయాటగా భావింపఁజేసెను. ఇట్టిచేష్టలుగలవాఁడని తెలియఁబడని

---

* ఇతి విక్లబితం తాసాం శ్రుత్వా యోగీశ్వరేశ్వరః, ప్రహస్య సదయం గోపీ రాత్మారామో వ్యరీరమత్-అని మూలము. అరీరమత్=రమయామాస అని వ్యాఖ్య. తాసాం=ఆగోపికలయొక్క. విక్లబితం=పారవశ్యముచే నోడలు తెలియనంతశ్రద్ధచే వచింపఁబడిన భాషణజాలమును. శ్రుత్వా=విని. యోగీశ్వరేశ్వరః=యోగిశ్రేష్ఠులకధిపతియైన అనఁగా ధ్యానగమ్యుఁడైన తాను (శ్రీకృష్ణమూర్తి) ఆత్మారామః=తానాత్మారాముఁడగుచు నవఁగా నెల్లభూతములయాత్మలయందు విహారముసల్పువాఁడు కావున. గోపీః=గోపికలను. అరీరమత్=సంతోషమును బొందఁజేసెను. ఎట్లు? ప్రహస్య=నవ్వి. అనఁగా యోగివరులు తనను ధ్యానముచేయుచుండ సర్వభూతాంతర్యామి యగు శ్రీకృష్ణపరబ్రహ్మ మాగోపికల యార్తభాషణములను విని యిఁకఁ దడవు చేయరాదు. వీరిమనస్సులు శ్రద్ధాయుక్తము లైనవి. కాన వీరి కుపదేశము చేయక తప్పదు. ఇది దాని కదనుకాదు. ఇప్పుడే వీరు ముక్తసంగు లైన నేనవతరించినకార్యము సాగదు. కాఁబట్టి మరల వీరిని లోకవ్యాపారనిరతలనుగా నొనరింపక తప్పదు. వాతోడ గోలోకమునకు రాఁగలరు కదా. అని తలంచి తా నాత్మారాముండు గాన వారియాత్మలలోనుండు తనరూపమును వికసింపఁ

మహిమములుగల శ్రీహరి తానచ్యుతుఁడు గాన (చ్యుతి, నాశనము, లేక జాతిపోవునడవడిక లేనివాఁడు) నంతియ గాక మనుపమానమగు చిఱునవ్వుచేఁ గనంబడుచుఁ గనంబడనట్లుండిన దంతములనే మొల్లమొగ్గలకాంతి వ్యాపింపఁజేయుచుఁ దారాగణములం గూడిన శీతాంశుని పగిది, ఆగోపికలం గూడి యాది వ్యభూముల నానందమున నుండెను. ఆగోపికలత్తఱిఁ దమ కధీశ్వరుఁడగు శ్రీకృష్ణపరమాత్మ తమ్ముఁ గాంచుటచే వికసిల్లిన (సంతోషమున గొప్పవియగు) మోములు గలవారైరి. అట్టిగోపికలను నక్షత్రములను జంద్రుఁడు వికసింపఁజేసినట్లు సంతోషపఱిచెను.

పాఠకులారా! ఇందలిస్వారస్యమును బరిశీలింపుఁడు. నక్షత్రములతోఁ గూడినచంద్రునివలెఁ గనఁబడెనని మూలార్థము. ఏణాంకుఁ డన్నందున సంపూర్ణచంద్రుఁడనియే యర్థము. శరద్రాత్రికయందుఁ గదా యీగానము జరపఁబడుట. కావున సంపూర్ణచంద్రుఁడు నక్షత్రములంగూడి విహరించినట్లనఁగా నక్షత్రప్రకాశములుతగ్గి చంద్రప్రకాశమున కవి లోఁబడునట్లు

జేసివారినలరింపఁజేసెను. అనఁగా తనమాయచే వారినాచ్ఛాదించి సంతుష్టచిత్తలనుగా నొనరించె నని భావము. తెనుఁగున మహాకవి గోపీః అన్న ద్వితీయా బహువచనమును తృతీయావిభక్తిగా మార్చి "గోపికలతో రమించె" అని వ్రాసెను. ఇది ప్రమాద మనక తప్పదు. బాహ్యక్రీడ లొనరించెన్ అన్నచో నాత్మారామః యోగీశ్వరేశ్వరః అన్న వాక్యములు వ్యర్థము లనక తప్పదు. ఆత్మారాముఁడు గాని వారిని సంతుష్టచిత్తలనుగా నొనరించె ననక వీలులేదు.

భగవంతుని తేజస్సు వారి నాచ్ఛాదింపఁగా బొమ్మలవలె వారుండి
రని భావముకదా. పున్నమచందురునిముందు నక్షత్రములెట్లు
ప్రకాశించునో శ్రీకృష్ణునింగూడి గోపిక లట్లుండిరనిదీనిభావము.
అనఁగా శ్రీహరిమాయ వారిం గప్పఁగా నీయూహాలు లేక తమ
చిత్తములు తదధీనములగుట నేమియుం దోఁచమి శ్రీహరి
యాడించినట్లాడుచుండి రని దీని భావసారమును గ్రహిం
పుఁడు.దీనిచే భగవంతునిసర్వనియంతృత్వముస్పష్టమగుచున్నది.
సర్వాతిశాయిత్వము మఱింత స్పష్టమగుచున్నది. పరమేశ్వ
రత్వము సిద్ధాంతమగుచున్నది. అప్రధృష్య తేజశ్శాలిత్వము
బహిర్గత మగుచున్నది. అంతియకాని కామపరతంత్రుఁడై
పరభార్యలం గూడి విహరించె ననియు జారశిఖామణి యనియు
నీభావ మేమాత్రము గోచరింప దనియు నది తుచ్ఛకల్పిత
మనియు భావింపుఁడు. ఆసమయమున నాగోపికలెల్లఁ గృష్ణ
స్వరూపలుగనే యుండిరి. సూత్రధారుఁడు బొమ్మలనాడించినట్లు
వారి నాడించెను. వారిమనసుల లోఁబఱచికొని తనమాయచే
వారిం గప్పి యానందపరవశలనుగాఁ జేసినట్లు కనఁబఱచెను.
అను భావమే యిటఁ గనఁబడును.

ఇట్లు గోపికల మైమఱచున ట్లొనరించి వారు పాటలు
పాడఁగాఁ దానునుం బాడుచు వారికెల్లఁ దానధీశుఁడై వైజ
యంతీమాలికను ధరించి వనంబునుండి వనమునకుఁ బోయెను.
అచ్చోటనే యుండక వేఱొక వనమునకు, నందుండి యింకొ
క్కవనమునకు నిట్లుగాఁ దిరిగెను. ఒక్కయెడ యమునానది

యందుఁ జల్లనియిసుకదిన్నెలయందుఁ గూరుచుండి వారంద ఱును జుట్టును బలిసి కూరుచుండఁగా నది యందున్నకమలకు ముదములపైఁబొలసి వీతెంచువాయువున కానందించుచుండెను. అవ్వల నాగోపాలబాలుఁడు *బాహుప్రసారములచేతను, బరిరంభణములచేతను, చేతులు, ముంగురులు, ఊరువులు, కొంగు ముడులు, వక్షోజములు అను వీనిని స్పృశించుటచేతను నర్మాలాపములచేతను, నఖాగ్రముల స్పృశించుటచేతను, క్రీడచే

* బాహుప్రసారపరిరంభకరాలకోరు నీవీస్తనాలభననర్మనఖాగ్రపాతైః, క్ష్వేళ్యావలోకహసితైర్వ్రజసుందరీణా ముత్తంభయన్ రతిపతిం రమయాంచకార-అనియూ. దీని ప్రాతీతికార్థము పైన వ్రాయంబడినది విశేషార్థ మేమనఁగా, లోకమున దీక్షావిధిప్రకారము గురువు శిష్యున కుపదేశించును. ఆయుపాసనాంశము నాల్గుభాగములు. వానికి ఖండములు నాలుగు గలవు. మంత్రఖండము, న్యాసఖండము, పూజాఖండము, హోమఖండము అని వాని పేరులు. ఇచట శ్రీకృష్ణమూర్తి గోపిక లనన్యశరణలు కాఁగా నేకాంతస్థలమున వారికి మంత్రోపదేశ మొనరించి వారిని గోలోకవాసార్హలనుగా నొనరించెనని దీని భావము. అంతియకాని విపరీతార్థ మిందించుకంతయుం లేదు. ముమ్మాటికిని లేదు. ఉపదేశక్రమముగా నిట శ్రీకృష్ణుఁ డాత్మమంత్రమునే వారి కుపదేశించెను. ఇదియే తారకము. వారీసంసారము వలదనిరి. భర్తలు కూడ వలదనిరి. నీవే భర్త వనిరి. భరించువాఁడు గదా భర్త. అనఁగా నాలుగుదినము లన్నముపెట్టిపోషించువాఁడు కాఁడు. సంసారనివృత్తిద్వారా ముక్తిమార్గమును దెలిపి కాపాడువాఁ డనునర్థ మిట గ్రాహ్యము. గురువు శిష్యుని జేరఁదీసి చక్కఁగాఁ బరీక్షింపవలయునని విధి సర్వత్ర గలదు.

తను, దృష్టివిశేషములచేతను, హసితములచేతను ఆవ్రజసుందరీమణులమనస్సులు లోఁబఱచుకొని వారి నానందింపఁజేసెను.

---

"సుపరీక్షితశిష్యాయం దేయంమంత్రం సమాహితః."

అనులోనగు ప్రమాణములు వేనవేలుగాఁ గనఁబడుచున్నవి. ఈపరీక్ష యేల? అనునదియే చక్కని ప్రశ్నము. శిష్యుఁడు పరిపక్వజీవుఁడా కాఁడా యని పరీక్షించుటయే దీని ఫలము. ఉపదేశకాలమునందు గురువు శిష్యుని దేహమును స్పృశించును. స్పృశించియాయాయవయవములఁ బరిశుద్ధములుగాఁ జేయును. ఇదియే న్యాసఖండ మందురు. న్యాసమనఁగా మంత్రబీజములనాయా యితావుల న్యసించుట. అనఁగా ఆబీజముల నుచ్చరించి యాయావయవముల స్పృశించుట. అంతట నవిపరిశుద్ధము లగును. లోకమున నుపాసకుల కందఱ కీవిషయము తెలిసినదియే కాని క్రొత్తది కాదు. సంధ్యావందనము చేయువారికెల్లను కరహృదయన్యాస మనుమాట తెలిసినదియే. అది యెందులకని యూహించువారును గొంద ఱుండకపోరు. వారల కిది యిందులకుఁ గదా యని పొడకట్టక మానదు. ఈయుపదేశమున నాన్యాసఖండము ప్రధానముగాఁ జేయఁబడినది. ఏలయనఁగా ఉపదేశమును గోరినవారు స్త్రీలు. అందును బ్రాయమున విఱ్ఱవీఁగువారు. వారు కోరినది ముక్తి. అనఁగా భగవత్సహచరిత్వము. అది సామాన్యముగా లభించునదియా? కాదు. దానికి వీరి కర్హత కలదా లేదా యని శ్రీహరి పరీక్షించి కాని తారకమంత్రము నుపదేశింపరాదు. పరీక్ష యనఁగా న్యాసఖండమునఁ గాఁదగినపని. ఏయింద్రియమును స్పృశించిన ప్రాపంచికవిషయములు తోఁచునో అట్టివి తోఁచకుండ నున్నదా యనునదియే యిట ముఖ్యము. బాహ్యప్రవృత్తి ననుసరించి పరీక్షించుట చాలదా. భగవంతుఁడు వారిమనస్స్థితులఁ గనుఁగొనఁజాలఁడా యన్న ప్రశ్నము చేయరాదు. లోకులకు నాచారముల నేర్పుటయే భగవంతునిపని. దాని నుదాహరణపూర్వకముగాఁ జూపుట కిటఁ బ్రయత్నించెనని యెఱుంగ

*ఇట్లు మహాత్ముఁడగు శ్రీకృష్ణునివలనఁ దమ వాంఛితార్థములఁ బొంది యా గోపికలు తమరు కాంతలలోఁ గృతకృత్యలమని తలంచు

---

వలయును. వ్యాసఖండము ప్రకారము భగవంతుఁడు గోపికల నాయాయంగముల స్పృశించెను. అట్టియవస్థయందు గురుశిష్యులు పితృపుత్ర భావము గలవారుగనే యుందురు. అది యనుభవముచేఁ దెలిసికోఁదగినదియె కాని మాటలవలన లాభము లేదు. కావున శ్రీహరి యిట వారికిఁ దారకమంత్ర రాజము నుపదేశించె నని సిద్ధాంతము. యోగీశ్వరేశ్వరః, ఆత్మారామః, అచ్యుతః, భగవాన్, సురలోకగోప్తా, అచు మొదలగు పదములే శ్రీకృష్ణునిం దెల్పుట కీఘట్టమున నుపయోగింపఁబడినవి. ఇవియే తప్పక చెప్పుచున్నవి. గోపికలు కూడ "దేహి దాస్యమ్" అని కోరినట్లే చెప్పఁబడినది గాని మా మన్మథార్తిని దీర్పుమా సుందరాంగా యని కోరిన ట్లెందును గానరాదు. ఇకార్యకారణములనుబట్టి యీపైయర్థమే చెప్పఁదగినది కాని వేఱొకయర్థమును జెప్పుట పాడిగాదు కాళిందీపులినతలంబుల నేల వసించెనని యాక్షేపింపవచ్చును. నదీతీర ముపదేశమున కర్హ మని యాగమములు ఘోషించుచున్నవి. నీటిలో మునిఁగి మంత్రోపదేశము చేయవలయునను నియమ మెందును గానరాదు. కావునఁ బులినతలముల భగవంతుఁ డుపదేశించెనని గ్రహించుట బుద్ధిమల్లక్షణము. దేహి దాస్య మ్మనునది ప్రపత్తిమార్గము. ముక్తికూడఁ గోరరాదని ప్రపత్తిమార్గ సిద్ధాంతము. అనఁగా భగవద్దాస్యము గోరిన ముక్తిని గోరకయే భగవంతుఁ డొసంగునని దానియంతరార్థము. ఈ రీతి నీచోట పదములార్థమును గ్రహించి భగవంతునియందు జారత్వారోపణము చేసి పాపరాసుల మూటగట్టుకొనకుందురని ప్రార్థించుచున్నవాఁడను.

*ఏవం భగవతః కృష్ణాల్లబ్ధమానా మహాత్మనః, స్వాత్మానం మేనిరే స్త్రీణాం మానిన్యోఽభ్యధికం భువి-అని మూలము. ఈశ్లోకము పైసిద్ధాంతమునే బలపఱచుచున్నది. భగవతః మహాత్మనః కృష్ణాత్-అను పదములను జూడుఁడు.

కొనిరి. ఇట్టియదృష్ట మితరకాంతలకుఁ గలదాయని వా రూహింపఁజాలిరి. ఇంతలో వారిమనోభావముల భగవంతుఁ డెఱింగెను. ఈగర్వము వీరికుండరాదని తలంచెను. ఈగర్వమును దొలఁగించి వీరి రక్షింపవలయుననియు నూహించెను. భగవద

శృంగారచేష్టల వర్ణించునపుడు భగవతః మహాత్మనః అనువిశేషణములు శ్రీకృష్ణున కేల? వ్యాసమహర్షి భావ మేమో కనుఁగొనవచ్చును. మహాత్మనః = అనాసక్తచిత్తత్వాదితిభావః-అని వ్యాఖ్య. ఏకార్యమునం దాసక్తి లేనివాఁడని దీనిభావము. అనఁగాఁ బ్రపంచమును నడిపించుట యొకవిలాసము కాని ఆసక్తిచేఁ గాదని తాత్పర్యము. దీనిచే భగవంతుని సర్వాతిశాయిత్వము ప్రఖ్యాత మగుచున్నయది. ఇట్టిభగవంతుని ప్రసాదమును బొందఁ గల్గితి మనునూహ గోపికలకుఁ గల్గెను. ఇది పాపకృత్యము కాదు. కాని భగవంతుని భావ మీపాటి యహంకారము గూడ వీరికిం గల్గఁ గూడదనియే. గోపికలు తారకమంత్రము దొరకినదియే యని మహాసంతోషాంబుధి నోలలాడిరి. వారియానందమునకుఁ బరిమితి గలదా? సాక్షాత్పరమేశ్వరునివలనఁ దారకోపదేశమునొందుటకంటె నదృష్టము వేఱొకటి కలదనుట వెఱ్ఱితనము కాదా? అదియే తారకమంత్రము. అదియే సంసారసాగరతరణక్షమము. దానికి మించినమంత్రమే లేదు. దానికిఁ దుల్యమగునదియుం లేదని గ్రహింపవలయును. అట్టిమంత్రమును బొందినవారి కింతపాటి యహంకార ముండినఁ దప్పేమి? లేదు గాని భగవంతునిదాస్యమును గోరి యందులకుఁ బాత్రులగువారికెల్ల నింతటి గర్వముకూడ నుండరాదని యాపరమేశ్వరు తాత్పర్యము. అదియుం న్యాయమే. ఈశ్లోకముచేతనుం గూడ గోపికలకామమును దనిరూపమున శ్రీకృష్ణుఁడు తీర్చినట్లు కానరాదు. వారినిఁ గృతకృత్యురాంద్రనుగా నొనరించెనని తప్పెడిని. కాననే వారిమనోనిశ్చితార్థ మెట్టిదని భగవంతుఁడు పరీక్షింపఁగోరెను. దానికొఱకే యంతర్థానమందెను. అ

నుగ్రహమున కందఱు పాత్రులు కావలయునను కోర్కె మంచిది కాని మేమే ధన్యులమని యెవ్వరు భావింపరాదనియు, అదియు నొక గర్వ మగు ననియు భావింపవలయునను నీతి నీవాక్యము బోధించుచున్నది. ఇట్టు లూహించి భగవంతుఁ డిందే యంత ర్హితుఁ డయ్యెను.

పాఠకమహాశయులారా! శరద్రాత్రికా వేణుగానముపట్టున గోపికలచరిత్రము శ్రీకృష్ణుని యద్భుతకృత్యమును వింటిరి. ఇందాయాయి తావుల విశేషార్థముల వెట్టిమొట్టిగా నాకుఁదోఁచినట్లు, భక్తిభావము ననుసరించియు వ్రాసితిని. ఇట విశేషించి మరల వ్రాయనక్కఱలేదు. అందు వ్రాయనివిషయముల నొకటి రెంటిని వ్రాయుచున్నాను. శరత్పూర్ణిమారాత్రి యందు యమునాతటంబున బృందావనమున నిసుకదిన్నె మీఁదఁ గూరుచుండి వేణుగానము చేసెను. గోపిక లాగానము నాలకిం

---

ఆయంతర్ధానము వారిని రక్షించుటకే. పరీక్షించి రక్షించుట భగవత్కృత్య మనుట సార్వజనీనము. ఇట్టు లీఘట్టముననంతటను గ్రహించుట సంభావ్యము. భక్తులకెల్ల నిది యుత్తమఘంటాపథము. ఈఘట్టమునఁ దెనుఁగుభాగవతము చప్పిడిగా నున్నది. ప్రాతీతికార్థ మైనను సరిగా వ్రాయఁబడలేదని తెలుపుచు నిది మహాపరాధమని చేతులొగ్గి వేఁడుచున్నాఁడను. విశేషార్థమునకుఁ జక్కనియవకాశముగల యీచోట నించుకంతయుఁ దెనుఁగునఁ జేర్పఁబడ లేదే యను పరితాపమున నీమాట వ్రాసితినిగాని వారిపాదారవిందభక్తి లేక గాని యసూయాపరవశుఁడనై కానేకాదని మఱియొక్కసారి చేతులొగ్గి విన్నవించుచున్నవాఁడను. ఈయది యపరాధమైనఁ బాఠకులు క్షమింతురు గాక.

చిరి. పరుగిడిరి. వారికిఁ దప్పఁ బురుషులకుఁ గాని బాలకులకుఁ గాని తోడనాడుకొను చెలికాండ్రకుఁ గాని వినఁబడినట్లు గానశాదు వినఁబడినచో వారెల్లఁ బరుగిడుదురు. కృష్ణు నేస్తఁబాయని చెలికాండ్రు ఆనాదమును విని పోవకుందురా. గోపికలు మాత్రమే పోయిరని యీకథ చాటుచున్నది. ఇతరులు రాఁగూడదని నందుఁడాజ్ఞాపించినట్లు గూడ లేదు. గోపికలకు మాత్రమే వినఁబడినట్లు మనమూహింపక తప్పదు. సుదసు బలరాముఁడుకూడఁ బోలేదు. ఏల? ఆమురళిగాన మశ్రావ్యమైనది. గోపికాశ్రవణములఁ జొరఁగల్గెను. ఈమాటచేతనే భగవంతుని యసమానశక్తి కానఁబడును. ఇట్టియసమానశక్తి భగవంతునకుఁ దప్ప వేఱొకరికి నుండునవకాశమే లేదు. ఆట్టిగానమును శ్రీహరి యొనరింప గోపికలు చేయుచున్న కార్యముల మానుకొనిరి. ఈగానము రాత్రితొలిజామునసే చేయఁబడినది. కొందఱు పాలు పిదుకలేదు. కాగుచున్న పాలను దింపలేదు. భోజనము కొందఱు చేయుచుండిరి. ఈవిషయము లుంచుకొంబట్టి రాత్రి తొలిజామే యీగానము చేయుచుండవలెనని తేటపడుచున్నది. గోపికలు పోవుచుండఁగా సోదరులు, భర్తలు, అత్తలు, బంధువులు వలదనిరఁట. వారిమాటలం బాటింపక వీరు గానము వినఁబోయిరఁట. తమమాటలు వినక నవయువతులు పోవుచుండ రాత్రివేళ నిర్జనుల పోవుచున్నారని భర్తలుగాని, భార్తలుగాని వెంబడించి పోలేదఁట. అత్తలైన నేమివెట్టియెత్తినదా యని కూడఁ బరుగిడి పట్టుకొని

యో, శక్యముగాకయున్న నిదియేమిపాపమని ధ్వనిచేసి పురుషులఁ బిలిచియో వారిని నిలిపియుండవలసినదియే. ఆ ప్రయత్నమే జరగలేదఁట. ఒక్కరు గాదు, ఇద్దఱు గాదు, మూవురు గాదు. పెక్కుమంది గోపికలారాత్రివేళ నిండ్లనుండి యొడలు తెలియక యుండఁ బరుగిడుచుండఁగా వీథులలో నొక్కరైనను జూచియుండరా. ఈవిషయము లూహింపఁదగినవి కావని యెవ్వఁడే ననఁగలఁడా. అన్నచో వానికి లోకజ్ఞానము తక్కువయన్నఁ దప్పేమియేఁగలదా. ఈవిషయములనుగూర్చి చక్కఁగా నాలోచింపుఁడు. నాభావమును వినుఁడు.

భగవచ్ఛక్తి యమేయము. దానిరీతి యిట్టిదని యెవ్వరు తెలిసికొనఁజాలరు. మనయూహల కందని వింతలు సాగుచుండును. ఇదొకవింత యనుకొను నంతలో దానినిమించిన దింకొకవిధముగా నింకొక్కటి సాగును. ఈ వేణుగానము పూర్ణిమారాత్రియం దొనరింపఁబడినది. ఏల? అది తారకమంత్రరాజము నుపదేశింప నర్హమగు కాలము. ఆనాఁడు శ్రీకృష్ణుఁడు తనలీలామానుషత్వమును గనఁబఱుపఁబూనెను. కాననే ఆ గానధ్వని యితరుల శ్రుతిపుటములఁ జొరకుండెను. గోపికలకు మాత్రమే వినఁబడినది. వెఱ్ఱియెత్తినట్లు వారు పరుగిడ నారంభించిరి. కాని భర్తలోనగువారు నిలుపఁజూచిరి గాని యంతలో వారు మాయామోహితులైరి. కావుననే కాంత లరుగుచుండఁ జూచుచుండిరి. కూడఁ బోవవలయునని యైన నూహింపఁజాలకుండిరి.

గోపికలను జూచినవారు వీరెవ్వరా యనినైన నూహింపఁజాలకుండిరి. గోపికలు పరుగిడిరి. భగవంతు నేకాంతమున మురళీహస్తుని, గానానందసాగరనిమగ్నుని గాంచిరి. దేహములు పరవశములు కాఁగాఁ బ్రణమిల్లిరి. అట్టితఱి శ్రీకృష్ణపరమాత్మ యడిగిన ప్రశ్నములు గోపికల మానసస్థితిఁ బరీక్షింపఁగోరియే యని తేటపడును. ఆ ప్రశ్నములకు నుత్తరములుకూడ గోపికల యనన్యభక్తిని గనఁబఱచును. వారడిగిన వరము లెట్టివని యాలోచింపుఁడు. "దేహి దాస్యమ్" అని యే వాంఛించిరి. ఇదియే యేకాంతభక్తుఁడు గోరువరము. కోరఁదగిన దిదియే కాని వేఱొండు కాదు. పరమపురుషార్థమును భగవంతుఁడే ప్రసాదించును. కాఁబట్టి భక్తుఁడు కోరఁదగిన కోరికనే కోరిరి. వారికోరికలు సత్యములని భగవంతుఁడు దెలిసెను. ఎన్నివిధముల బోధించినను వారు సంసారసుఖములనాసక్తులు కారని తెలిసికొనెను వారి కనుగ్రహరూప మగు వరము నీయఁ గోరెను. గోపికలు గోలోకమునుండి భగవద్విరహము నోర్వఁజాలక యవతరించిన వారను మాటను మాత్రము మఱువకుఁడు. ఆస్మృతియుండిన నేదియు నసంభవముగాఁ దోఁపదు. ఇంక దీనిం గూర్చి పెంచి వ్రాయుట యంత మంచిది గాదు.

గోపికలతో శ్రీహరి క్రీడించె నన్నవాదము నించుక విమర్శించెదను. ఈకథయే యసత్యమన్నవారి నీతి యుక్తమము గాదు. కథనంగీకరించి కృష్ణునియందు నిందల నారోపించువార

లకే యీసమాధానము. గోపికలు పెక్కుమంది కలరు. గుం
పులుగుంపులుగాఁ బోయిరి. కృష్ణుఁ డొక్కఁడే యం దుండెను.
వెన్నెల పిండియారఁబోసిన ట్లుండెను. అందు నాస్థలము యము
నాసైకతమయము. నిర్మలతమము. అట్టిచోట నాలింగనాదు
లచే నింతమంది నొక్కపురుషుఁడు సంతోషపఱచెననుట యసం
గతము కాదని యెవ్వ రనఁగలరు? వేనవేలని చెప్పఁబడినది.
ఈవనముననుండి యావనమునకు నటనుండి యింకొక్కవనము
నకుఁ దిరిగెనని చెప్పఁబడినది. సకలవిధరతిసుఖముల సంతోష
పఱచె ననుచో భావ మేమి ? ఇన్నిరూపముల నిందఱితోఁ
గ్రీడించెనని చెప్పవలసియున్నది. అందఱికన్నిరూపములుగాఁ
గనంబడెనుటకన్న నిఁకఁ గావలసిన దేమి యున్నది ?

పశ్య మే పార్థ రూపాణి శతశోఽథ సహస్రశః,
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫

పశ్యాదిత్యా న్వసూ న్రుద్రా నశ్వినౌ మరుత స్తథా,
బహూన్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. ౬

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరం,
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౭

భక్త్యాత్వనన్యయా శక్య అహమేవం విధోఽర్జున,
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరంతప. ౫౪

విశ్వరూపసందర్శనము ౧౧ అ.

అను భగవదుక్తి ప్రమాణమే యని నమ్మిన న్తెలియవచ్చును.ఆషే.

పను లీలవిషయమును నమ్ముటయే చాలును. భగవంతునిమహిమ మగణ్యమని తేటపడును.

ఇట్లు ఒక్కొక్క గోపికకొక్కొక్క రూపంబునఁ గనఁబడి వారిని సుఖింపఁజేసినచో నింద కవకాశమే లేదు. అది లేదన్నచో నీకార్య మసాధ్యము. ఇందేవిధముగా నాలోచించినను ఈకథ పరమపావన మైనది యని దృఢపడునే గాని వేఱొకవిధము నిలువఁజాలదు. కాఁబట్టి వృథా భగవంతుని దూషించి పాపమును సంపాదింపఁ బ్రయత్నింపక యూరకయుండుట నుచిది. ఇందు గ్రహింపఁదగినవిషయ మేమనఁగా భగవంతుఁడు గోలోకవాసులనుమాత్ర మాహ్వానించి వారికిఁ దారకమునుపదేశించెననియుఁ దదాది వారు మరల సంసారోన్ముఖత వర్తిల్లక యంతర్జ్ఞానమునఁ బ్రవర్తిల్లి రనియు నిదిమాత్రమే.ఈలీలచేత భగవంతుని సర్వవ్యాపిత్వము, సర్వనియంతృత్వము తేటపడును ఇట్లు సాటిలేని మర్యాద వర్తిల్లిన భగవంతుని మహిమను స్మరించి గోపికలకుం గల్గినపట్టుదల గలిగి భక్తిపరవశత వర్తిల్లవలయునని గ్రహించి తరింపవలయును.ఈభావముననే శ్రీలీలాశుకులు శ్రీకృష్ణుని వినుతించిన శ్లోకమును జదువుట భక్తుల కెల్లఁ బ్రధానకృత్యము గాన నాశ్లోకరత్నము వ్రాయుచున్నాఁడను.

శ్లో. అపి జనుషి పరస్మిన్నాత్తపుణ్యో భవేయం
  తటభువి యమునాయా స్తాదృశో వంశనాళః,

అనుభవతి య ఏష శ్రీ స్సమదాభీరసూనో
రధరమణిసమీపన్యాసధన్యామవస్థామ్. ౨ ఆ. ౯ శ్లో.
సజలజలదనీలం వల్లవీకేళిలోలం
శ్రితసురతరుమూలం విద్యుదుల్లాసిచేలమ్,
సురరిపుకులకాలం సన్మనోబింబలీలం
నతసురమునిజాలం నౌమి గోపాలబాలమ్. ౨ ఆ. ౧౨ శ్లో.

మహానుభావులారా! ఈగాథను జక్కఁగా నాలకించితిరి. దీని తత్త్వము మనమునఁ బదిలపఱచుకోనుఁడు. అదియే ప్రధానకృత్యము. ఇఁక నవ్వలికథను వినుట యుత్తమము. వేఱొక భగవల్లీల యనఁగా నదృశ్యుఁడు కృష్ణుంగూర్చి గోపిక లేమి ప్రయత్న మొనర్చి రనునదియే గాన దానిని వ్రాసెదను.

## గోపికలు శ్రీకృష్ణుని వెదకుట.

శ్లో. లీలాటోపకటాక్షనిర్భరపరిష్వంగప్రసంగాధిక
ప్రీతే గీతివిభంగసంగరలసద్వేణుప్రణాదామృతే,
రాధాలోచనలాలితస్య లలితస్మేరే మురారేర్ముదా
మాధుర్యైకరసే ముఖేందుకమలే మగ్నం మదీయం మనః.
శ్రీకృష్ణకర్ణామృతే. 3 ఆ. ౨౨ శ్లో.

శరణాగతవజ్రపంజరే శరణే శార్ఙ్గధరస్య వైభవే,
కృపయా ధృతగోపవిగ్రహే కియదన్యన్మృగయామహే
వయమ్. ౨3 శ్లో.

*భగవంతుని యూహా శక్తినని యెవ్వాఁడును గనుఁగొనఁజాలఁడు. ఊహింపను శక్తుఁడు కాఁడు. శ్రీకృష్ణుఁడేయూహాచే నంతర్థాన మొందెనో సత్యసిద్ధియని మన మెట్లు నిర్ణయింపఁగలము? కాని తోఁచినట్లు తెలుపుచుందుము. సత్యసిద్ధి యెంతెంత యున్నదో తెలియదు. పరమాత్మ శ్రీకృష్ణుఁ డగపడక యెందో చనినట్లు నటించెను. అత్తఱి నాగోపికలు భగవంతునిం జూడఁజాలక యూథనాథునిం గోలుపోయిన గజకాంతలవలెఁ బరితపించిరి. †గోపికలచిత్తము లప్పుడు శ్రీకృష్ణమూర్తినే నాశ్రమము లైనవి. కావుననే యొకరికి వారు తమ్ము శ్రీకృష్ణునిగనే

* ఈకథ శ్రీభాగవతము ౧౧ స్కం. ౩౦ వ యధ్యాయమునుండి సంగృహీతము.

†ఆక్షిప్తచిత్తాః ప్రమదా రమాపతేస్తాస్తా విచేష్టా జహృదాత్మికాః. అని యూ. అత స్తస్మిన్నేవ ఆత్మా యాసాం తాదృశ్యస్సత్యో తాశ్చేష్టా జహృవాః తదనుకరణైరాక్రీడన్. అని వ్యాఖ్య. దీనివలన గోపికలు శ్రీనాథులవ్యాఖ్యయము ననుసరించి శ్రీకృష్ణస్వరూప తైరనియును, నందుచేఁ గృష్ణుని ప్రవర్తించి నట్లే ప్రవర్తించి రనియును స్పష్టము. ఇపుడు గోపికలు మహత్త్వాటకీయోవ్యాయము ననుసరించిరని చెప్పవచ్చును. కృష్ణచేష్టితపదార్థము వారికంటెఁ బరులే దని గ్రహింపఁదగు. ఆకారాదినిముఱచే నమ్ముఁ గృష్ణునిగా నొకొరుకరు తెయు భావించి కృష్ణుఁడు నవ్వినట్లు కృష్ణుఁడు విహరించినట్లు కృష్ణుఁడు సంభాషించినట్లు మఱియు నత్తఱిఁ గృష్ణుఁ డేమేమి చర్యలు నొనరించెనో అవియెల్లఁ దమరు చేయఁబూనిరి. వారిమనస్సులు వారియందే లేవు కదా. కాన వారేమి చేయుదురు. ఇదియే భగవత్కృప. దానికి లోఁబడనివాఁడు ప్రపంచమున లేఁడని గ్రహింపందగును.

భావించుకొనిరి. దానిచేఁ గృష్ణునిచర్యలఁ జూపసాగిరి. నడకల చేతఁ గొందఱు, అనురాగముచేఁ గొందఱు, సుస్మితముచే నింకను గొందఱు, సవిలాసదృష్టుల మఱియుఁ గొందఱు, మనోహరసల్లాపముల మఱొకకొందఱు. విహారముల నింకొక్కకొందఱు. విలాసచేష్టలఁ గొందఱును దదాత్మికలై యాగోపికలు రమాపతిచేష్టల ననుకరించి కనఁబఱుపసాగిరి. నేనే కృష్ణుఁడను. నేనే కృష్ణుఁడను. అని పలుకసాగిరి. అత్తఱి వారిచిత్తములు వారివశమున లేవు. భగవంతు నందున్నవి. కావునఁ దమ్ముఁ గృష్ణునిగా నొక్కొక్కరు భావించుకొనుటయం దాశ్చర్య మేమున్నయది?

ఆగోపిక లింకను గృష్ణప్రేమభరంబున నెలుఁగెత్తి శ్రీకృష్ణు ననుకరించి లలితస్వరంబున గానంబు చేయుచు బుద్ధి నిలుకడయే లేక వెఱ్ఱియెత్తినభంగినీవనమునుండియావనమునకు నావనమునుండి యీవనమునకుఁ దిరుగుచు శ్రీహరినే యనుకరించుచు నాడుచుఁ బాడుచు నించుకంతయు నిలుకడలేక *సర్వభూతములయందు లోపలను వెలుపలను నిండియుండి యాకాశమువలె నున్న యాపరమపురుషుని బరాత్పరుని వెదకసాగిరి. ప్రేమమధికతమము కాఁగా నిది యాచారమా కాదా యని కూడ నాలోచింపక వృక్షరాజములను గాంచి శ్రీకృష్ణు నిజాడ నడుగ సాగిరి. ఇవి వృక్షములు. మనుష్యులవలె మాట

* ప్రపచ్ఛురాకాశవదంతరం బహిర్భూతేషు సంతం పురుషం పురాణమ్—అని మూ. ఇందుఁ బ్రాతీతికార్థము స్పష్టము. విశేషార్థము. గోపిక లంతకు

లాడఁజాలవు. వీని నడిగిన బదులు వచ్చునా. అనినైయెన వారాలోచింప రైరి. వృక్షములకడకుం బోయి శ్రీకృష్ణుఁ డిట్రోవనఁ బరుగిడెనా యని యడుగసాగిరి. ఈఘట్టమునందు మహాకవి పోతన,

క. భూతములలోన వెలిఁ బ్ర
ఖ్యాతుండగు నట్టివానిఁ • గాంతలు కాళిం
దీతీరవనాంతరములఁ
బ్రాఁతిక్ వెదకంగఁ జనిరి • పాడుచు నధిపా.

అని వ్రాసిరి. మూలమునఁ జమత్కృతి యిందేలాగో కానఁబడకున్నది. పురుషం అన్నపదము వదలివేయఁబడుట రసభం

ముందే శ్రీకృష్ణుని యుపదేశము నందియుండిరి. దానిచే సర్వభూతాంతరస్థునిగా నామహాత్ము నెఱింగిరి. కావున వారు వృక్షముల నడుగుటలోఁ దప్పేమియు గానరాదు. బాహ్యదృష్టి కది లోకాచారవిరుద్ధముగాఁ గనఁబడును గాని యించుక యాలోచించిన గోపికలు వృక్షముల నడిగినవిషయము చక్కఁగా నున్నది. కేవలమనుష్యులయందే కాక వృక్షములయందును భగవంతుఁ డున్నట్లు వారు కనుఁగొనిరని స్పష్టమగును. అదియే భగవదుపదేశఫలము. తక్కినవారియొద్ద నుపదేశమునకంటెఁ గృష్ణపరమాత్మ తానుగా నుపదేశించినపు డింతమాత్రము జ్ఞాన ముడుయుండుటలో వింతయేమియు లేదు. కాఁబట్టియే యీఘట్టమున భగవంతు నాకాశముతోఁ గవి పోల్చెను. ఇదెంతయుఁ దగియున్నది. "అతస్సంజ్ఞా భవంత్యేతే సుఖదుఃఖసమన్వితాః" అన్నమాట విదితమే కదా. కాన గోపికల నడుగుటన్యాయమని గ్రహింపఁదగును.

గము నాపాదించెను. ఎట్లో సమర్థింపవచ్చునుగాని సరసముగా నిటఁ దత్త్వము వెలిబుచ్చఁబడలేదు.

ఇట్లు తిరుగుచు వనమునుండి వనమున కేగుచు వృక్ష రాజములఁ గాంచి యత్యాతురతతో నోయశ్వత్థమా! భగ వంతుని జాడ నీకేని దెలియదా, ఓప్లక్షవృక్షరాజమా (జువ్వి) శ్రీహరి నెఱుఁగవా? ఓవటమహీరుహవర్యమా! శ్రీపతి ప్రేమ హాసావలోకనములచే మామనస్సుల హరించిపోయెను. ఆమ హాత్ముని జూచితివా. మాకుఁ జెప్పుమా యని యడిగిరి. కొంత దూరము పోయి యోకురవకభూజమా, ఓయశోకద్రుమమా, ఓనాగకుజమా, ఓపున్నాగక్షితిరుహమా, ఓచంపకశాఖవర్య మా, మావంటి మానినులదర్పమును హరించుసుస్మితముగల గోపాలకృష్ణుఁడు ఈత్రోవఁ బోయెనా? మీరు చూడకుం దురా, ఈత్రోవఁ బోయిన ట్లూహించుచున్నాము. మీరు కాంచి యుందురని యడుగుచున్నవారము. ఆమహాపురుషుని జాడఁ దెల్పి పుణ్యము గట్టుకొనుఁడు. అని వేఁడిరి. ఇచ్చట మూలమున లేని పదచమత్కృతి పద్యమునఁగనఁ బడియెడిని. కాని యిది భగవన్మహిమమును దెల్పక వారి యస్థిరచిత్తతనే కనఁబఱచెడు. ఆపద్యము జూడుఁడు.

సీ. పున్నాగ కానవే ♦ పున్నాగవందితుఁ
దిలకంబ కానవే ♦ తిలకనిటలు
ఘనసార కానవే ♦ ఘనసారశోభితు
బంధూక కానవే ♦ బంధుమిత్రు

మన్మథ కానవే • మన్మథాకారుని
వంశంబ కానవే • వంశధరునిఁ
జందన కానవే • చందనశీతలుఁ
గుందంబ కానవే • కుందరదను

తే. నింద్రభూజమ కానవే • యింద్రవిభవుఁ
గువలవృక్షమ కానవే•కువలయేశుఁ
బ్రియకపాదప కానవే • ప్రియవిహారు
ననుచుఁ గృష్ణుని వెదకి ర•య్యబ్జముఖులు.

ఆర్యులారా! ఈపద్యమును జూచితిరి. మూలమున "రామాను జో మానినీనాం గతో దర్పహార స్మితః"-అని కన్పట్టెడిని. ఇందు మిగులఁ జమత్కృతి కలదు. ఇందు రామానుజః అని ప్రయో గింపఁబడినది. బలరామునకుఁ దమ్ముఁడు-అనియర్థ మిచటఁ జెప్పినఁ జప్పిడిగా నుండును. వాస్తవ మేమనఁగా, రామా గోపికల మగు మమ్ము, అను=అనుసరించి (అనఁగా మాతరువాత), జః= (భూలోకమున) పుట్టినవాఁడు. అని గ్రహింపవలయును.అనఁగా గోలోకమునుండి ముందు మే మవతరించితిమి. మాతర్వాత శ్రీహరి యవతరించెను. కావున మాకుఁ బ్రాణవల్లభుఁడు. అం దులకే వెదకుచున్నవారము. అట్టి శ్రీభగవంతుని గోలోక నాయకుని మాదైవమును మీరు చూచియుందురని వేఁడు చున్నారమని గోపికలభావము. ఇట్లర్థము చెప్పకున్న రసమే యిటఁ గానరాకుండును. "మానినీనాం దర్పహారస్మితః" అను దానియం దెక్కువయర్థమున్నది. వృక్షరాజములారా! మేమిం

చుక గర్వించితిమి. అట్టిమాగర్వమును జిలునవ్వులచే హరించెను. మే మిపుడు విగతగర్వల మైతిమి. భగవంతునిపాదారవిందములఁ జూడఁ దహతహపడుచున్న వారము. కావున నోవృక్షరాజములారా! మీరు భగవంతు నెఱుంగుదురు. మాకుఁగల గర్వము మీకు లేదు. గావున మీరు వృక్షరాజము లైతిరి. కేవలపరోపకారమునే దెల్పుచు మీరు శ్రమంపడుచున్నను మీదేహమును బరులకు దారపోసితిరి. అని గోపికలభావము. దీనిచే నుపదేశానంతరము శిష్యుఁడు గురువునందు "మర్కటకిశోరన్యాయము" ననుసరించి యుండుట ధ్వనిత మగుచున్నది. ఇదియే శిష్యపరీక్షాఘట్టము. ఇవ్విషయమున గోపికలయందించుకయు దోషము గాని శ్రీకృష్ణునిచరిత్రమున లోపలేశము గాని కానరాదు. అంతియగాక భగవంతునిసర్వవ్యాపిత్వము స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. ఇఁకఁ బ్రకృతవిషయమును వ్రాయఁబూనెదను.

ఆగోపికలు కొంతదూర మరిగిరి. అందుఁ దులసీవృక్షవర్యము కనఁబడియె. దానిం గాంచినంతనే మహానందము వారి మదుల నుప్పొంగెను. దాని భక్తిమీఱ నోతులసీవృక్షమా! నీవు గోవిందచరణప్రియురాలవు. భక్తులందఱు నీదళములచే గోవిందునిపాదారవిందముల నర్చింతురు. కావున నీకంటెఁ గళ్యాణి యీప్రపంచమునఁ గానరాదు. అందుచే నోతులసీదేవీ! తుమ్మెదలగుంపుతోటి నిన్ను భరించును గదా శ్రీహరి. అట్టినీనాథునిం జూడలేదా. అచ్యుతుఁడు కదా నీనాథుఁడు.

అనఁగా నిన్ను వదలిపోవఁడని భావము. భగవంతునిపాదము లరవిందములు. వానిపైఁ దుమ్మెదలు మూఁగియుండును. తులసీదళము లందే భక్తులచే సమర్పింపఁబడుచుండును. కావునఁ దుమ్మెదలతో నిన్ను భరించుచుండును గదా యని వారు ప్రశ్నించిరి. దీని కేలాగో తెనుఁగునఁ బద్యసీ కానరాదు.*

అని యీలాగున నాగోపికలు తహతహపాటున భగవంతునిఁ జూడఁగోరి వనస్పతుల దగ్గరకుం బోయి ప్రశ్నించి ప్రశ్నించి తిరిగిరి. అందఱొకచోటఁ జేరిరి. నీకుఁ గనఁబడెనా యని ప్రశ్నించుకొనిరి. కనఁబడలేదను సమాధానము రాఁగాఁ బెదవులు విఱిచిరి. వెచ్చనూర్చిరి. అశ్రుధారలఁ బ్రవహింపఁ జేసిరి. తుదను మఱింతభక్తి యతిశయింపఁగా నొక్కొక్కతెయు శ్రీకృష్ణునికృత్యములఁ దమరే చేసినట్లు చెప్పకొనునంతటి యుద్రేకము వారికిం గల్గెను. ఒక్కతె నేను బూతన నని యొను. వేఱొక్కతె నేను శౌరిని. ఇదె పాలుద్రాగుచున్నవాఁడ నని యొను. ఇట్లే శ్రీకృష్ణుఁడు పూతనాసంహారము మొదలైన లంతెనుకఁ జేసినలీలలఁ దమరే చేసినట్లు నటించిరి. తన్మయత్వమును బొందిరి. తమరు గోపికల మనుభావమునే మఱచినట్లు నటించిరి. కొంతసేపు ఇవిగో శ్రీహరి పాదములుంచినతావు లనిరి. అప్పనీ త్రోవనే భగవంతుఁడు పరుగిడెను. హలకులిశాదిరేఖలు గనఁ

* ఇందు సర్వత్ర యిట్టి యర్థమును గ్రహింపవచ్చును. కావునఁ బ్రతిచెట్టును బ్రశ్నించినట్లు వ్రాసిన విసుగు కల్గునని వదలి దానిపాఠము వ్రాసితినని గ్రహించి మన్నింతురుగాక. నాయీవ్రాఁత భాషాంతరీకరణము కాదు కదా?

బడుచున్నవని చెప్పుకొనసాగిరి. ఈఘట్టమున మహాకవి మూలా
ర్థమును శతశః సహస్రశః పోషించుచు నొక పద్యరత్నమున
భగవంతున కర్పించెను. దానిని దిలకింపుఁడు.

సీ. ఈచరణంబులే • యిందునిభానన
సనకాదిమునియోగ•సరణి నొప్పు
నీపాదతలములే • యెలనాఁగ శ్రుతివధూ
సీమంతవీథులఁ • జెన్నుమిగులు
నీపదాబ్జంబులే • యిభకులోత్తమయాన
పాలేటిరాచూలి•పట్టుఁగొమ్మ
లీసుందరాంఘ్రులే • యిందీవరేక్షణ
ముక్తికాంతామనో•మోహనంబు
ఆ. లీయడుగులరజమె • యింతి బ్రహ్మేశాది
దివిజవరులు మౌళి • దిశలఁ దాల్తు
రనుచుఁ గొంద ఱబల • లబ్జాక్షుఁడేగిన
క్రమముఁ గనియు • నతనిఁ గానరైరి.

ఈపద్యము మహాకవికిఁ గలభగవద్భక్తియపరిమేయ మని తేట
పఱచుచున్నయది కదా!

ఇట్టు లనేకరీతుల వారు వెదకిరి గాని భగవంతుని సర్వ
భూతస్థునిఁ గనుఁగొన శక్తులు కాకపోయిరి. అంతశ్శుద్ధిగలవార
లైనను బాహ్యదృష్టిచే యథాపూర్వముగాఁ జూడఁ జాలకుం
డిరి. తన్మయముగా నున్నప్రపంచమును గనుచు దేవదేవుని
జూడఁ జాలకపోయిరి. కాని యాతమిచే వారికి వెఱ్ఱియెత్తెను.

గృహములమాటలే మఱచిపోయిరి. ఇంక బంధువులలోనగు వారిమాట యిటఁ జెప్పనేటికి? సర్వము శ్రీకృష్ణపరబ్రహ్మమే యని నమ్మిరి. అందే యెందో దాఁగియున్నవాఁడని నమ్మి యెట్టు లేఁ గష్టపడి యేపొదరింటియందో, ఏ చెట్టుచాటుననో దాఁగి యుండునని వెదకిరి. పాప మావనితలు భగవత్పరీక్షకుఁ దాళఁ గలరా. ఐనను వారనన్యచిత్తలై వెదకిరి. పొగడిరి. నీవే దిక్కుగా నమ్మియున్నార మని సమ్మతిమీఱం బల్కిరి. గృహములకుం బోనొల్ల కందే యుండిరి.

మహాశయులారా! చిత్తములనన్యాయత్తములుగాఁజేయక యీకథాసారమును బరిశీలింపుఁడు. గోపికలు కామాతురలై వెదకిరనునది యూహింపఁదగినదియా. లేక యనన్యచిత్తలై యాశ్రీహరి వెనుకఁబోచ్చిరనునది యూహింపఁదగినదియా. ఈవిషయమే ముఖ్యము. స్థూలదృష్టిం బరీక్షింపఁ గేవలకామాతురల నట్లు వెదకిరనియే తోఁచవచ్చును గాని నిక్కపుదృష్టి యని మనశ్శక్తి నుపయోగించి పరీక్షించినచో భగవద్భక్తి సత్యాత్ము దర్శింపఁగోరియే వెదకిరని తోఁచును. ఇదియే న్యాయము. కామావస్థలు వీరియం దేమాత్రము గానరావు. అత్యాతురుఁడగు శిష్యుఁడు గురుకటాక్షమును గోరి యెట్లు పరితపించునో అట్టిగురు వాదవి మంత్ర ముపదేశించి యంతలో నదృశ్యుఁడైనఁ దనసంశయములఁ దీర్చుకొనఁ గోరి యెట్లు పరికించునో ఆజాడలే కనఁబడును. మార్జారకిశోరన్యాయము మర్కటకిశోరన్యాయము కూడ నీచరిత్రమునఁ గనఁబడును.

ఒక్కశబ్దమైనను గోపికల కామాతురతను జెప్పుటలేదు. సరి
గదా వారిముక్తివాంఛనే తెల్పుచున్నయది. ఔరా! ఇట్టిగాథ
యందు భగవంతుని నిందించు నవకాశ మేలాగు తోఁచునో,
నోరెట్టులాడునో వివరింపఁజాలకున్నాఁడను. కడతేఱుట కిది
యొక్కటియే మార్గము. గోపికలాపరమేశ్వరు నారాత్రి
యందు దర్శింప నెట్లుత్తలపాటొందిరో యట్లు భగవంతుని
దర్శించునాతురత యేభక్తునిహృదయమునఁ గల్గునో వాఁడు
గోపికలవలె భగవత్కరుణకుం బాత్రుఁ డగునని చెప్పక
తప్పదు. అంతియగాని "ఆకాశమువలె లోపల వెలుపల నిండి
యుండుభగవంతుని గనుఁగొనఁగోరి" యనుదానిం బఠించియు
గోపికలు కామాసక్తలని చెప్పఁబూనుట యెంతటి సాహసమో
వచింప నూహింపఁ జాలకున్నవాఁడ. ఆయాయితావులఁ దదుచి
తభావముల వ్రాసితిని గాన నిట విశేషించి వ్రాయఁబూనక
వదలితి. కావున మహామతులారా! ఇట్టిఘట్టముల భగవన్మహి
మములను జక్కఁగా నాలోచించి కృతార్థుల రగుఁడు. కేవల
బాహ్యార్థములఁ దలంచి యిది యేదో యొకపురుషార్థ మని నిం
దింపకుఁడు. నిందించినను దాన నించుకంతయు లాభము లేదు.
భక్తజనుల మానసముల నిందలు కదల్పఁజాలవు. వృథా నోటి
మాటలచేఁ బాపము సంపాదించుకొొన నేల? పురుషార్థములఁ
బాడుచేసికొొన నేల? మనదూషణములు గాని భూషణములు
గాని భగవంతున కపకారోపకారములు చేయఁజాలవు. మన
కవాని గల్పింపఁగలవు. కాఁబట్టి శ్రీహరిదివ్యచరితామృత

మును గ్రోలి కృతార్థుల మగుట కన్న వేఱుపురుషార్థమే లేదు. ఇదియ యిందలి రహస్యము. కావున శ్రీకృష్ణా యని గట్టిగా నుచ్చరింపుఁడు. దాన సంసారతాపములు మీా కంటకుండును.

**భగవదవతారఫలము.**

మహాభక్తులారా! నరనారాయణచరిత్రము సర్వమును నుంత వ్రాసియుంటిని అందు నారాయణుఁడే శ్రీకృష్ణునియందంతర్భూతుఁడు. నరుఁడును శ్రీకృష్ణప్రియసఖుఁ సహాయుఁడై యవతరింపక తప్పదు. వారు ఏకగ్రీవముగాఁ బనిసేయువారు గదా! గోకులమున శ్రీకృష్ణుఁడు పెరుగుచుండెను. భగవదవతారఫలము భూభారహరణమే కదా! అనఁగా దుష్టసంహారము, శిష్టపరిత్రాణము, అను నీరెండేగదా తత్ఫలములు. ఆవిషయ మించుక వ్రాయుట కిదియే సమయము. గోకులమున శ్రీపరమేశ్వరుక్రీడలు మాత్రమే వ్రాయుచుండిన నించుకముందుఁ గథకుఁ జిక్కులు కలుగవచ్చును. అవు డావిషయములు వ్రాయుట యంతగా సరసమును గాదు. కాన నిట నతిసంక్షేపముగా వ్రాసెదను.

రెండుపక్షము లుండకున్న యుద్ధము పొసఁగదు. అది పొసఁగకున్న నవతారప్రయోజనము కనబడదు. కావున భగవంతునికార్యము నెఱవేర్ప నవతరించిన ప్రధానపురుషుల విషయము నాలుగుమాటలు వ్రాయకుండుట అంతమంచిది గాదు. ఇంతకు ముందే దుర్యోధనాదు లెవరెవ్వరుగాఁ బూర్వ ముండిరో చదివియే యుంటిరి. కాని వారికథ నించుక తెలుప

కున్న సమయమునఁ బిట్టపిడుగుగా వారిమాటలు చెప్పవలసి వచ్చిన విపరీతముగా నుండును. కావున నిట నరునిపుట్టుక, తదను కూలముగాఁ బుట్టినవారి విషయము, ఎవరు లేకున్న నరనారాయణావతారము నిష్ఫలమో వారిచరిత్రము నించుక పఠింపుఁడు. ఏకాలమునఁ గాని దుష్టులే భూభారమును దగ్గింప మహోపకారము చేయువారు. ఆపక్షము లేకున్న నొక్క చేతితోఁ జేసినసంచడివంటి దగును.

ఏకాలమున శ్రీకృష్ణుఁడు గోలోకమునుండి భూలోకమున కేతెంచెనో ఆకాలమున వారికి సహాయులును భూమి నవతరించిరి. ఆయాయితావుల నాయాయినామముల నాయాయిదైత్యదానవులు, దేవతలును స్వాంశములఁ గొందఱఁ బుట్టఁ జేసిరి. ఎవ్వరు లేకున్న భూభారము తగ్గదో వారివిషయమునే యిందుఁ గొలఁదిపంక్తులు వ్రాసెదను. తక్కుంగలవారిచరిత్రమాయాస్థలముల నుచితరీతి వ్రాయఁబూనితిని.

## పాండవులజననము.

ధర్మదేవత తనయంశమునఁ గొడుకును బుట్టఁజేసెను. ఆకొడుకు ద్వారా సకలధర్మములు లోకమునకు వెల్లడి కాఁగలవు. ఈయూహయే భగవదాజ్ఞ ధర్మము ముం దవతరింపకున్న లాభ మేమి? అధర్మమే నీతుల కుదాహరణభూతముగా నుండఁ గలదు. అట్టి యుదాహరణములనే మనకు భగవంతుఁ డను గ్రహించుచుండును. ఆవానిని లక్ష్యముగా నుంచుకొని సత్ప్రవర్తన మలవఱచుకొనుచు మనుజులు జీవింతురు. విఖ్యాతిం

గాంతురు. వాని నుదాహృతిగాఁ గైకొనినివారే దుష్టులై నికృష్టులై నిందలపా లగుచుందురు. ఇదియే భగవంతుఁడు ప్రచ్ఛన్నముగా నేర్పునీతి. ఇదియే శాస్త్రము. ఇదియే వేదసారము. పురాణసార మిదియే. రామాయణాద్యుత్తమకావ్యసార మిదియే.

ధృతరాష్ట్రపాండునామకు లిద్దఱన్నదమ్ములు. అనఁగా జ్యేష్ఠత్వకనిష్ఠత్వమును దెలుపువారు. ఏకోదరులు గారు. తండ్రులు చనిపోయిన పిదప నియోగవిధిఁ బుట్టినవారు. అంబికయు అంబాలికయు నను నిరువురు కాశీరాజదుహితలు. విచిత్రవీర్యుని భార్యలు. విచిత్రవీర్యుఁడు సంతానమును బడయకయే చనిపోయెను. శంతను పుత్త్రుఁడగు నాతనిభార్యలు పుత్రవిహీనత నవయుచుండిరి. శంతను తొలికొడుకగు భీష్ముఁడు బ్రహ్మచర్యవ్రతంబుం బూనుట నతనివలన వంశ మభివృద్ధి యగుజాడ కానరాదయ్యెను. శంతనుపత్ని సత్యవతి భీష్ముని వివాహముచేసికొను మనిచెప్పెను గాని యతఁడు ప్రతిననమానువాఁడు కాఁడయ్యెను. దాన నామె భిన్నమతియై తనతొలికొడుకగు శ్రీకృష్ణద్వైపాయనుం దలంచెను. స్మరణమాత్రన సర్వవిదుండు గానఁ బ్రత్యక్షమయ్యెను. వంశవిచ్ఛేదమును దెలిపి యెట్టులేని యీమహాపవిత్రవంశమును నిలుపుమా యని కోరెను. తల్లిమాటను మీఱఁజాలక యందుల కాముని సమ్మతించెను. కాని వారిమనస్సులు చింతాభరమునఁ గలుషములుగా నుండుటఁ దలంచి యొకవ్రత ముపదేశించి యీపద్ధతిని

వదలక యొక్కసంవత్సరము నియతినుండిన మీకుఁ బుత్త్రులం బ్రసాదించెద నని తపోవనంబున కరిగెను. వారిరువు రామహాత్ముఁ డాదేశించిన ప్రకారము నియతిమై నుండిరి.

ఆమహాత్ముఁ డరుదెంచి నియతరయై యున్నయంబికకుఁ దల్లియనుమతిఁ బుత్త్రదానంబు చేయ నంగీకరింప నాయంబిక యామునివేషంబున కేవగించి కన్నులు మూసి యుండెను. ముని దానిం దడవి పుత్త్రుండు బలపరాక్రమసంపన్నుండు కలుగు నని యనుగ్రహించి తల్లి కవ్విధంబుఁ దెలుపుచు నంబికకుం బుట్టుకొడుకు జనుమాంధుఁడగు. అది మాతృదోషంబుననే సం భవించె ననియె. సత్యవతి మఱియు నాముని ననునయించి అం బాలికయందు నిట్లే పుత్త్రదానంబు చేయ నంగీకరింపు మన నందుల కంగీకరించి యంబాలిక కడకుం జనఁగా నంబా లికయు నాతని వికృతవేషంబునకు వెఱచి వెల్లనై యుం డెను. పారాశర్యుండు పుత్త్రదానం బనుగ్రహించి తల్లిక వ్వార్తఁ దెలుపుచు నంబాలిక కొకకొమరుఁడు కలుగును గాని యతండు మాతృదోషంబునఁ బాండుదేహుం డగునని చెప్పి పోయెను. సత్యవతియు దూరమాలోచించి మరలఁ బుత్త్రుం దలంచెను. ఆక్షణంబ సన్నిహితుఁడై యాముని యేమి పనికై తలంచితివన నమ్మా జనుమాంధునింగన్న యంబిక నియత యగుఁ గావున రూపవంతుం డగు వేఱొక్కకొడుకుం గనుమా యని ప్రార్థింప నెట్టకేల కంగీకరించి నియతయగు నంబికకడకుం జనఁగా నామె తనకుఁ గొడుకు లేకున్న మానెనని యాముని

రూపమునకు రోసి తనదాసి నలంకరింపఁజేసి పనుప నాముని పుత్రదానంబుచేసి పోవుచుఁ దల్లికవ్విధ మెఱిఁగించి సకలధర్మ మూర్తియగు కుమారుఁడు కలుగుం గాని యతఁడు శూద్రుఁ డగును. మాతృదోషమే యిందులకుం గారణంబని చనియె. మరల నాతని సత్యవతి ప్రార్థింప నోడి యూరకుండెను.

వరుసగా ధృతరాష్ట్ర పాండువులు జనించిరి. విదురుఁడు యము నంశమునఁ బుట్టెను. భీష్ముఁడు వారలకు విద్యాభ్యా సము చేయించెను. వారును రాజలక్షణలక్షితు లయి భీష్ముఁడు కాపాడుచుండఁ బెరిగి పెద్దవారైరి. సుబలునికూఁతురు గాంధారి ధృతరాష్ట్రునిం బెండ్లియాడి మహాసాధ్విగావున భర్తవలెఁ దానును నేత్రములకుఁ బట్టంబు గట్టుకొనియుండెను. వసుదేవుని చెలియలగు కుంతి పాండురాజుం బెండ్లియాడెను. ఆమెకుఁ బృథ యనుపేరు చిన్నతనముననే పెట్టఁబడియెను. ఆమె పెండ్లికిం బూర్వమే తనమేనయత్తకొడుకు కపుత్త్రకుఁ డైయుండ నాతనికిఁ బుత్త్రికగా నొసంగఁబడియెను.ఆతనియింటఁ జక్కఁగాఁ బెరుగుచుండెను. ఆతనియింటి కతిథులు వచ్చుచుండుట కలదు గాన నొక్కనాఁడు దుర్వాసుఁడను సిద్ధుఁడు వచ్చెను. ఆయ నకు సపర్య లొనరింప నీమె నియోగింపఁబడియెను. పృథయు నా ప్రచండకోపస్వభావుఁడగుముని కపలోపచారముచేసి సంతుష్టమతిఁగా నొనరించెను. మునియు సంతసిల్లి యాకన్నియం బిలిచి యమ్మా నీసేవలకుఁ గడు నలరితిని. ఒక్కమంత్రము నుప దేశించెద. దాని భక్తిమైఁ బరిగ్రహింపుము. నీయిచ్చవచ్చిన

పుడు దీనిం జపింపుము. ఏదేవతను మదినిడుకొని దీనింజపిం తువో యాదేవత యప్పుడే ప్రత్యక్షమై పుత్రదానము చేయు. ను. జాగ్రత్త సుమీ. అని మంత్ర ముపదేశించి తనదారిం బోయెను. ఆమంత్ర మాపద్ధర్మముగుట పాప మాకన్నియ యెఱుంగదు. లోకానుభవ మామెకుఁ జాలదు. కావున నొక్క నాఁడు మందాకినీనదికిం బోయి స్నాన మొనరించి సూర్యభగ వానుని బ్రార్థించి యింటికిం బోవుచుండి దుర్వాసుఁ డిచ్చిన మంత్రము పరీక్షింపఁ గోరెను. మదిని బదిలముగా సూర్యభగ వంతుం బ్రార్థించి భక్తిమై గురుధ్యాన మొనరించి యామం త్రమును జపించెను. ఆకర్షణప్రయోగోచితబీజసంస్కృత మా మంత్రమని యాపృథ తెలియఁజాలదయ్యెను. ఇట్లు మంత్ర మును జపించుచు నాకుం గొడుకు పుట్టవలయునని కోరి నమ స్కరించి పురశ్చరణ మొనరించెను.

మంత్రశక్తి సామాన్య మెఱుంగరు. అది యనంతరూప ములఁ బరిణమించును. ఆయద్భుతశక్తికి మాఱులేదు. ఏదేవత నైనఁ గట్టివైచి తెచ్చి యెదుట నిలుపును. అట్టిమంత్రము నాబా లిక జపించెను. సూర్యుఁ డరుదెంచెను. తేజోదుర్నిరీక్ష్యుఁ డాతఁ డగుట నాకన్నియ వడవడ వడఁకెను. ఆమహాత్ముఁ డోడకు మని యభయ మిచ్చి నీకోరినవరం బిచ్చితి ననియె. కుంతియు స్వామీ! మంత్రప్రభావ మెఱుంగఁగోరి నిన్నుం బ్రార్థించితిని గాని పుత్త్రుం బడయఁ గోరి కాదు. అవివాహితను గదా. నాకుం బుత్త్రుండు కలిగిన నవ్వకుందురా. మతాచారదూషి

తను గాకుందునా! స్వామీ త్రిలోకపరిపాలకా! ధర్మాధారా! నాయం దనుగ్రహ మునిచి ధర్మమును గాపాడుమా యని ప్రార్థించెను. స్త్రీలు ప్రాయికముగా జ్ఞానశూన్యలు. ఆవిషయము నెఱింగియే వారియపరాధముల నెల్లఁ బురుషులు క్షమింతురు. నానమస్కారములఁ గైకొని నన్ను మన్నింపుమా యని మరల వేఁడెను.

సూర్యుండును బృథ యొనరించు ప్రార్థనంబు నాలకించి నీయీమంత్రశక్తియు నెఱుంగుదు. ధర్మపద్ధతుల నెఱుంగుదు. ఐనను నాదర్శనము వృథ గాఁగూడదు. నీకిప్పుడే పుత్రుం డుద్భవిల్లు. నావరప్రభావమున నీకన్యాత్వము దూషితము గాదని పుత్రుననుగ్రహించి పోయెను. ముహూర్తకాలంబునఁ దనయుం డామెకుం గల్గెను. తేజోదుర్నిరీక్ష్యుఁడగు నాతనయుం జూచి మహానందంబున నోలలాడియు ధర్మభీతయై యొకమందసమ్ము సూర్యకరుణచే నచ్చటికి రాఁగా దానియం దునిచి గంగలో వదలి సూర్యభగవానుఁడే కాపాడుఁ గాక యని తన యింటికిం బోయెను. ఆమందస మొకసూతునకు దొరకెను. వాని భార్య రాధ యాశిశువుం బెంచెను. కాన నాతఁడు రాధేయుం డనంబరఁగెను. కన్యకకు జనించినవాఁడు గానఁ గానీనుఁ డనియుఁ జెప్పంబడు.

తరువాత నాపృథ పాండురాజుం బెండ్లియాడెను. ఆమెకుఁ గలకుంతియను నామమే ప్రసిద్ధిఁ గాంచెను. కుంతిని వివాహమాడి పాండురాజఖండపరాక్రమంబున దిగ్విజయము

చేసెను. దిగ్విజయయాత్రకు ముందే పాండురాజు భీష్మాను మతంబున మద్రరాజతనయయగు మాద్రిని గూడఁ బెండ్లి యాడెను దిగ్విజయకాలమం దనేకరత్నరాసులఁ గప్పము లుగాఁ గొని పాండురాజు కరిపురంబును రత్నాకరముగా నొనరించెను. ధృతరాష్ట్రుని రాజుగా నునిచి తానే పరిపాలించుచు నుండెను. విదురుఁడు మంత్రియై సకలధర్మముల నుప దేశించుచుండెను. ధృతరాష్ట్రుఁడు రాజ్య మేలుచుండెను. కొంత కాలమునకుఁ బాండురాజునకు సంతానమును బడయకుండ శాపము గల్గెను. దాన నతఁడు సకలరాజ్యపాలనమున విము ఖుఁడై యుండెను. అచింత నెఱింగి కుంతి భర్తతోఁ దనచిన్న నాఁటి దుర్వాసునివృత్తాంతమును మాత్రము దెలిపెను. దానికిఁ బాండురాజుసంతసిల్లి యనుమతి యొసంగిమంత్రమునారాధింపు మా యనియెను.నియతయై కుంతి మంత్రమును జపించుచుసకల ధర్మముల కధిదైవత మగుధర్ముని మది నిలుపుకొనియె. ధర్మ దేవత ప్రత్యక్షదర్శన మొసంగి కొడుకు పుట్టఁగలఁడని వర మొసంగెను. ధర్మరాజు గలిగెను. మరల మహాబలుఁడగు వాయుదేవుని మదినిలిపి జపించెను. వాయువు సాక్షాత్కరించి పుత్రవరము నొసంగి చనియె. భీమసేనుఁ డననొప్పు తనయుఁ డుదయించెను. మూఁడవతడవ త్రిలోకాధీశుఁడగు నింద్రుని మనస్సున ధ్యానించుచు నామంత్రమును జపించెను. ఇంద్రుఁ డెదురుగఁ దోఁచి మహత్తరవిక్రముఁడగు కొడుకును బడయఁ గలవని వరమొసఁగెను. దాన నర్జునుఁ డనుపేరుగల కొడుకు

పుట్టెను. ఇట్లు ధర్మజ భీమార్జునులు పుట్టిరి. మాద్రియు మన
సున నుమ్మలిక పూనియుండెను. మహాసుగుణవతియగు కుంతి
యావిధ మెఱింగి యామంత్రము నుపదేశించి యభీష్టదేవతల
నారాధింపు మని తెలిపెను. ఆమాద్రియు నశ్విదేవతల మది
నిల్పుకొని మంత్రమును జపించెను. దాన నావెంకు వారను
గ్రహించి వరమిచ్చిరి. నకులసహదేవులన నిరువురుకొడుకు
లొక్కతడవ జనించిరి.

పాండురాజు పుత్త్రుల నైదుగురం జూచి పరమానం
దము నొందెను. ఆనిర్భరానందమున మైమఱచి మాద్రిని
బ్రేమించి శాపవశమునఁ బరలోకమున కరిగెను. అంతకుముందే
గాంధారి గర్భవతియై యుండెను గాని నియతకాలమున సం
తానము గలుగదయ్యెను. గర్భము వృద్ధియగుచు వచ్చెను.
కుంతి కొడుకులం గనుట విని యోర్వఁజాలక యుదరతాడ
నంబు చేసికొనియె. దాన గర్భపాతం బయ్యెను. పారాశర్యుఁ
డాక్షణంబ యరుదెంచి కోడలి నాక్షేపించి యమ్మాంసపుముద్దను
నూటయొక్కటిగా విభజించి నూఱుగురు కొడుకులు నొక్క
కూఁతురు పుట్టఁగలరని ఆమాంసపుఁదునుకల రక్షించుపద్ధతిం
దెల్పి చనియె. వారియాజ్ఞానుసారమే దుర్యోధనాదులు నూఱు
మందికొడుకులు దుశ్శలయను నొక దుహితయుఁ గల్గిరి.

ఏక్షణమున దుర్యోధనాదు లుదయించిరో ఆక్షణమున
శ్రీకృష్ణమూర్తి పాండురాజతనయులపైఁ దనదృష్టి నునిచెను.
వారిరక్షణమే తనరక్షణముగా భావించెను. వారికి రాఁగల

యాపద లన్నియుఁ దొలఁగుఁగాత మని సంకల్పించెను. భగవత్సంకల్పముచేత వారియాపద లన్నియుఁ గొండలవలె వచ్చి మంచువలెఁ దేలిపోవుచుండెను. భీముఁడు సహజ శత్రువుగా దుర్యోధనుఁడు భావించెను. కారణమేమియో తెలియదు గాని పాండుతనయులందఱు భీమునిసహాయముచేతనే బ్రదుకుచుండువారు. భీమునిపరాక్రమము దుర్యోధనునకు దుస్సహాముగా నుండెను. పుట్టువుదొట్టి శత్రుత్వము గల్గియుండుట విధివశమనే తలంపవలయుఁ గదా.

క్రమముగా ధర్మజాదులు పెద్దవారై విద్యాభ్యాసమున నాఱితేఱిరి. విలువిద్యయం దర్జునుఁడు లోకమునఁగల యందఱిని మించెను. ద్రోణాచార్యుఁ డందఱికంటె నీతనియం దెక్కుడు ప్రీతి యునిచి యస్త్రవిద్యారహస్యములఁ దెలిపి ప్రచండవిక్రమునిగా నొనరించెను. అంతట ధృతరాష్ట్రుఁడు ధర్మజునకుఁ గొంతరాజ్య మిచ్చి కాశీనగరమున నుండ నియమించెను. కాని యందనేకకష్టములు గలిగినందున నుండఁజాలక రహస్యగమనమున దేశయాత్రఁజేయుచు ననేకరాక్షసులను వధించి లోకులకష్టములఁ దొలఁగించుచుఁ బాంచాలనగరమును ద్రౌపదీస్వయంవరసమయమునఁ జేరిరి. అందర్జునుఁడు మత్స్యయంత్రమును దెగనేసి ద్రౌపదిం గెల్చెను. కాని కుంతీదేవి యనుమతిప్రకార మాద్రౌపది నైదుగురు వివాహమాడిరి. అంతటఁ బాండవుల కొక్కసహాయము గల్గెను. మరల ధృతరాష్ట్రుఁడు రాజ్య మొసఁగి ధర్మరాజును గారవించెను. క్రమ

ముగాఁ బాండవుల బలపరాక్రమములు లోకవిఖ్యాతము లయ్యెను. కృష్ణార్జునులకు సఖ్యము వృద్ధికాఁజొచ్చెను.

రాక్షసాంశజనితు లందఱును దుర్యోధనుని పక్షమునఁ జేరుచుండిరి. యాదవు లందఱు శ్రీకృష్ణునియాదృతిచేఁ బాండవుల ప్రక్కఁ జేరుచుండిరి. పాంచాలు రందఱు పాండవులకు బంధువులైనకారణమున వారికష్టములఁ దమవిగనే భావించి ప్రాణముల నైన సమర్పింపఁ దలంచి యుండిరి. ఆకాలమునఁ బాంచాలరాజ సేనయుఁ దద్వంశజనితులు పరాక్రమసమగ్రులై యుండిరి. ఈ సహాయము వీరికిం గల్గుటయుఁగూడ దుర్యోధనునకు హృచ్ఛల్యముగా నుండెను. భీముని గెల్వఁగలపరాక్రమము తనకుఁ గలదని యాతని కొక్క నమ్మకము గలదు. ఏలన గదాయుద్ధమున నతఁ డెక్కుడు పోకడల నేర్చియుండెను. కర్ణుఁడు తనకు నెచ్చెలిగా నున్నందున నర్జునుని గెల్వఁగలననియు నమ్మియుండెను. ఎవ్వారికి వారే యుద్ధసన్నద్ధు లగుచుండిరి. ఆయుద్ధమున మృతినొందఁగల జీవులందఱు నీరెండుపక్షములలో నెందోచేరి విక్రమింపఁ బ్రయత్నించుచుండిరి. ఇదంతయు భగవదవతారమునకు ఫలము. కాని యాపని ముగించుసమయము సమాసన్నము కాక యించుక దూరముగ నున్నందున భగవంతుఁడును జూచుచుండెను. ఐనను మనోవీథి నేయేకార్య మేయే రీతిఁ జేయవలయునో ఆవిధ మంతయు లిఖించియే యుండెను. కాలమునకై వేచియుండెను. ఈకథ యింతకంటెఁ బెంచి వ్రాయుట ప్రకృతోపయోగము కాదని వదలెదను. భగవత్కథకు దీని కెక్కుడుసంబంధము గలదు కనుక నింతమాత్రము వ్రాయక

తప్పినది కాదు. ఈవిషయము నింతట వదలి బృందావనమున శ్రీకృష్ణుని చర్యల మరలఁ దలంతము. బాలక్రీడలుగాఁ దోఁచి నవియు, ముక్తిమార్గప్రదర్శకములు నగు శ్రీబాలగోపాలుని చర్యల మరల స్మరింతము.

## గోపికాగీతలు.

ఈగోపికాగీతల కిచటఁదప్ప వేఱొకతావున వ్రాయు నవకాశము కలుగదు. పాండవజనన మేల నడుమఁ జేర్చితి వనఁగా నించుక విషయవ్యావర్తనము మంచిదని యట్లొనరించి తిని. రాసక్రీడవఱకుఁ బూర్తిచేసినఁ గాని లోకవ్యవహారముల భగవంతుని ప్రవృత్తి వ్రాయ వీలులేదు. కాన నిట భక్తిపర వశలగు గోపికలధ్యానమును వ్రాసెదను. సావధానులరై పఠిం పుఁడు. గోపికలారాత్రి శ్రీహరిం గానక పరితపించుచు నందఱొకచోటఁ జేరిరి. మమ్మింత మోసపుచ్చి యెచ్చటికో పోవచ్చునా. మాయపరాధ మిందేమి గలదని నిష్ఠురము లాడఁ బూనిరి. స్త్రీలకు నిష్ఠురములాడుట స్వభావము కదా! ఇచ్చట గోపికలవాక్యములయం దెల్ల నంతరార్థము కలదు. అదియే ప్రధాన మని పఠింపుఁడు.

* ప్రాణేశా! నీవీగోకులమున జన్మించినందున దీనికి మిక్కిలి జయంబనఁగా సర్వోత్కృష్టత లభించినవి. లక్ష్మీదేవి

*ఆత్మస్వరూపుఁడవు. నీవీభూతలమున నవతారమొందితివి. కావున నీభూతలము పవిత్రతం గాంచెను. దీనికన్న నీభూలోకమున నుత్కృష్టతమ మగుక్షేత్రము కానరాదు. నీవిటనున్నకతన శ్రీదేవియగు రాధాంబికయు

యిందే నిత్యనివాస మొనరించెడిని. మేమెల్ల నీపయిం బ్రాణములు
నిలిపి నిన్ను నలుదెసల వెదకుచున్నవారము. కరుణించి ప్రత్యక్ష
మగుము. [1]సురతనాథా! శరత్సమయంబునం జక్కఁగాఁ బూచిన
తామరమధ్యభాగమునందలి కాంతిని హరించు లోచనముల
చూపునుగోరి వెలయిూయని యీదాసురాండ్రను గష్టపెట్టుట
వరప్రదాతవగు నీకుఁ దగునా. ఇది వధముగా దనవచ్చునా.
ఈఘట్టమున మహాకవి వ్రాసినపద్య మెంతయో చక్కఁగా
నున్నది.

క. శారదకమలోదరరుచి
చోరకమగు చూపువలన • సుందర మిమ్ముం
గోరి వెలయిూనిదాసుల
ధీరత నొప్పించు టిది వధించుట గాదే.

---

నిందే నివసింప నవతరించెను. ప్రకృతిపురుషులగు మిమ్ము నమ్మి ప్రాణములు మీయందే యునుచుకొని మే మున్నవారము. నాయీభక్తిని భావించి సాక్షాత్కరింపుము. అంతవఱకు మాప్రాణములు దిటవు గాంచవని భావము. దెస లెల్ల వెదకుచున్నవారమనఁగా సకలవిషయములకు నీవే దిక్కనినమ్మి యున్న వార మనియు నిట్టి యీదీనురాండ్రయందుఁ గరుణ యునిచి సాక్షాత్కరించి యుద్ధరింపు మనియు సారము. 1 సురతనాథా! సుష్ఠురత మను దానికి దృఢానురాగ మని భావము. అనఁగాఁ గరుణానిధి యని సారము. వరదా! నీవు సకలకాంక్షితముల నొసఁగువాఁడవు. మేము గోరినది నీదృష్టి పాత్రతం గాంచునట్లు మమ్ముం జేయుమా యనియే. ఇట్టి న్యాయసిద్ధ మగు వాంఛితమును గోరిన మముద్ధరింపక ప్రత్యక్షముగాక మమ్మిట్లు బాధించుట న్యాయమా. అనఁగా మాకు నిహసుఖములు వలదు. నీదర్శనముననే కోరితిమి.

[2]మహానుభావా! విషమయమగు కాళియ మనఁబడు మడుఁగువలనను, అఘాసురునివలనను, ఘోరవర్షమువలనను, పెనుగాలివలనను, బిడుగుపాటువలనను, వృషభరూపధారియగు రక్కసునివలనను, మయసూనునివలనను ఇంకను ననేకబాధల నంటకుండఁ గాపాడితివి కదా. ఇపుడుపేక్షించుట న్యాయమా [3]సఖుఁడా! నీవు సత్యముగా గోపికయనంబడు యశోదకు సుతుఁడవు గావు. సర్వప్రాణులకు బుద్ధిసాక్షివగు పరమాత్మవు. చతుర్ముఖుఁడు ప్రార్థింప నీలోకమున ధర్మరక్షణ మొనరింప నవతరించితివి. యాదవకులమున నవతరించి పరమపవిత్రమిావంశ మను విఖ్యాతిని గల్గించితివి. అంతియ కాని నీవు సాక్షాద్భగవంతుఁ

---

మాకుం బ్రత్యక్షముగాక యాలసించుట వరదుఁడవగు నీకు సహజము కాదని సారము. ఇది వధము కాదా యనఁగా దాసికన్న నీపరితాపము మాకధికము కదా యని వారితాత్పర్య మని గ్రహింపవలయును.
2 మహానుభావా! పరమపురుషా! స్వల్పములగు బాధలనుండి కాపాడితివి. లోకులకు భయంకరములుగాఁ దోఁచినను అవి సామాన్యములే యని మా భావము. వానింబట్టి నీమహత్త్వము నెఱుంగఁ జాలితిమి. ఇపుడీసంసారతాపము మహాఘోర మైనది. సుఖ మనుభ్రాంతిని గల్పించుచు సుఖలేశము లేనిది. ఇట్టి బాధలనుండి మమ్ముద్ధరింపుము. ఇంతకుముందు నీవు కాపాడితివి కదా యని యనన్యగతికలమై నమ్మియున్నవారము. కావున మమ్ముద్ధరింపు మని గోపికలభావ మని తెలియందగు. 3 సఖుఁడా-యనఁగాఁ గష్టములఁ బాపి సుఖమును గల్గించువాఁడ వని భావము. నీవు కేవల యాదవపతి యగు నంద నందనుఁడవు కావు. సర్వజగత్కారణుఁడు, సర్వసాక్షియు నగు భగవంతుఁడ వనఁగాఁ బరాత్పరుఁడవు. బ్రహ్మ ప్రార్థించుటచే నీలోకమున నవతరించితివి.

డవు. ⁴వృష్ణివంశరక్షణభారమును వహించినయోపరమపురుషా! సంసారసాగరభీతికి వెఱచి నీశరణు చొచ్చితిమి. వరముల నొసంగుచు, లక్ష్మీహస్తారవిందమును గ్రహించి సకలకామములఁ బ్రసాదించి యొప్పారునది గదా నీపాణిపద్మము. అట్టి నీహస్తమును మాశిరసులపై నునుపుము. ఈపట్టున మహాకవి పోతన్న,

ప్రపంచమును బాలించుటకే కదా నీయీ యవతారము. మేము ప్రపంచమున నంతర్భూతులమే. కావున విశ్వరక్షణార్థమై యవతరించిన నీవు వంశమర్యాద ననుసరించి తొలుత మమ్ముద్ధరించి యవ్వల నితరుల నుద్ధరించవలయును. కావున మమ్ము సంసారబాధలకు లోఁబడకుండఁ గాపాడుము. నీవు సఖుఁడవు కదా. మాకుఁ జేయఁదగు మేలిదియే కాని వేఱొండు వలదు. అని దీనిసారము. 4 వృష్ణిధుర్యా! అని మూలమునఁ గనుపట్టెడిని. వృష్ణివంశమనఁగా యాదవవంశమని భావము. యదువృష్ణిభోజాంధకసాత్వతములనువంశము లన్నియుం యాదవశబ్దమునం దంతర్భూతములే. ఈయర్థమే కాకున్న "ఉపేయివాన్ సాత్వతాం కులే" యన్న పూర్వోక్తవాక్య మసంగతమగును. కావున యాదవకుల మనియే దీనియర్థము. ధుర్యశబ్దమునకు భారవాహకుఁ డని యర్థము. అనఁగా యయాతిశాపమువలన రాజులలో మర్యాదను బోఁగొట్టుకొన్నది కదా యీవంశము. అట్టిదానిని నీవవతరించి మర్యాద గలదానిగాఁ జేయఁబూనితి వని భావము. అట్టి యోపరమపురుషా! నీహస్తమును మాశిరములపై నునుపుము. నీకరము శరణాగతుల కభయదానమొసంగునది. అంతియగాదు. సకలవాంఛితముల నొడఁగూర్చునది. మఱియుం శ్రీకామినిం జెట్టఁబట్టినయది. కావున నట్టినీమృదుహస్తమును మాశిరసులపై నునుపుమా యని గోపికలు ప్రార్థించిరి. ఇందు విపరీతార్థ మేమి గలదో, కామాతుర లగు గోపికలు మాతో రమింపుమా యని కోరిన శ్లోకార్థ మగునో తోఁపకున్నది. బ్రహ్మరంధ్రము సహస్రదళకమలము. అందు నీహస్తము నును

ఆ. చరణసేవకులకు ♦ సంసారభయమును
బాపి శ్రీకరంబు ♦ పట్టు గలిగి
కామదాయి యైన ♦ కరసరోజంబు మా
మస్తకముల నునిచి ♦ మనుపు మీశ!

అని వ్రాసిరి. ఇందేమాత్ర మేని కామాతురలు గోపిక లనుభావ మగపడుచున్నదియా. [5] వ్రజజనార్తిహారా! మహాత్మా! వీరశేఖరా! స్వజనులమగు నడఁపఁజాలు చిఱునవ్వుగల భగవం

---

పుమా యని వారు కోరిరి. అనఁగా నీకరస్పర్శమున నది వికసించును. దాన విజ్ఞాన మలవడును. నీదివ్యమూర్తి యందుఁ జెలువారుచుండు దానిం జూడఁ గల్గుదు మని దీని వాస్తవార్థము. కామాతురలగు గోపికలు శ్రీనాథా! నీ హస్తమును మావక్షమున నునుపుమా యని కోరియుందురే కాని భక్తుల కభయదాన మొసంగు నీకరమును మాశిరసున నునుపుమా యని కోరరు. కాఁబట్టి గురుశిష్యన్యాయ మిందుఁ దేటపడును. అంతియగాని వేఱు భావము కానరాదని గ్రహించు టుత్తమము. హస్తమస్తకసంయోగమను టందఱెఱుంగుదురు. గురుశిష్యమర్యాదావిషయముననే యీన్యాయ ముపయోగింపఁబడును.

5 యాదవులకుం గల కష్టములఁ దొలఁగించువాఁడవు. అనఁగా సకలకష్టములు యాదవులకుం గలుగనున్నవి. వానిం దొలఁగింపనే యవతరించితివి. వీరుఁడా, ఆకష్టములను దొలఁగించుట నీకొకకష్టము గాదు. నీవు వీరుఁడవు కదా! శత్రుకృతకష్టములఁ దొలఁగింతువు. స్వజనులనఁగా నీతోడ నవతరించిన మాకష్టములను, మనుష్యలోకనివాసమే యొకకష్టమని భావము. అట్టి కష్టమును జిఱునవ్వులచేతనే తొలఁగింపఁగలవు. అట్టి నిన్ను సఖుఁడా అనఁగా మేలుకూర్చు ప్రోడా! యని పిలువఁ జాలితిమి. అట్టి మమ్ము నాశ్ర

తుఁడా! సఖుఁడా! నీకింకరులము. కాన మమ్మంగీకరింపుము. అందమగు నీముఖారవిందమును స్త్రీలమగు మాకుఁ గనఁ బఱుపుము.

శ్లో. వ్రజజనార్తిహన్ వీర యోషితాం నిజజనస్మయధ్వంసనస్మిత,
భజ సఖే భవత్కింకరీస్స్మ నో జలరుహాననం చారు దర్శయ.

అని మూలము.

భవత్కింకరీః నః అస్మాన్ భజ ఆశ్రయ అని వ్యాఖ్య. ఆశ్రయించుట యనఁగా భక్తుల ననుసరించి యుండుట భగవల్లక్షణము కదా. ఈశ్లోకమునకు మహాకవి,

క. మగువలయెడ నీక్రౌర్యము
దగునే నిజభక్తతతిదమనుఁడ వకటా
తగదు భవద్దాసులకును
నగుమొగముం జూపి కావు నళినదళాక్షా.

అని వ్రాసిరి. ఈపద్యమునఁ గూడ మమ్ముద్ధరింపుమా యను నర్థమే తోఁచెడిని. అంతియ గాని మమ్ము రతికేళిం దేల్పుమా యనునది కానరాదు.

6 భక్తుల సకలపాపములఁ దూలఁగొట్టుచు, నిఖ్యాతిం

---

యింపుము. భక్తుల నాశ్రయించుట కదా నీకృత్యము. దివ్యరుచిరభవన్ముఖారవిందము నొకమాఱు గనఁబఱుపుము. అనఁగా మాకుఁ బ్రత్యక్షమై మమ్ముద్ధరింపుమని దీనిసారమని గ్రహించుటయే యుత్తమమార్గము.

6 ప్రణతదేహినాం పాపకర్శనం తృణచరానుగం శ్రీనికేతనం,
ఫణిఫణార్పితం తే పదాంబుజం కృణు కుచేషు నః కృంధి హృచ్ఛయమ్-అని

గాంచి శ్రీనిలయమై కాళీయనాగరాజఫణార్పితంబై గోవుల ననుసరించి నడువ నూఁకొని దివ్యమై తనరారు నీపాదసరోరుహాముసు మావక్షోజముపై నునుపుము. మాకామతాప మార్పుము. [7] పుండరీకాయంతలోచనా, మనోహరవాక్యములుగల నీమధురవాక్కులచే బుధుల ననురంజింపఁ జేయుదువు. నీయందే

---

మూలము. పాపనాశకము ప్రఖ్యాతము సంపదాలవాలము కాళీయఫణిపడగయందుంచినదియు నను విశేషములు శ్రీహరిపాదారవిందమును గూర్చి చెప్పఁబడినవి. అట్టి నీపాదమును మా స్తనములపై నునుపుము. మాకామమును నశింపఁ జేయుమని గోపికలు కోరిరి. ఇందొక్కయక్షరమైనను గోపికలు కామపరతంత్రలు, శ్రీకృష్ణునియందమునకు మోసపోయి యతనిఁబొందఁ గోరిరి. అన్నయర్థము స్ఫురించునా. అట్టివారు గోపిక లైనచో శ్రీకృష్ణా! పాపముల నడంచి కాళీయు నుద్ధరించిన నీపాదమును మాకుచములపై నునుపుమని కోరుదురా. కామసూచకమైన దిందొక్కవిశేషణమైనఁ గలదా. ఈశ్లోకముచే భక్తరక్షణమునఁ బటిష్ఠమైనది భగవత్పాదమని భక్తులభావము. అట్టి భావమునే యీశ్లోకము చెప్పుచున్నది. అంతియకాని యసంగతార్థమును సూచింపదని గ్రహించుట సమంచితము. దీనికిఁ దెనుఁగున నించుక కామపరమగునర్థము కనఁబడియెడిని. కాని మూలమున నించుకంతయుఁ గానరాదు. [7] అధరశీధునా ప్యాయయస్వ నః-అని మూలము. కొంద ఱీశ్లోకముచే గోపికలు కామపరతంత్ర లయి కృష్ణుని వెదకిరిగాని భక్తిపరతంత్రలై వెదకలేదని యర్థమును జెప్పుదురు. కాని యది పూర్వాపరశ్లోకవిరుద్ధ మనుట పొరపాటు గాదు. బుధమనోజ్ఞయా-అని యున్నది. బుధులనఁగాఁ బండితులు. పండితులనఁగా జ్ఞానసంపన్నులు. జ్ఞానులకు మనోహరమైన వాక్కుచే నన్నదానిచేతనే పైభావము తిరస్కృతము. ముహ్యతీః=ఇట్టివాక్కుచే నాసపడునట్లు చేయఁబడితిమి. అట్టిమ మ్మధరసుధచేఁ బరితాపవిహీనల మగునట్లు

మనముల నిలిపి నిన్నే ధ్యానించుచు నీదాసురాండ్ర మనఁదగి
యున్న మమ్ము నధరామృతమున సంతృప్తినొందింపుము.
8గోలోకనాథా! తాపత్రయమునఁ గుందువారలకు జీవనము,
పాపములఁ బోఁగొట్టునది. బ్రహ్మవేత్తలచే వర్ణింపఁబడినది. శ్రవ
ణములకుఁ బరమమంగళము, శ్రీసమృద్ధి గలది. ఇట్టి నీకథాసు
ధను దృప్తియగునట్లు కీర్తించువారే యీలోకమునఁ బుణ్యా
త్ములు. ఇంతకంటెఁ బుణ్యకార్యము లేదు. ఈఘట్టమున మహా
కవి పోతన,

---

చేయుమా యనఁగా వాగమృతమున మాతాపత్రయముల నడంపుమా యని
భావము. సదుపదేశరూపామృతధారలచే మాహృదయములఁ గలతాపములఁ
బాపుమా యని సారము. జ్ఞానుల కానందమును గల్గించు నుపనిషదర్థమును
దెలుపుమాటలం బలికి మాకీలోకనివాసమున నలవడిన సంసార తాపము నార్పు
మా యని గోపికలప్రార్థన యని గ్రహించుట జ్ఞానుల లక్షణము. అంతియ
గాని విపరీతముగా గ్రహించి సన్మార్గమును బాడుచేయరాదు. పూర్వాపర
శ్లోకములఁ గల భావమును బరికించి యర్థము చెప్పవలయును కాని వేఱు
మార్గమున భావ మిది యని సిద్ధాంతముచేయఁ బూనరాదు. అది సజ్జనుల
త్రోవ కాదు. దీనితర్వాతిశ్లోకమును బరికించిన నింతయుఁ స్పష్టమగును.

8 తవకథామృతం తప్తజీవనం కవిభిరీడితం కల్మషాపహం,
శ్రవణమంగళం శ్రీమదాతతం భువి గృణంతి యే భూరిదా జనాః.

అని మూ. ఈశ్లోకమును జక్కఁగాఁ బఠింపుఁడు. కామపరతంత్రలు కోరు
నట్టివాంఛ లిందుఁ గలవా. లేక భక్తిపరతంత్ర లగు నారీమణులు కోరు
వాంఛ లిందుఁ గలవా. యని యించుక యూహింపుఁడు. ఇందొక్కయక్షర
మైనను గామపరతంత్రతఁ బలికించునది లేదని నాభావము. కల్మషాపహమ్ =
అన్నమాట కామపరవశతఁ గుందిన కాంతామణినోట యట్టి తపాతపాపను

మ. ఘనలక్ష్మీయుత మై నిరర్గ శుభదమై • కామాదివిధ్వంసి యై
సనకాదిస్తుత మై నిరంతరతపఃస్సంత ప్తపున్నాగజీ
వన మై యొప్పెడు నీకథామృతముశ్రావం గల్గునే భూరిదా
ననిరూఢత్వము లేనివారలకు మా • నారీమనోహారకా.

అని వ్రాసిరి. మూలార్థ మిట విస్తృత మని యెఱుంగ వలయును.

9 ప్రీతిపాత్రుఁడ వగునోగోపాలబాలకా! మహిమ మితరులకుఁ దెలియకుండఁ బ్రవర్తించు భగవంతుఁడా! సంతోషమును బుట్టించు నీనవ్వు, నీప్రేమావలోకనము, ధ్యానమం

---

సమయమున వెడలునా. భగవంతునిఁ గోరుట కావునఁ బాపము లేదు. కాన వారు కామపరవశలే యందురేమో. శ్రీకృష్ణుని భగవంతుఁ డని తెలిసికొన్న కాంతకుఁ గామము నివృత్తియై దివ్యజ్ఞానము దీపించునే గాని కామము వృద్ధి కాదు. భగవద్ధ్యానమునకు ఫలము కామాభివృద్ధియే యన్నవారికిఁ బదివేలనమస్కారములే కాని యింకొక్కమాట చెప్పవీలులేదు. కావున సజ్జనులారా! ఈఘట్టమున విపరీతార్థములకుఁ జోటు లేదని నమ్మి గోపికలు భక్తిపరతంత్రలై భగవంతునిఁ బ్రార్థించినట్లు మీరును శ్రీకృష్ణపరబ్రహ్మమును ధ్యానింపుఁడు. వ్యాఖ్యాతలు "కవిభిరీడితమ్" అను పదమునకు "బ్రహ్మవిద్భిరీడితం స్తుతం" అనియే వ్రాసిరి. పైనివ్రాసినభావము నాభావమని యోజింపకుఁడు. వ్యాఖ్యాతలభావ మనియే గ్రహింపుఁడు.

9 కపటవర్తనుఁడా యని గోపికలు సంబోధించిరి. నీతత్వ మొరులకుఁ దెలియరాక యుండఁ బ్రవర్తించుచున్నవాఁడవు. కాని మే మెఱుంగకుండఁ బ్రవర్తింపఁగలవా. మేము నిన్నుఁ గూడి యనవరతము గోలోకమున రాసమండలమున విహరించువారము గాన నీతత్వము నీపాదారవింద

గళమగు నీవిహారము మనస్సున కపరిమితానందము నొనఁ
గూర్చు నీరహస్సంకేతములు, మామనస్సులను ద్రవపడఁ
జేయుచున్నవి. [10]మనోహరుఁడా! నీపాదములు నళినసుంద
రము లైనవి. నీవు గోవులం దోలుకొని గోకులమునుండి వెడలు
నపుడు క్షేత్రములఁ బండి నేలపైఁ బడియున్న వరివెన్నులను,
గడ్డిపుడకలను, చిన్నమొలకులను దాఁకి యెంత నొచ్చునో
యని మామనములు తల్లడ మందుచుండును. అట్టి మామన
ములు కష్టపడునట్లు ఈవనములలో నెందుదాఁగితివో ఏచోట

సేవచేఁ దెలిసికొనఁగల్గినవారమే. మమ్మెప్పుడు గాంచినను నవ్వుచుఁ గటాక్ష
వీక్షణముల నాదరించుచు నీవిహారములు మాకు ధ్యానింపఁదగునట్లు చేయుచు,
మామనసులు నీరహస్యచరితములు స్మరింపఁగల్గునట్టు చేయుచుందువు కాన నివి
యన్నియుం మామనసులు నిన్ను దర్శింపఁ గోరి త్వరపడునట్టివానినిగాఁ జేయుం
చున్నవని సారము. దీనిచే వేగముగా సాక్షాత్కరించి మమ్ముద్ధరింపుమా యని
ప్రార్థించిన ట్లూహించుట న్యాయమార్గము.

10 శిలతృణాంకురైః-అని మూలము. శిలశబ్ద మిట నపుంసకలిం
గము. శిలాశబ్దము గాదు. వరి కోసిన పిదపఁ గ్రిందఁ బడియున్న వెన్నులు.
శిలోంఛవృత్తు లనుచో శిలవృత్తి యనఁగా నట్టి వరివెన్నుల నేరికొని తెచ్చి
వానిచే జీవనము చేయుట యని యర్థము. అంతియకాని పాషాణములు
కావు. ఈశ్లోకమును దెనిఁగించుచు మహాకవి పోతన,

ఆ. ఘోషభూమి వెడలి ♦ గోవుల మేపంగ
నీరజాభ మైన ♦ నీపదములు
గసవు శిలలు దాఁకి ♦ కడునొచ్చునో యని
కలఁగు మామనములు ♦ కమలనయన.

నేకఱకుగడ్డిపోచలు తగిలి నీమృదుపదములకు బాధలఁ గల్పించునో యని చింతించుచుండు మమ్ముల నుడికింపక వేవేగ దర్శన మిమ్ము.

[11]వీరుఁడా! నల్లనివెండ్రుకలచే నిండి, గోవులపాదధూళి గడుదట్టముగా నావరింపఁగాఁ జూచువారల కొకరీతిఁగా నందమును గూర్చునది కదా నీముఖారవిందము. అట్టి ముఖకమలమును సాయంకాలమునందు నీవు గోవులవెంట వచ్చునపుడు మాకుఁ గనఁబఱచుచుందువు. దానిం జూచినంతనే

---

అని వ్రాసిరి. శిలలు పాషాణము లనియే వారిభావము. శిలతృణాంకురైః అనుచో "శిలైః కణిశైః" అని వ్యాఖ్యాత లేల వ్రాసిరో వీరేల యిట్లు వ్రాసిరో. వారి కొదివినపుస్తకమునందుఁ బాఠభేదమున నట్లున్నదో. ఆపక్షమున దానిప్రక్కననున్న తృణశబ్దము రసప్రదము కాదు. తృణములఁ దాఁకి నొచ్చునని సంశయించుచుండఁ బాషాణములఁ దాఁకి యనుట రసవంతముగా నుండదు. వారియుద్దేశ మెఱుంగఁజాలకున్నాఁడను.

11 స్మరం యచ్ఛసి అను మూలమునకు కేవలం స్మరం యచ్ఛసి అర్పయసి నతు సుఖం దదాసి కపట ఇతి భావః. అని వ్యాఖ్య కలదు. దీనిచేత గోపికలు కామాతుర లని భావమని కొందఱందురు. అది మిగులఁ బొరపాటు. వీర! అనుసంబోధనము గలదు. నీవు లోకైకశూరుఁడవు. అట్టి నీ వీ గోవుల మేపుచు నడవులఁ దిరుగుచు సాయంకాల మాగోవులపాదధూళి ముఖకమలమును ఆచ్ఛాదింప నల్లనినెఱికురులు ముఖమునఁ గ్రమ్మియుండ నీవరుదేరఁ గాంచిన మాకు నీదర్శనమున గోలోకవృత్తాంతము స్మృతిగోచరమగుచున్నదని భావము. "స్మరం యచ్ఛసి" యనఁగా స్మృతియని యర్థమగునా యని ప్రశ్నించిన నీపాటిభావము దానినుండి పొడచూపు ననునదియే సమాధానము. లేకున్న వీరా యనునది వ్యర్థమగును.

మాకు నీపూర్వవార్తను స్మరింపఁజేయుచుందువు. కావున మాకది విచారమునే గల్పించుచుండును. [12]ఆధిహారుఁడా (మనోరోగ మావంతయుఁ గలుగకుండఁ బోఁగొట్టువాఁడా) రమణా! (ప్రీతిని గల్గించువాఁడా) నమస్కరించువారల కెల్ల కోర్కులం బ్రసాదించుచు, బ్రహ్మదేవునిచేఁ బూజితం బగుచు, భూలోకమున కెల్ల నలంకారప్రాయమై, ఆపత్కాలమందు ధ్యానింపఁదగి మిగులసుఖమును గల్గించు నీపాదకమలమును మావక్షోజములయం దునుపుము. దాన మాపరితాపములు నశించును. ఈఘట్టమున మహాకవి,

> ఆ. భక్తకామదంబు ♦ బ్రహ్మసేవిత మిలా
> మండనంబు దుఃఖ ♦ మర్దనంబు
> భద్రకరము నైన ♦ భవదంఘ్రియుగము మా
> యురములందు రమణ ♦ యునుపఁ దగదె.

అని వ్రాసి తనభక్తిని దేటపఱచిరి. ఎంతచక్కనిభావమును దేటపఱచిరి? ఎంతటి భక్తుఁడు? ఎంతటి భావజ్ఞుఁడు? సెబా సనవచ్చు.

---

12 ప్రణతకామదం పద్మజార్చితం ధరణిమండనం ధ్యేయమాపది,
చరణపంకజం శంతమం చ తే రమణ నస్తనే ష్వర్పయాధిహన్.

అని మూలము. ప్రణతకామదం పద్మజార్చితమ్ అనునీరెండు విశేషణములను బఠించినంతనే గోపికలు కామపరతంత్రలు కాక భగవద్ధ్యానాసక్తచిత్త లనునర్థ మగును. అంతియె కాని వేఱొకరీతి నర్థమే కాదు. తక్కినవిషయములకు సమాధానము ముందే వ్రాయఁబడినది.

[13]ఓ శూరుఁడా! మనోహరనినాదమున మెఱసి సర్వజన హృదయముల నానందింపఁ జేయు వేణువును ముద్దిడుకొనుచు సకలశోకములఁ బోఁగొట్టుచు సురతవర్ధనమై మనుష్యుల కితర సుఖములను స్మృతికి రాకుండఁ జేసి యసమానమై తనరు నీయ ధరామృతము మా కొసఁగుము. [14]ఓకృష్ణా! పగటిపూట నీవడ వులకుఁ బోవ నిన్నుఁ జూడఁజాలక పరితపించుమాకు క్షణ కాలము కూడ నొకయుగముగాఁ గానఁబడును. వంకరలగు

---

13 ఇచ్చట గోపికల కామాసక్తి తేటపడుచున్నదని కొందఱు బో డ్డున యజ్ఞోపవీతమును దోఁపి కలహమునకుఁ బూనుదురు. వారి కిదియే సమాధానము.

శ్లో. సురతవర్ధనం శోకనాశనం స్వరితవేణునా సుష్ఠు చుంబితం,
ఇతరరాగవిస్మారణం నృణాం వితర వీర నస్తేఽధరామృతం.

అని మూలము. సురతవర్ధన మనఁగా సురతచ్ఛేదక మని భావము. వర్ధనమనఁగా ఛేదించునది యని యర్థము. కాఁబట్టియే శోకనాశనం అన్న విశేషణము సార్థకము. ఇతరరాగవిస్మారణమ్ అనఁగా నీయందనురాగమును దప్ప నితరదేవతలయందు విశ్వాసమును బోఁగొట్టునని భావము. దీనిచే నన న్యభక్తిభావము దృఢపడుచున్నది. అంతియ గాని నీచార్థ మేదియుం నిట కనఁబడదు. లేనిపోనిశంకలకు మదిని జోటు నుసుపకుఁడు.

14 దీనిచే నిరంతరదర్శనమును గోరుచున్నారము. త్రుటికాల మనఁగా

తీక్ష్ణసూచ్యాబ్జపత్రస్య దళవేధస్త్రుటిర్భవేత్.

అను సిద్ధాంతోక్తప్రకారము, (సన్నటిసూదిచే తామరపూవులోపలి మెత్తని దళమునకు రంధ్రము చేసినంతకాల మని యర్థము.) అనఁగా నత్య

ముందటివెండ్రుకలుగల నీముఖాంబుజము శ్రీకాటపట్టు. అట్టి నీమోహముద్రమ్మిని జక్కఁగాఁ జూచు మాకు ఱెప్పలు గావించి చూపున కించుక యంతరాయమును గల్పించిన బ్రహ్మ నలువ మందబుద్ధి గలవాఁడని యూహింపఁదగును. ఓ యచ్యుతా! భర్తను, పుత్త్రులను, దండ్రిని, సోదరులను, బాంధవులను వదలి నీగీతమును విన వచ్చితిమి. మేమెల్ల నీదివ్యగీతముచే నొడలు మఱచితిమి. నీవే గతి యని నమ్మి వచ్చితిమి. శఠుఁడా! ఎవ్వఁడేని

ల్పకాలమని భావము. ఇట్టిమాకు ఱెప్పలు లేకున్న బాగుండునే యని దీని భావము. దీనిచే క్షణమాత్రమేని నిన్ను దర్శింపకుండ నుండఁజాల మను భావము స్పష్టమగుచున్నది.

15 దీనిచే గోపికలమోహము వెల్లడియగుచున్నదే. ఏమి దీనికి సమాధానమని కొందఱందురు. దీనిచేతనే గోపికలు ముక్తిఁగోరుచున్నవారని స్పష్టమగుచున్నదే. కామార్తులను నర్థమెట్లు కనుఁగొంటిరని ప్రతిప్రశ్నము చేయవలయుం.

శ్లో. పతిసుతాన్వయభ్రాతృబాంధవా నతివిలంఘ్య తే హ్యచ్యుతాగతాః,
గతివిద స్తవోద్గీతమోహితాః కితవ యోషితః కస్త్యజే న్నిశి.

అని మూలము. అచ్యుతా! అను నామోచ్చారణమును బరికింపుఁడు. నీపదము చ్యుతి (నాశనము) లేనిది. అట్టు గాటనే యచ్యుతుఁడవు. చ్యుతి లేనివాఁడవని భావము. ఓపరమాత్మా! సకలబంధువులను వదలి "అతి విలంఘ్య" చక్కఁగా వదలి యని దీని భావసారము. ఉద్గీతమోహితాః=ఉద్గీత మనఁగా నుపనిషద్వాదమని యర్థము. దానిచే నొడలు మఱచి యని భావము. గతివిదః=మాగతి యిదియే యని యెఱిఁగినవారమై యని భావము. నీచెంతకుం జేరితిమి. ఇట్టి మమ్ము, నిశి=అజ్ఞానాంధకారసమావృతమగు నీలోకమునందు

రాత్రియందుఁ ద్యజించునా. యోజింపుమా. [16]ఓ శ్రీహరీ! నీర
హాస్యసంకేతంబును, కామసందీపనంబైన స్మితవక్త్రమును, ప్రేమ
తోఁగూడిన చూపులును, మంగళములకాలవాలమగు విశాల
వక్షస్థ్సలమును వీనిం గాంచి నీపయి మామనస్సులు ప్రీతిని
బొందుచున్నవి. వాంఛితములు కొనలుసాగుచున్నవి. నీయా
విర్భావము గోకులవాసులకెల్ల దుఃఖరాసులఁ దొలఁగంద్రో
యుచున్నయది. సర్వమంగళాత్మకమై యొప్పారెడు. ఇట్టు లొట
నీయందే మనస్సు నిలిపితిమి. అట్టి యనన్యగతికలమగు మాకు
మనోవ్యాధినిర్మూలించు నేదేనొక్క వీక్షణమును సుంత ప్రవ
హింపఁ జేయుమా. (మనోవ్యాధు లనఁగా నీజన్మము వదలి
యెపుడు గోలోకమున కేగుదుమా యన్నచింతలని భావము.)
ఆవీక్షణసుధారసమున మునింగి శాశ్వతపదమునకుం బోవుదుము.
ఓప్రియతముఁడా! నీమృదుతమపాదపద్మములు మావక్షోజ
ములయందు భీతినొందుచు ధరించువారము. మావక్షస్థలము
కఠినమైనది నీపదారవిందము లతికోమలములు. కాన నీస్పర్శ
మున నేరీతి నొవ్వకుండును? అన్నభీతి మాకుం గలదు. అట్టిపద

---

"రోషితః" ధైర్యము లేనివారము. అగుమమ్ము వదలితివేని నిన్నుఁ గితవుఁ
డందురు. ఘాతుకుఁడందురు. అనఁగా సాధువులు నిందింతురని భావము.
దీనిచే మాకు ముక్తిని బ్రసాదింపుమా యని గోపికలు కోరిరని యెఱుంగ
వలయును. 16 నీసురుచిరాంగములు నీవిహారస్థలమును గాంచిన మామన
స్సులు మహాహర్షము నొందుచున్నవి. మాకోరికలు మిన్నుముట్టుచున్నవి.
కావున మాకుదర్శన మొసంగి మమ్ముఁ దరింపఁజేయుమా. దీనిచేతఁగూడ వీరి
కోరిక లెట్టివో స్పష్టమగుచునేయున్నవి.

పంకజములు నీవరణ్యమున నడ్డులేక సంచరించుటచేఁ గఠినపాషాణాదులు తగుల నెంత నొచ్చునో యని యెపుడు మామనస్సులు తత్తఱపడియెడిని. మాచిత్తములు నిన్నే పట్టియున్నవి కదా. అని యిట్లు అనేకప్రకారముల నాడుచు విచిత్రరీతిం బాడుచు గోపికలు శ్రీకృష్ణపరవశమానసముల నుండిరి.

మహామతులారా! గోపికాగీతల నాలకించితిరి. మూలమునఁ గల పదచమత్కృతి నందందుఁ దిలకించితిరి. ప్రాతీతికార్థమును దెలిసికొంటిరి. విశేషార్థమును నావ్రాసినదానిం గాక మీమదిని యోజింపుఁడు. ఒక్కసుందరపురుషునిం గోరిన ప్రమదలు పెక్కుమంది యొక్కచోటం జేరి యతని వెదకుట లోకస్వభావమా యని యూహింపుఁడు. లోకాతీతమందురా అది భగవన్మహిమను కానఁ బరమపవిత్రమే యగు. లోకవిరుద్ధమందురేని అది దూష్యమగును. ఇంతమంది యొక్కనిగోరి యొకచోటఁ జేరి పరస్పరవిరోధములు లేకుండుట నెందేని వింటిరా యని నే నడుగుచున్నాఁడను. కాని యపుడు ఇందేదో విశేషార్థము గలదని యూహింపక మాన శక్యమా. మానిన లాభమా. కాఁబట్టి యిందుఁ గల విశేషార్థముల గ్రహింపక తప్పదు. గోపికలు భగవంతుఁడగు శ్రీకృష్ణపరమాత్మ యదృశ్యుఁడు కాఁగాఁ దద్దర్శనమును గోరి ప్రార్థించుట. ఈప్రార్థనమే గోపికాగీత లనఁబడుచున్నది. ఒక్కొక్క గోపికయు నొక్కొక్క భావమును దెలుపక సంఘముగా నీభావములఁ దెలిపిరి. దీనిచేతనే కాముకత్వమునఁ గాక భక్తిచేతనే యిట్లు

ప్రార్థించిరనుట స్పష్టము కాక మానదు. ఒక్కొక్కచోట నిందుఁగలవి శేషములు వర్ణనాతీతములు. పరబ్రహ్మా! లోకనాయకా పరమేశ్వరా యిత్యాది సంబుద్ధులు జూడ గోపికలించుకంతయుఁ గామపరవశలు కారనియు, శ్రీహరియందుఁ గలయవ్యాజభక్తిచే నట్లు ప్రార్థించిరనియు వారు గోలోకమునసుండినగోపికలే యనియుఁ గావున వారికి నాయిక రాధాదేవి యాయె ననియు స్పష్టమగును. ఇంతియ గాక శ్రీహరి నీపాదారవిందమును మావక్షోరుహములపై నునుపుమా యని వేఁడుటయు, నీహస్తసరోజమును మాశిరస్సున నునిచి కాపాడుమా యని ప్రార్థించుటయుఁ గాముకత్వమును వెల్లడింపవనుట స్పష్టము. ఇట్టిఘట్టములయందు విశేషముగా నీచమగు నర్థమును గల్పించుట పాడిగాదు. భగవదవతారమునందు జనులకొక యసూయతను బుట్టించుట సాధుమార్గమే కాదు. దీనిచేఁ బరమతస్థులు మనల దూషించుట కవకాశ మేర్పడినది. తెనిఁగించునపు డిట్టి ఘట్టమున జాగరూకుఁడై కవి మెలఁగవలయును. వేలమంది స్త్రీలతో నొక్కపురుషుఁడు సుఖించె నని చెప్పినచో నది యమానుషశక్తిని వెల్లడించును గదా. అట్టులని దానియందు లేని యర్థమును జేర్పరాదు.

గోపికలు పతులయానతి మీఱి తల్లిదండ్రులమాటల లెక్కింపక సోదరులపల్కుల నాదరింపక బంధువులనుడువులఁ జెవిఁ జొన్పక రాత్రికాలమున నొంటిరిపాటున వెడలి రనుట మాత్రమే మన మాలోచించిన వారు కులట లనుటలో

నాశ్చర్య మేమియుఁ గానరాదు. కాని యంతమంది గుంపులు కట్టి పోవుచుండఁగా నింటివార లడ్డుపెట్టక వెంబడింపక తరువాతనైన నలుగురును గలిసి యిది యేమి యన్యాయమని తలపోసికొని యూరివారెల్ల వారిఁ జూడఁ బ్రయత్నింపక యింటనుండుట యచ్చెరువు గొలుపక మానదు. ఇందఱి నాభగవత్కాళ యాచ్ఛాదించెనని చెప్పక తప్పదు. అట్టితావుల నీఁక విరుద్ధ మేమున్నదో నేనెఱుంగఁజాల కున్నాఁడను. తగినట్లు సమాధానము చెప్పుట యెట్టివారికేని కష్టమనియే నాభావము. భక్తపరాధీనుఁడు భగవంతుఁడు. ఆతని దివ్యచరిత్ర మత్యద్భుతము. అవాఙ్మానసగోచరము. దాని కసాధ్య మేదియును లేదు. తన లోకవాసుల నందఱిని శ్రీకృష్ణగానము లాగెను. ఆయాకర్షణ శక్తి ఇతరగానమునకు లేదు. కాఁబట్టియే నావబ్రహ్మ మాపరమేశ్వరుఁడే యనఁ జెల్లు.

గోపిక లాగానాకృష్టచిత్తలై పరుగిడిరి. భగవంతునిం గాంచిరి. కాని యాపరాత్పరుఁడు వీరిచిత్తవ్యాపార మెట్లున్నదో కనుఁగొందమని లోకాచారము ననుసరించియే ప్రశ్నించెను. వార లాప్రశ్నములకు బదులిడిరి. ఇష్టాలాపములఁ గొంతకాలముపుచ్చి శ్రీహరి వారికిం గనఁబడఁ డయ్యెను. అత్తఱి వారంద ఱొక చోటఁ జేరి వచించినమాటలే గోపికాగీతలనం బరఁగెడిని.వానియందలి యర్థము భక్తిపారవశ్యమును వెల్లడించునే కాని యితరభావమును దెలుపదు. ప్రతిశ్లోక మొక్కారీతిగా నర్థమిచ్చును. వానియర్థముల నందందే వ్రాసితిని. కాన

మరల నిట మొదటినుండి యించుక వ్రాసి వదలుచున్నాఁడను. గోపికలవలె దృఢభక్తినిరతులై సదా భగవంతునిదర్శనమునే కోరుచు సమస్తము తదర్పణముచేసి యాపరమేశ్వరుని నమ్మియుండినచో నుత్తమ శాశ్వతలోకమును గోపికలవలెఁ బొందుదురని విన్నవించువాఁడను. ఇదియే యిందలిసారము. ఇంతట నీవిషయమును వదలి తరువాతికథను వ్రాసెదను.

## శ్రీకృష్ణమూర్తి గోపికలకుఁ బ్రత్యక్షమగుట.

శ్లో. యాసాం గోపాంగనానాం లసదసితతరాలోలలీలాకటాక్షా,
యన్నాసాచారుముక్తామణి రుచినికరవ్యోమ గంగాప్రవాహే, మీనాయంతేఽపి తాసా మతిరభసచలచ్చారునీలాలకాంతా, భృంగాయంతే యదంఘ్రిద్వయసరసిరుహే పాతు పీతాంబరో నః.

శ్రీకృష్ణకర్ణామృతము ౨ ఆ. ౯౫ శ్లో.

* ఆర్యులారా! అవ్వలికథ నవధరింపుఁడు. శ్రీహరి వారితో ప్రభక్తిని బరీక్షింపఁ గోరి యదృశ్యుఁ డయ్యెను. కాని గోపిక లిండ్లకుం బోక యందే యారేయి చాలసేపుండి భక్తిశ్రద్ధలతోఁ బ్రార్థించిరి. నిష్ఠురము లాడిరి. అగతికల మగు మమ్ము నిట్టు వదలిపోవుట భగవంతుఁడ వగు నీకుఁ దగునా యనిరి. నీవు వదలిన నిన్ను వదలుదుమని తలంచితివా. ప్రాణములనైన నిందే వదలుదుము గాని నిన్నుం గనుంగొనక యిం

* ఈగాథ శ్రీభాగవతము ౧౦ స్కం. ౩౨ వ యధ్యాయమునుండి గ్రహింపఁబడియె.

డ్లకుంబోవ నుంకింతుమా యనిరి. భక్తపరాధీనుఁడవు నీవు. ఇట్టినీ విట్లు మమ్ముఁ బరీక్షించిన మేమెంతవారము స్వామీ యని ప్రార్థించిరి. ఆర్తిహరుఁడవగు నిన్ను నమ్మితిమి. ఏమిచేసి నను మీఁదియే భార మనిరి. ఇట్లు తన్నే నమ్మి భీతినొందక గృహములకుం బోవఁ దలంపక యారాత్రి చెట్టులుగుట్టలు తిరుగుచు భగవంతుని జూడఁగోరుచుండిరి.

శ్రీహరియు వారిమనోభావమును లోకమర్యాద నను సరించియుఁ దన్నుఁ జూచి సామాన్యులు గురుశిష్యధర్మముల నేర్చుకొందు రనియుఁ బరీక్షించి చూచెను. అనన్యగతిక లని స్పష్టమాయెను. వెంటనే వారియెదుటఁ గరుణారస ముప్పొంగఁ బ్రత్యక్ష మయ్యెను. అప్పుడాహరిమోమున స్మితము నర్తనము సలుపుచుండెను. పీతాంబరము తనువున కొకవింతచెలువము నొసంగుచుండెను. పుష్పహారము కంఠమున వ్రేలాడుచుండెను. అప్పటి యారూపమున మన్మథమన్మథుఁ డని చెప్పుటకంటె వేఱొక్కమాట భాషలో నెందును గానరాదు. అట్టిగోపాల బాలునిఁ గాంచిరి. గోపికల నేత్రసారసములు వికసించెను. ప్రసాదదృష్టులు వర్ణనాతీతముగాఁ బగియుండెను. ప్రాణములు మరలఁ బ్రవేశింపఁగనే లేచినదేహములవలె వారెల్ల నొక్కు మ్మడి లేచిరి. ప్రత్యక్షమైన శ్రీకృష్ణునిం గాంచిరి.

శ్రీకృష్ణదర్శనమున గోపికలతనువులు ప్రమోదసాగర మున మునింగెను. కాఁబట్టియే యందుజరపఁదగు విధాన మెట్టిదో యవి యెఱుఁగ కుండెను. ఒక్కగోపిక రెండుచేతు

లతో శ్రీకృష్ణకరాంబుజమును బట్టుకొనియెను. ఆసేవచేఁ దన ప్రమదమును దెలుపుకొనియెను. ఒక్కకాంతామతల్లిక చారు చందనచర్చలనలరు శ్రీహరిహస్తమును దనభుజశిఖరమున నునుచుకొనియెను. ఒకయంగన గోపాలబాలుని తాంబూలచర్వణమును దోసిటం బట్టెను. ఒక పురంధ్రీమణి శ్రీపతిచరణారవిందమును దర్శనమునకై తపించు తనవక్షోరుహాముపై నిడుకొనియె. ఒకకామిని ప్రేమాతిశయమున నొడలుమఱచి బొమముడి పెట్టెను. అంతతోఁ దనివిసనక యధరముఁను గఱచి తన యుత్కంఠతను జూపెను. మఱియుఁ గటాక్షవీక్షణములఁ దీవ్రముఁగాఁ గనుంగొనియెను. ఒకసాధ్వి సాధువులు భగవత్పాదారవిందమును జూచుచుఁ దృప్తినొందనట్లు నందనందను పదనారవిందమును జక్కఁ గాంచియుఁ దృప్తినొందదయ్యెను. ఒక్క కామాక్షి యాపరబ్రహ్మమును నేత్రరంధ్రములద్వారా మదిఁ జొనిపి ధ్యానసమాధినిష్ఠుఁడగు యోగీంద్రుకైవడి మహానందమున నొడలుమఱచి శరీరమునం దంతట గగుర్పాటు పొలయ మదియందే యాపరమేశ్వరు నాలింగనము చేసికొని యానందించెను. ఇప్పట్టున మహాకవి వ్రాసినపద్య మొండు మూలానుసారముగాక యున్నను వ్రాయక తప్పినది కాదు.

సీ. ఎలయించి ప్రాణేశ ♦ యెందుఁ బోయితివని
తోరంపుటలుకతో ♦ దూఱె నొకతె
జలజాక్ష ననుఁబాసి ♦ చనఁగ నీపాదంబు
లెట్లాడె నని వగ ♦ నెయిదె నొకతె

నాథ నీవరిగిన • నాప్రాణ మున్నది
కూర్మియే యిది యని • కుందె నొకతె
యీశ్వర! నను నిన్ను • నిందాఁకఁ బాపెనే
పాపపు విధి యని • పలికె నొకతె

ఆ. తలఁగిపోవునట్టి • తప్పేమి చేసితి
నధిప పలుకు ధర్మ • మనియె నొకతె
యేమినోముఫలమొ • హృదయేశ నీమోము
మరలఁ గంటి ననుచు • మసలె నొకతె.

ఇట్టులావనితామణులు *విశ్వతైజసావస్థనున్న జీవులు సుషుప్తిసాక్షియగు ప్రాజ్ఞునిం గాంచినట్లు భగవద్విరహమును దాఁటి యతిశయానందమున నందనందనుం దర్శింప నట్టి యప్పద్మనేత్రలం గూడి యచ్యుతుండగు నాపరమేశ్వరుఁడు పత్న్యాదిశక్తులం గూడిన పరమాత్ముని వలెఁ బ్రకాశించెను. భక్తరక్షణ సమాదృతిం గాంచిన భగవంతుఁ డాతరుణమున నార్తలై తన్నుం దలంచు గోపికల నందఱం గూడి ప్రకృతివితతిం గాంచిన

* జహుర్విరహజం తాపం ప్రాజ్ఞం ప్రాప్య యథా జనాః, తాభిర్విధూత శోకాభి ర్భగవా నచ్యుతో వృతః, వ్యరోచతాధికం తత్ర పురుషశ్శక్తిభి ర్యథా-అని మూ. ప్రాజ్ఞం ఈశ్వరం ప్రాప్య యథా ముముక్షవో జనాః. యద్వా ప్రాజ్ఞం బ్రహ్మజ్ఞం ప్రాప్య యథా సంసారిణః యద్వా ప్రాజ్ఞం సుషుప్తిసాక్షిణం ప్రాప్య యథా విశ్వతైజసావస్థాజీవాః అని వ్యాఖ్య. గోపికలు స్వాశ్రయమును గోరి తనయాజ్ఞగా మెలఁగుపరివారదేవత లని దీని సారమని పాఠకు లూహింతురు గాక.

విరాట్టువలెఁ బ్రకాశించెను. ఈతరుణముననే శ్రీకృష్ణుని యపరిమితశక్తి కానఁగను.

ఇట్లు లనన్యగతికలై తన్ను దర్శింపఁ దహతహపడుచున్న గోపికలం దోడుకొని యాసర్వలోకాధిపతి కాళిందీపులినంబులకుం బోయెను. ఆపులినములకుఁ జెంతఁ గాళిందీనిర్మలజలంబులు తమశీకరముల నీపులినములను సుఖవంతములుగాఁ జేయుచుండెను. ఆపులినములయందు వికసించినకుందమందారములు వాసనల వెదలఁజల్లుచుండెను. ఆకుసుమములయందు మత్తమధుకరములు మూఁగియుండెను. అపుష్పములపరిమళములం గైకొని మారుతకిశోరములు పులినముల స్పృశించుచుండెను. శరద్రాత్రికాశీతాంశుసందోహము లంధకారములఁ దోలఁగఁద్రోలుచుండెను. ఆకాలము, ఆస్థలము చూడంజూడ మనోహరముగా నుండెను. ఆయిసుకదిబ్బలు కాళిందీహస్తములచేఁ గుప్పఁజేయఁబడినట్లు గానవచ్చుచుండెను. అట్లు చూడంజూడ ముద్దులమూటగట్టుచున్న యాకాళిందీపులినముల నందఱుఁ బ్రవేశించిరి.

*అంత నా గోపికలు శ్రీమత్పరమేశ్వరుసాక్షాత్కారమునఁ దమహృదయరోగములు నశింప హాయింజెంది శ్రీపరమాత్మ సాక్షాత్కరించుటచే నపరిమితానందసాంద్రము లగు

---

* తద్దర్శనాహ్లాదవిధూతహృద్రుజో మనోరథాంతం శ్రుతయో యథా యయుః, స్వైరుత్తరీయైః కుచకుంకుమాంకితై రచీక్లృప న్నాసనమాత్మబంధవే-అనిమూ-ఆత్మబంధవే=అంతర్యామిణే-అని వ్యాఖ్య. ఇచ్చట గోపికలకు

శ్రుతిసముదయములవలె నుండిరి. పూర్ణకామముల నావనితలు తేజరిల్లిరి. కుచకుంకుమముల నంచితములగు తమచేలాంచలంబుల నాప్రాణబంధు వగుపరమాత్మ కాసనమును గల్పించిరి.

[1]మహాయోగులహృదయారవిందమధ్యభాగమున సమర్పఁబడునాసనముగల యావాసుదేవుఁడు మూఁడులోకముల సంపత్తున కెల్ల నేకనివాసంబైన తనదివ్యసుందరాకారంబుతోడ నాయాసనమునఁ గూరుచుండి తనచుట్టును గోపికలు బలసియుండఁ దదీయపూజల గ్రహించి యెంతయుఁ బ్రకాశించెను. అనంగదీపనుఁడగు (శరీరము మరల లభింపని జ్ఞానమును విక

శ్రుతులకు (వేదములకు) నుఁపమానోపమేయభావము వ్యాసకల్పితము. కామపరవశతఁ గుందుకాంతలను వేదములతోఁ బోల్చుట యెందును గానము. భగవద్దర్శనమునఁ గామమునివర్తింపవలయునేకాని యది యభివృద్ధి కాఁగూడదు. కావుననే ఉపనిషత్తులు భగవత్సాక్షాత్కారమునఁ బరమానందము ననుభవించినట్లు గోపికలు శ్రీకృష్ణసాక్షాత్కారమున సమితానందము ననుభవించిరని దీనిసారము. ఈశ్లోకముకు జదివినపిదపనైన నేమానవుఁడుగాని గోపికలు వ్యభిచారవృత్తిగలవారని భావింప రని నానమ్మకము. వృథా పాపమునకొడిగట్టక శ్రీకృష్ణపరమాత్మపావనచరిత్రమును బఠింపుఁడు.

1 తత్రోపవిష్టో భగవాన్ స ఈశో యోగీశ్వరాంతర్హృదికల్పితాసనః, చకాస గోపీపరిషద్గతోఽర్చిత స్త్రైలోక్యలక్ష్మ్యేకపదం వపుర్దధత్ - అనిమూ. గోపీసభాగతః. తాభిస్సమ్మానితస్సన్ చకాస శుశుభే త్రైలోక్యే యా లక్ష్మీశ్శోభా. తస్యాః ఏకమేవ పదం స్థానం తద్వపు ర్దధత్ దర్శయన్ - అని వ్యాఖ్య. ఇచట ఈశః భగవాన్ యోగీశ్వరాంతర్హృదికల్పితాసనః - అనువానిని శ్రీకృష్ణునకుగాఁ జేర్పఁబడినవి. గోపీపరిషద్గతోఽర్చితః. అనఁగా వారిచేఁ బూజింపఁబడి అని యర్థము. కాముకుఁడగు కృష్ణునకుఁ గామపరవశలై యొడలుదెలియకున్నగోపికలకుఁ గలసంబంధ మిట్లు వర్ణింపఁబడినది.

సింపఁజేయువాఁడగు) నాముకుందుని విలాసదృష్టులతోడను వక్రభ్రూకుటులతోడను నాదరించి యాపరమేశ్వరు కరములను జరణసరోజములను దమయూరువులపై నునుచుకొని మెల్లనఁ బిసుకుచుఁ దోలుదోలుతఁ బ్రశంసించియు మరల నట్టడవిని వదలి యింతసేపు కనఁబడకపోయెనన్న కోపముచే నిట్లు పలికిరి.

## గోపికలప్రశ్నము.

*మహానుభావా! లోకమునఁ గొందఱు తన్ను సదా సేవించువారి నంగీకరింతురు. అనఁగా సన్మానింతురని భావము. మఱికొందఱు తమ్ముసేవింపకుండినను వారి నాదరింతురు. ఇంకను గొందఱు తమ్ముసేవించువారిని సేవింపనివారినింగూడ నాదరింపరు. ఇందుల కేమికారణమో యెఱింగింపుమా యని ప్రార్థించిరి.

---

ఇదియే కామమగునెడల అది యందఱు కోరఁదగినదియే. కాని వేఱురీతిఁగా గామమనునర్థ మిటఁ దేలలేదు. ఇట్టిభావులఁ బరికించియైన గోపికాగీతలు పరమపావనఫలము నొసఁగునవియని నమ్మి తరింపఁ బ్రయత్నింపవలయును.

* భజతోఽనుభజంత్యేకఏకఏతద్విపర్యయం, నోభయాంశ్చభజంత్యేక ఏతన్నోబ్రూహి సాధు భో-అని మూ. నీవు నరసింహావతారమున నిన్నే నమ్మి సేవించు ప్రహ్లాదుని జేరఁదీసి యాదరించితివి. రామావతారమున జటాయువు కబంధుఁడు లోనగువారు నిన్ను సదా సేవింపకున్నను వారి నాదరించి ముక్తి నిచ్చితివి. ఈయవతారమున నిన్నే నమ్మి సేవించుమమ్మును, సేవింపని రాధాదులను నేల యాదరింపకున్నవాఁడవు? ఈక్రొత్తయాచార మీయవతారమునసే యేల యవలంబించితివి? అని ప్రశ్నించిరని గ్రహింపఁదగినది. అనఁగా మేము భక్తిపరవశతఁ గాంచలేదా యేమి? తెలిపి మమ్ముద్ధరింపుమా యని దీని భావసారము.

## శ్రీహరిచెప్పినయుత్తరము.

సేవచేయునాదృతింబొందినగోపికలారా! మంచిప్రశ్నము చేసితిరి. సమాధానము వినుఁడు. ఉపకారప్రత్యుపకారభావమూని గొలుచువారి నాదరించువారు స్వార్థమున మాత్రమే ఆదరణము గలవారు. కావున వారియెడల సౌహృదము గాని ధర్మము గాని యించుకయు గానంబడదు తండ్రులు కొడుకులను బ్రత్యుపకారమును గోరక యాదరించునట్లు తమ్ము సేవింపనివారిని ఆదరించి కరుణించువారివిషయమున నిరపవాదమగు ధర్మము, సౌహృదము నను నివి రెండును బ్రకాశించుచుండును. మఱియు సేవించువారిని ఆదరింపనివారును గొందఱు గలరనుట సత్యమే. అట్టివారికిం దమ్ముసేవింపనివా రెంతవారు? అందు భజించువారి నాదరింపనివారు జ్ఞానులైనయాత్మారాములు. భోగేచ్ఛలేని పూర్ణకాములు. కృతఘ్నులు. నతికర్కశులు. అను నాల్గుతెఱంగులుగాఁ బెద్దలచేఁ బరిగణింపఁబడుదురు

ఇఁక నావిషయమునువినుండు. నేనోనిర్ధనుఁడుతనకుంగల యల్పద్రవ్యమును గూడఁ గోలుపోయి యాచింతపెంపున నితరము నెఱుంగకదానియందే యేకాగ్రచిత్తమున నుండుమాడ్కినాపై నిరంతరధ్యానానువర్తనముల మెలఁగువారలకు వృద్ధిని గోరియే వారి నెఱింగియు నాదరింపకుందును. ఇవి సకారణము గాని యకారణము గాదు. కాన నపరాధము కాదు. అట్టులౌట నోగోపికలారా! నాకొఱకు లోకమును (అనఁగా లోకాచార

ములను) భర్త్రాధర్మములను స్వప్రియబంధువులను వదలిపెట్టి నన్నే భజించుమీకు నాయందు నిరంతరాత్యంతానువృత్తి గలుగునట్లును మీకుం గనఁబడక యుంటిని. అంతియకాని యితర కారణములచేఁ గాదు. మీప్రేమాలాపముల వినుచు నేయుం టిని. ఇంకను ప్రేమ దృఢము కావలయుననియే యీలాగునఁ బరీక్షించితిని. దానికై మీప్రీతినే కోరువాఁడనని యెఱుంగుఁడు. నాపై ననూయఁ బూనకుఁడు. అదిమీయభివృద్ధికి హేతువగును. ఇది త్రిశుద్ధిగ నమ్ముఁడు. నిర్దోషయోగముం గూడినమీయీ యుపకారమునకు నెంతకాలముననేని నేఁ బ్రత్యుపకారము నొనరింప శక్తుఁడను గాను. వదలిపెట్ట నశక్యములగు గృహ శృంఖలములనుండి విడిపించుకొని నాసన్నిధికిం జనుదెంచి మీరు చేసిన యీసేవారూపమగు నుపకారమునకు మీసుశీలతయే ప్రత్యుపకారమగు. ఇదియే మీకు నుపదేశింపఁదగిన విషయము. అని యాపరాత్పరుఁడు పలుక నాపురాణపురుషుని దివ్యభవ్యవచనంబుల విని యాగోపికలు శ్రీహరిసంస్పర్శన మునఁ గలుగు నాశీర్వచనములఁ బొంది సంతాపంబులనుండి విముక్తలైరి.

భక్తాగ్రగణ్యులారా! భగవత్సాక్షాత్కార మాగోపి కలకుఁ గల్గినకథను బఠించితిరి కదా. ఇపు డేమనియెదరు? గోపి కలు వ్యభిచారవృత్తి నవలంబించినవా రనియే యిపుడుకూడ నందురా. మీజిహ్వలు తడఁబడకుండునా. హృదయ మిది చేయరానిపని యని హెచ్చరింప కుండునా. పాపకార్యమింత-

కన్న వేఱుగ లేదని మీకుమాత్రము తోఁపకుండునా. ఈకథ యందు ముఖ్యవిషయము గోపికలప్రశ్నము. శ్రీహరి యాప్ర శ్నమునకుఁ జెప్పినయుత్తరము. వ్యభిచారిణు లిట్లే ప్రశ్నింతురా. కాముకాగ్రగణ్యుఁడు ఇట్లే బదులుచెప్పునా. ఏగ్రంథ మునఁగాని యిట్టివిషయమును వింటిరా. దానిసారమును వినుఁడు.

కొందఱు తమ్ము సేవించువారి నాదరించి తరింపఁజేయు దురు. కొందఱు తమ్ము సేవింపకున్నను వారినిం బిలిచియైనను దరించుమార్గముం జూపుదురు. మఱికొందఱు సేవించువారిని సేవింపనివారినిం గూడ దగ్గఱం జేర్పరు. ఏల? మాకుం దెల్పుమా యని గదా ప్రశ్నించిరి. ఈప్రశ్నసార మింతకుముందే వ్రాసి తిని. మరలఁ జర్చింపనేల! పిష్టపేషణన్యాయమునకు లక్ష్యము గానేల! అని వదలి భగవంతుఁ డిచ్చినసమాధానసారమును వ్రాసెదను. ఈసమాధానమే లోకులకు దృష్టాంతభూతముగా నుండవలయునని భగవంతునిభావము. తత్సారమును గ్రహించుటయే మనపని.

కొంద ఱుపకారమునుబొంది ప్రత్యుపకారమును జేయు దురు. వారియందుఁ బ్రీతిగాని వేదోక్తధర్మముగాని కానరాదు. లోకమునఁ దండ్రి కొడుకువలన నుపకారమును గోరక తనకది ధర్మమని ప్రీతిచే నాతనిఁ జేరఁదీసి కృతకృత్యుం జేయును గదా. అట్లే ఒకరు తమ్ము సేవింపకున్నను గొందఱు వారిం బిలిచి

యుపకారము చేయుదురు. అనఁగా వారికిం దరణోపాయమును జెప్పుదురు. అట్టివారియం దించుకంతయు ధర్మలోపము గాన రాదు. సుహృద్భావము ప్రకాశిత మగు. మఱికొందఱు తమ్ము భజించువారి నాదరింపనివారును గలరు. అట్టివారు తమ్ముసేవిం పనివారి నాదరింతురా. ఆదరింపనేయాదరింపరు. వారెవ్వరనఁగా జ్ఞానప్రధానులై ఆత్మారాములగువారే. వారికిభోగేచ్ఛలేదు. పరిపూర్ణకాములు. కృతఘ్నులు. అతికఠినాత్ములు. అని నాలుగు తెఱంగులుగా వారుందురు. అని సమాధానము చెప్పెను. దీని భావ మేమి? ఈనాల్గు తెఱంగులు లోకమునఁనుండువారివి. ఇంకఁ జనవిషయ మేమనఁగా-అనఁగా నుత్తమజ్ఞానులధర్మ మేమనఁగా భక్తుఁడు తన్నాశ్రయించినపుడు ఆతని నాదరింప కుండవలెను. దాన నాతనిచిత్తవృత్తిని గనుఁగొన వచ్చును. తన్ను నాదరింపఁ డని కినుకఁ బూనునా? లేక యింకను సద్బుద్ధిపెరుగ హెచ్చుగా సేవించునా యనునది యీపరీక్షలో స్పష్టమగును. ఏభక్తుఁడు భగవంతునియం దాస్థఁబూని సమాహితుఁడై ప్రతిఫలమును గోరక పట్టువదలక సేవించునో ఆభక్తునకు వరుసఁగా సౌశీల్యా దులు వృద్ధినొందును. అవియే భగవంతునిపదమును జేర్పఁ గలవు ఇదియే భగవంతుఁడు చేయుపరీక్ష యని మనము గ్రహిం పవలయును.

ఈవిషయము భగవదవతారములలోఁ జూపింతము. నృసింహావతారమునఁ బ్రహ్లాదుఁడు భగవంతు నాశ్రయించెను. సకలకష్టముల నోర్చి శ్రీహరినే ఆశ్రయించెను. దాన నతని

గాపాడెను. దీనిచే భగవంతునకుఁ బ్రహ్లాదునిద్వారా శత్రువధ మనునుపకారము లభించెను. దానికిం బ్రత్యుపకృతిచేసెనని గ్రహించు టుత్తమము. శ్రీరామావతారమున జటాయువు కబంధుఁడు లోనగువారు శ్రీరామచంద్రుని సేవించినవారుకారు. వారిని అదరించి తానై ప్రేమించి కృతకృత్యులనుగాఁ జేసెను. అనఁగా వారికి నుత్తమలోకములఁ బ్రసాదించెను గాని ముక్తిని బ్రసాదింపలేదు. ముక్తియనఁగా నిట భగవద్దాస్యమని గ్రహింపవలయు. కృష్ణావతారమున గోపికలు నిరంతరము సేవించిరి. సదా మనస్సుల శ్రీహరినే భావించుచుండిరి. అట్టివారిని గాపాడక యదృశ్యుండయ్యె. వారు స్త్రీలు మహారణ్యమధ్యమున నుండిరి. అట్టివారిని వదలిపోయెను. వారు తదేకనిష్ఠతో వెదకఁ జొచ్చిరి. అనన్యగతికలై యట్లే యుండిరి. కాని గృహములను గాని భర్తలను గాని ప్రియబంధువులను గాని స్మరింపరైరి.

"అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే,
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్."

అన్నస్వప్రతిజ్ఞను నెఱవేర్పక మానునా యని నమ్మిరి. నట్టడవి యని రాత్రి యని యిందేమేని క్లేశమగ్లునని యిందేదేనిం గాని తలంపరైరి. భగవత్పాదారవిందములనే నమ్మిరి. ఆత్మపీఠమున వాని నిలిపిరి. నిశ్చలహృదయముల ధ్యానించిరి. ఇందుఁగుచాదిపదములున్నవే యని సంశయింపకుఁడు. మాంసాశనుఁ డగు పురుషుఁడు భక్తుఁడైన దానినే భగవంతునకర్పించి సేవించును; కాని వాఁడు హింసచేయఁడు. ధర్మవ్యాధుఁ డట్టివాఁడేకదా.

"యదన్నం పురుషోఽశ్నాతి తదన్నం తస్య దేవతాః."
అన్నసూక్తి యందతెలిపింగినదియే కదా! అట్టిభక్తిచే భగవంతుఁడు ప్రసన్నుఁడగు. ఒక్కఁడు వనచరుఁడు మంచిఫలముల నేర్చి రుచిచూచి మధురము లనితోఁచిన వాని నర్పించు. కాని వాఁడాఫలము లెంగిలిచేయఁబడినవని భావింపఁడు దాన భగవంతుఁడానంద మొందు. శబరిలోనగువా రట్టివారే కదా. వేఱొకఁడు భగవంతుని స్వర్ణపీఠమున నాసీనుంజేసి పూజించి నవరత్నహారముల నొసంగు. దాన శ్రీహరి తుష్టినొందు. అంబరీషాదు లట్టివారే కదా. ఇంక నొకఁడు తనకుంగల యత్యల్ప పదార్థమును భగవంతునకు సమర్పించు. దాన నాపరాత్పరుఁడు పరితుష్టమానసుం డగు. కుచేలాదు లట్టివారే కదా. మఱియు నొకఁడు హృదయారవిందమున శ్రీపరమేశ్వరు నాసీనుంగాఁజేసి ధ్యానించి మనఃకల్పితద్రవ్యముల నొసంగి "ధన్యోఽస్మి" యనుకొను. దాన నాపరమపురుషుఁడు మహానందము నొందు. శుకయోగిప్రభృతు లట్టివారే కదా! వేఱొక్కండు పరిమళపరిశుద్ధస్థలవిరాజితకుసుమములం దెచ్చిహారాకృతినమర్చి భగవత్పాదారవిందముల నర్పించి తనివి చెందు. దాన శ్రీనాథుఁడు ప్రముదితమానసుం డగు. సుదాముఁడు లోనగువా రట్టివారే కదా. ఇట్లు లాయాభక్తుఁ డాయాపద్ధతుల భగవంతు నారాధించు. ఆపూజలనన్నింటిచేతను సమానప్రీతిగలవాఁ డగును. కాని యాభక్తుల భక్తి దృఢతమముగా నుండవలయు. సేవా

భేదముల నన్నింటిని భగవంతుఁ డొక్కరీతిగనే భావించి పర మాత్మ సమానఫలము నిచ్చును.

శ్లో. పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి,
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. ౨౬
యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్,
య త్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭
శ్రీభగవద్గీత. ౯ అధ్యా.

ఈభగవద్వచనములు పైయర్థమును స్పష్టపఱచుచున్నవి కదా. కావున గోపికలు తమకుఁగల మంచివస్తువు ననఁగా వస్త్రాంచలమును శ్రీహరికిం బీఠముగా నమర్చిరి. లజ్జ వదలి శ్రీ హరీ! నీపాదారవిందమును మావక్షోరుహములయం దునుపు మా. దాన మాహృదయజాడ్యము తొలఁగు నని ప్రార్థించిరి. నీకరాంబుజమును మాశిరముల నునుపుమా. దాన ముక్తి గలు గునని వేఁడిరి. అంతియ గాని మాతో భోగింపు మని యొక్క మాట నైనను బలికిరా. మోహనాకారా! ఇత్యాదిపదములఁ బిలిచిరా. వేదాంతార్థబోధకము లగునామములనే వారుచ్చరిం చిరి. ఇట్టితావుల విపరీతార్థముల వచింపకుండుట చాల మేలు. భగవంతునకుఁ బక్షపాతము లేదు. యోగులను సామాన్య మానవులను హృదయము నిర్మలమైనచో సమముగ భావించును.

మాం హి పార్థ! వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః,
స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేఽపి యాంతి పరాం
గతిమ్. ౩౨. శ్రీభగవద్గీత. ౯ అధ్యా.

అను భగవద్వాక్యమే మనకు శ్రీపరాత్పరుని మహిమమును వేయిభంగులఁ దెలుపుచున్నయది. కాఁబట్టి భగవంతుని సేవించు టలోఁ బరికరములు ప్రధానములు కావు. భక్తియే ప్రధా నము. దానివంటి సాధనము భగవత్పదప్రాప్తికి సులభ మగు నది వేఱొకటి కానరాదు. కావున భగవంతునియందు లేని పోని దోషముల నారోపింపక సేవించి కృతకృత్యుల మగు టకుఁ బ్రయత్నింతము. ఇంతట నీవిషయమును మాని తత్ప్రాతి భగవల్లీలను వ్రాయ మొదలిడెదను.

## రాసక్రీడావృత్తాంతము.

శ్లో. ఆతామ్రాయతలోచనాంశులహరీ లీలాసుధాప్యాయితైః
గీతామ్రేడితదివ్యకేళిభరితైస్స్వీకృతం వ్రజస్త్రీజనైః,
స్వేదాంభఃకణభూషితేన కిమపి స్మేరేణ వక్త్రేందునా
పాదాంభోజమృదుప్రచారసుభగంపశ్యామిదృశ్యంమహః.
3 ఆ. ౨౯ శ్లో.

శ్లో. అంగనామంగనామంతరే మాధవో
మాధవం మాధవం చాంతరేణాంగనాః,
ఇత్థమాకల్పితే మండలే మధ్యగ
స్సంజగౌ వేణునా దేవకీనందనః. ౨ ఆ. 3౫ శ్లో.

సరసమనీషులారా! భక్తిరసపరిపూర్ణహృదయులారా! గోపికావస్త్రాపహరణమను చరిత్రమునందు శ్రీకృష్ణమూర్తి రాధాంబికకుఁ బ్రత్యక్షమై మూఁడునెలలకుఁబిదప వసంతర్తువు నందు బృందావనమందు నన్నుంగూడి రాసక్రీడ ననుభవిం

తువు గాక. గోపిక లెల్లఁ దత్సుఖము ననుభవింతురు గాక. అని యాజ్ఞయిడి యంతర్హితుఁ డయ్యెనని చదివితిరి కదా. ఆ[illegible]ప వేణునాదము, గోపికాగీతలు భగవంతుఁడు వారికిఁ బ్రత్యక్ష మగుటయుఁ జదివితిరి. ఇఁక రాసక్రీడావృత్తాంతము నాలకింపుఁడు.

రాసమనఁగా గోలోకపాలకుఁ డగుభగవంతుని క్రీడా స్థానభేదము. అది యుపాసనయం దొక యర్చనస్థానము. ఆయంత్రమున శ్రీగోలోకనాయకుని శ్రీకృష్ణపరమాత్మను దత్పరివారదేవతలను ధ్యానించి పూజింపఁదగు. ఆపూజ కార్తికమాసపూర్ణిమాతిథియందుఁ జేయందగు. ఇతరకాలములయందును జేయఁదగదని చెప్పరాదు గాని యది ముఖ్యకాలము. శ్రీగోలోకనాయకుని పూజాయంత్రముల యందిద్దియే ప్రధానమని చెప్పఁదగియున్నది. ఈపూజావిధానము సామాన్యము గాదు. కేవలభక్తి దీనికిం బ్రధానము. శ్రీరాధామాధవు లిందధిష్ఠాతృదేవతలు. గోపికలు గోపకులు పరివారదేవతలు. ఈయంత్రవాసునిగా శ్రీమాధవు నర్చించుట శ్రీకృష్ణున కెంతో ప్రియము. దానిఫల మనంతము. ఈయంత్రస్థానమునకు రాసమండల మని పేరు. ఇందలిదేవి యగురాధకు రసికేశ్వరి యని, రాసేశ్వరి యని పేరు గలదు. ఇందు రాధామాధవుల కభేదము కనఁబడును. సకలవాంఛితములను శ్రీకృష్ణుఁడు రాధద్వారా ప్రసాదించును. కావుననే శ్రీవైష్ణవులు సకలవాంఛితములను భక్తులకు భగవంతుఁడు శ్రీద్వారా ప్రసాదించునని సిద్ధాంతము

చేసిరి. శాక్తమనఁగా నిదియే. శివశక్తియన శ్రీరాధాదే వియే. శివశక్తియనఁగా మంగళప్రదాత్రి యని సారమే గాని శివునిభార్య యని యర్థము గాదు. రాధాదేవియే మూలప్ర కృతి. శ్రీకృష్ణుఁడే విరాట్టు. వీరిశక్తియే ప్రపంచము. వీ రిరు వురకు భేదము చెప్పరాదు. సమానభక్తితోఁ బూజింపవల యును. భగవంతుని సంకల్పశక్తియే రాధ. భగవదాజ్ఞం గొని సకలలోకముల నిర్మింపఁజాలిన దీమెయే. ఇట్టిపరదేవీపరమా త్ముల పూజకంటె నధికతపస్సింకేమున్నది? అనన్యభక్తిఁ బూజించి ధ్యానించిన మోక్షసామ్రాజ్య మతనికిం గరతలా మలకము.

శ్రీకృష్ణుఁడు భూమి నవతరించుటకు ముందే రాధాదే వియు గోపికలు బృందావనము రాసమండలము ముందె భూలో కమును జేరినవి. అనఁగా నందాదులు బృందావన మని పేరిడిరి. ఒక్కచోటికి రాసమండలమను పేరుంచిరి. ఇవన్నియు వారికిం దెలియకయే కారణాంతరములచే సాగెను. గోలోకమున సాగు శ్రీకృష్ణరాసవిహారమే యిచ్చట జరగును. దానినే మీరు చక్కఁగా వినవలయును. ఇదేదో ఒకవిహారమని తలం పకుఁడు. భగవన్మహిమము దీనఁ దెలియనగు నని తలంచి పఠిం పుఁడు. ఇది దానివివరణము. ఇంకఁ గథ వినుఁడు.

* నారాయణుఁడు తెల్పిన గోపికావస్త్రహరణకథ నాల

---

* ఈకథ శ్రీకృష్ణజన్మఖండము 27వ అధ్యాయమునుండియు, శ్రీభా గవతము దశమస్కంధము 33 వ యధ్యాయమునుండియు, విష్ణుపురాణము

కించి నారదుఁ డిట్లు ప్రశ్నించెను. మహాత్మా! నారాయణా! మూఁడునెలలు గడచిన పిదప శ్రీహరి రాధాదికాంతల నెట్లు రాసక్రీడం దేల్చెను. బృందావన మెట్టిమహత్త్వము గలది? రాసమండలవిధాన మెట్టిది? శ్రీహరి యొక్కఁడు. వారు పెక్కుమంది కదా. ఇట్టితావున నెవ్వరితో వీరెల్ల నెట్లు క్రీడించిరి? దీనిని వినవినఁ గుతూహల మగుచున్నయది పుణ్యశ్రవణకీర్తనా! శ్రీమన్నారాయణా! ఇది యిట్టిదని వివరించి తెల్పుము. ఈకథ శ్రీహరి రాసయాత్రను దెలుపునది కదా. ఇదియే కదా పురాణసారము. శ్రీహరికథలన్నియు శ్రుతిమనోహరములు. కావున వాని వినఁగోరుచుందును. అట్టినా కీగాథను వచించి కృతార్థుం జేయుమా యని వేఁడెను. నారదముని యాతురతం గాంచి తత్కుతూహలము నెఱింగి శ్రీమన్నారాయణమూర్తి పక్కున నవ్వి కరుణారసము మోమునుండి స్రవింప వచియింపఁ బూనెను.

నారదమునీ! రాసక్రీడను వర్ణించెద అవధరింపుము. ఆనాఁడు గోపికల నిష్టోపదేశసల్లాపములఁ దేల్చి భగవంతుఁ డిట్లుచేసెను. మఱుదినము యథాపూర్వకముగాఁ గాలము గడచుచునే యుండెను.'ఒక్కరైన నిదియేమి యన్యాయము? రాత్రి మీ రెక్కడికేఁ బోయితిరి? అని యడిగినపాపమునఁ బోలేదు.

---

పంచమాంశము ౧౩వ అధ్యాయము నుండియుం, బ్రహ్మపురాణము౮౧వ అధ్యాయమునుండియుం గ్రహింపఁబడి యిందలి విశేషములఁ గలుపుచు శ్రీకృష్ణఖండ భాగవతములు ప్రధానములుగా వ్రాయఁబడునని యెఱుంగవలయును.

రాత్రివృత్తాంతము వారికి స్మృతిగోచర మైనకదా వారు ప్రశ్నింతురు. భగవన్మాయ వారినాచ్ఛాదింప వారేమి చేయుదురు? సంతోషమున సంసారయాత్రసాగించుచు నందలు యథాపూర్వముగా నుండిరి. గోపికలు గూడ నీవార్తను స్మరింపఁజాలకుండిరి. మూఁడునెలలు గడచెను. క్షణకాలముగనే యవి గడచిపోయెను. భగవంతుని కనుసంజ్ఞయంతటిలో బ్రహ్మలు పెక్కుమంది పోవుదురన నీఁక నీనెలలమాట యిటఁ జెప్ప నేఁటికి?

## బృందావనవర్ణనము.

ఒక్కనాఁడు శ్రీగోపాలబాలుఁడు రాత్రివేళ బృందావనమున కేగెను. ఇపుడుండు గోకులము బృందావనమందే. కాని యిదియొక నగర మయ్యెను. దీని కవ్వలనున్న దియే బృందావనమునఁ బరఁగెను. ఆదినము శుక్లపక్ష త్రయోదశి. చంద్రోదయ కాలముననే శుభముహూర్తమున నచ్చటికిం బోయెను. ఆవనమున యూథికామల్లికామాలతీకుందమాధవీలతలు పుష్పింపనాపూలనుండి పరిమళమును సంగ్రహించి వాయుకిశోరములు వీచుచుండెను. ఆసురుచిరకుసుమమరందమును గడుపారఁ గ్రోలి భృంగములు ఝుంకారరవములఁ దమయానందమును వనలక్ష్మికిం దెలుపుచుండెను. మనోహరముగఁ గలనాదములు వినవచ్చుచుండెను. క్రొత్తచిగురుల మెక్కి మెక్కి పుంస్కోకిలములు మనస్సును సంతోషమున నోలలాడించునట్లు నాదములు చేయుచుండెను. నవలతాలాసవాససంయుక్తమై యావనము మనోజ్ఞ

ముగఁ జూపట్టుచుండెను. అందు నొకచోటు చందనాగురుక స్తూరీకుంకుమములఁ బరిమళించుచుండెను. కర్పూరమిళితతాం బూలము, ఇతరసుఖోచితద్రవ్యము లమర్పఁబడి యుండెను. కస్తూరియుఁ జందనము కలియఁజమరిన చంపకప్రసూనములం దగపడుచుండెను. రతియోగ్యములగు నానావిధభంగీవిరచిత తల్పము లందమర్పఁబడియె. అది మిగుల సొంపుగా నుండెను. రత్నదీపములందు వెలుంగుచుండెను. కృష్ణాగురుధూపములసువా సన లందు గుమగుమ లాడుచుండెను. పరిమళబహుళకుసుమ మాలాజాలము లందలరారుచుండెను. సర్వత్ర వర్తులాకారము గనుండెను. అదియే రాసమండలము నాఁబడు.

### రాసమండలము.

ఆరాసమండల మనుపమానశోభావిభాసిత మైయుండెను. కస్తూరీకుంకుమచందనాదులచే నది యలంకరింపఁబడి యుండెను. దానిం జుట్టి పుష్పోద్యానము లుండెను. ఆపుష్పములవాసనలు గుబులుకొనుచుండెను. క్రీడాసరోవరములు దానిచుట్టు నేత్ర పర్వ మొనరించుచుండెను. ఆకొలఁకులయందు హంసకారండవ ములు జలకుక్కుటాదివిహంగంబులు నిండియుండెను. అవి మత్తిల్లి ప్రమదలంగూడి విహారములు సల్పుచుం గూయు చుండ వినువారలకు శ్రవణములకు హాయి కూర్చుచుండెను. వానివిహారములు కనుఁగొనినంతనే సంసారసుఖ మిట్టులుండిననే కాని సార్థకము కాదని స్ఫురించుచుండెను. తమచేడియ నుప లాలించుట రతిసుఖము ననుభవించుట స్మరునియాజ్ఞ యిట్టిదని

తెలియవచ్చుచుండెను. పరిశుద్ధవినిర్మలస్ఫటికములవంటి జలము తత్సరస్సులనిండి యుబుకుచుండెను. మఱియు నారాసమండల మునుజుట్టి రంభాస్తంభసహస్రము లొప్పారుచుండెను. మామిడిచిగుళ్లతోరణములు దానిచుట్టును గట్టఁబడియుండెను. సిందూరము చందనము నింపియున్నఘటములు కనఁబడుచుండెను. మాలతీకుసుమహారములు నారికేళఫలములు వ్రేలాడుచుండెను. అట్టిరాసమండలమును గాంచి శ్రీపరాత్పరుఁడు పక్కున నవ్వెను.

పాఠకులారా! రాసమండలవర్ణనమును జదివితిరి కదా. దీనివిధమును గాంచిన నిది యెవరిచే నిట్టులలంకరింపఁబడియుండునని చింతింపుఁడు. నందాదు లిట్టులలంకరించి రన వీలులేదు. ఇతరగోపాలకుల కీవిషయమే తెలియదు. ఇఁక నెవ్వ రలంకరించిరి? కేవలవర్ణన మిట్టు లుండదు. పూలహారములు వైచుట మామిడిచిగుళ్లతోరణము లుండుట పూర్ణకుంభము లందుండుట యనునివి వర్ణనాంశములు కావు. ఇది రాసమండలము కదా. ఇది యొక చక్రము. చక్రమనఁగా భీతిచెందవలదు. ఇష్టదేవతను సమారాధింప ననువుపఱచుకొన్నచోటు యంత్రమనఁబడును. అం దిష్టదేవత యుపవసించుస్థలమునకు బిందువని పేరు. అదియే మధ్యస్థానమగు. ఆదేవతచుట్టును దత్పరివారదేవత లుందురు. ఈరాసమండలము గోపాలచక్రము. ఇందు శ్రీరాధాంబికంగూడి మాధవుఁడు బిందుస్థానమున (యంత్రమధ్యమభాగమున) వసించును. ఆవలఁ జక్రదళములయందు

గోపిక లుందురు. ప్రతిదళము పూజార్హమే. అదెట్లు? సర్వా మధిదేవతామయముగ నుండవలయును. బిందుస్థానమున రాధం గూడి మాధవుఁడున్నట్లే ప్రతిదళమందును మాధవునిం గూడిన పరివారదేవత యుండును. దానిం బూజింపవలయు. ఇదియే పూజాపద్ధతి. ఆపూజాపద్ధతియే యిట రాసక్రీడయని చెప్పఁబడియె నని తలంపుఁడు. జలపూర్ణకుంభములు, చందనాది పరిమళద్రవ్యములు, సకలర్తుపుష్పమాలికలు, ధూపద్రవ్యములు సకలపవిత్రఫలములు నందుండునట్లు చెప్పఁబడినది కదా. రతికొఱ కేర్పఱచినచోట నిట్లు వస్తువుల నునుచుట మఱేగ్రంథముననైనం జదివితిరా. వింటిరా. కంటిరా? ఇందఱు స్త్రీలు నొక్కపురుషుఁడు రతిసుఖమున నోలలాడుట విచిత్రముగ నుండదా. చిత్రము కాదేని ఆపురుషుఁడు సర్వవ్యాపియగు భగవంతుఁడు కావలయు. కథయే కల్పితమనువాదమున నిది సమాధానము కాఁజాలదు. దానికి మీకీవిషయము తెలియదనున దియే సమాధానము. ఆస్తికులగు తముబోంట్లకే యీసమాధానము. కావున నిందఱుస్త్రీల కన్ని రూపులు గాందోఁచు పురుషుఁడు పరమపురుషుఁడే. అల్లపరమపురుషుఁడే యీకృష్ణమూర్తి. ఆ భగవంతుఁడే యిట నారాధ్యుఁడు. గోపికలు తత్పరివారదేవతలు. రాధాంబిక భగవచ్ఛక్తి. రాధామాధవుల కవినాభావ సంబంధము గలదు. ఇట్టిదేవతారాధనమే రాసక్రీడ. రాసకేళి. రాసోత్సవ మనఁబడును. గోపికల నుద్ధరింప శ్రీకృష్ణుఁడే యిచ్ఛామాత్రమున దీనిం గల్పించెను. ఈయలంకారములు భగవత్సం

కల్పకల్పితములు. ఇది భగవద్గోష్ఠి యనంబడు. అంతియ కాని వ్యభిచారస్థానము కాదు. ఇట శ్రీకృష్ణుఁడు తనసర్వవ్యాపిత్వము గోపికలకుఁ దెలుపును. కాన నిది విశ్వరూపసందర్శనము వంటిది. భక్తులీకథలు జపకాలమునఁ దలంచుచు శ్రీకృష్ణతారకమంత్రరాజమును జపింపవలయు. ఇదియే వైష్ణవశాస్త్రము. ఇందుఁ బరికరములేవియు నక్కఱలేదు. శ్రద్ధాభక్తులే. ద్రవ్యముతోఁ బనిలేదు. మనస్సు సమాహితముగ నుండుటయే యిట నమూల్యద్రవ్యము.

పరమపురుషుని ధ్యానించు నపుడీగోపిక లేల యని ప్రశ్నింతురు కాఁబోలు. కొంచెమోపిక మెయి నాలకింపుఁడు. తొలుదొలుత నేయీర్ష్యాపరవశులరు కావలదు. అదిమీయభివృద్ధికే భంగము. శాస్త్రమునమకారపంచకము గలదని మీరును విని యుందురనుకొనియెదను. మంత్రము, మననము, మద్యము, మాంసము మైథునము అను నివియే మకారపంచకశబ్దమునఁ దెలుపఁబడునవి. ఇవి వినఁగనే వెగటుగఁ దోఁచును. వీనియంతరార్థము వేఱు. వెలుపల సురుచిరముగఁ దోఁచు వస్తువు తత్త్వమాలోచింప సకలకల్మషపదార్థభూయిష్ఠముగ నుండు. దానికి మన దేహమే యుదాహరణము. కనులకింపుగా లేనిపదార్థతత్త్వముఁ బరిశీలింప నిర్మలముగాఁ దోఁచును. హృదయ మిందులకు దృష్టాంతము. ఇట్లే అన్నియు నూహింపుఁడు. ప్రకృతమకారపంచకరహస్యార్థము నాలకింపుఁడు మంత్రమనఁగా స్మరించినవారిని గాపాడునది. ఇదియే భగవద్రూపము. మనన మనఁగా నట్టి

యుపాస్యదేవతారూపమును మదినిల్పుట యని యెఱుంగఁ జను. మద్యమనఁగా భగవత్పాదోదకమని యూహింపుఁడు. దానిని బానముచేయవలయు. అదియే గంగానది యనంజను. ఆనది మనదేహమందే యుండును. కాశికిఁ బోవనక్కఱలేదు. ఇడాపింగళాసుషుమ్నాఖ్యనాడీసంయోగమే త్రివేణి యనం బడు. ఇందు స్నానముచేయువాఁడే సకలపాతకనిర్ముక్తుఁ డగు. కావున మానసికపూజయందు భగవత్పాదోదకమునుఁ బుచ్చుకొనవలయు. ఇదియే యమృత మనంబడు.

"సుధాధారాసారైశ్చరణయుగళాంతర్విగళితైః
ప్రపంచం సించంతీ పునరపి రసామ్నాయమహసః,
అవాప్య స్వాం భూమిం భుజగనిభ మధ్యుష్టవలయం
స్వ మాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహారిణి."

అని మానసికపూజయందు శ్రీమచ్ఛంకరభగవత్పాదాచార్యులవా రుపదేశించిరి. "శిరస్థితచంద్రమండలం సర్వయోగశాస్త్రసిద్ధమ్" అని వ్యాఖ్య. అట్టి యుపాస్యదేవతాపాదోదకమున స్నానము చేయవలయు. అదియే పవిత్రస్నానము. స్మృత్యాచనమనఁగా నిదియే. స్మరించిన స్నానమనఁగా భావించుట యని కదా తాత్పర్యము. ఈగంగానదియందు స్నానముచేసినట్లు మానసికపూజాకాలమున నిశ్చలభక్తి ధ్యానించుటయని దీని సారము. కాఁబట్టియే,

"మలనిర్మోచనం పుంసాం జలస్నానం దినే దినే,
సకృద్గీతాంభసిస్నానం సంసారమలమోచనమ్."

అని సూక్తిరాజము కనుపట్టెడిని. గీతాంభస్సుల స్నానము చేయుట యనఁగాఁ బైయర్థమే యని యెఱుంగవలయు. అట్టిమద్యము మానసికపూజయందుఁ బ్రధానము. మాంస మనఁగా హృదయగ్రంథిని భగవత్సమర్పణము చేయవలయు నని సారము. జంతువును జంపి మాంసమును వండి నమల వలయు నని కాదు. అది నశించుమార్గము. ఇది కడతేఱు మార్గము. కొందఱు స్వదేహము నర్పింపవలయు నందురు. అంత కన్న హృదయసమర్పణమన్నది సముచితము. మైథునమనఁగాఁ బ్రకృతిపురుషుల సంయోగ మెఱుంగుట యని భావము. జగ త్తిట్టిదని తెలిసికొనుట యని దానిసారము. ఇజ్జగత్తు శాశ్వ తము కాదని భావించుటయే యుపాసనాఫలము. అంతియ కాని మంత్రము నేర్చుకొని జపముచేయుచు సురాపానము చేసి మాంసమును దిని మైథునము చేయవలయునని కాదు. ఈయర్థ మే యుపాసనయందైన నుండునా. దానిరహస్యార్థ మిది.

ఇఁకఁ బ్రకృతము ననుసరించెదను. రాసమండలమునఁ గ్రీడించు శ్రీకృష్ణపరమాత్మను ధ్యానింప ఫలమేమి యని ప్రశ్నింతురు కాఁబోలు. ఈయుపాసనయందు జితేంద్రియత్వ మలవడును. అంతకంటె ఫల మేమి కావలయును? ఎట్లనఁగా వినుఁడు. మనోహరాకృతిం జెలఁగు గోపికలం గూడి యొక్కొక్కదళ మున నొక్కొక్కరూపమున నుండు సర్వవ్యాపకుని ధ్యానిం చినపుడు విషయసుఖములు స్మృతిగోచరములు కాకుండ నుపా

సించుటకన్న నెక్కుడుఫల మేమి కావలయును? అట్టులౌట నీరా సమండలవిహారము జితేంద్రియత్వము నాపాదించుచు శ్రీకృష్ణ పరతత్వమును వెల్లడించుచుండును. ఇదియ యిందలి సారము. ఈఘట్టమున నింతకంటె నెక్కువ వ్రాయఁబూనక ముందటి కథను సాగించెదను.

శ్రీబాలగోపాలుఁ డట్టిరాసమండలమును గాంచి నవ్వి మహాసంతోషమున మురళిని మ్రోయించెను. అది యత్యంత కామమున మత్తిల్లిన యాగోపికల వాంఛావృద్ధిహేతు వయ్యెను. వారుకోరునది యామురళీగానమే. ఆనాదమే ముముక్షువులకు నుపనిషన్నాదము. ఆమనోహరపరమపావనమురళీనాదము నాలకించినంతనే రాధాదేవి మదనాతుర యయ్యెను. దాన మూర్ఛాపరవశురా లయ్యెను. *అంతియ గాక పాషాణమువలె దేహము నిశ్చల మయ్యెను. కాని యామెచిత్తము ధ్యానమున ననన్యవిషయ మయ్యెను. అనఁగా నిశ్చల మయ్యెను. అట్టియారాధ "మదనాతురా" యనఁగా విశేషాసక్తి గల దయ్యెనని భావము. మదనాతురయే యైనచో ధ్యానైకతానమానస యగుటెట్లు? అంత నొకక్షణకాలముననే చేతననొంది మరల నావేణునాదము నాలకించెను. ఆరాధాంబిక యాధ్వని నాలకించుచు సముద్విగ్నయై యట్లే నిలువం బడెను. తానపుడుచేయుచున్న కార్యమును బూర్తి

---

*బభూవ స్థాణువద్దేహా ధ్యానైకతానమానసా-అని మూ. శ్రీకృష్ణ జన్మఖండము.

చేయకయే జవమున గృహమునుండి వెడలెను. నాలుగుదెసలు పరికించుచు నాధ్వని వినఁబడినచోటునకుఁ బోయెను. ఆమె నడుచునపుడు శ్రీకృష్ణమృదులతమపాదారవిందద్వంద్వమును ధ్యానించుచు దేహకాంతిచే నాప్రదేశమును బ్రకాశింపఁ జేయుచు సురుచిరమణిగణభూషణాలంకృతయై పోయెను. గోపికలెల్ల నానిరుపమాననినాదసమాకృష్టచిత్తలై మనస్సులు దిటవు వదల కులధర్మమును వదలి శంకల మాని కామమోహితలై గృహముల వెడలిరి.

అందు ముప్పదిముగ్వురు సుశీలాదులు రాధాప్రియతములు గోపికాప్రవరలు బయలువెడలిరి. వారెల్ల రాధాదేవికిఁ బ్రియవయస్యలు. వారివెనుక గోపిక లసంఖ్యలుగాఁ బయనము సాగించిరి. వారిని లెక్కింప నవకాశము లేకుండెను. ఆగోపికలెల్ల వేషమున వయస్సున గుణగణమున నొకరిని వేఱొకరు మించక యొక్కరీతి నుండిరి. సుశీల యనుగోపికాతిలకముం గూడి పదాఱువేలగోపికలు పోయిరి. చంద్రముఖి యనుగోపిక వెంట/నంతమందియే పయనముచేసిరి. మాధవియను గోపకుమారివెనుక పదునొకండువేల గోపకుమారిక లరిగిరి. కదంబమాలచెలికత్తియలు పదుమూఁడువేల మంది కడువడిం జనిరి. కుంతి యనుగోపికచేడియలు పదివేలమంది యరిగిరి. యమునయను నారీమణి ప్రియసఖీజనము పదునాల్గువేలసంఖ్యచేఁ ద్వరితగతిం బ్రయాణముచేసిరి. జాహ్నవియను నుత్తమాంగన నెచ్చెలులు తొమ్మిదివేలమంది యామెను వెనుకొనిరి.

పద్మముఖియను రాధాప్రియవయస్యవెంట నవసహస్రసంఖ్యల గోపికలు నడిచిరి. సావిత్రియను గోపికామణిం గదిసి గోపుల మునుండి పదునైదువేలమంది వెడలిరి. పారిజాత యను గోపకుమారి వెనువెంటఁ బదివేల గోపికలు పయనము సాగించిరి. స్వయంప్రభ యనురాధాదేవిసఖి నాశ్రయించి యేడువేలమంది గోపికలు చనిరి. సాధుముఖివెంబడి పదునాల్గువేలమంది గోపాంగనలు వెడలిరి. శుభాంగనామణి ననుసరించి చతుర్దశసహస్ర గోపిక లరిగిరి. పద్మను గాంచి తదాశ్రయణమునన్నున్న పదునాల్గువేలగోపకుమారికలు పోయిరి. గౌరి ననుసంధించి యంత మంది చనిరి. సర్వమంగళానుసరణమునఁ బదాఱువేలమందియు, కాళికనాధారముగాఁగొని షోడశసహస్రసంఖ్యలును, కమల ననుసరించి పదుమూఁడువేల సంఖ్యలును, దుర్గవెంటనంటి షోడశసహస్రములును, సరస్వతివెంబడి పదుమూఁడువేలును, భారతివెనుకఁ బదివేలమందియు, నపర్ణను వెనుకొని పదునాల్గు వేలమందియు, రతివెంటఁ బదివేలమందియు, గంగ నాశ్రయించి పదునాల్గువేలమందియు, నంబికను మంచిమాటలాడి పదాఱు వేలమందియు, సతిననుమతి వడసి పదుమూఁడువేలును, నందిని గొనియాడుచుఁ బదివేలును, సుందరిసహవాసమునఁ బదుమూఁడువేలును, కృష్ణప్రియసమ్మతినంది షోడశసహస్రములును, మధుమతియంగీకరింపఁ బదాఱువేలమందియు, చంపయనుగోపిక ననుమతినిబొంది పదుమూఁడువేలును, చందన నాశ్రయించి పదాఱు వేలును గోపిక లాతురంబున రాసమండలంబునకుం బోయిరి.

వీ రెల్ల నందొకచోటఁ జేరిరి. కొందఱు ఫలములం గైకొనియు, మఱికొందఱు పుష్పహారముల గ్రహించియు, ఇంకనుంగొందఱు పరిమళచందనహస్త లగుచును, కొందఱు శ్వేతచామరములం బట్టియు నచ్చటి కేగిరి.

తరువాతఁ గొందఱు గోపకన్యలు కస్తూరి హస్తముల ధరించియు, కొందఱు కుంకుమముఁ గైకొనియు, కొందఱు తాంబూలపాత్రములం బట్టుకొనియు, కొందఱు కాంచనవస్త్రములం బూనియుఁ, జంద్రావలి యున్నయెడ కరిగిరి. ఇట్లు పోయిన వారెల్ల నందొకచోటఁ బరమప్రమదమునఁ జిఱునవ్వులు మోములఁ గనుపట్ట రాధికావేషమును దాల్చి యందుండి బయలువెడలిరి. * మార్గమున వారెల్ల హరిశబ్దమును మరల మరల జపించుచు బృందావనమున కరిగి యందుఁ గనంబడు రాసమండలమును జూచిరి. ఆమండలము స్వర్గంబులెన్నింటికన్నను సుందరముగా నుండెను. రాకానిశాకరకరవ్యాప్తమై చెన్ను మీఱుచుండెను. ఇతరమనుజు లచ్చట లేకుండిరి. కుసుమమయముగా నుండెను. పుష్పపరిమళసమ్మిళితవాయు వందుఁ దిరుగుచుండెను. స్త్రీల కందఱి కదికామమును బుట్టించునట్టిది. మునులకుంగూడ మోహనకారణము.

ఆచోటు వారెల్లం జేరి పుంస్కోకిలకలధ్వని నాలకించిరి. ఆనాద మతిసూక్ష్మము. అవ్యక్తమధురము. మిగులఁ జంచలచిత్తులకుం గూడ మహానందజనకము. ప్రసూనమధుమత్తభ్రమరీ

* చక్రుః పునఃపునస్తాశ్చ హరిశబ్దజపం పథి-అని మూలము.

సంగసంగులకుం గూడ మనోహరము. ఆరాసమండలమును శుభముహూర్తమున రాధిక ప్రవేశించెను. ఆమె చెలికత్తె లందఱు హర్షమున నోలలాడుచు నందుఁ బ్రవేశించిరి. రాధి కయుఁ బ్రవేశించుతఱి శ్రీకృష్ణపాదారవిందముల సమాహి తయై ధ్యానించుచుండెను. రాధను దూరమునుండియే కాంచి శ్రీహరి పరమానందభరితుఁ డయ్యెను. అంతతో నుండక యెదు రేగెను. చిఱునవ్వు కనఁబడునట్లు స్వాగత మొసంగెను. ఆరాధ యత్తఱి వయస్యల నడుమ నుండెను. రత్నాలంకారము లామె తనుసంగతిఁ బ్రకాశించుచుండెను. దివ్యవస్త్ర మామె ధరించి యుండెను. స్మితవక్త్రయై వక్రలోచనములఁ జెలువారుచు, గజ రాజగమనయై రమ్యాకృతిం దగి మునిమానసములను గూడ మోహపరవశములుగఁ జేయంజాలునట్టి లావణ్య మొప్పుచుండ నవీనవేషవయస్సులచేఁ గానంబడుచు సాటి యనునదియే లేక తలశ్రోణినితంబ భారము గలిగి పగదేవతాస్వరూపిణియై చారు చంపకవర్ణాభయై శారదచంద్రప్రతిమాననముఖియై కబరీభార మును వహించుచు మాలతీమాలిక కబరియందు వింతగనొప్పు చుండ దివ్యరూపమున నలరారుచుండెను. అట్టి రాధాంబికం జూచి శ్రీహరి పరమానంద సాంద్రస్వాంతుఁ డయ్యెను.

రాధాంబికయు బాలరూపము కనంబడ నున్న శ్యామ సుందరుం గనియెను. ఆదివ్యాకారము నవయౌవనసంపన్నమై, రత్నాభరణభూషితమై, కందర్పకోటి లావణ్య లీలాధామమై, మనోజ్ఞతరమై చూడ రెండుకన్నులు చాలక యుండెను.

ప్రాణాధికురాలగు రాధాదేవిని జూచుశ్యామసుందరుని, వక్ర చక్షుస్సులచేఁ బ్రాణేశ్వరుం జూచురాధికను గనుఁగొనువారికి వారియద్భుతరూపమహిమము లిట్టివని వర్ణింపనలవిగాకుండెను. శ్రీహరియు రాధను జూడఁగనే వక్రనయనముల నామె పరమాత్మ్యంజూచి చూచి కటాక్షవీక్షణములు సార్థకములు కాఁగా లజ్జచే ముఖమును జేలాంచలమున నాచ్ఛాదించుకొనియెను. భగవద్వీక్షణ కామబాణములచేఁ బ్రపీడితయై యాతన్వంగి మూర్ఛనొందెను. సర్వాంగములఁ బులకాంకురములు చూపట్టెను. మనస్సు పరవశ మయ్యెను. శ్రీకృష్ణమూర్తియు రాధాకటాక్షమదనాశుగవితానవిద్ధాంగుఁడై క్రీడారసోన్ముఖుఁ డయ్యెను. మూర్ఛాయత్తుఁ డయ్యెఁగాని భూమింబడక స్థాణుసముఁడై నిలువంబడి యుండెను. మురళియుఁ గ్రీడారవిందము నీ రెండును మాత్రము ధరఁ బడియెను. పీతాంబరము శిఖిపింఛము ననునివి రెండును శరీరమునుండి జాఱెను. క్షణమాత్రమునఁ జేతనంబొంది పరమానందమున శ్రీహరి రాధికాసన్నిధికి మెల్లగాఁ బోయెను. ఆమెను జేరఁదీసికొని యురమును జేర్చి ముద్దాడెను. శ్రీకృష్ణస్పర్శమాత్రమున నాసాధ్వియుఁ జేతన నొంది ప్రాణాధికుఁడై ప్రాణనాథుఁడై తనరు వనజాక్షుని నురమునఁ బరుండెను. ప్రీతింజూపెను. చూపులచేతనే ముద్దాడెను. శ్రీపతి యామె చిత్తము నపహరించెను. రాధయు హరిచిత్తమును దొంగిలించెను.

అంత రసికుఁడగు గోపాలకృష్ణుఁడు రాధికను రాసమం

దలమునకుం గొంపోయెను. అందొకతావు వారిరువురయుని కికై యేర్పఱుపఁబడినది. అందు రత్నప్రదీపములు వెలుఁగు చుండెను. రత్నదర్పణములు కనఁబడుచుండెను. చందనపంకము చల్లిన చారుచంపకశయ్య లట విరాజిల్లుచుండెను. పచ్చకప్పుర పువిడెములు, భోగోచితేతరానేకమహార్ఘపదార్థములు నందుం డెను. అచ్చోటి హర్మ్యమున నారాధాదేవితోటి శ్రీహరి నివ సించెను. రసికేశ్వరి హరికిఁ దాంబూల మొసఁగ నతఁ డద్దాని నాదృతిమెయి నంగీకరించెను. రాసేశ్వరియు శ్రీహరిదత్తతాం బూలమును నమలి పరమాద్భుతరసమున మునిఁగెను. చర్విత తాంబూలమును శ్రీకృష్ణుఁడు రాధ కొసఁగిన నాజగజ్జనని దాని భక్తిమెయి గ్రహించెను. చర్వితతాంబూలమును రాధి కను గృష్ణమూర్తి పరమాదృతి యాచింపనామె యీయ నంగీక రింపక పాదారవిందములపై వ్రాలెను. భీతిల్లెను. ఆయదనున రతితల్పమున రాధను జేర్చి రసికనాయకుఁడు సంతోషింపఁ దలంచెను. రతివిశేషములు కనంబడ వారందు విహరించిరి. వారిరువురును గామశాస్త్రపండితులు. కానఁ దదుక్తరీతి మెలంగిరి.

*ఏరీతి నాశ్రీకృష్ణమూర్తి రాధికామందిరమున నుం డెనో యారీతి నాగోపికలచూపుల కన్నిరూపములం గనంబడి యెను. ఒక్కొక్క కేళీమందిరమున నొక్కొక్క గోపికయుఁ దనతో శ్రీకృష్ణుఁడు కూడి యున్నట్లే యెంచుచుండెను. ఆరాస

* ఇటనుండి శ్రీభాగవతము ననుసరించి వ్రాయఁబడిన దని యెఱుంగనగు.

మండల మెల్ల గోపీగోపాలకసంభృతమై చూపట్టెను. తొమ్మిది లక్షలు గోపాలకులు పదునెనిమిదిలక్షలమంది గోపికలు ఆరా సమండలమున నాతరుణమున నుండిరి. మఱియు నందొకచో నాయోగీశ్వరేశ్వరుఁడు వలయాకారముగా వారినమర నియ మించి వారట్లు లుండ నిద్దఱినడుమఁ దాను నిలిచి యంతట నాపద్ధతినే యవలంబించెను. ఇరుప్రక్కలయందు గోపికలు నడుమ వేణుహస్తుఁ డగు శ్రీకృష్ణుఁడు వెలసిరి. అందుఁ దన బాహువుల నాసుచరిత్రల భుజశిఖరములపై మోపి యాగోపి కలకు తమకు మాత్రమే హరి చెంతనున్నవాఁ డనునూహను గల్పించెను. అందఱకు నన్నిరూపములఁ జూపట్టుచు నిలిచెను. అంతియ కాక నడుమ వేణునాద మొనరించుచు వారల మైమఱ చునట్లు చేయుచుండెను.

ఆవేడుకను జూడఁగోరి దేవతలు తమభార్యలంగూడి వచ్చి వ్యోమయానముల నుండి యంబరమున నిలిచియుండిరి. కన్నులకఱవు దీఱఁ జూచుచుండిరి. ఆరాసమండల మత్తఱి నెంతయు విశాలముగాఁ గానఁబడుచుండెను. అంతట నొక్కొ క్కకోణమందు నిర్వురుగోపికలు నొకకృష్ణుఁడు కనఁబడుచుండిరి. దివి దేవదుందుభులు మొరసె. పుష్పవృష్టి కురిసెను. గంధర్వులు తమసుందరులంగూడి యాలీలామానుషవిగ్రహుని యమల కీర్తులను గీతములుగా నమర్చి పాడఁజొచ్చిరి. రాసక్రీడ నృత్య రూప మైనది. కావున పాదగతు లారంభములు కాఁగా నామం దయానలవలయములయు, నూపురములయుఁ గింకిణుల కల

నిస్వనం బరుదై చెలఁగెను. ఆయుత్సవమున భగవంతుఁడగు దేవకీకుమారుఁడు హైమమణుల నడుమనుండు మహామరకత మణులభంగి బహురూపములం దాల్చి యమరవినుతిం గాంచెను.

ఒక్కతావున శ్రీహరి వేణునాదము చేసెను. దాన వారలయొడళ్లు పరవశము లయ్యెను. ఆరూపవర్యము నే మహాకవి శ్రీలీలాశుకులు,

శ్లో. కేకికేకాదృతానేకపంకేరుహాలీనహంసావళీహృద్యతా హృద్యతా, కంసవంశాటవీదాహదావానలస్సంజగౌ వేణునా దేవకీనందనః. ౨ ఆ. ౯౬. శ్లో.

అని వర్ణించి కృతార్థుఁడయ్యెను. ఆనినాదము నారదమహర్షికి మనోహరముగా నుండెనని చెప్పుట యొక యబ్బురమా! అంతట నాయుత్సవము పెలుచన సాగఁజొచ్చెను. అందుఁ దాళలయములకు సరిగా నడుగులు పెట్టుచుఁ గరకమలములఁ ద్రిప్పుచు, సుస్మితము లొనరించుచు, భ్రూలతికల విలాసగతులఁ ద్రిప్పుచు, మృగరాజమధ్యములఁ గదలించుచు, వక్షోజములు చలింప, నంబరములు చీకాకుపడ, గుండలములు చెక్కిళ్లఁ దాండవమాడ, ముఖమండలముల స్వేదబిందువులు తలచూపఁ గేశపాశము లించుక యూడ, నొడ్డాణముబిగి యించుక సడల నాకన్యకామణులు బాలగోపాలు ననుసరించి యాడుచుఁ బాడుచు నీలమేఘచక్రమందలి తటిల్లతలతీఱున బహురూపములఁ దాల్చిన యాహరిరూపముల నడుమ నడుమఁ బ్రకాశించిరి. ఈదివ్యమూర్తినే శ్రీలీలాశుకులు,

శ్లో. మహాళిమాలామిళన్మత్తభృంగీలతా భీతభీతప్రియావిభ్రమా
లింగితః, స్రస్తగోపీకుచాభోగసమ్మేళనం సంజగౌ వేణునా
దేవకీనందనః. ౨ అ. ౩౯ శ్లో.

అని వినుతించి సఫలమనోరథుం డయ్యెను.

ఆరీతి నర్తనక్రీడ సల్పుచు నాతామరసాయతేక్షణలు చక్కఁగాఁ గంఠములెత్తి భగవంతుని గాత్రస్పర్శంబున మేనులు మఱచి మహాప్రమదంబున వివిధరాగంబులఁ బాడుచుండ నీ జగంబెల్ల నాగీతనాదమయ మయ్యెను. ఈతరుణమున భగవంతునిమూర్తిని శ్రీలీలాశుకులు,

శ్లో. బాలికాతాళికాతాళలీలాలయాసంగసందర్శితభ్రూలతావి
భ్రమః, గోపికాగీతదత్తావధానస్స్వయం సంజగౌ వేణునా
దేవకీనందనః. ౨ అ. ౪౧ శ్లో.

అని వినుతించి ముక్తిమార్గమును జూఱఁగొనియెను.

* అంత నాయుత్సవంబున నొక్కమందయాన ముకుందునితో నసంకీర్ణంబుగా స్వరాలాపంబు లొనర్చి యాచమత్కృతికి గోవిందుఁడు హర్షించి వినుతింప నాయాలాపమే ధ్రువతాళముగాఁబాడి యావిలాసమానవాక్కృతి సమ్మానంబుం బడసె. మఱియొక యన్నులమిన్న యారాసోత్సవమున గరకంకణము లల్లలనాడఁ గబరిలోని మల్లికాకుసుమములు క్రిందరాలఁగా విశేషశ్రమమునొంది తనప్రక్కనున్న గదాయుధుని

* తదేవ ధ్రువ ముస్నిన్యే తస్యైమానం చ బహ్వదాత్ - అని శ్రీభాగవతము. ధ్రువం ధ్రువాఖ్యం తాళవిశేషమ్-అని వ్యాఖ్య.

భుజశిఖరముమీఁదఁ దనబాహువూని నిలుచుండెను. ఆతరుణముననున్న శ్రీకృష్ణమూర్తినే మదినిల్పి శ్రీలీలాశుకులు,

శ్లో. క్వాపి వీణాభిరారావిణా కంపితః క్వాపి వీణాభిరాకింకిణీనర్తితః, క్వాపి వీణాభిరామాంతరంగాపితః సంజగౌ వేణునా దేవకీనందనః. ౨ ఆ. ౩౭ శ్లో.

అని పొగడి ధన్యుఁ డయ్యెను.

వేఱొక్క పురంధ్రీమణి నల్లఁగలువపరిమళముగల శ్రీకృష్ణబాహువు సురభిచందనలిప్తముగా నుండఁ జక్కఁగ నాఘ్రాణించి హృష్టరోమాంచితతనూరుహయై ముద్దాడెను. ఈ ఘట్టమున నీగోపాలమూర్తియాకృతిని శ్రీలీలాశుకులు,

శ్లో. చారుచంద్రావళీలోచనైశ్చుంబితో గోపగోబృందగోపాలికావల్లభః, వల్లవీబృందబృందారకః కాముకస్సంజగౌ వేణునా దేవకీనందనః. ౨ ఆ. ౩౮ శ్లో.

అని సన్నుతించి మోక్షలక్ష్మిని జూఱఁగొనియెను.

ఇంక నొక ప్రమదాతిలకము ఆటతొందఱచేఁ జలించుచున్నకుండలములకాంతిపుంజము తనచెక్కిళ్లను బ్రకాశింపఁజేయఁగా నట్టిచెక్కిలిని శ్రీపతిచెక్కిటం జేర్పఁగా లీలామానుషవిగ్రహుఁ డగు నాబాలగోపాలుఁడు ఆయంగనారత్నము తాంబూలచర్వితమును గైకొనియెను.

మఱియు నొక్క తెఱవ నూపురములు మ్రోయుచుండఁగా నొడ్డాణపుఁజిఱుగజ్జెలు ధ్వనింపఁగా నృత్తము చేయుచుఁ

బాడుచు శాంతస్వభావ ముట్టిపడ శ్రీనాథునిహస్తారవిందమును బరమశుభప్రద మనునమ్మికఁ దనవక్షోరుహములఁ నునుచుకొని యెను. ఈతటి నీశ్రీహరిరూపమునే తనహృదయాబ్జపీఠమున నునుచుకొని శ్రీలీలాశుకమహాకవి,

శ్లో. చారుచామీకరాభాసభామావిభు
రైవజయంతీలతావాసితోరస్స్థలః,
నందబృందావనే వాసితామధ్యగ
స్సంజగౌ వేణునా దేవకీనందనః. ౨ ఆ. ౮౦ శ్లో.

అని తలంచి పూజించి భక్తవర్యుఁడై శ్రీహరిదాస్యమును బొందెను.

ఈరీతి నాగోపికలు పరమప్రమోదమున శ్రీభార్గవికి నేకాంతవల్లభుఁ డగు నాభక్తవత్సలునిం గూడి బహుభంగులగులీలలం బ్రమోదించుచు, నాతనిం బ్రాణనాథునిగాఁ బడసి యాలోకనాయకుబాహువులఁ దమకంఠములపై నునుచుకొని భగవల్లీలలం బాడుచు విహారము సల్పిరి. మఱియు నానర్తనమున గోపికలు కర్ణోత్పలములు కపోలతలములపైఁ బడిన ముంగురులు ఘర్మాంబువులు తమముఖారవిందముల కొకవింతచెలువుఁ గలిగింపఁగా జడముడి వీడి యందుండినకుసుమములు రాలఁగాఁ గంకణములనాదములు, నూపురములధ్వనులు వాద్యములు కాఁగా కుసుమములనుండి వెడలిన తుమ్మెదలమధురతర ఝుంకారములు పైపాట కాఁగా నారాసమండలమున శ్రీహ

రితో సమముగ నాట్యవిహారము నొనరించిరి. *ఏమియు నెఱుఁగని యర్భకుఁడు తనప్రతిబింబమును దర్పణాదులయందుఁ గాంచి వానితో నాడుకొనుచందమున రమావల్లభుఁడు గోపలలనలం గూడి వారియాలింగనములకుఁ, దనహస్తమును వారు పట్టుకొనుటకు, విలాసవీక్షణములకు విభ్రమస్మితములకు మహానందము నొందుచు మెచ్చుచు విహారము సల్పెను. ఇవ్విధమున భగవంతునిదేహస్పర్శమున నాగోపికలు మహాముదమునొందిన కతన సకలేంద్రియములు తమవశమున నుండమి వీడినకేశపాశమును, విడివడినకోకముడిని జాఱినరవికెను సవరించుకొనఁజాలక తదేకనిష్ఠలై యుండిరి. వేయిమాటలేల గాని యాగోపికలచిత్తములు కృష్ణమూర్తివశమున నుండెను. కావున వారలపు డేమిచేయుచుండినదియుఁ దెలియఁజాలకుండిరి. ఏమర్త్యా

---

* ఏవం పరిష్వంగకరాభిమర్శస్నిగ్ధేక్షణోద్దామవిలాసహాసైః, రేమే రమేశో వ్రజసుందరీభి ర్యథార్భకస్స్వప్రతిబింబవిభ్రమః—అని మూలము. యథార్భక ఇతి. స్వప్రతిబింబైర్విభ్రమః క్రీడా యస్య స ఇత్యనేనైశ్వర్యగ్లిత మ్. స్వయమేవ సర్వకళాకౌశలం. సౌగంధ్యలావణ్యమాధుర్యాది. చ తాసు సంచార్య తాభిస్సహ రేమే. యథార్భకస్స్వప్రతిబింబై గతి—అని వ్యాఖ్య. ఎట్లుబాలకుఁడు తనప్రతిబింబమును అద్దముగోనగునిర్మలపదార్థములయందుఁ బ్రతిఫలింప దానిం గాంచి వేఱొకబాలకునిం గాంచినట్లాడుకొనునో అట్లు. శ్రీకృష్ణుఁడు గోపికలనఁగా స్వకీయప్రతిబింబములే కావున వానితో లీలావినోదములఁ దేలెను. దీనిచే భగవంతునియందు జారత్వమును గల్పింప నవకాశము కలదని యెట్లు పలుకవచ్చును? హాతమునఁ బలుకవచ్చునేమో గాని. సద్బుద్ధిచేఁ బలుకరాదనుటకంటె నెక్కువ తెల్పనేల?

దను భగవంతునియందుఁ జూపఁదగునో యనునదియు వారికిఁ దోఁచకుండెను. శ్రీకృష్ణపరమాత్మయే తమరనుకొనుచుఁ దదేకతానమానసముల నిలువఁబడియుండిరి.

శ్రీకృష్ణుఁ డిట్లు విహారము సల్ప దానిం గాంచి వియచ్చరకాంతలు మోహపరవశ లైరి. తా సర్వాంతర్యామియయ్యు శ్రీకృష్ణమూర్తివిలాసాదృతింబూని గోపిక లెందఱు గలరో అన్నిరూపములఁ దానును నిలువంబడి యారాసమండలవిహారము సల్పి యాశ్రమమున బడలియున్న యాకాంతల నెమ్మోముల మహానందమొప్ప సుఖములఁ గల్గించుతనకరతలంబునఁ బ్రేమరసము కనంబడ నిమిరెను. దాన నాగోపకాంతలు బంగరుకుండలములరోచులు, కుంతలములరుచులు గలిసి కపోలములయందు వ్యాపింపఁగా వానిజిగిచే మెఱయుబెళుకుచూపుల శ్రీకృష్ణునకు వేడుక నొదవించుచు సురుచిరమందస్మితామృతమున నాయాత్మారామునకు మర్యాదను గల్గించుచు భగవన్ముఖస్పర్శమునఁ బరమామోదమునంది యాతని యమేయలీలల గానముచేసిరి. *ప్రసన్నచిత్తముల నలరునాగోపికలం గూడి

---

* తాభిః ప్రసన్నచిత్తాభి ర్గోపీభిస్సహసాదరం, రరామ రాసగోష్ఠీభిరుదారచరితో హరిః-అని బ్రహ్మపురాణము. ఈశ్లోకమే విష్ణుపురాణమునందును గనంబడియెడిని. విష్ణుపురాణము బ్రహ్మపురాణమునకుఁ బుత్రిక యని యీవఱకే వ్రాసియుంటిని గదా. ఇందుదారచరితః = అన్నవిశేషణమే శ్రీహరి మహిమమును దెల్పుచున్నయది. ఈక్రీడయందు విపరీతార్థము కానరాదు.

లోకాతిశాయిచరితముగల శ్రీకృష్ణపరమాత్మ సాదరముగా రాసగోష్ఠులచే విహారము సల్పెను. *అత్తఱి రాసమండల మతి మనోహారముగా గోలోకముననున్నరీతిఁ జూపట్టెను. అందా సమయమునఁ దొమ్మిదిలక్షలమంది గోపిక లుండిరి. తొమ్మిదిలక్ష లమంది శ్రీకృష్ణమూర్తులు కనఁబడిరి. అప్పు డారాసమండల మునందుఁ బదునెనిమిదిలక్షలమంది గోపికలుం గృష్ణులు నుండిరి. ఆరాసమండలమున మహాపూజ యనఁగాన ర్తనము. గేయచక్రాధి దేవత రాధిక. కాఁబట్టి యట భగవంతుఁడు తనపరివారదేవత లంగూడి న ర్తనముచేయును. ఆన ర్తనమున గోపికలకు నొడళ్లు తెలియలేదు. జడముడులు వీడుటయుఁ దెలిసికొనఁజాల రైరి. వస్త్రము వదలుటయు నెఱుఁగ రైరి. రత్నహారములు సూత్రచ్ఛే దమునఁ గ్రిందఁబడుటయు నెఱుఁగ రైరి. తమస ర్వాలంకృతులు తాఱుమాఱగుటయు నెఱుఁగ రైరి. తుదకు వారికి వారిదే హాము లే కనఁబడకుండెను. మూర్ఛల మునింగినట్లు మహానంద మును మాత్రమే యనుభవించుచుండిరి. కాని తమ రనుభవించు నానంద మెట్టిదో యెట్లు లనుభవించిరో వారే యెఱుఁగఁ జాలకుండి రనుట యతిశయో క్తి కానే కాదు. ఆమహానాట్య మున వాద్యములమ్రోతలు, కంఠస్వరములు. గాక కరకంకణ ములయు, నొడ్డాణెములచిఱుగజ్జెలయు నవ్య క్తమధురరవలేశ

---

*ఇది శ్రీకృష్ణజన్మఖండానుసారము వ్రాయఁబడినదని యెఱుంగనగు. గోపీనాం నవలక్షాణి గోపానాం చ తథైవ చ, లక్షాణ్యష్టాదశ మునే యుక్తాని రాసమండలే—అని మూలము

ములు వినఁబడుచుండెను. రత్నహారము లొండొంటితో నొరి యుచప్పుడులును గలిసియుండెను. ఇట్టు లామహానర్తన మవిచ్ఛిన్నముగా సాగెను. గోపికలు పరమానందమున నోలలాడుచుండిరి. వారితోనుండు శ్రీకృష్ణులందఱును దదధికానందమును బొందుచుండిరి. ఇట్లు రాసమండలవిహారము పూర్ణ మయ్యెను.

మహాశయులారా! వివేకమహితులారా! ఈరాసక్రీడలఁ బురాణము లెట్లు తెలిపినవో పఠించితిరి. అందందు వ్యాఖ్యాత లెట్లు భావములఁ దెలిపిరో తెలిసికొంటిరి. ఇఁక దీనిసారమును వినుఁడు. రాసమండల మనఁగా భగవదారాధనార్థకల్పితచక్రరాజ మని ముందే తెల్పియుంటిని. ఈరాసక్రీడ యొక సంభోగాంగ మనితలంచుట కిసుమంతయు నవకాశము లేదు. లీలాశుకులు "సంజగౌ వేణునా దేవకీనందనః" అని తమభావమును దెలిపెను. ఇందు భగవంతునివేణుగానము, తద్భక్తినిరత లగు గోపికలగీతము, వీరందఱొనరించునర్తనము సాగెనని తేటపడుచున్నది. ఒక్కకృష్ణుఁడు ఇరుప్రక్కల గోపికలు. ఈరీతి నవలక్షలుండిరని తెలియవచ్చెడిని. ఆమహాచక్రమునందు నెన్నిదళము లున్నవో ఒక్కొక్కదళమున నిర్వురుగోపికలు ఒక్కకృష్ణపరమాత్మ ఈరీతిగా నిలువఁబడినట్లు తెలియనగు. ఎన్నియావరణములో ఒక్కొక్కయావరణమున కెన్నెన్ని దళములో తెలియ నశక్యముగా నున్నదని భ్రమింపకుఁడు. ఆచక్రము నుద్ధరించు పద్ధతి, దళములయందున్న యధిదేవతలపేరులు, అందున్నపరివారదేవతానామము లిపు డెఱుంగఁబనిలేదు. దాని కిది సమ

యము కాదు. శ్రీకృష్ణుం డానందించుతావు రాసమండల మనంబడు. శ్రీకృష్ణు నలరించుపూజ నర్తనము, తద్గుణములం బాడుటయు ననియెఱుంగవలయు. నేంటికింగూడం జైతన్యమను మతమున నర్తనమే ప్రధానము పాటియు నట్టిదియే. అనంగా భగవద్గుణగణగుంభితగీతములం బాడుచు నర్తనముచేయవలయు నను నడియే దీనిసారము. ఏదేవతాపూజయందును లేని గీత నర్తనము శ్రీకృష్ణార్చనముననే యేల కల్గెనని మీరు ప్రశ్నింతు రేమో యని నాలుగుమాటలు వ్రాయుచున్నాండను. మీరం దఱు స్తుతిపాఠములం బఠించియుందురు. అవి శ్లోకరూపమున నున్నవి. ఏల? వానిని గానరూపమునం బాడవలయు ననియే. నారదాదిమహర్షు లేల వీణానాదమున భగవంతు నలరించెదరు? అదియు నొకపూజ యనియే కదా. నారదముని ముక్కుమూసి కొని తపోనియమము నవలంబింపక సదా గాన మేల చేయు నని పురాణములు పలుకుచున్నవో యించుక యూహింపుండు. గానము వీణావాదనము. వానిని దాళయుక్తములుగాం జేయుచుం బూజించుట యోగవిద్య యనియు, యోగాభ్యాస మునకన్న నిది యధికమనియు స్మృతులు తెలుపుచున్నవి. ఇపు డేమందురు ? ఏవి యాస్మృతివాక్యము లందురా? వినుండు.

శ్లో. వీణావాదనతత్వజ్ఞ శ్శ్రుతిజాతివిశారదః,
తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి.

యాజ్ఞవల్క్యస్మృతి. ప్రాయశ్చిత్త కాండము. ౧౧౫ శ్లో.

తత్స్వరూపజ్ఞశ్చ తదనువిద్ధబ్రహ్మోపాసనతయా తాలాది

భంగభయాచ్చి త్తవృత్తే రాత్మైకాగ్రతాయా స్సుకరత్వా దల్పా యాసే నైవ ము_క్తిపథం నియచ్ఛతి. ప్రాప్నోతి.

శ్లో. గీతజ్ఞో యది యోగేన నాప్నోతి పరమం పదం,
రుద్రస్యానుచరో భూత్వా తేనైవ సహ మోదతే. ౧౧౬.

వ్యా. గీతజ్ఞో యది కథంచిద్యోగేన పరమం పదం నాప్నోతి. తర్హి రుద్రస్య సచివో భూత్వా తేనైవ సహ మోదతే, క్రీడతి. అని వ్యాఖ్య.

అవ. యస్య పునర్వైదిక్యాం గీతౌచిత్తం నాభిరమతే తేన లౌకికగీతానుస్మృత్యాత్మోపాసనం కార్యమిత్యాహ.

శ్లో. అపరాంతకముల్లోప్యం ముద్రకం ప్రకరిం తథా,
ఔవేణకం సరోబిందుము_త్తరం గీతకాని చ. ౧౧౩
ఋగ్గాథాపాణికా దక్షవిహితా బ్రహ్మగీతికా,
గేయమేత_త్తదభ్యాసకరణా న్మోక్షసంజ్ఞితమ్. ౧౧౪

ఋగ్గాథాద్యా శ్చతస్రో గీతికా ఇత్యేతదపరాంతకాది గీతజ్ఞాత మధ్యారోపితాత్మభావం మోక్షసాధనత్వా న్మోక్షసంజ్ఞితం మంతవ్యమ్. తదభ్యాస స్యైకాగ్రతాపాదనద్వారే ణాత్మైకాగ్రతా ప_త్తికారణత్వాత్-అని వ్యాఖ్య.

చూచితిరి గదా స్మృతిభావము. గీతజ్ఞుఁడు కూడ భ_క్తియుక్తుఁ డయ్యెనేని మోక్షమార్గమున కర్హుఁ డని చెప్పఁబడినది. ఏపూజయందైన నేకాగ్రత ప్రధానము కదా. అది లేకున్న నేదియు ఫలింపదు. కావున గానము నృత్యముకూడ భగవద్భ_క్తి

యుక్తునకు శ్రీహరి నారాధింపఁ జక్కనిమార్గములే యగు ననుట నిస్సంశయమమార్గము.

దేవతాంతరమున నీగానపూజ కలదా యని ప్రశ్నింతురా. కలదు. వినుఁడు. శంకరుఁడు సాయంసమయమునఁ ద్రిపురసుందరి పీఠమున నధివసింప ముప్పదిమూఁడుకోట్లదేవతలు బలసియుండ బ్రహ్మాయు, విష్ణువు తనకుఁ దోడుగా నిలువఁ దాండవ మొనరించును. ఆతరుణమున శంకరునకు నటరాజనామము జగత్ప్రసిద్ధము.

శ్లో. నృత్తావసానే నటరాజరాజో ననాద ఢక్కాం నవపంచవారం, ఉద్ధర్తుకామ స్సనకాదిసిద్ధా నేతద్విమర్శే శివసూత్రజాలమ్.

అని వ్యాకరణశాస్త్రమున నొకచో వ్రాయఁబడియెఁ గదా. వ్యాకరణసూత్రములు నటరాజరాజఢక్కానాదనజనితము లని యందఱంగీకరించిరి. శాస్త్రకర్తలే తెల్పిరి. శంకరునకు నృత్తమున నతిప్రీతి కలదని దీనఁ దేలెను గదా. కాఁబట్టియే శంకరుసందర్శనము ప్రదోషకాలమునఁ జేసిన సర్వదేవతాదర్శన ఫలము గలుగు నని చెప్పఁబడినది. శంకరు నభిషేకముల నలరింపఁ జేయఁగోరువారు శివలింగ మందురు. స్తుతుల సంతోషపఱచు వారు మహాదేవుఁ డందురు. నాట్యమున భజించువారు నటరాజమూర్తి యందురు. ఏభక్తున కేవిధమునఁ బూజింప నిచ్ఛ పొడమునో యాభక్తుని తదారాధనమున భగవంతుఁడు తృప్తుఁ డగును. ఆపద్ధతు లన్నియుఁ దనకృత్యములనుండియే భక్తులకుఁ

దానే తెల్పును. అందు నెవ్వరి కేమార్గమిష్టమో దానిచే భగవంతు నారాధింపవచ్చును. ఇది సకలస్మృతిపురాణేతిహాసములనువదించినమార్గమే కాని క్రొత్తది కాదు. కాఁబట్టి శ్రీరాధామాధవుని వేణుగానమునను నర్తనమునను బూజింపవచ్చును. పుష్పములఁ బూజింపవచ్చును. స్తోత్రరాజముల వినుతింపవచ్చును. ఇంక నెన్నియో విధములఁ బ్రార్థింపవచ్చును అందు నిదియొకమార్గము. తక్కినవానికంటె నిది యుత్కృష్టమనియు దీనికంటెఁ దక్కినవి తక్కువయనియు వచించుట మహత్తరపాపకార్యములలో నిది మొదటి దనవలయును. కాఁబట్టి యీరాసక్రీడ భగవంతుఁడు గీతము నృత్యముచేసి భక్తుల కిదియు నొక తపస్సే యని తన్నారాధించుమార్గముల ననేకములలో నిదియు నొకటి యని తెలుపుట కారంభించెనని మనము భావింపవచ్చును. ఈమార్గ మేభక్తులకు రుచించునో వారు దీని నవలంబించి భగవద్గీతములను బాడి నృత్యముచేసి పరమాత్ము నారాధింపవచ్చును. కృతకృత్యు లగుదురనుట కేశంకలు లేవని నిరాఘాటముగాఁ జెప్పవచ్చును.

ఈరాసక్రీడ కేవలమింద్రియసుఖార్థక్రీడయే యయ్యెనేని దానింజూడ దేవత లరుదెంచి విమానములయం దంబరతలముననుండి రనుట చెప్పఁబడునా? భార్యలంగూడి యావేడుకను జూచుచుండిరని శ్రీభాగవతమునఁ జెప్పఁబడినది కదా. ఆశ్లోకములను జూడుఁడు.

శ్లో. దివౌకసాం సదారాణా మౌత్సుక్యనిభృతాత్మనాం,

తతో దుందుభయో నేదు ర్నిపేతుః పుష్పవృష్టయః. ౫
జగుర్గంధర్వపతయ స్సస్త్రీకా స్తద్యశోఽమలం.

దేవతలు భార్యలంగూడి వచ్చి యావేడుకను జూచుటయే గాక దుందుభులు మ్రోయించిరఁట. పూలవానఁ గురియించిరఁట. గంధర్వులు భార్యలం గలిసి శ్రీహరినిర్మలయశస్సును బాటలుగాఁ బాడిరఁట. ఎంద్దైన నిట్టివింత వింటిమే? కంటిమే? ఏ శృంగారప్రబంధమునందైన రతిక్రీడను వర్ణించునపుడు దేవతలరుదెంచి చూచుచుండిరి. దేవదుందుభులు మ్రోయించిరి. అని వర్ణింపఁ బడినదా? అది వాస్తవముగా రతిక్రీడయే యైనచో నీమహాఘనకార్యమును జూడ భార్యలనుగూడి దేవతలు గంధర్వులు వచ్చిరనుటకన్న నింద్యమేముండును ? కావున నిది రతిక్రీడ కాదని స్పష్టముగాఁ జెప్పవచ్చును. ప్రతిశ్లోకమునందును బ్రతిగోపికయు గానముచేతను నర్తనముచేతను శ్రీహరిని దృప్తిఁజెందఁ జేసినట్లున్నదియే కాని రతిసుఖముల నలరించినట్లు కానరాదు. రాసక్రీడను వర్ణించుచు శ్రీకృష్ణకర్ణామృతమునందు శ్రీలీలాశుకు లెనిమిదిశ్లోకములయందును గడపట "సంజగౌ వేణునా దేవకీనందనః" అనియే భగవంతుని వర్ణించెను. ఇవన్నియుంబోల నాలోచింపఁగా నీరాసక్రీడ భగవత్పూజాభాగములం దొకవిధమగు నర్చనవిశేషమని కనఁబడుచున్నదియే కాని వేఱొకమాటకిట నవకాశమే లేదు. కావున దుర్వాదులిట నోరు మెదల్పక యున్నమర్యాద యూడిపోవకుండఁ గాపాడుకొనుటయే వారికృత్యమని మఱియొకపర్యాయము

వ్రాయ సాహసించుచున్నవాఁడను. ఏమాత్రము ప్రపంచజ్ఞాన మున్నను నిది సురతకేళి యన సాహసింప రని నానమ్మకము. పని లేనిమంగలి పిల్లితల గొఱిగినట్లు ఇతరకార్యములు లేక తిని కూరుచుండి శ్రీహరిని దూషింపఁబూనినచో నట్టివారి నేమనఁ జాలను గాని పూర్వజన్మమున లేశమైనను భగవద్భక్తిబీజము నాటనిహృదయము కదా యని పరితపించెదను. ఇంతియ కాక అట్టివారలకుఁ జక్కనిభక్తి నొసంగి కాపాడవలయునని మాటికి మున్మాటికి శ్రీకరుణానీరధియగు శ్రీనందనందనుం బ్రార్థించుచున్నవాఁడను. ఇంకను బెంచివ్రాయ నుంకింపక తర్వాతిగాథను వ్రాసి నాలేఖినిం బవిత్రగాఁ జేయ నెంచెదను. ఆర్యులారా! మీామనస్సులు భక్తిరసపరిపూర్ణము లగును గాక. శ్రీహరి మీాకాయురారోగ్యములు ప్రసాదించి కాపాడుఁ గాక. భగవత్కథలయందు మీాకుఁగల సమాదృతి పెంపొందుఁ గాక. ఈరాసక్రీడాఘట్టమున శ్రీభాగవతమునకుఁ బోతనగారి తెనుఁగునకు సంబంధమే లేదన వీలులేదు గాని మూలమున లేని వర్ణనాంశముల నెన్నియో తెనుఁగునఁ గలవని చెప్పుట కేశంకలు లేవు. ఐన నమ్మహాత్మునిపద్య మొక్కదాని నిట నుదహరింపకపోవ మనసొప్పకున్నది.

చ. ప్రమద యొకర్తు మాధవుఁడు • పాడ విపంచి ధరించి కేల
సం, భ్రమమునఁ దంత్రి మీాటుచుఁ డి•రంబుగ రాయము
చేసి యొక్కరా, గము దగ నాలపించి సుభ•గస్వరజా
తులు వేలు వేలు కా, నమరఁగఁ బాడెఁ దద్ రమణుఁ •
డౌనన దారువు లంకురింపఁగన్.

శ్లో. కాచిత్సమం ముకుందేన స్వరజాతీరమిశ్రితాః,
ఉన్నిన్యే పూజితా తేన ప్రీయమాణేన సాధ్వితి,
తదేవ ధ్రువ మున్నిన్యే తస్యైమానంచ బహ్వదాత్.

అనునీసార్థశ్లోకమునకుఁ బైపద్యము తెనుఁగని తోఁచెడి. మూలమునకు దీనికిని గలసంబంధ మెంతయో చదువరు లూహింతురు గాక. ఇఁక నీవిషయమున దృష్టినొంది యవ్వలిభగవల్లీలను వ్రాసెదను.

శ్రీకృష్ణుఁడు గోపికలంగూడి యమునానది జలకేళి సల్పుట.

శ్లో. వ్రజయువతిసహాయే యౌవనోల్లాసికాయే
సకలశుభవిలాసే కుందమందారహాసే,
నివసతు మమచిత్తం తత్పదాయత్తవృత్తం
మునిసరసిజభానౌ నందగోపాలసూనౌ. ౨ ఆ. ౭౮.

ఆర్యమహాశయులారా! రాసక్రీడయందు శ్రీహరిప్రవృత్తిని బఠించితిరి. దానియంతరార్థమును దెలిసికొంటిరి. ఆరాసమండలమున గోపికలును శ్రీహరిమూర్తులును లక్షలకొలందిగా విహరించిరి. ఆవిహారము గీతనృత్తమయము. అందు శ్రీకృష్ణపరమాత్మయొక్క జగత్కారణత్వము ప్రదర్శింపఁబడినది. ఇరువురు గోపికలు. నడుమ నొక్కకృష్ణమూర్తి యిట్లు లెక్కకు మిక్కిలి నిలుచుండి రనఁగా భావమేమి? సర్వజగద్వ్యాపి యనుటయే గాని వేఱేమున్నది. దీనిని డాఁచి స్త్రీలతో విహరించెనని వెక్కిరించుటకన్న నవివేకము వేఱొకటి లేదు. దానిని జూడ దేవత లరుదెంచి రని భాగవతమున నుండఁగా నది

రతికేళి యని యేమూానపుఁడు వచింపఁగలఁడు? కావున నట్టి యసంగతప్రసంగములఁ జాలించి యారాసవిహారము భగవత్పూజ యనియు, నదియే చక్రార్చన మనియు, నందుఁ బరివార దేవతలం గూడిన భగవంతుఁడు తనయిచ్ఛాశక్తి యనఁబడు రాధాదేవింగూడి బిందుస్థానమున (యంత్రమధ్యమభాగమున) రత్నసింహాసనమున నుండెననియుఁ, బ్రతిదళములయందును దనబరివారదేవతలం గూడి తానే యన్నిమూర్తులుగా నెలకొనియె ననియు గ్రహించి యారూపములఁ దనరు శ్రీకృష్ణుని ధ్యానింపుఁడు. భగవంతుం బూజింపుఁడు. చేతనైనచో నాపరమాత్మను ధ్యానించుచు నృత్య మొనరింపుఁడు. శక్తిగల్గినచో భగవన్నామములం బాడుఁడు. ఇంక నవకాశమున్నచో వీణను ధరించి వాయింపుఁడు. ఏకార్యమునఁ బ్రవర్తించినను భగవంతునియం దనన్యగతిక మగు భక్తిపరత్వమును మాత్రము వదలకుఁడు.

"తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం నియచ్ఛతి."

అను స్మృతివాక్యమును స్మరింపుఁడు. యోగమునకు వీణావాదనము మిక్కిలి సహకారి యగునఁట. అదియేకదా మనస్సును స్థిరముగా నిలుపఁగలదు. దాని నభ్యసింపుఁడు. శ్రీరాసాధిపురాలగు రాధికను భగవతిగాఁ జింతింపుఁడు. ఆజననియే మూలప్రకృతి లోకజనని. తత్కటాక్షమునకుఁ బాత్రుఁడు కానిచో భగవత్కృపకు నర్హుఁడు కాఁడు. కావునఁ దొలుతొలుతఁ బ్రకృతి నుపాసించి తత్కరుణకుఁ దాఁ బాత్రుఁడై పిదపఁ దదనుమతిఁ బడసి భగవంతు నుపాసింపవలయు.

శ్లో. అవిద్యానామంత స్తిమిరమిహిరద్వీపనగరీ
జడానాం చైతన్య స్తబకమకరంద స్రుతిఝరీ,
దరిద్రాణాం చింతామణిగుణనికాజన్మజలధౌ
నిమగ్నానాం దంష్ట్రా మురరిపువరాహస్య భవతి.

అనుసూక్తిని స్మరింపుఁడు. శక్తి లేదన్నచో వాఁడసమర్థుఁడే యగు. ఏకార్యమును జేయఁజాలఁడు. భగవంతుఁడు నిర్గుణుఁడు. ఆతత్వమును దొలుత నాశ్రయింప వీలులేదు.

"తదను ప్రధానద్వారా రాజదర్శనం కర్తవ్యమ్."

అన్న న్యాయము లోకవిదితము. అనుభవసిద్ధాంతము. దానిమాన వీలులేదు. భగవదిచ్ఛాశక్తియే రాధికాంబ. తత్పూజనము మాని శ్రీకృష్ణకృపకుఁ బాత్రుఁడ నౌదునని ప్రయత్నించుట దూరదృష్టి లేమిచే నని యెఱుంగఁదగు. శ్రీరామానుజులవా రీవిషయమును స్వానుభవమున నెఱింగిరి. కావుననే శ్రీదేవిద్వారా భగవత్కటాక్షము ప్రసరించు ననిరి. ఊరక వా రనలేదు. భగవంతు నుపాసించి ఫలము గానక తత్పుణ్యమున నీజ్ఞానమును సంపాదించిరి. భగవతి నుపాసించిరి. భగవత్కృపాపాత్రులైరి. దాన నేమి ఫలము గల్గెను? భగవత్కరుణకు నెల్లరు పాత్రులే యన్న సమబుద్ధికలిగెను. భక్తి యనపాయమార్గమని వారికిం దోఁచినది. ఔరా! ఎంతస్వానుభవమాహాత్మ్యనకుం గల్గెను? శ్రీమధ్వాచార్యులుగా రీవిషయమునఁ గ్రొత్తమార్గమును ద్రొక్కిరి. భక్తి ప్రధాన మనుటలో మతత్రయస్థాపకులు సమానాభిప్రాయులే. కాని యిం

చుక భేదమును జూపిరి. దాన నేమియు నష్టము లేదు. సర్వ మునకు భగవంతుఁడే గతి యన్న భావము శ్రీమధ్వాచార్యులు గారిది. శ్రీదేవిద్వారా భగవత్కటాక్షము నొందవలయు ననుట మిగిలిన యిద్దఱభావము. మార్గభేదమే గాని గమ్యస్థాన మొక్కటియే. ఎవ్వరి కేమార్గము రుచించిన దానిని వారాశ్ర యింప వచ్చును. కావున భక్తిభరితస్వాంతులై శ్రీరాధామాధ వుల రాసమండలమున సకలపరివారదేవతాయుతులనుగా ధ్యానించుట యిహపరశ్రేయస్సాధనము. ఇదియే యీలీలాసా రము. భగవంతునిసర్వకారణత్వ మీగాథనుండి కనుఁగొన వచ్చును. ఇంతకంటె నింకను బెంచివ్రాయుటకన్న నవ్వలి భగవ ల్లీలను వ్రాయుట యుక్తమని తోఁచుచున్నది. దానికిం గడం గెదను.

శరద్రాత్రికానిశియందు శ్రీహరి యేకాంతస్థలమునఁ బర మపావనకాళిందీతటమున మనోహరపులినతలంబునఁ గూరు చుండి తనభక్తజనులను రావించెను. వారిమనఃప్రవృత్తులఁ బరీ క్షించెను. దృఢమనస్కులన్న విషయ మెఱింగెను. సర్వజ్ఞున కేల యీపరీక్ష యని ప్రశ్నింపరాదు. లోకుల కీసదాచారమును బోధించుటకే కాని వేఱుగాదు. స్త్రీలకుఁ దండ్రిగాని భర్తగాని తప్ప నితరులు మంత్రోపదేశము చేయరాదనియు ఒకవేళ భర్త జ్ఞానశూన్యుఁ డైనతఱిఁ దదనుమతిం బడసి కాని యొరు లుప దేశింపరాదనియు నున్నది కదా. ఆనియమమును శ్రీకృష్ణుఁడు మీఱెఁ గదా యని ప్రశ్నింపఁజనదు. లోకవిషయమున నట్టి

విధులుకాని పరాత్పరునివిషయమున నావిధులు బాధింపవను నదియే యాప్రశ్నమునకు దగినసమాధానము. ఆరాత్రి సుము హూర్తమున శ్రీహరి గోపికలకు శ్రీరాధామాధవమంత్రరహ స్యము నుపదేశించెను. అంతట వారికిఁ దనయందుఁగల ప్రేమ మును మరలఁ బరీక్షింపఁగోరి యనఁగా శ్రీరాసమండలపూజ నుపదేశింప వీరు తగినవారా కారా యని యెఱుంగఁగోరి యదృశ్యుఁ డయ్యెను. గోపిక లనన్యచిత్తముల భగవంతుని వెదకిరి గాని రాత్రియని, ఇది యరణ్యప్రదేశ మని, తమ రబల లని, ఏవేని ఆపద రావచ్చు నని, భర్త లేమందురో యని, లోక మేమి నిందించునో యని, ఇందొక్కవిషయమునైన నాలోచింపక తదేకాగ్రమనసుల భగవంతుని జూడఁగోరిరి. భక్తి దృఢమైనదే యని తలంచి ప్రత్యక్ష మయ్యెను. శ్రీరాస మండలమున వారికి భక్తిమార్గము నుపదేశించెను. వారింగూడి నృత్యము చేసెను. వేణువు తానూఁదుచు వారు పాడునట్లు చేసెను. మహానందమున నోలలాడించెను. ఆవల యమునాజల ములఁ గ్రీడింపఁ గోరెను.

జలక్రీడసల్పుట కాముకులయాచారము కదా. దీని కేమి సమాధానమని ప్రశ్నింపవచ్చు? చక్కనిసమాధానము కలదు. ఆలకింపుఁడు. జలక్రీడలు సల్పుట పగటిపూటయందే కాని యపరరాత్రమునఁ గాదు. ఏగ్రంథమునను అట్టియాచార మున్నట్లు కనఁబడలేదు. రాకానిశాకరుకిరణములు సోఁకినపుడు వేసవికాలమున నేల యది చేయఁగూడ దనకుఁడు. ఇది శర

త్కాలము. తులామాసము. శీతమారంభమగు సమయము. అది యమునానది. శీతలజలముల కునికిపట్టు. అర్ధరాత్రము తర్వాత నీజలక్రీడ లారంభము చేయఁబడినది. ఇది యీలోక మునఁగల యాచారము కాదు. అంతియగాక ఒక్కకృష్ణుఁడు కాఁడు. ఒక్కగోపిక కొకకృష్ణుఁడు కనఁబడుచుండును. కావున నీజలక్రీడ యితరులజలక్రీడవంటిది కాదు. ఇది లోకోత్తరము. దీని కిదియే సాటి. తత్వమును వినుఁడు. యజ్ఞముచేసిన పిదప నవభృథస్నానము చేయుట విధివిహితము. అది మానిన నాయజ్ఞము పూర్తికాదు. ఇది భక్తితోఁజేయు మహాపూజాయజ్ఞము. జపయజ్ఞము యజ్ఞములలోఁ బ్రధానము. "యజ్ఞానాం జపయజ్ఞోఽస్మి" అన్నభగవద్వాక్యము మీా తెలుఁగనిది కాదు కదా! తదంగ మీాపూజాయజ్ఞము. ఈరెండు నీరాత్రియందే యొనరింపఁబడినవి. ఆవల నవభృథస్నానము చేయవలయు. అదియే యీాజలక్రీడ యని భావించిన నించుకంతయు దోషము లేదు. అట్లు కాదేని లోకాచారవిరుద్ధముగా జలకేళి సాగెనని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పుటయేగాక ఇందఱు గోపికలు లేరనియు, కృష్ణుఁడొక్కఁడే కాని యింద ఱుందురా యనియుఁ జెప్పవలసివచ్చును. కృష్ణుఁడు తన్ను నిన్నిమూర్తులనుగాఁ జూచునట్లు మంత్రబలమునఁ జేసెనని యైనను దుద కంగీకరింపవలసి వచ్చును.ఇన్నికల్పనలు చేయుటకంటె భగవంతునకు సర్వశక్తులు కలవన్నయొక్కమాట చాలదా. ఈవృథాశ్రమము లేల? తెలియనిదానిని దెలిసినట్లు నటింపనేల ? కావున వంకర

టింకర లన్నట్లు ప్రశ్నింపకుండుట మేలు. మంత్రోపదేశము నొందుటయే యొకదీక్ష. పూజచేయుట యొకయజ్ఞము. సర్తన ముచేయుట వేఱొక్కసేవ. వీనితరువాత భగవంతునింగూడి స్నానముచేయుట కృతకృత్యతం గాంచుమార్గము. దానికై గోపికలు కడంగి రని తెలిసికొను టుత్తమము. ఇంకం గథ వినుఁడు.

*ఆలతాంగు లా రాసమండలనృత్యమును సల్పి కంఠము లెత్తి భగవద్గుణములఁ బాడిపాడి యలసిసొలసిరి. అప్పటివారి సమ్మోదమునకుఁ బారమే లేదు. వారిమనస్సులు శ్రీకృష్ణపా దార్పితము లయినవే కాని వారివశములుగా లేవు. శ్రీహరి వారలయుట యొఱింగి యాశ్రమము నపనయింపఁదలంచి తానో విందుఁడు కాన గోపికలు వారలు కాన నవశ్యము వారిశ్రమ ములఁ దొలఁగించుట తనకు విధియుఁగాన నాఁడుగజములగుం పునుగూడియున్న గజరాజుతీఱున లోకాచారపరిపాటిమీఱి శాశ్వతసుఖము వారికిం గల్పింపఁగోరి వారిం దోడుకొని రాస మండలమునుండి వెలువడియె. వారిమేను లంతకుముందు సురభి కుంకుమపంకచర్చల వింతగానుండెను. రాసమండలనర్తనమున వారు మిక్కిలి యలసిరి. శ్రమజల ముప్పతిల్లెను. దాన నాకుం కుమపంకము పూలహారముల సంక్రమించెను. తమపరిమళము లకుఁదోడుగా నీసువాసనలు కలిసి మఱింత పరిమళించెను. ఆ

* ఈకథాశేషము శ్రీభాగవతమును ప్రధానముగాఁ జేసికొని యితర పురాణవిషయములఁ గలుపుచు వ్రాయఁబడినదని గ్రహింపవలయును.

తావులకు భ్రమరములు మూఁగెను. వారితో నవియు ఝం కారములు చేయుచుఁ బయనముచేయ సాగెను. యమునా నదిజలముల స్నానముచేయఁబూని యామందయానలం బిలుచు కొని గోవిందుఁడు ముందు నడచెను. యమునాహ్రదమును బ్రవే శించెను. హరివెంట నాగోపిక లానందపరవశలై మడువున విగిరి.

శ్రీగోవిందుఁ డాసమయమున గోపికాజనాన్వితుఁడై తనయపారమహిమను భూలోకసుఖమును వియచ్చరులకుఁ దెలుపఁబూని గోలోకమునుండి తనయెడఁబాటు నోర్వఁజాలక వచ్చిన యాగోపికల కానందమును గల్గింప నెంచి కాళిందీహ్ర దోత్తమమును బ్రవేశించెను. దానిం జొచ్చినంతనే శ్రీకృష్ణ మూర్తి తనకరసరసిజములచేఁ బావనజలంబుల గ్రహించి యాపల్లవపాణులపైఁ జల్లెను. తదంభస్సిచ్యమాన లై యా చెలువలు చెలువుమిగిలి విలసిల్లిరి. ఆజలము భగవత్కరకమల వినిర్గతము కదా. ఇదియే యవభృథస్నానలక్షణము. ఆవల నాజలజాక్షు లాజలజాక్షునిపై భక్తిమెయి జలముల దోసి లించి చల్లిరి. ఆజలములు భగవంతునితనువుసోఁకి పరమపావ నము లయ్యెను. ఆశీకరములఁ దోఁగినప్రమదలకంటెఁ బవి త్రాంగులు వేఱొక్కరు గలరా. అవభృథస్నానమునఁ గొంద అు పాల్గొందురు కదా. ఏల? ఆస్నానము దీక్షాంగస్నానమని. ఈరాసవిహారము పరమపావనభగవత్పూజారూపము. దానికి సమమైనది వేఱొండుండునా. అట్టిస్నానసమయమున శ్రీహరి

యంగసంస్పర్శమునఁ బవిత్రములగుజలములు తనుమేనుసోఁక నాపల్లవపాణులు పరమానందమున నోలలాడిరి. వారుచల్లిన నీళ్ళచేఁ దడిసి శ్రీహరియు నానందించెను. ఇట్లు పరస్పరాను రాగముల వారు కొంతవడి విహారము సల్పిరి.

ఇట్టు లాపరమేశ్వరుఁడు తా సకలాంతర్యామి యయ్యు నిరంజనుం డయ్యు నాతరుణమున నాతరుణులంగూడి జలములఁ గ్రీడించుచు నానందించునట్లు నటించుచు గోపికల నానందింపఁ జేయుచు వారియానందమే తనదిగా భావించుచు నాక్రీడను గాంచి మింటనున్న * సురపుంగవులు మెచ్చి తనపైఁ బూల వానఁ గురియింప మెచ్చుకొనుచుఁ దాను గజరాజలీల మెఱసి జలవిహారమును సాగించెను. ఆమడువుచెంతనే పుష్పారామము గలదు. అందు సకలర్తుకుసుమము లొప్పారుచుండును నీటి తుంపురు లాలతలపై వాయువశమునఁ బడుచుండును. ఆయుప కారమునకుఁ బ్రత్యుపకారమును జేయఁగోరి కాఁబోలు నాల తలు మనోహరకుసుమపరిమళముల నావాయువున కొసఁ గుచుండును. ఆవాయు వాసువాసనలం గొనివచ్చి యాతరుణ మున శ్రీహరిపైఁ దద్భక్తిపరవశలపై వ్యాపింపఁజేసి "ధన్యోఽ స్మి" అను కొనియెను. అపూవులతావులకు సొక్కి మధుకర ములు నలుఁగడల వ్యాపించెను. అందు గొన్ని సరసిజాక్షునిఁ జుట్టుకొనియెను. తుమ్మెదలు తన్నుఁ గ్రమ్మియుండఁగా గజరాజు వలె నాగజరాజరక్షకుఁ డాగజగాములఁ గూడి యపుడు

* వైమానికైః కుసుమవర్షిభిరీడ్యమానః-అని మూలము.

కానంబడియెను. వీరిజలవిహారమును మధుకరములు ఝుంకార మునఁ బాడుచుఁ దిరుగుచు వారిని వదలిపోవకుండెను. ఆ విహారమున శ్రీహరి గజరాజనియు,గోపికలు కరేణువు లనియుఁ గవులు వర్ణింతురు. శరత్కాలరాత్రిని శ్రీహరి మనోహరమునఁ గడపెను.

జలవిహార మిట్లు పూర్తియగువఱకు రాత్రియు నించు మించుగాఁ ద్రియామాశబ్దమును గోల్పోయెను అప్పటికి నాజల క్రీడయుఁ బూర్తి కాఁగా శ్రీహరింగూడి యాపురంధ్రీలలామ లు వెడలివచ్చి తటమును జేరిరి. సురుచిరవస్త్రముల ధరిం చిరి. తమమోముఁ దమ్ముల ముకురములందుఁ జూచుకొనిరి. చందనాదుల నలంది పూలమాలికలం దాల్చి వారెల్లఁ దేజ రిల్లిరి. అంతట వారికిఁ జేతనము వచ్చినట్లయ్యె. అప్పటికి నా గోపికలకుఁ దమ రెందుండునదియు నేమిచేయుచుండు నదియు నెఱుకపడియెను. కృతార్థతం గాంచితిమని యానందించిరి ఇంత దనుక వారిచిత్తములు వారివశమున లేకుండెను. ఇదియే భగ వన్మాయామహిమము. ఆమహామాయ వారి నాచ్ఛాదించెను. భగవంతునికృత్యము లిట్టివని యెఱుంగ భగవంతుఁడే సమర్థుఁడు. కాని యన్యు లగుదురా? ఆవల వారెల్లఁ దాంబూలచర్వణ కృత్యమును జరపిరి. తాంబూలాంకితముఖపద్మము లెట్లుండునో యని మరల దర్పణములఁ జేఁబూని చూచుకొనిరి.

ఇంతదనుక నొడలెఱుంగనికాంతలకపుడు భగవద్విలాస మెఱుకపడియె. ఆవినోదమున కచ్చెరువంది యందొక్కకాంతా

మణి బలవంతముగాఁ దనవైపునకు లాగి తదీయహస్తమున నలంకృతమగు మురళిని దీసికొని యానందించెను. వేఱొక్కయంగన వాంఛచే నోడలెఱుంగక భగవంతుని వివస్త్రునిగాఁ జేయ నెంచి పీతవస్త్రము నాకర్షించెను గాని యాలీలామానుషవిగ్రహుఁడు, ఆమెను సంతోషింపఁజేయ వస్త్రమును యాచింప నొసంగి పరమానందము నొందెను. మఱియొక ప్రమదాతిలకము శ్రీహరిం గాంచి యుక్తిని గనుమా యని తన ప్రక్కకు లాగుకొని కపోలమును ముద్దిడుకొని కౌఁగిలించుకొనియె. మఱియొక తెఱవ సుస్మితము ముఖమునఁ జిందులాడఁ గటాక్షవిలాసములు కన్పడ నంతకుముందు సాగిన పులినవిహారమును స్వామికిం దెలుపందలఁచి పులినముల కుపమేయమగు శ్రోణిభారమును సంజ్ఞచేఁ దెలిపెను. ఇంక నొకపంకజలోచన శ్రీకృష్ణుని హస్తతలమున నునిచికొని యాయన కేశపాశమున మాలతీమాలికలఁ జుట్టెద నని యట్లుచేసి తనవిలాసము నటించెను. మఱియు నొక్కయువతీమణి శ్రీనాయకుజడను బట్టుకొనినట్లు నటించి దానియందు మయూరపించికను జొప్పించి గురివింద పుష్పములహారమును దుఱిమి జడను జక్కఁగాఁ జుట్టెను. ఒక కమలాక్షి శ్రీకృష్ణునకు సంతోషము వృద్ధిచేయుపూనికచే వేఱొకప్రమదను జేరఁదీసి వివస్త్ర యని భావించి శ్రీహరి కర్పించెను. ఒకకామినీమణి శ్రీహరిపాణిపంకజమునఁ జందన మలందెను. కొందఱు తెఱవలు స్వామిముందు నృత్యము చేసిరి. ఒక్కకాంతామణి వేఱొకనారిని నృత్యముచేయవే యని బలవంతపెట్టెను.

కృష్ణపరమాత్ముఁడు దదనుగుణములగు విహారముల వారి నల రించెను. వారత్యంతకౌతుకమున వెలయఁ దా నానందించినట్లు నటించెను.

ఆవల శ్రీకృష్ణుఁడు తనప్రేయసియగు రాధికను జేరఁదీసి కొని వక్షమున వసింపుమాయని వేఁడెను. అంతియకాక యామె కబరియందున్న హారములఁజక్కనొత్తెను. ఫాలభాగము సిందూ రతిలకమును సవరించెను. దానియందుఁ గస్తూరీబిందువును గలి పెను. భ్రూమధ్యమున నతిసూక్ష్మమగు చందనబిందువు నుని చెను. కపోలములయందు మనోహరమకరికాదిపత్రము లలవడ వ్రాసెను. మహాపావనాంశుకమును గట్టుకొమ్మాయని యామె నభ్యర్థించెను. పాదములయందు మణిమయమంజీరములఁ దానే యలంకరించెను. నఖములఁ దుడిచి లత్తుకఁబూసెను. సకలభూ షణభూషితాంగిం జేసి చందనచర్చలఁ గైనేసి మాలతీమాలిక నొసంగి మరలమరల ననురాగభరమున ముద్దాడెను. మనోజ్ఞన యనారవిందములయందు నంజనము నునిచి యెంతోవింతగ సంతసించెను. నాసికామధ్యభాగమును రాజమౌక్తికమున నలంకరించెను. వక్షోజములయందును శ్రోణిదేశంబులను నఖ చ్ఛిద్రముల నునిచెను. అధరమున యావకాలంకృతమును గా వించెను.

ఇట్టులా రాధికాంబ నలంకరించి యాపుష్పోద్యానమున వారి నింకను నలరింపఁజేయనెంచి తనమూర్తిని బహుమూర్తు లుగా నొనరించి యనేకరీతుల వారికి సంతోష మిడయింపఁ

జేసెను. అందొక్కొక్కగోపిక కొక్కొక్కకృష్ణుఁడుగాఁ దానే కనఁబడెను. పుష్పతల్పము లసంఖ్యలుగా నుండెను. వారెల్ల శ్రీకృష్ణనవీనవిధదర్శనమున మూర్ఛల మునింగిరి. కదలఁ జాల కుండిరి. పులకాంచితసర్వాంగముల నలరియు నెఱుంగ కుండిరి. ఆస్వప్నక్రీడయందుఁ గామశాస్త్రోక్తవిధము లన్నియు జరిగినట్లే వారెంచిరి. శ్రీహరి తనదగ్గరనుండినట్లే వారు తలపోయు చుండిరి. కాని యిదొకమాయ యని యెఱుంగరైరి.

## రాసమండలముఁజూడ దేవత లరుదెంచుట.

అట్లు బాలగోపాలుఁ డనేకరూపంబుల గోపికలకుం గనఁబడుచు గానసర్తనరూపవిహారముల చేతను, అవభృథస్నానరూపజలక్రీడలచేతను వారిని భక్తిపరవశలనుగాఁ జేయుచుఁ దనసర్వతస్సంవ్యాప్తిని గనఁబడఁజేయుచుండ నంబరమునుండి కన్నులార నీమాయాలీలలం గాంచుచున్న దేవోత్తములందఱు భార్యలంగూడి యరుదెంచిరి. వారియనుచరులును వచ్చిరి. మణిహేమమయవిమానారూఢులై మహత్తరసంతోషమునఁ దమతమయనుచరులం గూడి వచ్చి పులకాంచిత సర్వాంగులై ప్రమోదాంబుధినిమగ్నులై భగవంతుని దర్శించిరి. మునులును ఋషులు, సిద్ధులును, పితృదేవతలును, గంధర్వవిద్యాధరులును, యక్షరాక్షసకిన్నరులును భార్యలంగూడి వచ్చి శ్రీహరి లీలామానుషత్వమును దర్శించి యానందించిరి.

ఆసమయమున దివ్యస్యందనసమారూఢుఁడై శంకరుఁడు పార్వతియు నరుదెంచిరి. ఆరథము శాతకుంభవినిర్మితము. రత్న

సారపరిచ్ఛదము. వినిర్మలవస్త్రాచ్ఛాదితము. శ్వేతచామరద్వయ సమాయుక్తము. రత్నదర్పణసమంచితము. శతచక్రము. చిత్రవర్ణము. అట్టిరథము నెక్కి పార్వతీసమన్వితుఁడై శంకరుఁ డరుదెంచెను. వామపార్శ్వమున మహాకాళుఁడు, దక్షిణభాగమున నందికేశ్వరుఁడు నుండిరి. పురోభాగమునఁ గార్తికేయుఁడు, పింగళాక్షుఁడు లోనగు పార్షదులు నుండిరి. అష్టభైరవులు క్షేత్రపాలాదులు నుండిరి. వక్షస్థలమున నలరు పార్వతి సస్మితయై కనఁబడుచుండెను. బ్రహ్మయు వాగ్దేవింగూడి శాతకుంభసంభృతస్యందనము నెక్కి యరుదెంచెను. వామభాగమున సప్తర్షులును, దక్షిణభాగమున సనకాదిమానసపుత్త్రులును జనుదెంచిరి. బంగరురథముపై నధిష్ఠించి కర్మసాక్షియగు ధర్ముఁడు చనుదెంచెను ఆధర్మునివక్షస్థలస్థయగు సతీదేవి స్మేరాననయై పూర్ణరాసమును గాంచుచు, సకామయు వక్రలోచనయు నైయుండెను. బ్రహ్మతేజంబుల నలరు పార్షదులెల్ల మహోత్సాహమునఁ జనుదెంచిరి. శచీదేవింగూడి యింద్రుఁడును, రోహిణింగలిసి చంద్రుఁడును, స్వాహాదేవింగూడి వహ్నియు, సంజ్ఞాదేవింగూడి భాస్కరుఁడును జనుదెంచిరి. రతీదేవి హృదయమున నలర మన్మథుఁ డేతెంచెను. సర్వగ్రహములు, దిక్పాలకులు, భార్యలంగూడి యరుగుదెంచిరి. వీరెల్ల నాకాశమున నిలిచి సంగీతనాదముల నుల్లసిల్లు రాసమండలమును జూచిరి.

ఆరాసమండలమును గన్నులారఁ జూచిన యాకాశస్థులగు నవ్వారిలోఁ గొంతమంది మూర్ఛనొందిరి. కొంద ఱానం

దమున నొడలెఱుంగకుండిరి. క్షణకాలము దేవతలు స్మితవక్త్ర
ములతో మహోత్తరప్రమోదసంభరితమానసంబులతో నుండిరి.
ఆరాసమండలవాసులపై దివ్యచందనవృష్టిని బుష్పవృష్టిని గురి
యించిరి. కస్తూరీపరిమళమిళిత పుష్పదామవర్షమును మునులు
గురిపించిరి. దేవకామినులు రాసనృత్యమును రాసమండలమును
జూచి యాసుఖమును బడయఁగోరి తద్వాంఛచే బాధితులైరి.

అంతట శ్రీకృష్ణపరమాత్మ రాసమండలమును ప్రేమరస
మునఁ దడిపి రాధికం గూడి యమునానదికిం బోయెను. *పరి
పూర్ణబ్రహ్మమై సనాతనుఁడు నగు శ్రీకృష్ణుఁడు మాయాదేవి
యపరస్వరూపలగు గోపికలు వెంటరా యమునాజలంబుల
మరల స్నానమాడెను. రాధాదేవి శ్రీహరిచెంత నుండెను.
మహానందమున నొడలు మఱచియుండు రాధికకు శ్రీహరి జల
ముల హస్తకమలములతో నందిచ్చెను. తనకరసంసిక్తజలమును
గోరు శ్రీపతి కారాధిక మూఁడుదోసిళుల జలము నిచ్చెను.
హరియు రాధికాంబరముఁ బట్టుకొని లాగెను. [1]మఱియు
కుసుమహారమును దీసి జడను శిథిలముగా నొనరించెను. సిం
దూరపత్త్రమును దుడిచివైచి రూపమును జలతాడనములచే
స్నానయోగ్యముగా నొనరించెను. కనుబొమలరంగు, క్రింది
పెదవికింగల రక్తిమవర్ణప్రసాధనము, కన్నులకాటుకయుఁ బోవు

---

*రాధయా సహ కృష్ణశ్చ పూర్ణబ్రహ్మసనాతనః, గోపీభిస్సహజగ్మశ్చ
మాయా శ్రీకృష్ణరూపిణీః - అని మూలము. 1 మాలాం చిచ్ఛేద కబరీం
చకార శిథిలాం హరిః-అని మూ.

నట్లొనరించెను. ఇది వ్రతాంగస్నానము కాదు. ఇది విహార స్నాన మని తెలుపఁబూని యిట్లు చేసెను. ఆవల నారాధికం గూడి జలముల మునిఁగెను. సలిలసహజకేళి నొనరించెను. ఆమెయుఁ దనవలెనున్న యొకగోపికను నగ్నను జూపించి యామగువ లజ్జావనతవదనయై సస్మిత యగుచుండ దానిం జూడుమా యని హరికిం గనఁబఱచెను. ఆమెయు దూరమున నుండి రాధాదేవి చేయునేత్రసంజ్ఞ నెఱింగి వచ్చి శ్రీహరిని సమీపించెను. వేగముగా మురళిని లాగుకొని యామె పరుగి డెను. అంతియ గాక పరమేశ్వరుపీతాంబరము లాగుకొనియెను. వనమాలను గ్రహించి జలముల దోసిటం జల్లెను. శ్రీకృష్ణునిం బట్టుకొని జలముల ముంచెను. గభీరమగు నాజలమధ్యమున జగన్నాయకుఁడు మునిఁగెను. వేగంబ లేచి యాకామినింగాంచి ప్రమోదమునఁ జేరఁదీసికొని గారవించెను.

ఇట్లు శ్రీకృష్ణమూర్తులే శ్రీకృష్ణునితోఁ గ్రీడించెను. ఆమనోహరయమునాతోయముల స్వమూర్తులతో నిట్లు విహ రించి విహరించి యొడ్డుచేరి యారాధాంబికచే యాచింపఁబడి వలువనొసంగి దివ్యవనమాల నిచ్చెను. ఆమెయు యాచించిన శ్రీహరికిఁ గట్టవస్త్రము నొసంగి రాసేశ్వరి గావున మురళి నొసంగెను. పతిమేనఁ జందన మలందెను. పరమభక్తిచేఁ భర్తకుఁ గూరుచుండ నాసనము పెట్టెను. జడముడి సవరించి మనోహర మాల్యములం దుఱిమి మాలతీమాలికను బైనఁ జుట్టి యలంక రించెను. శ్రీహరియు నారాధికకుఁ గబరీసౌందర్యము గలుగ

నలంకరించి కుండితమండితశ్రోత్రయుగళగాఁజేసి మకరికాపత్ర ములఁ గపోలములఁ గైచేసి మృగనాభిబిందుయుతమగు సిం దూరతిలకమును భాలభాగమున నలవరించి దాని క్రింద (భ్రూమ ధ్యమున) చందనబిందువు నునిచి దివ్యవస్త్రశోభితాంగియుఁ జందనాదిపరిమళసమ్మిళితతనూలతికయు నగునాతన్వంగిని వక్ష మునఁ జేర్చి లాలించెను. పరమానందమున నొకదివ్యసుమమాలి కను గళమున నునిచెను. భూషణములఁ దొడుగఁజేసి పాద ములకు మంజీరముల శోభిల్లఁజేసి లత్తుకపూతయుఁ గనఁబడఁ జేయుచు నానందింపఁజేసెను.

ఇట్లాగోపకుఁ డొక్కఁడు గోపికలకందఱు కన్నిరూప ములఁ గనంబడుచు వారి నలంకరించినట్లు నటించి వారింగూడి మరల రాసమండలమును జేరెను. అంత రాధికాదేవి రాసమండ లాధిపురాలు గనుక నందుఁ జొచ్చిన వెంటనే భగవంతు నర్చిం పఁబూనెను. దానిచుట్టు కుందమాధవీకేతకీమాలతీలతలు చూ డంజాలి యుండెను. మఱియుఁ జంపకయూధికామల్లికాదిపుష్ప ములవాసనలు గుబాళించుచుండెను. అపుడప్పుడ వికసించు నాపుష్పముల మనోనాయకుం బూజింపఁ దలంపుగొనియె. రాధాంబిక వెంటనే గోపికలం బిల్చి పుష్పాపచయ మొనరింప నాజ్ఞాపించెను. కొందఱిని మాలతీమాల్యములఁ గట్ట నియో గించెను. కొందఱిని దాంబూలకృత్యమునకుఁ గొందఱిని జంద నము దీయుపనికిఁ, నాజ్ఞాపించి వార లాకార్యములు చేయ నామోదించెను. పిదప రత్నసింహాసనాసీనుఁడగు హరిమేనఁ జం

డన మలంది తాంబూల మిచ్చెను. కొందఱారాధాహృదయ మెఱింగి భగవదద్భుతగుణములం బాడిరి. కొందఱు మృదం గాదుల వాయించిరి. ఇట్టులర్చనవిశేషంబుల నాగోపిక లారా ధాంబను గూడి భగవంతు నారాధించి పుష్పోద్యానములఁ జరించి సరోవరతటముల విహరించి నదీనదంబులఁ దిరిగి శ్మశా నముల సంచరించి గిరిగహ్వరములఁ జొచ్చి వనితావాంఛలఁ దీర్పఁజాలు ముప్పదిమూఁడువనములఁ దిరిగి భాండీరము, శ్రీవ నము, చంపకకాననము, తులసీవనము, కుందచంపకాటవులు, నింబారణ్యమధువనములు, జంబీరకాననము, నాళికేరవనము, పూగాటవి, కదళీవిపినము, బదరీకాంతారము, బిల్వగహనము, నారింగాటవి, అశ్వత్థవంశదాడిమీవనములు, మందారతాళ చూతకేతక్యశోక ఖర్జూరామ్రాతక జంబూశాలకటకపద్మవన ములు, జాతీవనము, న్యగ్రోధశ్రీఖండప్రహ్వాష్టకేసరవనములు లోనగు పవిత్రస్థలములఁ జూచి చూచి శ్రీహరి నందందు నర్చిం చుచు విహరించినను భగవత్సందర్శనమున సంతృప్తి వారికించు కంతయుఁ గలుగదయ్యెను. కామినులకామము శృంగారమున నివృత్తిఁ గాంచదు కదా. ఘృతధారచే నగ్నింబోలె వారివాం ఛలు వృద్ధి యయ్యెను.

అంత దేవత లామురరిపుననుమతి నొంది తమతమనివాస ములకుం జనిరి. వారిభార్యలు రాధికనుజూచి పనివినిరి. మును లాపరమాత్మసందర్శనమున 'ధన్యాస్స్మః' అనుచుఁ బోయిరి. దేవతలెల్ల నారాసక్రీడను బ్రశంసించుచుఁ బోయిరి. ప్రతిరాజ

కుటుంబమునందును దమయంశములఁ బుట్టఁజేసిరి. కామానల దహ్యమానహృదయులై దేవకాంత లొక్కొక్కరాజాన్వయమున నుదయించిరి. నారదా! యిది రాసమండలవిహారతత్వము. విస్తరించి వచించితిని. దీనితత్వ మాలోచింపుము. ఇంకేమి వినఁగోరుదువు? నీప్రశ్నము నేనెఱుంగుదును. ఇంకను ఈరాస మండలార్చితుండగు భగవంతునిచరిత్రము నత్యద్భుతమును వినిపించెదనని తరువాతిభగవల్లీలను వచింపఁ దలంపుఁగొని యెను.

మహానుభావులారా! జలక్రీడావిషయమున నీవఱకే కొంత వ్రాయఁబడియెఁ గదా. మఱి రెండుమూఁడువిషయము లించుక తెలిపెదను. శరద్రాత్రియందు మురళీనాదమున నెల్లర నాహ్వానించి వారికిఁ దారకము నుపదేశించెను. ఆవల రాస మండలమునఁ దనపూజాపద్ధతి నెఱింగించెను. ఆపూజాపద్ధతి భగ వదానందజనకము. అందు గీతనృత్తములు ప్రధానములు. తాను వారికి మార్గదర్శకుఁడై పాడి యాడి వారిచే నాపనులు చేయించెను. తనసర్వవ్యాపిత్వమును వెల్లడించెను. గోపికలందఱకుఁ దన చెంతనే శ్రీకృష్ణుఁడున్నట్లు తోఁపఁజేసెను. ఈచిత్రమును మింట నున్న దేవతలందఱు నాశ్చర్యమున జూచిరి. మహర్షు లానంద పరవశులై భగవత్తత్వము నెఱింగిరి. ఆచక్రపూజ పూర్ణము కాఁగా నవభృథస్నాన మొనరింపఁ గాళిందీమహానదికిం గొని పోయెను. ఆరాత్రివేళ నాజలక్రీడ శ్రౌతపద్ధతిగనే యుండెను. రాధాదేవియే రాసమండలనాయిక, రాసేశ్వరుఁడే శ్రీ

కృష్ణుఁడు. వీరిరువురు స్నానమునకుం బోయిరి. గోపికలయం దొక్కరొక్కరు తనచెంతనే కృష్ణుఁడు కలఁడు. తనయం దెక్కు వప్రీతి యాహరికిఁ గలదని వారెల్ల నమ్మిరి. ఎవ్వరికి వారే యిట్లు తలంచుకొనుచు జలక్రీడ సల్పిరి. ఆజలకేళికిం గూడ దేవత లరుదెంచిరఁట. అది యెట్టిదో యెఱుంగనగు. ఈజలక్రీడ రహస్యమో కాదో దీనివలననే తెలియందగి యుండును. కాఁ బట్టి యిది పరవనితాపహరణక్రీడ కాదనియు నిది గోలోక మహిమ మనియుఁ దెలిసికొనందగును. దీనిమహాత్వ మవాఙ్మా నసగోచరము.ఆ క్రీడాసమయమున శ్రీకృష్ణుఁడు దేవతావినుతుఁ

"వైమానికైః కుసుమవర్షిభిరీడ్యమానః."

డగుచుఁ దనసర్వవ్యాపిత్వమును దెలిపెను. పరిపూర్ణబ్రహ్మ మయి సనాతనుఁడు నగు శ్రీకృష్ణుఁ డని జలక్రీడాసమయమునఁ బురాణములయందుఁ జెప్పఁబడుటచేతనే భగవన్మహిమము తేటపడుచున్నయది. ఈక్రీడ కామసంబంధమున జరపఁబడలేద నియు నెఱుకపఱచుచున్నది. ఇంతియగాక శ్రీకృష్ణపరబ్రహ్మమే మాయాబలమున గోపీరూపముల వెలసె నని వర్ణింపఁబడినది.

"గోపీభిస్సహ జగ్ముశ్చ మాయాశ్రీకృష్ణరూపిణః."

అని యుండుటఁ జూచియైన బుద్ధిమంతు లాలోచింపవచ్చును. భగవంతుఁడు చతుర్దశభువనముల నిర్మించుట విలాసముకొఱకే కదా. ఈవిలాసమట్టిదే. తానే గోపికారూపమునఁ గనఁబడి వారితోఁ గ్రీడించెననుటయు త్తియు క్తముగ నేయున్నది.దీనిసారాంశ మిదియే.గోకులముననున్న గోపిక లిండ్లయందేయుండిరి. కృత్రిమ

గోపికలు పరుగిడిరి. కావుననే క్రీడలాడిననేమి? తనతోఁ బానా డుకొనుట తప్పుగాదు. భగవంతునిదృష్టిచే రెండవపదార్థమే యీలోకమున లేదు. కాని తాఁజేయునియమము లోకులకుదా హరణము కావలయును గదా. కాఁబట్టియే యీలాగున శ్రీహరి వ్యవహరించెను. ఇదియొక యజ్ఞము. భక్తియజ్ఞమనియు జ్ఞాన యజ్ఞ మనియుఁ జెప్పనొప్పును. ఈయజ్ఞమునకు ఋత్విజులుండ వలసినది లేదు. ద్రవ్యము లక్కఱలేదు. సర్వము భగవదిచ్ఛా కల్పితమే? భక్తియే మహాద్రవ్యము. దానిని లోభిత్వమునొం దక భగవంతునిపాదారవిందములయం దర్పించుటయే ఇందలి కృత్యము.

## చిన్నప్రశ్నము.

ఇది యొకభక్తియజ్ఞమే యైనచో నిందు రాధికవస్త్ర మును శ్రీకృష్ణుఁడేలలాగి నగ్నగాఁజేసెను. ఇది యేయజ్ఞమున నైనఁ గలదా అని కొందఱు ప్రశ్నింపవచ్చును. ఈప్రశ్నము చేయఁదగదని నేనను వాఁడఁగాను. ముఖ్యమనియే నాభావము.

## సమాధానలేశము.

ఈభక్తియజ్ఞమునఁ బ్రతిఫలముగా నొందవలసినది స్వర్గ సుఖము గాదు. నిరీహత్వము. అనఁగా సర్వమును త్యజించుట యే. నేర్చుకొనఁదగినది సర్వసమత్వము. ఆచారము లోకమును మించినది జ్ఞానులయం దలవడును. సర్వపరిత్యాగము చేయు చోటున వస్త్రపరిత్యాగము తప్పుగాదు. ఇట రాధికకు శ్రీకృష్ణ మూర్తి సర్వాంతర్యామితఁ దెలిపెను. అనఁగా నీవు మూఁల

ప్రకృతివి. నాయాత్మవు నీవే. నాకును నీకును భేదమే లేదు. నాయిచ్ఛాశక్తివి కదా. అని తెలిపెను. కావున వస్త్రము మా ల్యము భూషణములఁ దీసి వైచెను. శుకయోగి దిగంబరుఁడు కదా. ఆతనిభావ మేమి? సర్వసమత్వము కదా. ఈభక్తియ జ్ఞమున నీభావము లభించుటయే ఫలము. ఈఫలమునొంద నర్హులు భగవదధీనమానసులు. అనన్యగతికులుగాని యిత రులు కారు. ఈభావమే యిట నేర్చుకొనఁదగినది.

ఆర్యులారా! ఈఘట్టమున లోకాచారములను దదతీతా చారములను ఆలోచించి యేది తరణోపాయమని నేర్చుకొనఁ దగినది యనువిషయ మూహింపవలసియుండును. ఈఘట్టమే భగవన్మహిమమును జక్కఁగాఁ దెలుపునది యని నమ్ముఁడు. పామరులమాటలకుఁ జెవియొగ్గి మోసపోరాదు. భగవం తుఁడు కటాక్షించినది బుద్ధి కదా. దానిని సద్వినియోగము చేయవలయును గాని దుర్వినియోగము చేయరాదు. కాఁబట్టి యీగాథలను జక్కనిభక్తిచేఁ బఠించి తరించుమార్గమును మనమున దృఢపఱచుకొనవలయును. భగవంతుఁడు తన్నుఁ దలంచువారిని దరింపఁజేయ సంసిద్ధుఁడుగా నున్నవాఁడు. తలం చువారు లేరేయని తపించుచున్నవాఁడు. కావునఁ గలికాల మున శ్రీకృష్ణపరమాత్మను ధ్యానించి కృతార్థు లగుట సుల భోపాయము. ఆధ్యానము నిష్కల్మషముగా నుండవలెను. దానికంటె వేఱుమార్గము నిరపాయము కనఁబడలేదు. ఇతర కార్యములయందు భూతములఁ బీడించుట కనఁబడును. భక్తి

యజ్ఞమున నేపీడయుఁ గానరాదు. కావున నెల్లరు భక్తియజ్ఞమున శ్రీమత్పురుషోత్తమునా రాధించి కృతార్థులు కావలయును. ఇతరమార్గము లింత సులభతమములు కావు. ఇంక నవ్వాలిదగు భగవత్కథ నాలకింపుఁడు.

## శ్రీకృష్ణమూర్తి అష్టావక్రముని నుద్ధరించుట.

శ్లో. విదగ్ధగోపాలవిలాసినీనాంసంభోగచిహ్నాంకితసర్వగాత్రమ్, పవిత్రమామ్నాయగిరామగమ్యం బ్రహ్మప్రపద్యే నవనీతచోరమ్. ౨ ఆ. ౫౧ శ్లో.

శ్లో. ఉపాసతామాత్మవిదః పురాణాః పరం పుమాంసం నిహితం గుహాయాం, వయం యశోదాశిశుబాలలీలాకథాసుధాసింధుషు లీలయామః. ౨ ఆ. ౫౫ శ్లో.

*మహానుభావులారా! ఈ వ్రాయుకథ యత్యద్భుతమైనది. అన్నియు నట్టివి కావా యనఁబోకుఁడు. భగవంతుఁడు భూలోకమున నవతరించి మహామతులకు ముక్తినిచ్చుట కిదియే మొదటి కథ. కావుననే యత్యద్భుతమని వ్రాసితి. లోపలికథ కేవలసంభోగచరిత్రమే యైననందు మహర్షికి ముక్తినిచ్చుట యసంగతముగా నుండును. తాఁ బరమేశ్వరుం డయ్యు భక్తిపరవశలగు గోపికలు స్వాపరరూపయగు రాధికయుఁ జెంతనుండుతఱి మునికి ముక్తినొసంగనన్నను సంగతముగానుండును. రతికేళీసంరంభమున ముని ముక్తికాముఁడై యరుదెంచె ననుట విం

---

*ఈగాథ శ్రీకృష్ణజన్మఖండము ౭౫ వ యధ్యాయమునుండి గ్రహింపఁబడినది.

తలో వింతగా నుండక మానదు. ఆపవిత్ర సమయముననా ముని వచ్చును. మీరును యోజింపుఁడు. పరమార్థజ్ఞానముగల మహర్షికి సమయజ్ఞానమే యుండదా? కాఁబట్టి యీకథనుబట్టియు నాలోచించిన లోపలకథ మహత్వద్యోతకమే యని దృఢపడఁ గలదు. ఇఁకను గథ వినుఁడు.

నారదమునిం జూచి నారాయణమూర్తి యిట్లు వాక్రుచ్చెను. మునీంద్రా! యివ్వలి కథ నాలకింపుము. ఆవల గోపాంగనలెల్ల యమునాతీరశీతలభూముల నుపవిష్టుఁడైన రాధామాధవుం గాంచి పరమానందమున నేకాంతసేవాభాగ్యము దొరకెనని సంతోషించిరి. భగవన్మాయ తమ్మాచ్ఛాదించుటచే మిగులఁ బ్రౌఢిమ గలవార లైనను భగవంతునిగా నెఱుంగఁజాలరైరి. వింటివా నారదా! భగవన్మహిమను. అత్తఱిఁ గొంతమంది గోపికలు శ్రీకృష్ణా! నీకంఠమునందున్న మాలతీమాలికలను దీసి మాకొసంగుమా యని వేఁడిరి. కొందఱు కాంతలు శ్రీనాథా! నీభుజాంతరమున మమ్మునుచుకొనుమా యని ప్రార్థించిరి. మఱికొందఱు యాదవాంగనలు పరమపురుషుని స్కంధమును బట్టుకొనిరి. (అభయ మిమ్మా యని భావము). మఱి యొక కామిని యెడలెఱుంగక ప్రాణవల్లభా నీపీతాంబరము నాకొసంగుమా యని యాచించెను. (నీమాయ నాకెఱుకపడఁజేయుమా యనిభావము). వేఱొకతన్వంగి యీశ్వరా నీసిందూరతిలకము నాకొసంగుమా యని యర్థించెను (జ్ఞానము గల్గఁజేయుమా దాన నామోము వికసిల్లునని యంతరార్థము). ఇంకనొక పురంధ్రి

త్వరపడి శ్రీహరిచెంతకుం జని కురులు దువ్వుచు నాకబరిం జక్కఁజేయుమా యని యభ్యర్థించెను (నీహస్తము నామస్తకమున నునుపుము. దాన నుపదేశఫలము గల్గును. నాశిరస్సు వెంట్రుకలచే నలంకృతముగాఁ గన్పట్టెడు. అది వాస్తవాలంకారము కాదు. శిరస్సే కదా బ్రహ్మరంధ్రస్థానము. అందే కదా ద్విదళచక్రము. అద్దానియగ్రమునఁగదా నీయునికి. కావున నుత్తమాంగ మని పేరు శిరస్సునకుం గల్గెను. ఇట్టి నాయీశిరస్సును దువ్విన నీతేజస్సు ప్రజ్వలించును. దాన జ్ఞానము వృద్ధియగు. దాన ముక్తి దొరకు నని దీనిరహస్యాభిప్రాయము). కొందఱు సుందరీలలామలు జగద్వల్లభునిం గాంచి మా శ్రుతిమూలముల నలంకరించుకొన శ్రీఖండము ననుగ్రహింపుమా యని చేతులొగ్గిరి (మహాత్మా! నీప్రసాదమంత్రమును గటాక్షించితివి. అదియే శ్రుతిమూలముల కాభరణము. దాన మాయంగములు పవిత్రము లగును. ఇంకఁ దదర్థరూపజ్ఞానలేశము ననుగ్రహింపుమా యని వేఁడిరని సారము). ఒకానొక ప్రకటాంగి శ్రీకృష్ణముఖసరోజమును వీక్షించి సుస్మితము చిగురొత్తఁ గూటమింగోరి బలవంతముగా మురళిని గ్రహించి మాధవుని బట్టుకొనియెను (ప్రకృతి నీయధీనురాలు. అట్లే నేనును నీయధీనురాలను. ప్రకృతి నీహృదయమున నభేదముగా నునుచుకొనునట్లు నన్నును నీహృదయమున స్మరించి నీనామధ్వని నాకు సదా వినఁబడఁజేయుము. ఏశబ్దము విన్నను నీనామముగానే నాకు వినఁబడునట్లు చేయుమా యని కోరెనని

దీనితాత్పర్యము). ఒకానొక యిందీవరాక్షి శ్రీహరిని నగ్ను నిగాఁ జేసి యాపీతవస్త్రమును గ్రహించెను (ఓమహానుభావా! సర్వగతుఁడవు. నీకీవస్త్ర మొక యలంకారమా. నీసర్వగతత్వమును దెలిసికొనునట్టి తెలివిని బ్రసాదింపుమా యని వాంఛించె ననునదియే దీనిరహస్యము). ఇట్లు కాంత లాపరమాత్ము ననేకభంగులఁ బ్రార్థించి తమకుఁ గలకాంక్షలం దెల్పుకొనిరి.

అంత నొక్కచక్కనికాంత స్వామీ! నీపాదనఖరముల యందు మెఱయులత్తుక నొసంగుమా యని వాంఛించెను (ఉద్ధారకా! నేను గోరునది నీపాదసేవయే. దాని నాకు సదా లభింపఁజేయుమా యని వేఁడెనని దీనిసారము). మఱియొక నెఱజాణ ప్రీతిచే శ్రీనాథా! నానావిధవిచిత్రమకరాదిపత్రముల నాకపోలవక్షోజములయందు లిఖింపుమా యని బ్రతిమాలెను (ముక్తిప్రదా! నీహస్తస్పర్శమున నాముఖము కాంతిమంత మగు. నాహృదయము నిర్మలమగు. అదిలేకున్నఁ గాదు. నీవంటరానియవయవములు కలవా? సర్వవ్యాపివి కదా. కాన జగజ్జనకుఁడ వగు నీవలన నాకీయుపకారము కావలయునని దోసిలొగ్గె ననుటయే దీనియర్థము).

ఇట్లు గోపికలు తమ్ము నెక్కఁడ విడుచునో యనుసందియమున డిందుపడు నమ్మందయానల పొందుఁబాసి పరీక్షింపఁ గోరి రాధాదేవింగూడి యదృశ్యుఁ డయ్యెను. అతినిర్జనస్థానమునందు రాధను బ్రమోదమందఁజేయఁగోరెను. ఆకాలోచిత

మగు శృంగారము నవధరించెను. ప్రతిపర్వతమందును, ప్రతి ద్వీపమునందును, ప్రతినిర్జనవనమందును, ప్రతినదీతటములందును, జంతువివర్జితమగు ప్రతికాననమందును, శ్రీగోష్ఠమందును. రత్నశైలమునందును, వేలాంగగోతటమునందును, కాళిందపుళిందమందిరగంధమాదనభూధరములందును, మనోహరకుందవనమునందును, కావేరీతీరనీరజమందును, పుష్పభద్రాపులినతలమందును, పరిమళకుసుమవిసరవిరాజమానపుష్పోద్యానమందును, రాధకు మనోహరవేషునిగాఁ దన్నుఁ గనఁబఱచుచు నన్నితావుల నారాధంగూడి విహరించెను. చందనవాయుప్రసారముగల రమ్యమలయద్రోణియందుఁ గ్రుమ్మరెను. పుష్పమయ్యలఁ గల్పించి యందారాధంగూడి విహరించెను. ఆరాధయుఁ దత్సంస్పర్శనమున మూర్ఛిల్లెను. పులకాంచితవిగ్రహయగు నారాధాదేవిం గాంచి కరముహరించి యామెబడలికను బాపఁ గోరి తనహృదయమున నిడుకొని మూర్ఛమునుంగుటకు బెదరి విలుప్తవేషయై కామార్తయగు నాతన్వంగిని శిథిలకుంతలను జూచి చూచి చేతనయుక్తగా నొనరించి కంపితాంగమును జేరఁదీసికొని దివ్యాంబరమును సవరించి మొలనూలుచక్కఁజేసి కబరి నలంకరించి మాలతీమాల్యమున నలవరించి కుందకుసుమసందోహముల మేను జానుమీఁదఁజేసి యామెను సంతుష్టాంతరంగనుగఁ జేసెను. పిదప సిందూరతిలక మిడియెను. మకరికాపత్రము లలవరించెను. నఖరముల సాలక్తకములఁగా నొనరించి పద్మపత్రములఁ జిత్రించెను. ఆకృత్రిమపద్మములచే నఖరములెంతో వింతగనుండెను. వెంటనే యారాధంగూడి సరోవరము

నకుం బోయి దానిచమత్కృతికిమది మెచ్చుచు స్నానమొనరించి యాదేవింగూడి జలక్రీడ లాచరించి జలముల నంజలితో రాధ కొసఁగి యాదేవి మరల నొసంగినజలంబుల గ్రహించి స్నానము చేయుచు సహస్రదళములుగల పద్మవిశేషము నొక్కదానిని బ్రేయసి కొసంగి తానొక్కటి ధరించెను.

తరువాత నామెంగూడి సరస్సు వెలువడి కృతాలంకారుఁడై వటమహీరుహము చెంతకుం బోయెను. అది మిగులఁ బొడవులగుశాఖలచే నొప్పారుచు భూభాగమును జాలనాక్రమించి స్వచ్ఛాయచే నాభాగమును జల్లఁజేయుచుండెను. దానిం జుట్టి కేతకీవనమొండు కన్నులపండువు చేయుచుండెను. ఆకేతకీకుసుమమిళితసుగంధవాయువు లాపరాత్పరునిదేహముపై పొలసి ధన్యము లగుచుండెను. మహానందంబున బహుపురాతన పవిత్రగాథల రాధికకుం జెప్పుచుఁ గాలము పుచ్చుచుండెను.

అత్తఱి నత్తామరసేక్షణుం డొకపురాణమునిపుంగవుం బొడగాంచెను. ఆముని శ్రీకృష్ణుని జూడ నరుదెంచుచుండెను. ఆయనమోము, నేత్రములును బ్రసన్నములై యలరారుచుండెను. హృదయమున శ్రీకృష్ణునిధ్యానావసరమునఁ బొడఁగనఁ జాలక యమ్ముని ధ్యానమును మాని వెలుపలనుండఁ గాంచెను. ఆముని నీలవర్ణముగా నగపడుచు నవయవములు వక్రములై యుండఁ గుబ్జుఁడై దిగంబరుఁడై జడలం దాల్చి బ్రహ్మతేజమున వెలుంగుచు ముఖమునుండి యగ్ని వెడలుచున్నదో యన్నటుగపడుచుఁ దపోరాశి యొకరూపమునుదాల్చి లేచెనో యన

వచ్చుచుండెను. ఓహో బ్రహ్మతేజము మూర్తీభవించినదే యన్నయూహను బుట్టించుచు, నఖములు శ్మశ్రువులు కడుఁ బొడవులై యొప్ప శాంతుఁడై తేజోనిధియై దోసిలొగ్గి భక్తిచే నరుదెంచు నష్టావక్రమునిం గాంచి రాధిక నవ్వఁగా. శ్రీహరి వారించెను. మునీంద్రుని ప్రభావ మెఱింగించెను. మునియు నమస్కరించి శ్రీగోవిందు నిట్లు వినుతించెను. ఏ స్తోత్రమును దనకుఁ బూర్వము శంకరుఁ డుపదేశించెనో దానినే వినుతిచేయఁబూనెను. *గుణాతీతుఁడవు. సర్వగుణాధారుఁడవు. గుణబీజుఁడవు. గుణాత్మకుఁడవు. గుణులకీశ్వరుఁడవు. గుణి

అష్టావక్రకృత శ్రీకృష్ణస్తుతిః.

---

* గుణాతీత గుణాధార గుణబీజ గుణాత్మక, గుణీశ గుణినాంబీజ గుణాయన నమోఽస్తు తే. ౧. సిద్ధిస్వరూపసిద్ధ్యంశసిద్ధిబీజపరాత్పర, సిద్ధిసిద్ధగుణాధీశసిద్ధానాం గురవే నమః. ౨. హే వేదబీజ వేదజ్ఞ వేదిన్వేదవిదాం వర, వేదజ్ఞానాత్మరూపేశ వేదజ్ఞేశ నమోఽస్తు తే. ౩. బ్రహ్మానంతేశశేషేంద్ర ధర్మాదీనామధీశ్వర, సర్వసర్వేశ శర్వేశ బీజరూప నమోఽస్తు తే. ౪. ప్రకృతే ప్రకృతప్రజ్ఞ ప్రకృతీశ పరాత్పర, సంసారవృక్షసద్బీజఫలరూప నమోఽస్తు తే. ౫. సృష్టిస్థిత్యంతబీజేశ సృష్టిస్థిత్యంతకారణ, మహావిరాట్తరోర్బీజ రాధికేశ నమోఽస్తు తే. ౬. అహో యస్య త్రయస్స్కంధా బ్రహ్మవిష్ణుమహేశ్వరాః, శాఖాప్రశాఖా వేదాద్యాస్తపాంసి కుసుమాని చ. ౭. సంసార విఫలా ఏవ ప్రకృత్యంకురమేవ చ, తదాధార నిరాధార సర్వాధార నమోఽస్తు తే. ౮. తేజోరూప నిరాకార ప్రత్యక్షానూహామేవ చ, సర్వాకారాతిప్రత్యక్ష స్వేచ్ఛామయ నమోఽస్తు తే. ౯. శ్రీకృష్ణజన్మఖండము. ౨౯ అధ్యాయము.

బీజుండవు. ఇట్టి నీకు నమస్కారములు. సిద్ధాత్మకుఁడవు. సిద్ధ్యంశ మవు. సిద్ధిబీజభూతుఁడవు.పరాత్పరుఁడవు. సిద్ధిసిద్ధగుణాధీశ్వరుఁ డవు. సిద్ధులకు గురుఁడవు. ఇట్టినీకు వందనములు. వేదబీజుఁ డవై వేదజ్ఞుఁడవై వేదవిద్వరుఁడవై వేదజ్ఞాతాద్యరూపేశుఁడవై తనరు నీకు నతులొనరింతు. బ్రహ్మానంతేశశేషేంద్రధర్మాదుల కధీశ్వరుఁడ వగుచు, సర్వేశ్వరుఁడవై బ్రహ్మాండబీజభూతుఁడ వై యలరుచున్న నీకుఁ జేమోడ్పులు. నీవే ప్రకృతివి. ప్రకృ తీశ్వరుఁడవు ప్రకృతిజ్ఞుఁడవు. సంసారవృక్షరూపుఁడవు. తద్బీజ మవు. తత్ఫలరూపుఁడవు. ఇట్టినీకు జోహారులు. సృష్టిస్థిత్యంత బీజేశ్వరా! సృష్టిస్థిత్యంతకారణా, మహావిరాడ్రూపా! రాధికే శ్వరా! నీకివె నమస్కరణములు. ఏపరమాత్మునకు బ్రహ్మవిష్ణు మహేశ్వరులు ముగ్గురు మూఁడుస్కంధములో వేదాదులు శాఖాప్రశాఖలో తపస్సులు కుసుమములో సంసారవిషలములే ప్రకృత్యంకురములో అట్టిమహావిరాడ్వృక్షమునకు నీకుఁ బ్రణా మములు. తేజోరూపా! నిరాకారా! సర్వాకారాతిప్రత్యక్ష రూపా! అప్రత్యక్షాత్మరూపా! మహాత్మా! నీకివె ప్రణతులు.

అని పలికి యమ్మునివరుఁడు భగవచ్చరణసరసిజముల పయిం బడి నిస్తంద్రభక్తిచే యోగమూని ప్రాణములఁ దృజిం చెను. రాధామాధవులు జూచుచునుండిరి. ఆమునితను వప్పద్మ పత్రాక్షుని పాదపద్మములచెంతఁ బడిపోయెను. ఆతనువునుండి జ్వలద్ధవ్యవాహనజ్వాలామాలాతుల్యమగు తేజస్సొండు సప్త తాళప్రమాణముగఁ జూడఁదగి అందందు వ్రాలి వ్రాలి తిరిగి

తిరిగి తుదకు శ్రీకృష్ణపాదారవిందములయందు లీన మయ్యెను. ఇది యష్టావక్రమునికృతస్తోత్రము. దీనిని ప్రాతఃకాలమున నెవ్వఁడు పఠించునో వాఁడు ముక్తిపదమునుజేరును. శంకలు లేవు. నారదా! ఈస్తుతిరాజము ప్రాణాధికము. ముముక్షువులు దీనిని గాంక్షింతురు. పూర్వము వైకుంఠమున శంకరునకు విష్ణువుపదేశించెను. కాన నిది పరమ పవిత్రమైనది. అని పలికిన నారదముని భగవంతునిం గాంచి యిట్లు పలికెను.

భక్తవర్యులారా! ఈగాథయందుఁ దెల్పఁదగిన విశేషములు మున్ను తెల్పినవియే.గోపికలచర్యలు కామప్రహితములు కావనియుఁ దత్సార మిది యనియు నందే వ్రాయఁబడినది. మఱొక్కమాట.

"సర్వత్ర రమణం కృత్వా రాధావేషం విధాయ చ."

అనునదియే యిట సారమని మరల వ్రాయక లేఖిని యూరకుండఁజాలదు. ఎన్నియో దివ్యస్థలముల నొక్కపర్యాయము రాధంగూడి విహరించెనని చెప్పఁబడినది. ఒక్కొక్కతావున నొక్కొక్కరాధయు నొక మాధవుఁడును ఈరీతిగా నెన్నివిహారయోగ్యస్థలములుండినవో అన్నితావుల నిట్లే యుండుటయే. భగవంతుని సర్వవ్యాపిత్వము కామరూపిత్వముల వేయిభంగులఁ జాటుచున్నది. సర్వరూపములు భగవదంశములనుట కిది యొక యుదాహరణము. పాప మారాధిక భగవన్మాయామోహిత కావున గృష్ణునితో నొక్కతావునఁ దానున్నట్లే భావించెను. అన్నితావులనున్న రాధలు నిట్లే

# పోషకులు.

## శ్రీకృష్ణావతారతత్వమును బోధించుపుణ్యపురుషులు.

---

### కడప.

మ. రా. శ్రీ. కే. గుండూరావుగారు, బి. ఏ., బి. యల్.
,, విరూరు పిచ్చయ్యగారు, బి. ఏ., ప్లీడరు.
,, సి. లక్ష్మీనారాయణశాస్త్రులుగారు, బి. ఏ., బి. యల్.
,, కాకూరు శ్రీనివాసరావుగారు, బి. ఏ., బి. యల్.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. సుబ్బరావుగారు, బి. ఏ., బి. యల్.
,, వి. రాధాకృష్ణయ్యగారు, బి. ఏ., బి. యల్.
,, బి. పి. దేవరాజులునాయడుగారు, బి. ఏ., బి. యల్.
,, పి. నారాయణరెడ్డిగారు, బి. ఏ., బి. యల్.
,, సి. పి. రామచంద్రరావుగారు, బి. ఏ., బి. యల్.
,, కే. సూర్యనారాణరావుగారు, ప్లీడరు.
,, భోగనాధము వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, పత్తి రాఘవులు శ్రేష్ఠిగారు.
,, కంచిరాజు లక్ష్మీనరసింహయ్యగారు.
,, సుంకేసుల సుబ్బయ్యగారు.
,, కామిసెట్టి లక్ష్మీనరసయ్యశ్రేష్ఠిగారు.
,, దేవతి పిచ్చయ్యశ్రేష్ఠిగారు.
,, కామిసెట్టి వేంకటేశము శ్రేష్ఠిగారు.
,, మల్లెంకొండు రామలింగయ్యశ్రేష్ఠిగారు.
,, మాలేపాటి చిన్నవెంగన్నశ్రేష్ఠిగారు.
,, అన్నలూరు శేషగిరిరావుగారు.
,, డబ్ల్యు శ్యామయ్యగారు.
,, బి. శేషగిరిరావుగారు.

మ. రా. శ్రీ. యాదాటి వేంకటసుబ్బయ్యశాస్త్రిగారు.
,, శ్రీకంఠము నరసింహయ్యగారు.
,, వేమగంటి శ్రీనివాసరావుగారు, బి. ఏ., ఎల్.టి.
,, పి. వీరభద్రరావుగారు.
,, పుష్పాల వేంకటస్వామినాయడుగారు.
,, శాస్త్రపాటి చలపతిరావుగారు.
,, బొందలకుంట వేంకట నారాయణరావుగారు.
,, ఆర్. గోవిందరావుగారు, బి ఏ, తహసీల్దారు.
,, బచ్చు వేంకటసుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, సకలా వేంకటసుబ్బయ్యగారు.
,, వీరబోయిన కొండయ్యగారు.
,, చిల్లా వేంకటకొండయ్యగారు.
శ్రీమతి. తలుపుల వేంకటసుబ్బమ్మగారు.
మ. రా. శ్రీ. మాకం జంగంశ్రేష్ఠిగారు, చీమలపెంట.

### కామలాపురము.

,, కొమరగిరి వేంకటసుబ్బయ్యగారు, బి. ఏ, తహసీల్దారు.
,, బచ్చు రాఘవయ్యశ్రేష్ఠిగారు.
,, జి. సుబ్బరావుగారు.
,, రాణువ ఫణిరావుగారు.
,, గంగవరము, వేంకటనారాయణరెడ్డిగారు, మిన్నాయగారి
,, హనుమనగుత్తి. చెంచిరెడ్డిగారు, గ్రామమునిసిఫ్. [పల్లె.

### వల్లూరు.

,, సముద్రాల రామస్వామిగారు.
,, బెస్తవేముల నరసయ్యశ్రేష్ఠిగారు
,, టంగుటూరు చెన్నయ్యశ్రేష్ఠిగారు.
,, వంకదారు మాచయ్యగారి మల్లయ్యకుమారుడు సుబ్బయ్య
శ్రేష్ఠిగారు. [గారు.
,, పోలేపల్లి వెంగన్నశ్రేష్ఠిగారు, అరణిపోలేపల్లి సుబ్బయ్యశ్రేష్ఠి

## ఎఱ్ఱగుంట్ల.

మ. రా. శ్రీ. ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు, కరణము.
,, ఎఱ్ఱగుంట్ల వేంకటసుబ్బయ్యగారు.
,, మాలేపాటి నాగయ్యగారు, తల్లము సుంకయ్యగారు.
,, పేర్ల నాగిరెడ్డిగారు.
,, ఏ. శ్రీనివాసులునాయడుగారు.
,, అయ్యాదొరనాయడుగారు.
,, యం. రంగనాయకులునాయడుగారు.
,, శంకరయోగి సుబ్బరావుగారు, నిడుజువ్వి.

## పులివెందుల.

,, మద్దాల బోగాది శ్రేష్ఠిగారు, వేములక్రొత్తపల్లి.
,, పోలేపల్లి సుబ్బయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు. వేంపల్లి
,, పుల్లగూర వేంకటశేషయ్యశ్రేష్ఠిగారు, వేంపల్లి.

## ప్రొద్దుటూరు.

,, కొప్పరపు సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బయ్యశ్రేష్ఠిగారు.
,, నారాయణము సుబ్బరామయ్యశ్రేష్ఠిగారు.
,, వంగిపురము శ్రీనివాసాచార్యులుగారు, బి. ఏ, ప్లీడరు.
,, సి. నరసరామ శాస్త్రిగారు, బి. ఏ, ప్లీడరు.
,, యం. రామస్వామయ్యగారు, ప్లీడరు.
,, రావులూరు సుబ్బరావుగారు, డిప్టీనాజర్.
,, ఉప్పలూరు భద్రయ్యగారు.
,, డి. రాజశేఖర కవిసింహులుగారు, శతావధానులు.

## రాజంపేట.

,, ఆర్కాటు పరశురామరావుగారు, ప్లీడరు. నందలూరు.
,, ఏచూరు చెంచుసుబ్బయ్యగారు, శేషమాంబాపురము.
,, నూకల వేంకటసుబ్బయ్యగారు, అప్పయరాజుపేట.

మ. రా. శ్రీ. పిడతల చిన్న వేంకటసుబ్బయ్యగారు, పెనగలూరు.
,, అచ్యుతన్న రామచంద్రరావుగారు, టంగుటూరు.

సిద్ధవటము.

,, చల్లా చెంచుపాపిరెడ్డిగారు, చంద్రపల్లి.
,, యాదాళ్ల వేంకటరామయ్యశ్రేష్ఠిగారు, చిన్నపురెడ్డిపల్లె.

రాయచోటి.

,, కోట బాలయ్యకుమారుఁడు సుబ్బయ్యశ్రేష్ఠిగారు, నీలకంఠరావుపేట.
,, రేవులూరు సిద్దయశ్రేష్ఠిగారు, కస్తూరిరాజుగారిపల్లె.
,, చిన్నబయ్యన్నగారి లక్ష్మన్నగారు, ఎఱ్ఱిదొడ్డిపల్లె.
,, కర్నూతుల వేంకట రమణయ్యగారు, లక్కిరెడ్డిపల్లె.
,, పర్వతరాజు వేంకటరమణయ్యగారు, నూలివేడు.

అనంతపురమండలము.

,, కరణము కృష్ణరావుగారు, జేవినవాళ్లి
,, శ్రీరాము తిమ్మయ్యశ్రేష్ఠిగారు.
,, పెద్దనరసప్పగారి హనుమంతుగారు.
,, వెలమకూరు ఆత్మారామయ్యగారు, పినాకినీముద్రాక్షరశాలాధికారులు.

గుత్తి.

,, పి. యం. శ్రీనివాసయ్యంగారు బి. ఏ, యమ్. ఎల్. డిస్ట్రిక్టు మునిసిపు.
,, యస్. సుబ్బరావుగారు, బి. ఏ., ప్లీడరు.
,, వై. రామస్వామిగారు, బి. ఏ. ప్లీడరు.
,, జి. యం. హనుమంతరావుగారు, భూస్వాములు.
,, వై. శేషప్పగారు, ప్లీడరు.
,, వై. కొండలరావుగారు.
,, హనుమంతరావుగారు, బి. ఏ, తహసీల్దారు.

చింతించిరి. ఏల? అన్నియాకృతులను మార్చినవాఁడు భగవంతుఁడు. రాధారూపముననున్న యాత్మ శ్రీహరియే కావున నామె యెట్లులుంగును? దీనిచేత భగవంతుఁ డందఱి కన్ని రూపములుగాఁ గనఁబడుచుఁ దా సర్వసాక్షియై సాటిలేక తన్నాశ్రయించినవారి వాంఛల ననేకమార్గములఁ దీర్చుచుండును. ఈ మాట తెలిసి నిక్కమని నమ్మినవారు శ్రీకృష్ణచరిత్రమునందుఁ గుందుకలదని నిర్ధారణము చేయఁజాలరు. అపరాధమని యట్టి మాటలు విన్నఁ జెవులు మూసికొని భగవంతుని స్మరించి మహాత్మా! మమ్మీ మాయాసముద్రమునుండి యుద్ధరింపుమా యని ప్రార్థింతురు. కావున మహాత్ములారా! ఈదివ్యగాథయే పరమపవిత్రఫలము నీఁ జాలునది యని నమ్ముఁడు. సదా నిశ్చల భక్తి శ్రీహరిపాదారవిందముల నెమ్మదిం జేర్చి భజింపుఁడు. ద్రవ్యవ్యయములేని మార్గమిది. ప్రాయశ్చిత్తము లేదు. ఇహపరసాధనము. కాన నీమార్గము నాశ్రయించి సంసారమును సాగరమువలె దుస్తరమును దాఁటుఁడు. వృథాలాపములఁ గాలమును ద్రోయకుఁడు. పోయినకాలము మరల లభింపదు. ఒక్క క్షణమైన శ్రీకృష్ణా యని స్మరించిన నఱువది ఘటికలు సార్థకము లగును. భగవంతుని స్మరింపుఁడు. భగవంతుని ధ్యానింపుఁడు. భగవంతుని బూజింపుఁడు. భగవన్నామమును జపింపుఁడు. ఇదియ మనవిధి.

**ఓం శాంతిః శాంతిః శాంతిః.**

శ్రీకృష్ణావతారతత్త్వమున లీలావర్ణనమను
నాల్గవ ప్రకరణము సంపూర్ణము.

16
4/29
445